## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంధాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## TTD(తిరుమల తిరుపతి దేవస్థానం)

## http://ebooks.tirumala.org

ebooks.tirumala.org

తిరుమల తిరుపతి దేవస్థానములు
Tirumala Tirupati Devasthanams
ePublications

Languages | Series | Authors | Archives | Saptagiri | Catalog | Contact US | Search

: COMPLAINTS PLS CONTACT e MAIL saptagiritd@gmail.com CAN CALL 0877 226 4359, 4543,4360,4363, 4365 BETWEEN 10.30 AM AND 5 PM (DURING WORKING DAYS)

- TELUGU (1197)
- BANJARA (2)
- ENGLISH (226)
- SANSKRIT (70)
- TAMIL (302)
- KANNADA (175)
- HINDI (181)

Saptagiri

Telugu Tamil Sanskrit Kannada Hindi English

Online Subscription

Panchangam

Telugu Tamil

Sri Bhagavad Ramanuja 'Sahasrabdi' Utsavam

Narada Bhakthi Sutra...

Maha Bharatham - Bhagavatham

Maha Bharatham Vol 1...

Potana Bhagavatam Vo...

Potana Bhagavatam Vo...

Potana Bhagavatam Vo...

Potana Bhagavatam Vo...

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# హరి భారతి



గ్రంధ కర్త:

"సాహిత్య విద్యా ప్రవీణ", "వ్యాకరణ విద్యాప్రవీణ"

**హరి శ్రీరామమూర్తి**

M.Sc., M.Tech.,

# హారి భారతి

గ్రంథ కర్త
**హారి శ్రీరామమూర్తి**

ప్రథమ ముద్రణ : 2005

ప్రింటింగ్ :
**జయ గ్రాఫిక్స్,**
గాంధీనగర్, విజయవాడ.
Ph : 5567477, cell : 9866167477

ప్రతులకు :
**శోధన్ పెయింట్స్,**
బందర్ రోడ్, లక్ష్మీపేట,
విజయవాడ - 520 010.
Ph : 0866 - 2475388

**వెల. రూ. 200-00**

# విషయ సూచిక

# హరి భారతి

రచయిత

హరి శ్రీరామమూర్తి
M.Sc., M.Tech.,




ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి
వారి సౌజన్యంతో

# నమామి వేదమాతరమ్

## పరిచయ వాక్యములు

"హరి భారతి" గ్రంధరచయిత శ్రీహరి శ్రీరామమూర్తి గారు చిన్ననాటి నుండి నాకు చిరపరిచితులు, వారి కుటుంబము యావత్తు వేద సాంప్రదాయము ననుసరించుచున్నది. అందరు విద్యావంతులు. "భారతీనిరుక్తి" గ్రంధకర్తలు హరిసోదరులు. ఆ హరి సోదరులలో నాల్గవ వారు, మధ్యములు శ్రీ హరివెంకటకృష్ణమూర్తి గారు. ఈ కృష్ణమూర్తి గారి జ్యేష్ఠపుత్రుడు శ్రీరామమూర్తి. మహాపీఠాధిపతుల దర్శన, సత్సాంగత్యభాగ్యము పొందినవారు. అందువలన ఎక్కువగా ధర్మబద్ధ జీవితముననుసరించుచున్నారు. వారల విజ్ఞానమపారము. పండిత ప్రకాండులైన వారి పినతండ్రులు, శ్రీ హరిసాంబశివ శాస్త్రి, లక్ష్మీ నరసింహశర్మ గారు, సాంగ స్వాధ్యాయ భాస్కరులు శ్రీ కుప్పా లక్ష్మావధాని గారి వద్ద శాస్త్రాభ్యాసం చేసినవారు. పైగా నిరంతరం రామాయణ, భారతాది గ్రంథముల పరిశోధన చేయుచుండెడివారు. వారి పెద్దల అడుగు జాడలలోనే నడుస్తూ మన పూర్వ సంస్కృతిని విస్తరించుచూ దానిని ప్రజలందరకు తెలియజేయుటకు అనేక వ్యాసములు వ్రాసి ప్రశంసలు పొందియున్నారు. శ్రీరామమూర్తి గారు మాయింటికి వచ్చి యీ విషయాలను నాతో ముచ్చటిస్తూ ఉండేవారు.

"హరి భారతి" గ్రంథమందలి వ్యాసములు మానవులు నిత్యము అనుసరించు విషయములు, పండగలు, వాని వైదిక స్వరూపముల గూర్చి వివరంగా సప్రమాణంగా వ్రాయబడినవి. ముఖ్యంగా "వ్యాకరణ శాస్త్రంలో భార్యను గూర్చిన ముచ్చట్లు" "వివాహంలో బండికాడి ఎందుకు?" ఇత్యాది వ్యాసములు అపూర్వ విశేషములను తెలియజేయును.

ఇటువంటి మంచి గ్రంథములు ప్రజోపయోగార్థము వ్రాయుటకు శ్రీహరి శ్రీరామమూర్తి గార్కి భగవంతుని ఆశీస్సులు పూర్తిగా ఉండుగాక!

ది. 1-3-2001

**భాలకి విశ్వనాధరావు**
అడ్వకేటు మరియు టాక్సు కన్సల్టెంటు
వెంకటేశ్వరపురం, విజయవాడ-10

ఓం నమోభగవతే వాసుదేవాయ ఓం ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్రీరామ శ్రీరామ శ్రీరామ

# నమామి వేదమాతరమ్

నేటి కాలమున మానవులు వేదవిహిత సంస్కార రహితులై వేదశాస్త్రాధ్యయనమును, మనభారతీయ సంప్రదాయమును, ఆచారములను, ధర్మమును మరచి, పాశ్చాత్య వ్యామోహమునకు బానిసలై, పాశ్చాత్య వేషభాషలే భూషణమని తలచి, భారతీయ సంప్రదాయ, ఆచార, వేషభాషలను చిన్నచూపు చూచుచూ వేదశాస్త్రముల యందప్రమాణ బుద్ధితో పుక్కిటి పురాణములనే ధ్యాసతో సంచరించుచున్నారు. నిరసనచూపుచున్నారు. నిర్లక్ష్యం చేయుచున్నారు. మన భారతీయుల కన్న పాశ్చాత్యులే నయం - వారు మన వేదశాస్త్రాలను ఆదరించి పరిశోధనలు చేస్తున్నారు.

ఇట్టి కాలములో గూడ హరి సోదరులు చిన్ననాటినుండి సంస్కృత గ్రంధములను పరిశోధన చేయుచూ పాశ్చాత్యుల ఆక్షేపణలను శాస్త్రీయముగా ఖండించుచుండిరి. అట్లు పాశ్చాత్యుల దురభిప్రాయములను ఖండిస్తూ వారు వ్రాసిన గ్రంథము "భారతీ నిరుక్తి" కామకోటి పరమాచార్యుల అనుగ్రహం పొంది., గవర్నర్, ఖండూభాయ్‌దేశాయ్ చే 1972లో ఆవిష్కరింపబడింది. ఈ హరిసోదరులలోని కృష్ణమూర్తిగారి కుమారుడు శ్రీరామమూర్తిగారి శోధనఫలమే యీ గ్రంథము. దానిని చదివిన మనకు వీరు మనవిద్యలయందు ఎంత పరిశ్రమ చేసిరో తెలియుచున్నది.

ఏడు తరాలుగా హరివారితో మాకు (కుప్పావారికి) అనుబంధబాంధవ్యాలు వుండగా నాకు వారితో పరిచయము వారి స్వగ్రామము ఈపూరులో వారింటిలో నేనుండుట వలన కల్గినది. ఇది నాపూర్వజన్మ సుకృతము. మా నాన్నగారైన శ్రీకుప్పా ఆంజనేయశాస్త్రిగారు వారి అన్నగారు శ్రీ గోపాల కృష్ణమూర్తిగారు మంచి స్నేహితులు. అలాగే మా బాబాయి గారు శ్రీకుప్పా సుబ్రహ్మణ్య శాస్త్రిగారు శ్రీహరి శ్రీరామమూర్తిగారు మంచి మిత్రులు. మా చిన్న తాతగారైన శ్రీ కుప్పాలక్ష్మావధాని గారి వద్ద వారు అనేక విషయాలు తెలుసుకుంటూ ఉండిరి. వారివద్ద గీతాశాస్త్రం చదివారు.

మేము ఇద్దరము శ్రీవిష్ణుసహస్రనామపారాయణ సంఘమునందు సభ్యులమగుట చేత సంఘమువారు నిర్వహించు అహోరాత్రపారాయణలలో వారిని కలవగలుగుచున్నాను. అప్పుడు భారతీయ వేదాంత శాస్త్రములు, రామాయణ, భారత, భాగవతాదుల గురించి వారిద్వారా మేము అనేక విషయములను తెలిసికొనటం జరుగుచున్నది. ఇది మా అదృష్టము.

శ్రీరామమూర్తిగారు రచించిన 'హరి భారతి' గ్రంథమును అనుకోకుండా చదవటము జరిగినది అందులో 'వివాహములో బండికాడి ఎందుకు?','వ్యాకరణ శాస్త్రములో భార్యనుగూర్చిన ముచ్చట్లు' మొదలైన వ్యాసాలు బాగున్నాయి, సామాన్యులకు కూడా అర్థమయ్యేరీతిలో ముచ్చట్లను బాగా ముచ్చటించారు. స్వరములు, మండూకములు, పుష్పములు, వర్షములు మొదలగువాని వైదిక ప్రాశస్త్యము తెలుసుకొనదగినదే!

నాకీ అవకాశమునిచ్చిన శ్రీరామమూర్తిగారికి కృతజ్ఞతలు తెలుపుతూ వారికి భగవంతుడు ఆయురారోగ్యైశ్వర్యములను ఇవ్వాలని మనసా వాచా కోరుతూ.....

అనంతవరము, గుంటూరుజిల్లా. వారి మిత్రుడు, శ్రేయోభిలాషి,

**తేది.: 1-04-2004** **కుప్పావేంకటేశ్వర శర్మ.**

# నమామి వేదమాతరమ్

## చిన్నమాట

అది పవిత్ర కృష్ణాతీరము. అక్కడ ఒక చిన్నపల్లె, పేరు ఈపూరు, తెనాలి తాలుకా గుంటూరు జిల్లా. అది మా పుణ్యజన్మ స్థలము. అచట పిత్రుపైతా మహాధనము గలదు. అది గొప్ప పెన్నిధి. శ్రీవేణుగోపాలస్వామి దేవస్థానము. వ్యవస్థాపకులు హరిసోమయాజులు గారు తాతగారు. తరువాత మా జనకులు సోదరులు ఏడుగుర్కు. హరిసోదరులని కామకోటి పీఠం జగద్గురువులు, శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి వారు నామకరణం చేశారు. "భారతీనిరుక్తి" గ్రంధకర్తలు. వేద వేదాంగాలు నరనరములలోను జీర్ణించుకుని పోయినవారు. అనేక శాస్త్రములు, పురాణములు చదివి, పరిశోధన చేశారు. ముక్తికి వైదిక వర్ణపరిశోధన-పరిశ్రమ, భుక్తికి "శోధన్ పెయింట్స్" వర్ణపరిశోధన-పరిశ్రమ చేపట్టారు.

వర్ణములనగా అక్షరములు, రంగులు అని రెండర్థాలు. ఈ రెండు రకముల వర్ణములు పరమేశ్వరుని వర్ణించుటకే పుట్టినవి. రంగులనగా కాంతులు. ఇవి లౌకికంగానూ, వైదికంగానూ భగవంతుని అలంకరించుటకు పుట్టినవి.

నేను ఆ హరిసోదరులలో మధ్యముడు. నాల్గవ వారునగు శ్రీహరివెంకటకృష్ణమూర్తిగారి కుమారుడను, అమ్మగారి పేరు అనసూయ. నాన్నగారు శోధన్ పెయింట్స్ సంస్థా వ్యవస్థాపకులు. అన్యోన్య సహకారము, స్వయం కృసి, సమైక్యత-ఇవి ఆయన సిద్ధాంతములు,. నన్ను, మా సోదరులను అందరిని సంస్కృతాభ్యాసంలో దించారు. వ్యాకరణ శాస్త్ర నిష్ణాతులు, ఆఖరు బాబాయి గారు లక్ష్మీ నరసింహశర్మ గారు వ్యాకరణ విద్యాప్రవీణులు. వీరి వద్ద, నా చదువు సాగింది. ఇంగ్లీషు, లెక్కలు, సైన్సు నాన్న గారి వద్ద సాగింది. క్రమ క్రమంగా శాస్త్ర విశేషాల మీద మక్కువ గల్గింది. శాస్త్ర పాఠాలు చెప్పుచూ బాబాయి గార్లు అనేక అపూర్వ విశేషములు. ఏ పండితుడు చూడని విశేషములు తెల్పెడివారు, బోధించేవారు. పైగా నాన్నగారు, బాబాయిలు, నిరంతరం శాస్త్ర గోష్ఠిలో పరిశోధనలో ఉండేవారు. వారితో పాటు నన్ను కూర్చో పెట్టుకునేవారు. సభలు, సమావేశాలకు తీసికొని పోయెడివారు. కామకోటి, శృంగేరీ, పూరి, పుష్పగిరి పీఠాధిపతులు, గణపతి సచ్చిదానందస్వామి, జీయరుస్వామి-ఇట్టి మహాత్ములు వచ్చి మా శోధన్ గృహమును పవిత్రము చేసినారు. ఆ రోజులు మరువలేనివి. అది నాజీవితంలో స్వర్ణయుగము.

ఆ స్వాములతో గోష్ఠి కార్యక్రమములు మరువలేనివి. వానిలో పాల్గొన్నపుడు నేను గూడ బాగా చదువుకొని, విశేషములు తెలిసికొని, పరిశోధనలు చేయాలని తలంపు గలిగేది. దానికి

నాన్న గారు, బాబాయిలు బాగా ప్రేరణను చేయూతనిచ్చిరి. 1958లో సాహిత్య విద్యా ప్రవీణ, వ్యాకరణ ఎంట్రన్స్ 1964లో యమ్.యస్ సి., 1966లో యమ్ టెక్ పూర్తి అయిన పిదప శోధన్ వ్యాపారమును నాన్నగారప్పగించారు. వ్యాపారము చేస్తూనే విరామ సమయాలలో శాస్త్రాభ్యాసం, భాగవద్గీతా శంకర భాష్యాభ్యాసం, బాబాయి గారు శ్రీహరి సాంబశివ శాస్త్రిగారి వద్ద (తర్క వేదాంత సార్వభౌములు) చేశాను. 1985లో వ్యాపారమును సోదరుడు సోమ సుందర శర్మకు వప్పజెప్పి సమయమును ఎక్కువగా చదువు క్రింద ఖర్చు పెట్టి, తెలియని విషయాలను బాబాయి గార్ల వద్ద తెల్సుకొని బండిని ముందుకు సాగిస్తూ కొద్ది కొద్దిగా ఉపన్యాసములు చెప్పటం, వ్యాసాలు వ్రాయటం ప్రారంభం చేశాను. వ్యాసములన్నీ బాబాయి గారు సాంబశివ శాస్త్రిగారి చెవినవేసి ఆయన ఆమోద ముద్ర పడిన తరువాతనే పత్రికలకు ఇవ్వటం జరిగింది.

అర్చనావాణి పత్రికాధినేతలు, నిరంతరం యజ్ఞకర్తలు, యజ్ఞమయులు, హనుమదుపాసకులు బ్రహ్మ శ్రీ బుఱ్ఱా రాధాకృష్ణమూర్తి గారితో రెండు సంవత్సరముల క్రిందట పరిచయం జరిగింది. క్రమంగా వారితో గోష్ఠి సాగింది. నా వ్యాసములను వారు చదివి అపుడు వారు "యీ వ్యాసములన్ని గాలికి పోవటమెందుకు? పుస్తకముగా పదిలపరచిన బాగుండును" అని చెప్పగా బాగుండుననిపించింది. ఈ "హరిభారతి" గ్రంధము తయారీకి శ్రీకారం తోవతీసింది.

శ్రీరాధాకృష్ణమూర్తి గారి కుమారులు శ్రీ నీలకంఠశాస్త్రి గారు తమ జయగ్రాఫిక్స్ ద్వారా గ్రంధమును బయటకి తెస్తానన్నారు. సరేనన్నాను. గ్రంధ నిర్మాణం విషయంలో నాకు తోడుగా నిలచిన నా సోదరులు చి॥ వాసుదేవశర్మ, సోమసుందరశర్మలు సర్వదా అభినందనీయులు. శ్రీరాధాకృష్ణమూర్తిగార్కి అనేక శతసహస్రనమోవాకములు. శ్రీనీలకంఠశాస్త్రి గారి కృషి మరువరానిది.

ఈ గ్రంధమునకు ఉపోద్ఘాతము వ్రాసిన బ్ర॥శ్రీ॥ చింతలపాటి సోమయాజిశర్మ గార్కి, అమూల్యమైన అభిప్రాయములిచ్చిన ప్రొఫెసర్ శ్రీ నేతి అనంతరామశర్మ గార్కి, పరిచయ వాక్యములు వ్రాసిన శ్రీ భాలకి విశ్వనాధరావు గార్కి శ్రీ కుప్పా వెంకటేశ్వర శర్మ గార్కి శ్రీ హరిహనుమత్సోమయాజి శర్మ గార్కి అనేక కృతజ్ఞతాభి వందనములు. నా కృషిని అభినందిస్తూ ఆశీర్వదించిన జగద్గురువులు శృంగేరి, కంచికామ కోటి. పుష్పగిరి పీఠాధిపతులకు, వేదమూర్తులు శ్రీహరిసాంబశివశాస్త్రి గార్కి శతసహస్రానేక నమస్సుమాంజలులు. మా నాన్నగారు, బాబాయిలను సర్వదా స్మరిస్తూ......

ఇట్లు
హరిశ్రీరామమూర్తి
శోధన్ పెయింట్స్, విజయవాడ

ది. 1-3-2001

శ్రీశ్రీశ్రీ

hone : (04112) 22215 E-mail : skmkanci@md3.vsnl.net.in
ax : 224305

Sri Chandramouleeswaraya Namaha :
Sri Sankara Bhaghavadpadacharya Paramparagatha Moolamnaya Sarvagnapeeta
His Holiness Sri Kanchi Kamakoti Peetadhipathi

# JAGADGURU SRI SANKARACHARYA SWAMIGAL

*Srimatam Samsthanam*

No. 1, Salai Street, Kancheepuram - 631 502.



Date : 13-2-2004

'హరిభారతి' గ్రంథ రచయిత హరి శ్రీరామమూర్తి హరిసోదరులలో నాల్గవ వారైన శ్రీ హరి కృష్ణమూర్తి గారి కుమారుడు. హరి సోదరులు నువరిచితులు. "భారతీ నిరుక్తి" అనే గ్రంధరచయితలు. వరమాచార్యుల కృపా పాత్రులు. వీరి అడుగుజాడలలోనే శ్రీరామమూర్తి నడచుచున్నాడు. వీరి రచనలు హరిసోదరుల రచనల పోలియున్నవి. సంప్రదాయకముగ శ్రీ గణపతి, హనుమంతుడు మొదలగు దేవతలు, ఉగాది, దీపావళి మొదలగు పండుగలు, రథ సప్తమీ, నవరాత్రులు, మండూకములు, స్వరములు మొదలగువాని వైదిక స్వరూపము, స్వభావముల గూర్చిన పరిశోధన ఆనందదాయకము. ఆ పరిశోధనాఫలమగు ఈ గ్రంథము అందరికి బాగా ఉపయోగించునది.

శ్రీ మహాత్రిపుర సుందరీ సమేత శ్రీ చంద్రమౌళీశ్వరస్వామి వారియు, శ్రీ కంచికామకోటి పీఠాధిపతులు జగద్గురువులు శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతీ స్వాముల అనుగ్రహములతో యీ గ్రంథమును అందరూ చదివి పరమ భక్తులగుదురని ఆశీర్వదించుచున్నాము.

ఇతి

నారాయణ స్మృతిః

श्री श्री जगद्गुरु शङ्कराचार्य महासंस्थानम्, दक्षिणाम्नाय श्री शारदापीठम्, शृङ्गेरी.

**SRI SRI JAGADGURU SHANKARACHARYA MAHASAMSTHANAM,**
**DAKSHINAMNAYA SRI SHARADA PEETHAM, SRINGERI - 577 139.**

**PRIVATE SECRETARY**
To His Holiness Sri Jagadguru
Shankaracharya Dakshinamnaya
Sri Sharada Peetham
SRINGERI-577139.(Karnataka)



Camp : SRINGERI
Ref :
Date : D-1/ 612
19/8/2003



శ్రీయుతులు హరిశ్రీరామమూర్తిగారికి నమస్కారములు.

తమరు పంపిన 'హరిభారతి'యను గ్రంథమును శ్రీచరణులు అవలోకించారు.

ఈ గ్రంథమునందు అనేక విషయములు ప్రతిపాదింపబడి యున్నవి. గణపతి అంజనేయుడు మున్నగు దేవతల వైదిక స్వరూపములను గూర్చిన వివరణ దీనియందు కన్పట్టుచున్నది. ఉగాది-దీపావళి మున్నగు పండుగల వైశిష్ట్యము ప్రతిపాదితమైయున్నది. ఇంకనూ పలు విషయములు చర్చింపబడినవి. బహుగ్రంథ పరిశీలన ఫలముగా ఇది రచింపబడినట్లు తెలియుచున్నది. నూతన సంప్రదాయముల విలువలు దీనియందు చెప్పబడియున్నవి. ఈ గ్రంథము చదువరులకు ఉత్సాహజనకమై అనేక విషయ ప్రబోధకమైయున్నది.

శ్రీశారదా చంద్రమౌళీశ్వరుల యనుగ్రహమున ఈ గ్రంథము ఆస్తిక జనుల యాదరపాత్రమగుగాక. తమకితోష్యధిక శ్రేయఃప్రాప్తియగుగాకయని శ్రీ చరణులాశీర్వదించినారు.

ఇట్లు
T. [illegible]

శ్రీ విద్యాశంకరః ప్రసన్నః
*Sri Sri Sri*
# *Jagadguru Pushpagiri Sankaracharya Mahasamsthanam*
**PUSHPAGIRI - 516 166**

1-10-176/, Begumpet
Hyderabad, Ph : 848799

Ph : Off : 25201, Cuddaph,
Pushpagiri Chennur Exchange

శ్రీశ్రీశ్రీ జగద్గురు
శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యేత్యాది సమస్త బిరుదావళీ విరాజమాన
శ్రీ పుష్పగిరి పీఠాధీశ్వరులు
శ్రీమదభినవోద్దండ **శ్రీ విద్యానృసింహ భారతీస్వామి** వారు అస్మదత్యంత ప్రియ శిష్యులు



హరి శ్రీరామమూర్తిని ఆశీర్వదించి -

"హరిభారతి" గ్రంధరచయిత చి॥ హరి శ్రీరామమూర్తి నాకు చిరపరిచితులు. వీరి పెద్దలు హరిసోదరులతో మాకు సన్నిహిత సంబంధము గలదు. వీరిదొక విశిష్టమైన కుటుంబము. ఒకవైపు స్వావలంబన సిద్ధాంతముతో, వికేంద్రీకరణ సిద్ధాంతానుగుణంగా శోధన్ రంగు పరిశ్రమలను నడుపుట, మరియొక వైపు పితృ, పైతామహ ధనమైన వేణుగోపాలునికి గోపుర ప్రాకారాదులు నిర్మించి వైభవముగా బ్రహ్మోత్సవములు జరుపుట, సమష్టి కుటుంబ వ్యవస్థ నాదరించి సమష్టి కృషి ఫలితముగ స్వంత వ్యవసాయమును సమర్ధవంతముగా నిర్వహించుట, వీరిలో కొందరు గురు శిష్య సంప్రదాయానుసారముగ వివిధ శాస్త్రాధ్యయనము చేయుట, ప్రాచీన భారతీయ సంప్రదాయముల తామాచరించుచూ నితరుల ప్రోత్సహించుట. ఇది హరిసోదరుల కుటుంబ వైశిష్ట్యము. ఇట్టి భారతీయ సంప్రదాయ కల్పిత పవిత్ర వాతావరణములో పెరిగిన చి॥ శ్రీరామమూర్తి ఒకవైపు భౌతిక విజ్ఞాన సంపన్నుడయ్యునూ, తమ పెద్దల చూపిన బాటలోనే పయనించుచూ క్రమక్రమముగా విజ్ఞాన సమూపార్జన చేసి భారతీయ ఆచార సంప్రదాయముల యొక్క విశిష్టతను, ప్రాధాన్యతను వెల్లడిచేయు వ్యాస సంపుటిని తెలుగు సాధకలోకమున కందించుట ముదావహమైన విషయం.

ఇవి మూఢాచారములు అనెడి పాశ్చాత్య విజ్ఞాన వ్యామోహితులైన యువకులకు ఈ వ్యాసములు కనువిప్పు గావించి కరదీపికలుగా వెలయగలవని ఆశించుచున్నాము. శ్రీ శారదా చంద్రమౌళీశ్వరుల అనుగ్రహముతో వీరింకనూ విజ్ఞాన సౌరభములు వెదజల్లు సాహితీ కుసుమములను పరిమళింపచేయుదురుగాక !

స్వస్తి, శుభం భవతు

ఇతి

తేది : 2-9-2003
బేగంపేట, హైదరాబాద్

**నారాయణ స్మృతిః**

श्री श्री जगद्गुरु शङ्कराचार्य महासंस्थानम् ,दक्षिणाम्नाय श्री शारदापीठम् , शृङ्गेरी.

**SRI SRI JAGADGURU SHANKARACHARYA MAHASAMSTHANAM,**
**DAKSHINAMNAYA SRI SHARADA PEETHAM, SRINGERI - 577 139.**


**PRIVATE SECRETARY**
To His Holiness Sri Jagadguru
Shankaracharya Dakshinamnaya
Sri Sharada Peetham
SRINGERI-577139.(Karnataka)




Camp : SRINGERI

Ref :

Date : D - 1/ 612

19/8/2003

---



శ్రీయుతులు హరిశ్రీరామమూర్తిగారికి నమస్కారములు.

తమరు పంపిన 'హరిభారతి'యను గ్రంథమును శ్రీచరణులు అవలోకించారు.

ఈ గ్రంథమునందు అనేక విషయములు ప్రతిపాదింపబడి యున్నవి. గణపతి ఆంజనేయుడు మున్నగు దేవతల వైదిక స్వరూపములను గూర్చిన వివరణ దీనియందు కన్పట్టుచున్నది. ఉగాది-దీపావళి మున్నగు పండుగల వైశిష్ట్యము ప్రతిపాదితమైయున్నది. ఇంకనూ పలు విషయములు చర్చింపబడినవి. బహుగ్రంథ పరిశీలన ఫలముగా ఇది రచింపబడినట్లు తెలియుచున్నది. నూతన సంప్రదాయముల విలువలు దీనియందు చెప్పబడియున్నవి. ఈ గ్రంథము చదువరులకు ఉత్సాహజనకమై అనేక విషయ ప్రబోధకమైయున్నది.

శ్రీశారదా చంద్రమౌళీశ్వరుల యనుగ్రహమున ఈ గ్రంథము ఆస్తిక జనుల యాదరపాత్రమగుగాక. తమకితోప్యధిక శ్రేయఃప్రాప్తియగుగాకయని శ్రీ చరణులాశీర్వదించినారు.

ఇట్లు

T. [signature]

శ్రీ విద్యాశంకరః ప్రసన్నః

*Sri Sri Sri*

# *Jagadguru Pushpagiri Sankaracharya Mahasamsthanam*

**PUSHPAGIRI - 516 166**

10-176/, Begumpet
Hyderabad, Ph : 848799

Ph : Off : 25201, Cuddaph,
Pushpagiri Chennur Exchange

శ్రీశ్రీశ్రీ జగద్గురు

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యేత్యాది సమస్త బిరుదావళీ విరాజమాన

శ్రీ పుష్పగిరి పీఠాధీశ్వరులు

ప్రమదభినవోద్ధండ **శ్రీ విద్యానృసింహ భారతీస్వామి** వారు అస్మదత్యంత ప్రియ శిష్యులు



హరి శ్రీరామమూర్తిని ఆశీర్వదించి -

"హరిభారతి" గ్రంథరచయిత చి॥ హరి శ్రీరామమూర్తి నాకు చిరపరిచితులు. వీరి పెద్దలు హరిసోదరులతో మాకు సన్నిహిత సంబంధము గలదు. వీరిదొక విశిష్టమైన కుటుంబము. ఒకవైపు స్వావలంబన సిద్ధాంతముతో, వికేంద్రీకరణ సిద్ధాంతానుగుణంగా శోధన్ రంగు పరిశ్రమలను నడుపుట, మరియొక వైపు పిత్రు, పైతామహ ధనమైన వేణుగోపాలునికి గోపుర ప్రాకారాదులు నిర్మించి వైభవముగా బ్రహ్మోత్సవములు జరుపుట, సమష్టి కుటుంబ వ్యవస్థ నాదరించి సమష్టి కృషి ఫలితముగ స్వంత వ్యవసాయమును సమర్థవంతముగా నిర్వహించుట, వీరిలో కొందరు గురు శిష్య సంప్రదాయానుసారముగ వివిధ శాస్త్రాధ్యయనము చేయుట, ప్రాచీన భారతీయ సంప్రదాయముల తామాచరించుచూ నితరుల ప్రోత్సహించుట. ఇది హరిసోదరుల కుటుంబ వైశిష్ట్యము. ఇట్టి భారతీయ సంప్రదాయ కల్పిత పవిత్ర వాతావరణములో పెరిగిన చి॥ శ్రీరామమూర్తి ఒకవైపు భౌతిక విజ్ఞాన సంపన్నుదయ్యునూ, తమ పెద్దల చూపిన బాటలోనే పయనించుచూ క్రమక్రమముగా విజ్ఞాన సమూపార్జన చేసి భారతీయ ఆచార సంప్రదాయముల యొక్క విశిష్టతను, ప్రాధాన్యతను వెల్లడిచేయు వ్యాస సంపుటిని తెలుగు సాధకలోకమున కందించుట ముదావహమైన విషయం.

ఇవి మూఢాచారములు అనెడి పాశ్చాత్య విజ్ఞాన వ్యామోహితులైన యువకులకు యీ వ్యాసములు కనువిప్పు గావించి కరదీపికలుగా వెలయగలవని ఆశించుచున్నాము. శ్రీ శారదా చంద్రమౌళీశ్వరుల అనుగ్రహముతో వీరింకనూ విజ్ఞాన సౌరభములు వెదజల్లు సాహితీ కుసుమములను పరిమళింపచేయుదురుగాక !

స్వస్తి, శుభం భవతు

ఇతి

తేదీ : 2-9-2003

బేగంపేట, హైదరాబాద్

**నారాయణ స్మృతిః**

## పండితాభిప్రాయములు

ఉగాది, శివరాత్రి, నవరాత్రి, దీపావళి, శృంగాంతరం ద్వారమివార్గ సిద్ధేః, సిద్ధ సమాధి యోగము, అణుశక్తి, మండూకములు, వర్ణములు, అలంకారములు, గణపతి మొదలగు వ్యాసములను చూచినాను.

"హరిభారతి" పరమేశ్వర తత్త్వప్రబోధమును ధర్మస్వరూపమును వివరించు భారతి యగుటచే నీ గ్రంథమునకు "హరిభారతి"యని యన్వర్థ నామ మనవచ్చును. రచయిత చి॥ హరి శ్రీరామమూర్తి. అపుడపుడాయా సందర్భాలలో తన మనోవీధిలో భాసించెడి భావపరంపరలకు ఏదియో యొక వ్యాసరూపమునిచ్చి సాహితీ వ్యాసంగము చేయుట ఈయనకు అలవాటు.

ఇతడు బాల్యముననే తన పినతండ్రి హరిలక్ష్మీ నరసింహశర్మ గారి యొద్ద సంస్కృత భాషాధ్యయనం చేశాడు. తన తండ్రి శ్రీ హరి వేంకటకృష్ణమూర్తిగారిచే స్థాపితమగు శోధన్ పెయింట్స్ పరిశ్రమ బాధ్యతను స్వీకరించాడు. అతడు తను నిర్వహించు శోధన్ రంగుల పరిశ్రమకు అవశ్యకమగు భౌతిక శాస్త్రాధ్యయనం చేసి యమ్.యస్.సి. పట్టభద్రుడైనాడు. ఇతని యదృష్టమేమో! ఇతని శోధన్ గృహములో నిరంతరము సాహితీ గోష్ఠులు జరుగుచూ ఉండేవి. అతని పెద్దలు చేయు వేదవాఙ్మయ పరిశోధన అతనిలో నొక సాహితీ చైతన్యమును ఉద్భవింపచేసినది. ఈ సాహితీ గోష్ఠులే గాక శాస్త్రీయ చర్చలు వినుచుండు అవకాశము గల్గినది. పెద్దలు సంపాదించిన శాస్త్రీయ సాహితీ కేదారములలో పయనించుచూ పెద్దలు త్రొక్కిన మార్గంలోనే వ్యాసంగము చేయుచూ విజ్ఞాన వితానమును సంపాదించుకో గల్గినాడు. తత్ఫలితమే యీ వ్యాస సంపుటి.

ఇందు ప్రధానముగా అనూచానముగా వచ్చు భారతీయ సంప్రదాయము ననుసరించిన పర్వతిథులూ, ఆచారముల వెనుక నుండెడి శాస్త్రీయ రహస్యముల వెలిదీసి ఇవి మూఢా చారములు గావు. ఇవి మన ప్రాచీన మహర్షులు యోగదృష్టితో వర్ణించిన విజ్ఞాన రహస్యములు అని ప్రబోధించుట యీ వ్యాసముల ప్రధానోద్దేశము.

సామాన్యముగ ధర్మశాస్త్రము ప్రబోధించెడు ఆచారముల వెనుక అఖండ కాలస్వరూప విజ్ఞానమును దర్శించుట యావశ్యకము. ఇట్లు కాలవిజ్ఞానములకు మన పర్వతిథులకు మన ఆరోగ్య విజ్ఞానమునకు ఎంతయో అవినాభావ సంబంధము గలదు. ఇట్టి కాలఖండ విభాగము ఇతర సంప్రదాయములలో కనపడదు. ఉదాహరణకు సామాన్యంగా మన పండగ లెక్కువగా చాతుర్మాస్య దీక్షా కాలమున వర్తింపబడినవి. చాతుర్మాస్య దీక్షా కాలము ఆషాఢ శుద్ధ ఏకాదశి నుండి కార్తీక శుద్ధ ఏకాదశి వరకు నాల్గు నెలలు వ్యాప్తమై యుండును.

ఇట్లు గ్రీష్మ ఋతువు మొదలుకొని, అటు హేమంత ఋతువునకు మధ్య కాలము సంధి కాలము. సంధ్యా సమయం ఎంత పవిత్రమో అంత దారుణమైనది. ప్రతిదినము సంభవించు అహోరాత్ర సంధి కాలము సంధ్యా సమయము. ఈ సంధ్యా కాలము పగలుగాదు, రాత్రి గాదు. అందుచే పగలు నిర్వర్తించు పనులు గాని, రాత్రులందు చేయు పనులు గాని సంధ్యా

సమయమున చేయరాదు. అందుచే సంధ్యా సమయమున యథేచ్ఛముగ ఆహారము తీసుకొనుటగాని, నిద్రించుటగాని, స్త్రీ సంపర్కము గాని చేయుట నిషిద్ధమని శాస్త్రములు ఉద్ఘోషించు చున్నవి. అది దారుణ సమయముగాన సంధ్యోపాసన చేయాలని వేద శాస్త్రములు ప్రబోధించుచున్నవి. అట్లే చాతుర్మాస్య సమయము సంధ్యాకాలము గాన యీ నాల్గు నెలలు దారుణములు. ఆకసము తరచుగా మేఘాచ్ఛాదితమై, ఆ దినములు దుర్దినములగును. సూర్యకిరణ ప్రసారము బాగా పడదు. వర్షధారలచే నదులు రజస్వలలగును. త్రాగు నీరు కలుషితమై, జీర్ణకోశము మందగించును. పలురకములైన వ్యాధులతో పాటుగా నేత్ర వ్యాధులు ప్రబలును. అందుచే ఆహారనియమ మావశ్యకమని ధర్మ శాస్త్రములుపదేశించు చున్నవి. భగవదారాధన చేసి యీశ్వరానుగ్రహము సంపాదించుట అవసరంగాన యీశ్వరారాధన నిమిత్తమై మహర్షులు వివిధ పర్వతిథులను నిర్ణయించి ఆ సమయములలో వివిధ దేవతారాధన చేయవలెనని శాసించిరి.

వీని అన్నిటిలోకి శరదృతువు ప్రమాదకరము. జ్యోతిశ్శాస్త్ర కాలగణన ననుసరించి సూర్యుడు నీచస్థితిని బొందును. అందుచే శరదృతువు యమదంష్ట్ర వంటిదని ఆయుర్వేద శాస్త్రం, పురాణములు తెల్పుచున్నవి. అందుచే శరదృతువులో శారద నవరాత్రులను వ్యాజమున పరదేవతారాధనము, కార్తీక మాసమున ఉపవాసములు రుద్రాభిషేకములు మొదలగునవి శ్రద్ధాభక్తులతో జరిపి కృతకృత్యులు గావాలని యీ పండుగల ముఖ్యోద్దేశం. అందుకనియే యీ విఘ్నముల నుండి బయటపడుటకై గణేశ చతుర్థి, నవగ్రహ పూజా విధానం భాద్రపద శుక్ల చతుర్థి నాడు జరుపుకొను సంప్రదాయమేర్పడినది.

ఇట్టి సంప్రదాయ రహస్యములనెన్నియో చిరం.జీవి యీ రచయిత వివరించుటకు పూనుకొన్నాడు. 'జ్ఞాత్వా కర్మాణి కుర్వీత'. మీరేయే కర్మలను, ఆచారముల నాచరించుచున్నారో వాని వెనుక నుండు విజ్ఞాన రహస్యములు తెలిసికొని యాచరించినచో అవి విశేష ఫలప్రదములగును. మన యాచారములు, కర్మలు మూఢాచారములు గావు, మన శరీర యాత్రను చక్కని బాటలో నడిపించు విజ్ఞాన సారథులు. అట్టి విజ్ఞాన రహస్యములు ప్రబోధించు వ్యాస సంపుటిని తెలుగులో మనకందించెడి ఈ రచయిత కృషి ప్రశంసనీయము.

"మండూకము, అణువు, రాత్రి, శృంగము, గణపతి, ఉగాది" ఇత్యాది పదములకు నిరుక్త శాస్త్రరీత్యా నిర్వచనములను చూపుటయేగాక కావ్య, నాటక, వైదిక ప్రమాణములను చూపుటకై యాతని తపన, కృషి, పట్టుదల, పరిశోధన అతని వ్యాసములలో కనపడుచున్నవి.

మా అన్నగారి కుమారుడైన చి॥ శ్రీరామమూర్తి యింకనూ బాగా వైదిక వాఙ్మయ పరిశోధన చేసి యిట్టి విజ్ఞాన రత్నములనేర్చి కూర్చి సాధన లోకమునకందించ గలడని, అతని కృషికి శ్రీ శారదాచంద్ర మౌళీశ్వరులు చేయూతనిత్తురని యాశించుచున్నాను.

శుభం భవతు - ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా

ఇట్లు
**హరిసాంబశివశాస్త్రి**
ఆస్థాన పండితులు, జగద్గురు పుష్పగిరి పీఠం,
రాష్ట్రపతి అవార్డు గ్రహీతలు, హైదరాబాద్.

2-9-2001
భాద్ర పదశుద్ధ పూర్ణిమా,
ఆదివారం.

# పరిచయ వాక్యములు

చిరంజీవి హరిశ్రీరామమూర్తి నాకు సోదరుడు. కంచి కామకోటి పీఠం పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామిచే ననుగ్రహింపబడి, ముద్దుగా పిలవబడిన హరిసోదరులలో మా నాన్నగారు శ్రీ హరివెంకట సుబ్బయ్యగారు జ్యేష్ఠులు. ఈ శ్రీరామమూర్తి తండ్రి శ్రీ వెంకటకృష్ణమూర్తి గారు నాల్గవవారు, హరిసోదర మధ్యములు. చి॥ శ్రీరామమూర్తి వ్యాపార దక్షత గలవాడు. యమ్.యస్.సి. పట్టభద్రుడు. మా కడసారి పినతండ్రి వ్యాకరణ విద్యాప్రవీణులు బ్ర॥శ్రీ॥ హరిలక్ష్మీ నరసింహశర్మ గారి వద్ద చిన్ననాటి నుండి సంస్కృత విద్యాభ్యాసం, వ్యాకరణశాస్త్రాభ్యాసం చేశాడు. ఇంగ్లీషు, లెక్కలు, సంస్కృతంలో పంచకావ్యాలు తన తండ్రి బ్ర॥శ్రీ॥ వేంకటకృష్ణమూర్తి గారి వద్ద చదువుకొన్నాడు. తదుపరి మరియొక పినతండ్రి, తర్క, వేదాంత సార్వభౌములు, బ్ర॥శ్రీ॥ సాంబశివశాస్త్రి గారి వద్ద, బ్ర॥శ్రీ॥ కుప్పా లక్ష్మావధాన్లు గారి వద్ద గూడ భగవద్గీతా శాంకర భాష్యం, వేదాంత శాస్త్రం అభ్యసించాడు.

తదుపరి మా ఆరవ పినతండ్రి శ్రీచంద్ర శేఖరం గారి ప్రోత్సాహముతో కొద్ది కొద్దిగా రచనలు చేయటం, ఉపన్యాసాలు చెప్పటం ప్రారంభించాడు. మా రెండవ పినతండ్రి గారు బ్రహ్మశ్రీ సత్యనారాయణశాస్త్రి గారు - ప్రిన్సిపాల్, సంస్కృత కళాశాల, పొన్నూరు. మా కుటుంబంలో సంస్కృత విద్యాభ్యాసానికి పునాది వేశారు. అయన తన సోదరులందరినీ సంస్కృత విద్యలో దించి, క్రమంగా వైదిక వాఙ్మయ పరిశోధనలో ముంచి వేశారు. ఈ హరి సోదరుల ముప్పది సంవత్సరముల పరిశోధనా తపఃఫలముగా "భారతీ నిరుక్తి" - వేద స్వరూప దర్శనము అనెడి మహోజ్జ్వల గ్రంథము వెలువడింది. దానిని 1972లో ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ ఖండూభాయ్ దేశాయ్ విజయవాడ శోధన్ గృహములో ఆవిష్కరించారు. విజయవాడలో శోధన్ పెయింట్స్ భవనములో 'నిరుక్త భారతి' అను పేరుతో సంస్కృత వాఙ్మయ పరిశోధనాలయమును హరిసోదరులు స్థాపించారు. ఆ సంస్థా మంత్రపుష్పమే భారతీ నిరుక్తి. ఆ గ్రంథ రచన, ముద్రణ, ఆవిష్కరణ వగైరా వ్యవహారములలో శ్రీరామమూర్తి హరిసోదరులకు సహాయభూతుడుగా నిలిచాడు. వారి నుండి అనేక ఆర్ష విజ్ఞాన రహస్యాలను తెలిసికొని, నేర్చుకొని, వారివలెనే తాను గూడ శ్రమించి బాగా చదవాలి, మంచి రచనలను చేయాలి అని తాపత్రయం పడుతూ ఉండేవాడు. తన పెద్దలతో బాటు అనేక శాస్త్ర చర్చలు, సభలలో పాల్గొనేవాడు.

క్రమంగా అదే ఒరవడిలో, పెద్దల అడుగు జాడలలోనే నడుస్తూ వారి ఆశీర్వచన బలముతోనే "హరిభారతి" అను వ్యాస సంపుటిని రచించి చదువరులకు అందించాడు. రేడియోలోను, టి.వి. లోను, పబ్లిక్ లలోను వాడి ఉపన్యాసములు అందరిమన్నన పొందాయి.

మాది గుంటూరుజిల్లా, తెనాలి తాలూకా ఈపూరు గ్రామము. మా తాతగార్లు శ్రీ
ఎలక్ష్మీ
ారాయణ సోమయాజులు గారు, హరి పెదరామయ్యగార్లు. సోమయాజులు గారు మా
ంటి ఎదురుగా శ్రీ వేణుగోపాల స్వామి వారి దేవస్థానమును స్థాపించారు. 1927లో
్వమివారి ప్రతిష్ఠ చేశారు. రామయ్యగారు శాస్త్రపండితులు. నిరంతర విద్యా గోష్ఠిలో
ంజీగియుండేవారు. ఎపుడూ 'రామ-రామ' అని అంటూ ఉండేవారు. మా ఇంట్లో వారి
ురువాత మా నాయనగారు, రెండవ పినతండ్రి సీతారామయ్యగారు వ్యవసాయం, దేవస్థాన
ంగములు చూచేవారు. కృష్ణమూర్తి గారు, శోధన్‌పెయింట్సు అను సంస్థను స్థాపించి, అనేక
ంది యువకులకు ఇంట్లో శిక్షనిచ్చి, ప్రతిజిల్లాలోనూ ఒక రంగుల ఉత్పత్తి యూనిట్టును ఆ
ువకులచే పెట్టించారు. వార్కి శ్రీ చంద్రశేఖరం గారు తోడు నీడగా నిలచారు. వ్యాపార
ంగంలో ఉంటూ వీరు సాహిత్య విద్యాగోష్ఠులలోను వైదిక వాఙ్మయ పరిశోధనా రంగంలోను
ులిగెడివారు. శోధన్ సంస్థకు రూపురేఖలు దిద్ది బాగా అభివృద్ధి చేశారు.

శ్రీ సాంబశివశాస్త్రి గారు, లక్ష్మీ నరసింహశర్మగార్లు శాస్త్రాభ్యాసం చేసి వైదిక వాఙ్మయ పరిశోధనలో క్షణం తీరిక లేక యుంటూనే శోధన్ వ్యాపార రంగంలో గూడ మెలిగెడివారు. ఇట్లు వీరు ఎవరెవరేయే రంగము నందున్ననూ, "ఇదంబ్రాహ్మ మిదం క్షాత్రం" అనే పద్ధతిలో కలిసిమెలసి, సోదర సమైక్యతకు హెచ్చుప్రాధాన్యమిచ్చేవారు. లక్ష్మీ, సరస్వతులు అన్యోన్యంగా ఉండేవి. శలవులలో ఒకచోట కలసి, వీరంతా వైదిక వాఙ్మయ పరిశోధనలో కాలక్షేపం చేసేవారు. డబ్బు కోసం తగవులాడుకోవటం ఎరగను. ఆడవారిలో అభిప్రాయ భేదాలు పొడసూపినా, వీరు వానిని లెక్క చేయక వారిని తమత్రోవలోనికి తీసుకొనివచ్చి. అందరిని ఒకే త్రాటిపై నిలిపేవారు. భేదబుద్ధిని నశింపజేసి అభేద బుద్ధికి పాటుపడేవారు. ద్వైతబుద్ధిగల్గినా, దానిని రూపుమాపి అద్వైత బుద్ధితో మెలిగినవారి సమైక్యత కామకోటి పీఠం పరమాచార్యులను శ్రీశ్రీశ్రీ చంద్ర శేఖరేంద్ర సరస్వతీ శ్రీ చరణులను ఆనందాశ్చర్యములలో ముంచెత్తినది. వారు అప్రయత్నంగా 'హరిసోదరులు' అని సంజ్ఞ ననుగ్రహించిరి. పరమాచార్యుల వారు విజయవాడలోని శోధన్ గృహమునకు 1968లో ఒక్క రోజు భిక్షా వందనమునకు శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారితో వచ్చి, హరి వారి సోదరసమైక్యతకు, పాండితీప్రకర్షకు వైదిక వాఙ్మయ పరిశోధనకు ముగ్ధులై నెలరోజులు పీఠంతో సహా ఉండిపోయిరి. హరి సోదరుల భారతీ నిరుక్తి గ్రంధమును ఆ నెలరోజులు-రోజూ తెల్లవారు ఝామున 3 గం॥ల నుండి 6 గం॥ల వరకు వినేవారు. వారితో పాటు శ్రీరామమూర్తి గూడ పాల్గొనేవాడు. స్వామి రోజూ కృష్ణానదీ స్నానానికి వెళ్ళి వస్తుంటే ఆయన వెంట శ్రీరామమూర్తి గూడ వెళ్ళుచూ రుద్రం చెపుతూ ఉండేవాడు. ఆ పై ఆయన వెళ్లలేక వెళ్లలేక కాంచీపురం వెళ్లి మరల అక్కడికి

హరిసోదరులను అందరినీ పిల్పించి మరల గ్రంధమును పూర్తిగా విన్నారు అపై గ్రంధముద్రణ అనుజ్ఞనిచ్చిరి. తదాది, శృంగేరీ, పూరి, పుష్పగిరి పీఠాధిపతుల మన్ననలనందుకొన్న హరిసోదరుల భాగ్యమే భాగ్యము. వారేమి తపము చేసిరో!

హరిసోదరులంతా ఒక త్రాటిపై ఏక వాక్యతపై నిలబడుటకు దోహదపడిన మా ఏడుగు తల్లులు అభినందనీయులు, అభిప్రాయభేదం వచ్చినా మరల కలసిపోయి సరదాగా ఉండేవా తమ భర్తల సమైక్యతకు భంగం కలిగించటం,వేర్పాటు ధోరణి లేకుండగా అన్యోన్యంగా మెలి ఈ హరి సోదరుల భార్యలు నిజంగా అభినందనీయులు. ఈ శ్రీరామమూర్తి తల్లి శ్రీమ అనసూయ. మా తల్లి శ్రీమతి మాణిక్యమ్మ. దివాకరుని వారి ఆడపడుచులు. అన్నదమ్ము కుమార్తెలు. ఇదో విశేషం.

నిరంతరం ముక్తికి వైదిక వర్గ పరిశ్రమను, భుక్తికి లౌకిక వర్గ పరిశ్రమను స్వీకరించి ఈ హరిసోదరుల కుటుంబములో జన్మించుట మా అదృష్ట విశేషమే. యిట్టి యీ కుటుంబము జన్మించిన శ్రీరామమూర్తి తన పెద్దల అడుగుజాడలలో నడచుట విశేషం. అతని భాగ్య అతడింకా బాగా పరిశోధనలను చేసి చేసి క్రొత్త క్రొత్త విశేషాలను వెలుగులోనికి తె అందివ్వాలని మా ఇలవేల్పు, ఈ పూరు గ్రామ నివాసి శ్రీ రుక్మిణీ, సత్యభామా సమేత శ్రీ వేణుగోపాలస్వామిని ప్రార్థించుచున్నాను.

తేది : 1-7-2001

ఇట్లు
హరి హనుమచ్ఛాస్త్రి
ఈపూరు, కొల్లూరు మండలం

# ఉపోద్ఘాతము

బ్రహ్మశ్రీ హరిశ్రీరామమూర్తిగారు పండిత వంశజులున్నూ పండితులున్నూ. వీరు ఆంగ్లభాష యందే గాక ఆర్ష విద్యలందున్నూ అమోఘ పాండిత్యము గలవారు. వీరు రచించిన అనేక గ్రంధములలో హరిభారతియను ఈ వ్యాసావళికి నేను ఉపోద్ఘాతమును వ్రాయ సాహసించితిని.

ఇందు ప్రకృతోపయోగములగు షుమారు ముప్పది వ్యాసములు గలవు. ఇవి యన్నియు విదేశీ సంస్కృతీ వ్యామోహమునందిన వారికి దేశీయ సంస్కృతిలోని వైశిష్ట్యమును జూపుచూ ఆర్షధర్మావలంబులనుగ జేయగల వైశిష్ట్యము నందియున్నవి. వస్తుతః మన ఆర్షసంస్కృతి ఏనాటికినీ చెక్కుచెదరక సనాతనమైయున్నది. గాని అయా పరిస్థితులలో 'అట్టి' ఉద్గ్రంధ వివేకములేని జనులు మన సంస్కృతిని మూఢాచారములను పేరిట త్రోసి వైచుచూ పాశ్చాత్య వ్యామోహితులై యున్నారు. ఇందు పేర్కొన్న ముప్పది యంశములను అనేక వేద, వేదాఙ్గాది పరిచయముతో ఉదాహరణముగ ప్రసంగించబడినవియే. ఈ విషయములను జాగ్రత్తగా పరిశీలించి (మనమత గ్రంధములందలి ప్రామాణిక బుద్ధితో) చూచిన యడల మనకు అట్టి ఆర్షవిద్య జ్ఞానములేమియు మన భావనలకు మూలమని ఎరుంగగలరు. మూఢవిశ్వాసమును నిరసించుటకు "గొబ్బిపూజ" విషయమై శ్రీరామమూర్తి గారు నిర్వచించిన విషయమమోఘము.

మృతభాషయని అధునికులచే పేర్కొనబడు సంస్కృతభాషను గూర్చి ఎంత వివరణ ఇచ్చినారు? ఆ వివరణల చదివినవారు సంస్కృతమును మృతభాష యనగలరా? జాతీయ భాషగా స్వీకరించక విడువగలరా?

ఈ గ్రంథమును గూర్చి పూర్తిగ వ్రాయవలెనన్న ఈ గ్రంధము నా మూలాగ్రము చదివినగాని ఏ కొంతయో వ్రాయనలవి కాదు. అట్టి నేను స్థాలీపులాకముగా చూచి వ్రాయనెంచుట తొందరపాటే కావచ్చును.

ముఖ్యముగా వితండవాదము ప్రబలిన ఈ రోజులలో అట్టి వేదమే గొప్పదియను దృష్టితోగాక ఈ గ్రంధవిషయములను వేదశాస్త్ర ప్రమాణములతో పరిశీలించినచో తమ వాదనలను తామే ఉపసంహరించుకొనవలసి వచ్చును.

ప్రకృత జనులు తమ మత ప్రామాణిక గ్రంధ పరిశీలన చేయునవకాశము జాలక పాశ్చాత్య వ్యామోహము వలన మన మతమును నిందించుటకలవడిరి. ప్రతి యొక్కరు ప్రతి గ్రంధమును పరిశీలించి తత్త్వము నెఱుంగుటకు సమయము చాలకపోవచ్చును. కాని మన గ్రంధముల సారమును అన్ని విషయములలోనూ కరతలామలకముగా చిత్రించి జూపిన శ్రీరామమూర్తి గారి కృషి తగుప్రసంసనీయము.

మనము ప్రస్తుతం స్వతంత్ర జీవనులమైయున్ననూ అనేక సంవత్సరములుగా విదేశీపాలనలో గల (ఆ భావములనే జీర్ణించుకొనిన) మన విద్యా విషయములలో మన ప్రాచీన సంస్కృతిని నేటి వరకు మన విద్యార్థులకు నేర్పింప బూనక ఆంగ్లేయులచే ప్రవేశపెట్టబడిన విద్యా విధానమునే వీడలేకున్నారు (మనపాలకులు). ఇప్పటికైననూ ప్రభుత్వం వారు మనసంస్కృతిని మన విద్యార్థులకుపకరించులాగున ఈ గ్రంధమందలి కొన్ని వ్యాసములను 'డిగ్రీ' కోర్సులలో ప్రవేశపెట్టించుట ద్వారా మన సంస్కృతీజ్ఞానమును కల్గించుటే గాక మిగులమానసోల్లాసము సైతము కలిగించగలదని నా భావన.

శ్రీయుతులు శ్రీరామమూర్తి గారు ఆంగ్లభాషా విదులైయుండి గొప్ప పారిశ్రామిక, వ్యాపారవేత్తలై యుండియూ ఇట్టి వేద వేదాఙ్గములందు సహితము దృష్టి పారించి సారమును మనకందజేయుటకు వారికి అవకాశమెట్లు గల్గెనో?

మనసుంటే మార్గములేకుండునా! ఇటులనే శ్రీరామమూర్తి గారు పరిశోధనలు సాగించి విలువగల గ్రంథములు వెలువరించి ప్రజలలోని అజ్ఞాన జనిత మౌఢ్యమును తొలగించే ప్రయత్నంచేతురు గాక యని ఆశీర్వదించుచున్నాను.

తేది : 30-6-2001

అధ్యక్షులు
శ్రీ విష్ణుసహస్రనామ పారాయణ జపయజ్ఞ సంఘం,
గుంటూరు.

బుధవిధేయుడు
**చింతలపాటి సోమయాజిశర్మ**
హస్సనాబాద్, గుంటూరు జిల్లా.

## వేదో2 ఖిలో ధర్మమూలమ్ - హరిభారతి వైదిక దర్పణమ్

వేదో2 ఖిలో ధర్మమూలం స్మృతి శీలే చ తద్విదాం ।
ఆచారశ్చైవ సాధూనాం ఆత్మన స్తుష్టిరేవ చ ॥"

ధర్మానికి నాల్గు వేదాలు మూలం. వేదాలను దర్శించి, స్మరించి వేద ధర్మాలను ఋషులు లోకానికందించారు. వారి స్మృతులు, వారి అనుష్ఠానము, శీలము, సాధువుల ఆచారమున్నూ ధర్మానికి కారణాలు కాబట్టి వేదవాఙ్మయం ప్రపంచ మంతటికీ, ఆదిమ వాఙ్మయమని ప్రశంసింపబడుతున్నది. భారతీయులే కాక మానవ జాతి అంతా తమ విజ్ఞానాన్ని, కళల్ని, వేదకాలం నుండి వివరించటం పరిపాటి అయింది. భారతీయ శాస్త్రాలకు, దర్శనాలకు వేదాలే మూలమనడం నిర్వివాదాంశం. నాస్తిక దర్శనాలు సైతం వేదమతాన్ని ధర్మాన్ని పూర్వపక్షంగా స్వీకరించడంలోనే వేదమతము యొక్క ప్రాచీనతను మన్నించి నట్లయింది. వేదో ధర్మ మూలమ్' అని "శాస్త్ర యోని త్వాత్-తత్తు సమన్వ యాత్" అని సూత్రీకరింపబడి ధర్మప్రధానమైన త్రివర్గానికి పరమపురుషార్థానికి వేదాలే మూలమని నిర్ణయింపబడింది. అట్టి వేదవిజ్ఞానం సర్వోపదేయము, శిరోధార్యమునై విరాజిల్లుతున్నది. నాడూ, నేడూ భారతీయులే కాక, విశ్వమానవులంతా వేదపరిశోధనలను, విభిన్న ప్రయోజనాలకై కొనసాగిస్తూనే ఉన్నారు. అట్టి పరిశోధనా వైవిధ్యాన్ని, ప్రయోజన బాహుళ్యాన్ని వేదాల మహత్త్వాన్ని ప్రస్తుతం మీ చేతిలో ఉన్న'హరిభారతి'లో దర్శించవచ్చు.

**'హరిభారతి'** రచయితలైన శ్రీ హరిశ్రీరామమూర్తి గారి తండ్రిగారేకాక వారి పినతండ్రులు-పెదతండ్రులు మా తండ్రిగారైన నేతి సుబ్బారావుగారికి చిన్న నాటి నుండి ఆత్మీయతా మిత్రులు. తద్వారా శ్రీహరిశ్రీరామమూర్తి గారు కూడా నాకు చిరపరిచితులే. వీరి కుటుంబం యావత్తూ వేద సంప్రదాయానికి అంకితమైనది. అందులో ముఖ్యులు హరి కృష్ణ మూర్తి గారు, హరిసాంబశివ శాస్త్రిగారు. వారి మార్గంలో పయనించిన శ్రీరామమూర్తి గారు స్వయంకృషితో సంస్కృతాధ్యయనం, శాస్త్రాధ్యయనం చేసి, సత్సాంగత్య ప్రభావం వల్ల చాలా విషయాలను తెల్సుకొని పాండిత్యాన్ని పొందారు. కేవలం సంస్కృతాంధ్రభాషల్లోనే కాక, ఆంగ్ల విద్యాభ్యాసం చేసి M.Tech. డిగ్రీని పొందారు. ఇంకా వ్యాపార రంగంలో అనుభవాన్ని గడించారు. అట్టి శ్రీరామమూర్తిగారు 'హరిభారతి' అనే పేరుతో వ్రాసిన ఈ గ్రంధానికి, చిన్ననాటి పరిచయాన్ని పురస్కరించుకొని విపులమైన పీఠిక వ్రాయమని నన్నాదేశించారు. వారి ఆదేశానుసారం ఈ 'హరిభారతి' గ్రంథాన్ని ఆ మూలాగ్రం చదివాను. ఇందులో 12 వ్యాసాలు వైదిక స్వరూపాన్ని - వైదికతత్త్వాన్ని కొన్ని విషయాలపై వివరణాత్మకంగా వ్రాశారు. అట్లే వైవాహిక సంబంధానికి సంబంధించి రెండు వ్యాసాలు, దేవతా పరతత్త్వాన్ని తెల్పే

వ్యాసాలు ఆరు, పండగల ప్రాశస్త్యాన్ని తెల్పేవి నాల్గు వ్యాసాలున్నాయి. ఇవి కాక సామాన్య విషయాల్ని గురించి లోతుగా పరిశీలించి తెలుగులో తొమ్మిది వ్యాసాల్ని వ్రాశారు. అంటే ఈ గ్రంథంలో మొత్తం ముప్పది మూడు వ్యాసాలున్నాయి. ఇవన్నీ మానవ జీవితానికి ఎంతో ఉపకరించేటటు వంటి అధ్యాత్మిక భావనా దృక్పథంతో వ్రాసినవి. ఇంత కృషి చేసిన హరిశ్రీరామమూర్తి గారిని మనసా వాచా కర్మణా అభినందిస్తున్నాను.

1. ముందుగా వైదిక దర్శనానికి సంబంధించిన విషయాల్ని గురించి పరిశీలిద్దాం:

ఋగ్వేదమంత్రం ద్వారా గణపతి వేదస్వరూపుడే కాక, వేద వేదాంగ వేత్తగా నిరూపించబడ్డాడు. **'భగవంతొ విఘ్నవినాయకొ ప్రీయతామ్'** అని వేదాల్లో గణపతి విఘ్నభగవానుడుగా చెప్పబడ్డాడు. ఇంకా బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, మౌద్గల్య పురాణాల్లో గణపతి కిచ్చిన నిర్వచనాల్ని పేర్కొని అట్టి మహాగణపతి సమస్తకార్యసిద్ధిని కలగజేస్తాడని **'గణపతి-వైదిక స్వరూపం'** అనే వ్యాసంలో నిరూపించారు.

వాఙ్మయమనాన్ని పాటిస్తూ, శుభప్రదమైన వాక్కులను ఉచ్చరిస్తూ, భాద్రపదంలో వినాయక పూజ చెయ్యాలనీ అదే వేదపదమున సుప్రతిష్ఠుడైన భగవదారాధన అనీ **'విఘ్నేశ్వరుడు'** అనే వ్యాసం ద్వారా తెలుసుకోవచ్చు.

క్రౌంచుడనే గంధర్వుడు మునిశాపవశాత్తు ఎలుక రూపాన్ని పొంది వినాయకుని సన్నిధిలో సేవ చేస్తాడు. కృష్ణయజుర్వేదతైత్తిరీయ సంహితలో రుద్రరూప గణపతికి, పరమేశ్వరునికి అత్యంత ప్రియమైన శబ్దబ్రహ్మ రూపమైన వాహనమే ఈ మూషికమని **'వినాయక వాహన'** మనే వ్యాసంలో వివరించారు.

ఆత్మ జ్ఞానం లేని వారికి రాత్రి యొక్క యధార్థస్వరూపం కన్పించదు. యోగులు రాత్రి దేవతా స్వరూపాన్ని దర్శిస్తారు. 'కాలరాత్ర్యాది శక్త్యౌఘవృతా స్నిగ్ధౌదన ప్రియా' అని లలితా సహస్రనామాల్లోని లలితా దేవికీ కాలరాత్రి అనే శక్తి ఉంది. నవరాత్రుల్లోని నవశబ్దానికి పరమేశ్వరుడనీ, రాత్రి అంటే పరమేశ్వరి అనీ నిరూపిస్తూ వేదమంత్ర స్వరూపిణియైన ముగురమ్మల రూపాన్ని ధరించిన అమ్మవారి పూజా విధానాన్ని **'నవరాత్రులు-వైదిక తత్త్వం'** అనే వ్యాసం ద్వారా దర్శించవచ్చు.

కృష్ణానది వేద స్వరూపిణి మాత్రమే కాదు. భగవత్స్వరూపిణి. ఇది వేద పాదాల యందు పుట్టినట్లు స్కందపురాణం. నదీ జలాలను నీరుగా దర్శించక దేవతాస్వరూపంగా దర్శించాలి. అవి వేద వాక్స్వరూపాలు కాబట్టి వానికంత శక్తి. ఇట్టి నదీనదులను తీర్థాలంటారు. కాబట్టి మానవులు ఈ నదీనదాల్లో పుష్కర స్నానం చేసి దేవర్షి, పితృతర్పణాలు చేసి తరిస్తుంటారనే విషయాన్ని **'పుష్కరములు-వైదిక దర్శనం'**లో చూడవచ్చు.

దీపం ఉన్న ఇంటో లక్ష్మీ ఉంటుంది. 'దీప' పదానికి అగ్ని, జ్యోతిస్సు, ప్రకాశం, కాంతి,

[illegible] స్వరూపంగా [illegible]. [illegible] వేదాధ్యయనం [illegible] ప్రధానమై

[illegible]కోపకారకమగుతున్నది. ఉగాది ప్రపంచం యొక్క జన్మ [illegible]

[illegible]ంటే శివుడని, 'ఉ' అదిగా గల దేవత [illegible] దేవత [illegible]

వ్యాసాల్లోను నిరూపిస్తారు.

[illegible]

వివాహం పాణిగ్రహణంతో [illegible] సప్తపది [illegible] సంపూర్ణమై భార్యాభర్తలకు శాశ్వత [illegible] బంధమౌతుంది. [illegible] భారతీయ వివాహ వ్యవస్థ [illegible] విషయాన్ని [illegible] అనే వ్యాసంలో వివాహమంత్రాల ప్రాశస్త్యాన్ని వివరించారు.

పెండ్లి కూతురు శిరస్సుపై [illegible] ద్వారా [illegible] స్నానం [illegible]యిస్తే ఆ కన్యను ఇంద్రుడు శుద్ధి చేసి పవిత్రురాలిని చేసి, సూర్యవర్చస్సు గల దానినిగా [illegible]స్తాడని వేదమంత్రాల భావన. ఈ విషయాన్నే సవివరంగా '[illegible]' అనే వ్యాసం ద్వారా నిరూపించారు.

[illegible]

పరమాత్మకు 'సంస్కృత' అని పేరున్నది. అట్టి సంస్కృత స్వరూపుని చిత్త సంస్కారం ద్వారా తెలియజేసే భాష కాబట్టి 'సంస్కృతం దేవభాష' అయిందని ఈ వ్యాసంలో విశదీకరించారు.

సనాతనమైన వాణి వేదవాణి. ఋషులచేత దర్శింపబడ్డ వేదవాణే సంస్కృత వాణి అయింది. అనేక రహస్యాలు, ధర్మాలు, రాసాయనిక, భౌతిక, అణువిజ్ఞానం, వైదిక [illegible] మొదలైనవెన్నో మానవునకు ప్రసాదించిన దివ్యవిజ్ఞాన భాండాగారము ఈ వేదవాణి. ఈ విషయాల్ని '[illegible]' వ్యాసంలో చర్చించారు.

వేద ధర్మప్రవృత్తిలేని మారణహోమాలు జరుగుతుంటే అనాదు ధర్మయుద్ధాలు జరిగేవి. అణువు చిక్కిలి సూక్ష్మమైంది. అంతకంటే సూక్ష్మతరం పరమాణువు. అట్టి పరమాణు స్వరూపుడే భగవంతుడు. వేద శాస్త్రాలు అణువిచ్ఛిత్తిని ఎట్లా నివారించినవో 'అణుశక్తి' వ్యాసం ద్వారా తెలుసుకోవచ్చు.

మానవుడు తన మాటల్లోని దోషాల్ని గుర్తించి, మృదు, మధు, మిత, సౌమ్యభాషణం చేస్తే అసలు కలహాలే ఉండవంటారు 'మితభాషణం' అనే వ్యాసంలో.

చక్కని ఆరోగ్యం ఉండాలంటే ఆహార, పానీయాల పరిశుభ్రత, శుద్ధి, నాణ్యత ప్రధానం. శరీరం ఆరోగ్యంగా ఉండాలంటే శరీరంలోని అగ్నిని కాపాడు కోవాలి. [illegible] ఆసనాలు, యోగం, ధ్యానం, ప్రధాన సాధనాలు. ఆరోగ్యాన్ని [illegible] [illegible] శరీరాన్ని ధర్మసాధనానికి పరోపకారానికి ఉపయోగపడేట్లు [illegible] [illegible] వ్యాసంలో.

ధనం వల్లే సుఖదుఃఖాలు ఏర్పడతాయి కాబట్టి సుఖం వస్తే పొంగిపోక, దుఃఖం వస్తే

ఆచార్య వేటి అనంతరామ శాస్త్రి
ఐ.1-82, పట్టాభిపురం, గుంటూరు-522 001
తేది : ఆషాఢ గురుపౌర్ణమి, 2001భవదీయ

వేటి అనంతరామశాస్త్రి క్రుంగిపోక ఉండగల్గటమే దైవత్వమని 'సుఖదుఃఖాలు' వ్యాసం ద్వారా నిరూపించారు.

వృత్తి విద్యలు గానీ మరే విధమైన విద్యలు గానీ, వృత్తులుగానీ, నేర్చుకొనే విద్యార్థులు వినయ విధేయతలు, భక్తి శ్రద్ధలు, శుశ్రూషలతో గురువును మెప్పిస్తే తప్పక ఆ విద్యలు లభిస్తాయి అనే విషయాన్ని 'ప్రాచీన వృత్తులు విద్యలు' ద్వారా తెలుసుకోవచ్చు.

అలంకారాలు లేకుండా ఉండేది సహజ సౌందర్యం. ప్రసన్నమైన చిరునవ్వే వెలలేని అలంకారం, మంచి మాట అలంకారం, సచ్చరిత్ర మానవులకు అలంకారం. నేటి వాతావరణంలో బాహ్యాలంకారాలు ఏ విధంగా మోహజనకాలై మానవులను పెడత్రోవన బట్టించి, కీడును కల్గిస్తున్నవో చెప్పారు. కాబట్టి అందరు ఆర్ష విద్యా సమలంకృతులై జన్మపావనం చేసుకోవాలంటారు 'అలంకారములు-సౌందర్యములు' అనే వ్యాసంలో

దిలీపదంపతులు నందినీధేనువును సేవిస్తున్నప్పుడు గోవు యొక్క మాహాత్మ్య మెట్టిదో కాళిదాసు చెప్పా, గోశృంగాల మధ్య భాగం పరమార్థ సిద్ధికి ద్వారమని 'శృంగాంతరం ద్వార మిత్యాహుః' అనే వ్యాసంలో నిరూపించారు.

శ్రీరామమూర్తిగారు ఆర్ష సంస్కృతిని, సనాతనధర్మాన్ని, తెలియజేస్తూ రచించిన పై వ్యాసాలు ఎంతో ప్రామాణికమైనవి. వేద శాస్త్ర ప్రమాణంతో పరిశీలించి శోధాహరణంగా వ్రాసిన యీ 'హరిభారతి' పాఠకుల అంతరంగాల్లో నిలిచిపోయేది. ఈ ప్రయత్నంలో విరమించక ఇంకా ఇట్టి విలువైన గ్రంథాలు శ్రీరామమూర్తి గారు వెలుగులోకి తీసుకొని వస్తారని ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

శుభం భూయాత్

ఆచార్య వేటి అనంతరామ శాస్త్రి
ఐ.1-82, పట్టాభిపురం,
గుంటూరు-522 001.
తేది : ఆషాఢ గురుపౌర్ణమి, 2001

భవదీయ
వేటి అనంతరామశాస్త్రి

హరిభారతి

# శ్రీ గణపతి - వైదిక స్వరూపము

ప్రతి సంవత్సరం భాద్రపద శుద్ధచవితి నాడు వినాయకుని పూజించని భారతీయుడు లేడు. ఆ పూజయే భారతీయుల మొదటి పండుగ. ఏపనినిగాని, ఏదేవతా పూజనుగాని, వివాహాది శుభకార్యములనుగాని ప్రారంభించుటకు ముందు సకల విఘ్న నివారణార్థమీ మహాగణపతిని పూజించి, ఆయన అనుగ్రహంతో ఆయా కార్యములను సిద్ధింపచేసుకొను చున్నాడు. నిఖిలగణములకు అధిపతి యీ గణాధిపతి.. భూత, ప్రాణి, స్థావర, జంగమ, దేవ, మనుష్య, వృక్ష, పశు, కీటక, పర్వత, నదీ, నదాదులకే గాక విఘ్న గణాలకు కూడా అధిపతి యగు నీ దేవతామూర్తి నారాధించి విఘ్నముల తొలగించు కొనగలుగుచున్నాడు. ఈయనకు సిద్ధి, బుద్ధి భార్యలట. అంటే గణపతి నారాధించిన మంచి బుద్ధియు, సమస్త కార్యసిద్ధియు గల్గును.

శుభకార్యారంభమున పవిత్ర వేదమంత్రములకు పతియగు నీ గణపతిని కవి, బృహస్పతి, బ్రహ్మణస్పతి యని తెల్పెడి యీ ఋగ్వేదమంత్రము ద్వారా వేదమంత్ర స్వరూపునిగా ప్రార్థించుచున్నారు.

"ఓమ్। హరిఃఓమ్। శ్రీ మహాగణాధిపతయే నమః। ఓమ్। గణానాం త్వా గణపతిగ్ం హవామహే! కవిం కవీనా ముపమశ్రవస్తమమ్। జ్యేష్ఠ రాజం బ్రహ్మణాం బ్రహ్మణ స్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్"॥ అట్లే యజుర్వేదములో "నమో గణేభ్యో గణపతిభ్యశ్చ వో నమోనమః" । నిఖిల గణములు, ఆ గణములపాలకులు రుద్రస్వరూపులు అని , గణపతి కవి, బ్రహ్మణస్పతి యని యర్థము. "వేదో వేదవిదవ్యంగో వేదాంగో వేదవిత్ కవిః" యని విష్ణు సహస్రనామ స్తోత్రం. కవి, వేదము, వేదపాలకుడైన వేదవేత్త - వీరందరు విష్ణురూపులు. కాన కవి, వేదపదములు సమానార్థకములు. బ్రహ్మ అనగా వేదమంత్రము. కాన గణపతి వేదస్వరూపుడు, వేదపతి - వాక్పతి - వాచస్పతి - బృహస్పతి. అధర్వవేదంలో గణపతిని గూర్చి ప్రస్తావించిన మంత్రము - "త్వం వాఙ్మయః త్వం చిన్మయస్త్వ మానందమయః". గణపతియే వేదవాఙ్మయము. సచ్చిదానందమయుడగు పరమేశ్వరుడు. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అని బ్రహ్మస్వరూపమును శ్రుతి తెలియజేయుచున్నది. ఆ బ్రహ్మయే గణపతి యని పై ఋగ్వేదమంత్రార్థము.

**"అధీత వేదవేదాంగస్సోనూచానో యుగీ గణీః" - వైజయన్తీ కోశము.**

**వేదవేదాంగముల నధ్యయనం చేసినవానిని యుగీ, గణీః**

అని అందురు. "గణాః అస్యసన్తీతి గణీః" అని వ్యుత్పత్తి. గణములు గలవాడు గణి. వేదవేదాంగములు చదివినవాడు గణి యంటే గణశబ్దము వేదవేదాంగ వాచకము. గణీః అనగా గణపతి వేదవేదాంగ వేత్తయగును.

"జ్ఞానార్థ వాచకో గశ్చ ణశ్చ నిర్వాణ వాచకః ।
తయోరీశం పరం బ్రహ్మ గణేశం ప్రణమామ్యహమ్ ॥"

గణశబ్దంలోని 'గ' కారము జ్ఞానార్థ వాచకము. 'ణ' కారము నిర్వాణ- ముక్తి వాచకము. కాన గణములనగా జ్ఞాన, ముక్తి సాధనములైన వేదమంత్రములే. కావున గణపతి వేదమంత్ర పతి అని యర్థము. గణపతి సహస్రనామములలో గణపతి మంత్రస్వరూపుడు అని -

" మంత్రీ మంత్రపతిర్మం త్రీ మదమత్త మనోరమః"

అని చెప్పబడుచున్నాడు. ఇట్లే మౌద్గల పురాణములో

గణ శబ్దః సమూహస్య వాచకః పరికీర్తితః॥
సమూహా యోగరూపాశ్చ బాహ్యాన్తరైక్య భావతః॥
తేషాం స్వామీ గణేశానః తం జ్ఞాత్వా యోగినః పురా।
శాన్తిం ప్రాప్తా విశేషేణ యోగశాన్తి మయం పరమ్॥

మానవుల దేహంలో లోపల బయట (అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః అని శ్రుతి) వ్యాపించి భగవంతుడున్నాడని శ్రుతివాక్యము. ఈబాహ్యాభ్యంతరముల ఐక్యమే యోగము. ఇట్టి యోగరూపములైన సమూహములే గణములు. వాని యధిపతి గణపతి. యోగులా యోగీశ్వరుడైన గణపతిని సమాధినిష్ఠలో దర్శించి శాన్తిని పొందిరి. ఇంకనూ ఆ మౌద్గలపురాణములో -

" మనోవాణీ మయం సర్వం దృశ్యా దృశ్య స్వరూపకమ్ ।
గకారాత్మక మేవం తత్ తత్ర బ్రహ్మ గకారకః ॥
మనోవాణీ విహీనంచ సంయోగా యోగసంస్థితమ్ ।
ణకారాత్మక రూపం తఞ్చ కారస్తత్ర సంస్థితః ॥
వివిధాని గకారాచ్చ ప్రసూతాని మహామతే ।
బ్రహ్మణి తాని కథ్యన్తే తత్త్వ రూపాణి యోగిభిః ॥
ణ కారాచ్చ ప్రసూతాని బ్రహ్మణి తాని యోగిభిః ।
నిరోధాత్మక రూపాణి కథితాని సమంతతః ॥
గకారశ్చ ణకారశ్చ వామ్ని గణపతేః స్థితౌ ।
తౌ జానీహి భో యోగిన్ బ్రహ్మాకారౌ శ్రుతేర్ముఖాత్ ॥
తయోః స్వామీ గణేశశ్చ యోగరూపేణ సంస్థితః ।

అని. మనస్సు, వాక్కు ప్రధానమైనవి. దృశ్యాదృశ్య రూపమగుయీ ప్రపంచము మనోవాగాత్మకము. ఆ రెండు ఉన్న జగత్తు 'గ' కారము చేతను, లేని జగత్తు 'ణ' కారము

చేతను చెప్పబడినవి. ఈ గకార, ణకారముల నుండి పుట్టిన రెండును బ్రహ్మస్వరూపములే. బ్రహ్మాకారములే. వాని అధిపతి గణపతి యని తాత్పర్యము.

కొద్దిగా లోతుగా పరిశీలించిన వేదాంతపరంగా గణేశ తత్త్వము దర్శించదగును. "తత్త్వమసి" అని మహావాక్యము వేదముచే బోధింపబడుచున్నది.

**"త్వం పదార్థే నరాత్మకః తత్పదార్థే గజాత్మకః ।**
**తయో రభేదే అసిపదార్థే గణేశాకృతిమయః ॥"**

*- గణేశాథర్వ శీర్షోపనిషత్.*

గణపతి యొక్క ముఖము గజముఖము . దేహము మానవాకారము. గజముఖము 'తత్' పదార్థమనీ, క్రింద నరస్వరూపము 'త్వం' పదార్థమనీ, చెప్పబడినవి. గజముఖము పరమాత్మయనీ, నరస్వరూపము జీవాత్మయని అర్థము. జీవాత్మ పరమాత్మల యొక్క అభేదమే యోగము. ఆ యోగమును 'అసి' అను పదార్థముచే చెప్పుదురు. అట్లు జీవాత్మ పరమాత్మల ఐక్యమే గణేశుని ఆకారము అని తాత్పర్యము. అదే నరనారాయణ తత్త్వము. కృష్ణార్జున తత్త్వము. గణేశతత్త్వము. గణేశుని ముఖము కృష్ణస్వరూపము. దేహము నర-అర్జున స్వరూపము. నరసింహ తత్త్వము. గజ స్వరూపమును ఇట్లుపనిషత్తులు తెల్పుచున్నవి.

గచ్ఛసౌ జశ్చ గజః సమాధినా యోగినో యత్ర గచ్ఛన్తీతి గః ।
యస్మాత్ బింబప్రతిబింబవత్తయా ప్రణవాత్మకం జగజ్జాయతే ఇతి జః ।

'గ' 'జ' అను రెండక్షరములు కల్సి 'గజ' పదమేర్పడుచున్నది. యోగులు తపస్సమాధిలో ఎవరిలో లీనమగుచున్నారో అది 'గ' యని మరల బింబము నుండి అద్దములో ప్రతిబింబము వచ్చినట్లు ఎవరినుండి ఓంకారస్వరూపమయిన జగత్తు పుట్టుచున్నదో అది 'జ' యనియు, కాబట్టి గజ అనేది పరమేశ్వర స్వరూపమనీ తెలియును. ఈ విషయమునే శ్రుతి - గజముఖము, గజాకారము జగత్తని.

" గజవక్త్రం గజాకారం జగదేవావరుంధే" తెల్పుచున్నది. గణేశ తాపిన్యుపనిషత్తు ఇలా ప్రవచించినది.

**"తతశ్చోమితి ధ్వని రభూత్ తత్పనై గజాకారః॥"**

పరమాత్మ నుండి 'ఓం' అను ధ్వని పుట్టెను. అది గజాకారమైనది. అంటే గజాకారము ఓంకారస్వరూపము అని అర్థము, ఈ విషయాన్ని ముత్తుస్వామి దీక్షితులు.

"వాతాపి గణపతిం భజే.............. ప్రణవ స్వరూప వక్రతుండం"

అని తన కీర్తనలో విశదపరచెను. గణపతి యొక్క తొండము ఓంకార స్వరూపమట.

ఈ గజవక్త్రము గూర్చి కథలిలా ఉన్నవి. పురాణాంతర్గతములు.

1. గణపతి పుట్టగానే ఆపిల్లవానిని శని చూడగా నాతని మస్తకము శని చూపుచే ఛేదింపబడెను. అపుడు శివపార్వతులు దుఃఖించి శ్రీహరిని ప్రార్థించగా నా శ్రీహరి గజమస్తకమును దెచ్చి కూర్చగా నా బాలుడు బ్రతికెను. అపుడు శ్రీహరి శివపార్వతులను ఓదార్చి ఇట్లు చెప్పెను.

"తేజసా కృష్ణ తుల్యోఽ యంకృష్ణాంశశ్చ గజాననః" -బ్రహ్మవైవర్తపురాణమ్

ఈ గజాననుడు తేజస్సులో కృష్ణునకు సాటివాడు. కృష్ణాంశగల్గినవాడై లోకముల బాలించును అని.

2. పూర్వమింద్రుడు పుష్పభద్రానదీ తీరమున నొక గజమునెక్కి వెళ్ళుచూ పుష్పోద్యానవనమున రంభను చూచి కామించెను. ఆమెయు కామపీడితురాలయ్యెను. వారిరువురు కామక్రీడలలో మునిగి తేలుచుండగా వైకుంఠమునుండి కైలాసమునకు పోవుచూ దుర్వాసమహర్షి పుష్పభద్రానదీ తీరమునకు వచ్చెను. అచట ఇంద్రుని జూచెను. ఇంద్రుడును దుర్వాసమునికి నమస్కరించగా నాముని ఇంద్రునాశీర్వదించి నారాయణునికి నివేదించబడిన నొక పూజాపుష్పము నిచ్చెను. ఆ పుష్పము సర్వవిఘ్ననాశకమనీ, శిరస్సున ధరించిన సిరిగల్గుననీ, అట్లు ధరించనిచో సిరి తొలగిపోయి విఘ్నములు గల్గుతాయని వివరించి చెప్పి ముని వెడలెను. కాని ఇంద్రుడు రంభా మోహములో పడియుండుటచే నాముని మాటలు చెవికెక్కకపోగా నాపుష్పమును తన గజశిరస్సున పారవేసి రంభవెంట పడిపోయెను. పుష్పమును తృణీకరించి నిరాదరించినందున, పుష్పము లేనందున సిరి తొలగిపోయి ఇంద్రుడు పతితుడాయెను. అందుచే సిరి లేని ఇంద్రుని రంభ, ఏనుగున్నూ విడిచి వెళ్ళిరి. ఆ గజమును పుష్పమును ధరించినదై అరణ్యమునకు పోయి నొక ఆడ ఏనుగుతో గూడి క్రీడించుచుండగా నది శ్రీ మహావిష్ణువు కంటపడెను. తనకు నివేదించబడిన పుష్పము యొక్క గతికి విచారించి తుదకా గజముయొక్క శిరస్సును ఖండించి, ఆ శిరస్సును పార్వతీ పరమేశ్వరుల మృతశిశువు యొక్క మొండెమునకు సమకూర్చెను. అందుచేత నప్పటి నుండి నా బాలకునికి 'గజవక్త్రుడ' ని నామము గల్గినది.

మౌద్గల్యోపనిషత్తు గణేశుని 'వక్రతుండ' నామధేయునిగా కీర్తిస్తూ నిట్లు వివరించుచున్నది

బింబం మాయాయుతం వక్రం మోహితం సిద్ధి బుద్ధిగమ్।
తద్భావం హస్తి తుండేన తేనాయం వక్రతుండకః॥
మాయా ముఖం మోహయుతం తస్మాద్వక్రమితి స్మృతమ్।
పరం బ్రహ్మ తయోర్యోగే వక్రతుండోఽ యముచ్యతే॥
కంఠాధో మాయయాయుక్తో మస్తకం బ్రహ్మవాచకమ్।
వక్రాఖ్యం తస్య విఘ్నేశ తేనాయం వక్రతుండకః॥

మానవుల బుద్ధిని, సిద్ధిని ఆవరించి మోహము గల్గించెడి అజ్ఞానమే మాయ.

ఆ మాయ 'వక్ర' మని పిలువబడుచున్నది. మోహయుక్తమైన ముఖము మాయ. ఆ మాయారూపమగు ముఖము వక్రమనబడు చున్నది. ఆ మాయను తుండముచే నాశనము చేయుచున్నాడు అందుకై అయన ముఖమునకు తుండము కూర్చబడినది. అందుచే అయన వక్రతుండుడయ్యెను. లేదా, ముఖము మాయ, తుండము మాయి. "మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్" అని భగవద్గీతా వచనమే ఇట్లు నిరూపింపబడినది. మాయగలవాడు మాయి. ఈ మాయినే పరంబ్రహ్మ అని అందురు. మాయా-మాయిల యోగమే వక్రతుండ స్వరూపము. లేక, కంఠము క్రింద భాగము మాయ, శిరస్సు బ్రహ్మ వాచకము. ఈరెండు కలిపిన వక్రతుండ స్వరూపము సిద్ధించును. ఇది గణపతి, గజవక్త్ర, వక్రతుండ నామప్రాశస్త్యము.

ఇట్లే వివిధనామముల అర్థములను చూతము.

4. వినాయకః-

దీనికి మూడు వ్యుత్పత్తులు - 1) వినయతి - శిక్షయతి దుష్టాన్ విఘ్నాం శ్చేతి వినాయకః - దుష్టులను విఘ్నములను శిక్షించుచున్నవాడు. 2) విగతో నాయకః ప్రభుః యస్య - తనకు ఎవరు నాయకుడు లేడు, కాలేడు, కాన స్వతంత్రుడగు నాయకుడు. 3) విశిష్టః నాయకః. ఒకానొక చక్కని విశేషము గల నాయకుడు. నాయకులందరిలోను విశిష్టుడు. మహామహిమలు గల్గి, సమర్థుడైన నాయకుడు - ప్రజలను చక్కగా పాలించుటయే విశేషము. నాయకులకు నాయకుడు. ప్రజానాయకుడు.

5. హేరంబః

దీనికి మూడు వ్యుత్పత్తులు. 1) హే-రుద్ర సమీపే రంబత ఇతి హేరంబః. శివుని సాన్నిధ్యంలో నిరంతరముండువాడు. 2) హే-శివ సమీపే రంబతే శబ్దాయతే ఇతి - శివుని వద్ద శబ్దము చేయువాడు. ఆ శబ్దము వేదధ్వని. ఆ వేద ధ్వనియే ఓంకారనాదము. ఈ నాదమును చేయువాడు హేరంబుడగును. 3) హేరతే - వర్ధతే ఇతి - ప్రపంచమును వర్ధిల్లజేయువాడు. బ్రహ్మవైవర్త పురాణమున నిట్లుగలదు.

"ఉమేతి శబ్దం కుర్వంతం రుదంతం తం స్తనార్థినమ్". అని వినాయకుడు పుట్టుమనే పాలకోసం ఏడుస్తూ ఉమా అని శబ్దం చేయుచున్నాడు అని. ఓమ్ అనునది 'అఉమ్' అని మూడక్షరములు. అవే మూడువేదములు. వాని కలయికతోనే 'ఉమ' అను శబ్దము పుట్టినది. అకారమును ముందు తీసి చివర చేర్చినచో 'ఉమా' అనే పదమేర్పడు చున్నది. కాన ఉమా అనే శబ్దము ఓంకారము అనగా త్రయీవిద్యా స్వరూపము. వేదత్రయ స్వరూపమగు బ్రహ్మవిద్య. అట్లు పుట్టిన వినాయకుని నోటినుండి ఓంకారము, వేదములావిర్భవించుట చేత నాయన 'హేరంబః' అని గీర్తింపబడుచున్నాడు.

హేరం అంబతీతి -

హేరం అనగా కిరీటము. అంబతి అంటే ధరించుచున్నాడని అర్థం. కిరీటధారి హేరంబుడగును. దేవతలలో నాయకుడు, సర్వగణములకు అధిపతి. కావున ఆయనకు అధిపత్యమివ్వబడినది. కిరీటధారి - రాజాధిరాజు గావించబడినవాడు.

6) చతుర్భుజః :-

నాల్గు భుజములు గలవాడు. నాల్గు భుజములు నాల్గు శృంగములు. నాల్గు వేదములు నాల్గు చేతుల ధరించినవాడు.

7) ఏకదంతః :-

ఒక దంతము గలవాడు. ఏకశబ్దము 'మాయా' వాచకము, సమస్తజగదుత్పత్తికి కారణము. దంతశబ్దము 'మాయీ' వాచకము అది 'సత్' అని చెప్పబడుచున్నది.

"ఏకశబ్దాత్మికా మాయా తస్యాస్సర్వ సముద్భవమ్।
దన్త స్సత్తాధరస్తత్ర మాయీవాచక ఉచ్యతే ॥"

- మౌద్గల పురాణమ్.

"మాయా భ్రాన్తిమయీ ప్రోక్తా సత్తా చాలక ఉచ్యతే ।
తయోర్యోగే గణేశోఽయ మేకదన్తః ప్రకీర్తితః"

కనుక మాయా, మాయీల సంయోగమే "ఏక-దంతముల" సంయోగమే ఏకదంత తత్త్వము. మాయీ అంటే మాయను తన అధీనమున నుంచుకొన్నవాడు. భ్రాంతి మయమగు మాయ ద్వారా ప్రపంచ సృష్టిగావించి అమాయను, మాయా సృష్టియగు జగత్తును నడిపించువాడు, నడిపించగలవాడునని అర్థము. (చాలకః).

"ఏకశబ్దః ప్రధానార్థః దన్తశ్చ బలవాచకః ।
బలం ప్రధానం సర్వస్మాదేకదన్తం నమామ్యహమ్."

ఏకః అంటే ప్రధానము, దంతమనగా బలమన్న అర్థములు. ప్రపంచంలో నన్నిటికన్న ప్రధానమైన బలము-శక్తి-సంపన్నుడు ఏకదంత స్వరూపుడగు గణపతియేనని తెలియుచున్నది.

8) విఘ్ననాయకః :-1) విఘ్నముల నాశనము చేయు నాయకుడు.

"విపత్తివాచకో విఘ్నః నాయకః ఖండనార్థకః।
విపత్ఖండన కారకం నమామి విఘ్ననాయకమ్"

- బ్రహ్మవైవర్త పురాణమ్.

విఘ్నమనగా విపత్తు. నాయకుడనగా ఖండించువాడు. కావున విపత్తులను ఖండించి

సమర్థవంతంగా పాలించు నాయకుడు వినాయకుడు.

2) "వివేకం హన్తీతి విఘ్నో హ వా తస్య విఘ్నస్యనాయకః" వివేకమును చంపునది విఘ్నము. విఘ్నమును నశింపచేసి మంచి వివేకము గల్గించు నాయకుడు.

3) "హననం కార్యస్యేతి విఘ్నః" అని అమరకోశము. కార్యముల చెడగొట్టునది విఘ్నము. ఆ విఘ్నముల నరికట్టువాడు వినాయకుడు.

4) మౌద్గల్య పురాణమున - "వేదాదిషు విఘ్నో భగవానితి కథ్యతే కాలమయత్వాత్, కాలాధీన సృష్టి స్థితిలయత్వాచ్చ".

5) "విశేషేణ జగత్సామర్థ్యం హన్తీతి విఘ్నః -- తతః

"భగవన్తౌ విఘ్న వినాయకౌ ప్రీయేతామ్" అని చెప్పబడెను. వేదములలో విఘ్నము భగవానుడని చెప్పబడెను. ఆ భగవానుడు సృష్టి, స్థితి, లయములను తనయధీన మందుంచుకొన్న కాలస్వరూపుడు. ఆ కాలస్వరూపమే విఘ్నదేవత. జగత్తు యొక్క సామర్థ్యమును నాశనము చేయునది కావున విఘ్నమని పేరు. కావున యీ విఘ్నమే కాలదేవత. కాలమే విఘ్నము. ఈ విఘ్నమును జయించిన పరమేశ్వరుడే వినాయకుడు . అందుకు "భగవంతులైన విఘ్నదేవత వినాయకులను కార్యారంభమున ప్రీతిచెందించవలెను". అని యర్థము. అందుకని స్కందపురాణమిట్లు చెప్పుచున్నది.

" ఉక్త్వైవమాహ్వా యత్ స్కందః శక్రస్తం కాలరూపిణమ్
య ఇదం మాయయా22 మోహ్యా కలయత్యఖిలం జగత్ ।
విఘ్నరూపేణ ఘోరేణ స కాలపురుషో భువి ।
గర్జనాదఖిలాన్లోకాన్ కంపయామాస వేగవాన్ ।"

మాయతో మోహపరచి నిఖిల జగత్తును నాశనము చేయు కాలపురుషుడు ఘోరమైన విఘ్నస్వరూపము. తన గర్జనలతో లోకములను కంపింపచేసెను. అట్టి కాలపురుషుని ఇంద్రుడు, స్కందుడు పిలిచిరి. అతనిని జయించిరి.

యోగవాసిష్ఠమందు విఘ్నము గూర్చి ఇట్లు ప్రస్తావన గలదు.

"మా తపః క్షపయా బుద్ధే కల్పకాల మహానలైః॥
యో న దగ్ధోస్మి మే తస్య కిం త్వం శాపేన ధక్ష్యసి॥"

భృగుమహర్షి విఘ్నరూపుడైన కాలపురుషుని శపించబోయెను. అపుడు కాలపురుషుడిట్లనుచుండెను.నీ శాపము నన్నేమియు చేయలేదు-నన్ను దహించదు. కాన నీ శాపము వృథాయగును. నీ తపస్సు క్షీణించును అని. కావున విఘ్నమనునది సత్కర్మలన్నిటి యందును అనివార్యమనీ, అది గణపతి ప్రసాదంతోనే జయించదగునని భృగుమహర్షి వృత్తాన్తం తెల్పుచున్నది. అట్లే కుమారసంభవ కావ్యమున గూడ వివరింపబడినది.

బ్రహ్మజ్ఞానులు విఘ్నములు జయింతురు. "ఆత్మేశ్వరాణాం న హి జాతు విఘ్నాః సమాధి భేద ప్రభవా భవన్తి" - ఆత్మ గజస్వరూపముగాన, అట్టి ఆత్మను శరణుబొందిన లేక వశము చేసికొన్న యోగులకు విఘ్నములు తొలగిపోవును వారి సమాధిస్థితిని భేదించజాలవు. ఈ మొద్గల పురాణగాధను చూద్దాము.

అభినందనుడను రాజు ఇంద్రునకు హవిర్భాగము లేని యొక యజ్ఞము చేయ ప్రారంభించెను. ఈ విషయము తెలిసిన ఇంద్రుడు కోపించి, కాలపురుషుని పిలిచి యా యజ్ఞ భంగము చేయవాజ్ఞాపించెను. యజ్ఞభంగమనే విషయమును గ్రహించి నాకాలపురుషుడు విఘ్నాసురుడుగా మారెను. అతడు రాజును చంపి ఆ యజ్ఞమును, కనపడి, కనపడకుండ పాడుచేయసాగెను. అపుడు మహర్షులు బ్రహ్మను ప్రార్థింపగా బ్రహ్మ గణపతిని ప్రార్థించమని చెప్పెను. వారి స్తోత్రము వలన గణపతి ప్రసన్నుడాయెను. గణేశుని చేతిలో విఘ్నాసురుడు ఓడిపోయెను. గణపతి శరణుజొచ్చి యాయన యాజ్ఞాబద్ధుడయ్యెను. అప్పటినుండి గణపతికి విఘ్నరాజని పేరుగల్గెను.

వైదిక సత్కర్మానుష్ఠానమే బ్రహ్మజ్ఞాన సాధనమనీ, అట్టిబ్రహ్మజ్ఞాని కాలమును జయించి యమృతస్వరూపుడగునని తాత్పర్యము. అనగా కాలాధీనమైన జగత్తును జయించును. భగవత్సాక్షాత్కారము కాగానే కాలరూపవిఘ్నము తొలగిపోవును. లలితాసహస్రనామములలో నమ్మవారికి ఈనామములున్నవి.

"కామేశ్వర ముఖాలోక కల్పిత శ్రీ గణేశ్వరా"
"మహాగణేశ నిర్భిన్న విఘ్నయంత్ర ప్రహర్షితా"

లలితాదేవి తన భర్త ముఖమును చూచుటతోనే గణపతిని పుట్టించెను. ఆగణపతి ఇరువది అక్షరములు గల మంత్రస్వరూపుడు.

దేవతలను జయించుటకు రాక్షసులనేక విఘ్నయంత్రములనేర్పాటు చేసికొనగా గణేశుడు వానిని నాశనము చేసెను. దానిని గాంచి లలితాదేవి సంతసించినది. గణపతిచేత విఘ్నయంత్రములు భేదింపబడెను. దేవతలు విఘ్నముల నుండి విడుదలయ్యిరి.

బ్రహ్మాండపురాణమున - "సంతసించిన లలితాదేవి కామేశ్వరుని ముఖముపై క్రీగంటి చూపునుంచి దంతములు కన్పించునట్లు నవ్వెను. ఆ నవ్వుకాంతుల నుండి గజరూపముగల దేవుడు యావిర్భవించెను. ఆయనయే శ్రీమహా గణపతి". అని గలదు.

9) లంబోదరః- "స్వోదరే సర్వం ప్రతిష్ఠితం, స్వస్య న కస్యాప్యుదరే స్థానమ్. తతో లంబోదరత్వమ్ సిద్ధమ్" ప్రపంచమంతా తన ఉదరమందే ఉన్నది. కాని తాను మాత్రమెవరి ఉదరంలో ఉండడుగాన గణపతి లంబోదరుడు. ఇక ఏదేవుని కట్టి నామములేదు.

10) శూర్పకర్ణ :- గణపతి చెవులు చేటలవంటివి. అంటే?

"రజోయుక్తం యథా ధాన్యం రజోహీనం కరోతి చ।
శూర్పం సర్వనరాణాం చ యోగ్యం భోజన కామ్యయా॥
శూర్ప కర్ణం సమాశ్రిత్య త్యక్త్వా మలవికారకమ్।
బ్రహ్మైవ నరజాతిస్థో భవేత్తేన తథా స్మృతః॥
తేనాయం శూర్పకర్ణప్ప వేదేషు కథితో2 భవత్.

గణపతి సహస్రనామములలో "ధన ధాన్యపతిః ధన్యః" అని గణపతి ధన,ధాన్యపతి అని పిలువబడుచున్నాడు. పంటల నూర్పిడి కాలమున ధాన్యమును తూర్పారబట్టుటకు యజమాని చేటలనుపయోగించును. చేటలతో విసరగా ధాన్యమునందలి ధూళిపోయి స్వచ్ఛమగు ధాన్యము నా ధాన్యపతి పొందును. అట్లే గణపతి జనుల కర్ణమార్గము (చెవుల) ద్వారా హృదయమును బొంది, శూర్పం వలె పాపపుణ్య రూపములగు మనోమాలిన్యములను చెరగుచుండుటచే 'శూర్పకర్ణ' అను పేరునొందెను.ధాన్యమును చెరుగుటకు ధాన్యపతి చేటలనుపయోగించెడి శిల్పమునకు ప్రతీకగా ధాన్యపతియగు యీగణపతి చెవులను చేటలుగా చూపించటం జరిగినదని వేదములో చెప్పబడెను.

11) మూషకవాహనః

గణపతి దేవుని వాహనము మూషకమట. శ్రీమహావిష్ణువు గరుత్మంతుని, శివుడు వృషభమును, దుర్గాదేవి సింహమును, కుమారస్వామి మయూరమును వాహనములుగా నెంచుకొనిరి. మరి యీ గణపతికి అత్యల్ప ప్రాణియైన మూషకము వాహనమగుట ఏమి? వినాయకుడు మూషకము పైన కూర్చుంటే ఆ మూషకము చనిపోదా? అని సాధారణ ప్రశ్నలు. విచారింతము -

"ఛందోమయేన గరుడేన సముహ్యమానః"అని భాగవతము,
"శృంగాంతరం ద్వారమివార్థ సిద్ధేః" అని రఘువంశము,
ఇంకా అనేక వేదమంత్రములచే గరుత్మంతుడు, వృషభమువొదలగునవి వేదస్వరూపములని తెలియును.

'బ్రహ్మణం బ్రహ్మవాహనం' అని వేదము.

బ్రహ్మకు బ్రహ్మ వాహనమట. పరబ్రహ్మకు శబ్దబ్రహ్మ వాహనము అని అర్థము. అంటే పరమేశ్వరుని వేదముద్వారానే తెలిసికొనవలెనని అర్థము. అట్లే మూషికము గూడ. శబ్దబ్రహ్మ స్వరూపమే. మూషిక స్వరూపము చూతము.

ఈ పదము 'ముషస్తేయే' అను ధాతువునుండి పుట్టినది. అనగా దొంగిలించు నదియని

యర్థము. కన్నంలో కనపడకుండ దాక్కుని దొంగవలె ఎవరికి తెలియకుండ పదార్థములను మామూలుగా ఎలుక దొంగిలించును. అట్లే సర్వప్రాణుల హృదయములనే బిలములలో నివసించుచూ అందరి భోగములను అపహరించుటచేత, మానవుల యజ్ఞానమును హరించుటచేత, అందరి ప్రాణములను హరించుటచేతను, మాయా మూషకరూపధారి యగు సర్వాంతర్యామియే మూషకమని గూఢంగా ఉంటూ చెప్పబడుచున్నాడు. అట్లే మానవుల అజ్ఞానము దొంగిలించి అనగాపోగొట్టి జ్ఞానమును ప్రసాదించునది వేదమే. కావున వేదమే మూషకము. అట్లు వేదము, లేక సర్వాంతర్యామి యగు ఈశ్వరుడు గణపతిని సేవించుటకై మూషకరూపమును ధరించి వాహనముగా రూపొందిరి.

"మూషకం వాహనాఖ్యంచ పశ్యన్తి వాహనం పరమ్॥
తేన మూషక వాహో2 యం వేదేషు కథితో2 భవత్॥
ముషస్తేయే తథా ధాతుః జ్ఞాతవ్యః స్తేయ బ్రహ్మధృక్
నామరూపాత్మకం సర్వం తత్రా సద్బ్రహ్మ వర్తతే।
ఈశ్వరః సర్వభోక్తాచ చోరవత్తత్ర సంస్థితః ।
స ఏవ మూషకః ప్రోక్తో మనుజానాం ప్రచాలకః॥
మాయయా గూఢరూపస్సః భోగాన్ భుజ్క్తే హి చోరవత్॥

అట్లే వేదమందు పరమేశ్వరుడు "తస్కరాణాం పతయే నమో నమః। స్తేనానాం పతయే నమోనమః" అని కీర్తింపబడుచున్నాడు. స్తేనః అనగా కపటవేషధారియైన దొంగ. మనతోపాటే ఉంటూ, నవ్వుతూ, ఆడుతూ, పాడుతూ ఉండి మనకు తెలియకుండా కళ్ళల్లో దుమ్ము కొట్టెడివాడు లేక తడిగుడ్డతో గొంతు కోయువాడు "స్తేనః" అని చెప్పబడును. అట్టి స్తేనలక్షణము ఈశ్వరరూప మూషకమున కనపడుటచే నీశ్వరుడే మూషకముగ ఉంటూ గణపతి దేవుని వాహనమాయెను.

లోకమున ప్రాణుల ప్రాణములను హరించునది కాలము. ఈ కాలమెపుడు ఎవరి ప్రాణమును దొంగిలించునో, ప్రక్కనే యుంటున్న ప్రాణులెరుగరు. కావున కాలము స్తేన-మూషక స్వరూపము. అయితే పరమేశ్వరునికి "కాలకాలః"" కృపానిధిః" అని నామములు గలవు. అనగా పరమేశ్వరుడు కాలమునకు కాలమువంటివాడు. అనగా మృత్యువు కాలరూపమున ప్రాణులను కాటువేయును. అట్టి మృత్యువును, కాలమును జయించిన వాడొక్కడే మృత్యుంజయుడని పిలువబడుచున్న పరమేశ్వరుడు. ఇట్టి యీ శిల్పమునకును పరబ్రహ్మకు శబ్దబ్రహ్మ వాహనమై యుండెడి శిల్పమునకునూ ప్రతీకగా వినాయకుడు మూషకమునెక్కినట్లు బొమ్మలలో చూపబడుచున్నది. కొన్ని చోట్ల సింహవాహనుడుగా చూపబడినది.

ఇట్లు ఇంకనూ గణపతి తత్త్వమును గూర్చి చెప్పవచ్చును. గణేశపురాణమందు "పార్వతీదేవి తపస్సు చేయగా, ఆమెకు వరములిచ్చుటకై ఓంకారస్వరూపుడైన పరమేశ్వరుడు ఓంకార రూపుడగు గజాననుడుగా సాక్షాత్కరించినట్లు" ఉన్నది.

పద్మాసనాసీనుడైన యీ గణపతికిఎడమవైపు బ్రహ్మముఖము, మధ్య నారాయణ ముఖము, దక్షిణమున శివుని ముఖము ఉన్నదట. అందుచే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు కూడా కారణభూతమగు పరమ, అవ్యక్తతత్త్వం గణపతి స్వరూపము. దేవీభాగవతమున గూడ, అకారోకార మకారస్వరూప బ్రహ్మవిష్ణురుద్రాత్మకుడుగ గణపతి వర్ణించబడినాడు. వినాయక సంహితలోని మయూరేశక్షేత్ర మాహత్మ్యంలో

"ధ్యానే మనసి మే జాతః పుత్ర త్వం పాలయ ప్రభో।
మమ పుత్రఇతి ఖ్యాతో లోకే2స్మి భగవన్ భవ॥"

అని గలదు. శివుడు భగవంతుని గూర్చి ఏకాగ్రమైన మనస్సుతో ధ్యానించగా భగవంతుడు ఆశివుని మనస్సులోనే ప్రసన్నుడాయెను. అపుడు శివుడాయనను నామనస్సులో పుట్టినందున నీవు పుత్రధర్మమును వహించి లోకమున నాకుమారునిగ (శివునికుమారుడుగ) ఖ్యాతి నందవలెనని ప్రార్థించెను. ఆభగవంతుడే గణపతి. ఇట్టి యీ మహాగణపతి ప్రసాదమున ప్రజలు మంచి బుద్ధిని, సమస్త కార్యసిద్ధిని బొందుదురు గాక! మంచి వాక్శుద్ధిని పొందెదరుగాక! మంచి పుత్రులను బొందెదరుగాక!

ఇతిశమ్

"నమామ విఘ్ననాయకమ్"



# శ్రీ కృష్ణావతార తత్త్వము

ద్వాపరయుగం అంతముగావచ్చింది. కలియుగ ప్రవేశం కాబోతుండగా నారదమహర్షి బ్రహ్మను కలిదోషమును తరించు ఉపాయమడుగుతాడు. అపుడు బ్రహ్మ "హరేరామ హరేరామ రామరామ హరేహరే। హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే" అని నిరంతర భగవద్ధ్యానమే కలిసంతరణోపాయమని ఉపదేశించినట్లు "కలిసంతరణోపనిషత్"చెప్పుచున్నది.

కృతమనగా పుణ్యమని యర్థము. కృతయుగంలో అంతా ధర్మము నాల్గు పాదముల నడచింది. పుణ్యమే తప్ప పాపప్రసక్తి లేదు. "త్రేతాయుగేతు సంప్రాప్తే ధర్మః పాదోనతాం గతః" అని స్మృతివాక్యము. త్రేతాయుగంలో ధర్మము యొక్క నాల్గుపాదములలో నొకటి తగ్గింది. త్రీన్ ధర్మపాదాన్ ఇతా 'ఇతి త్రేతా'। మూడు పాదములనాశ్రయించుటచే త్రేతా అయినది. "ద్వాభ్యాం కృత త్రేతాభ్యాం పరః", "ద్వాపరౌ పక్షౌ యస్యేతి" ద్వాపరః అని వ్యుత్పత్తుల వలన కృత, త్రేతల తరువాతది, రెండు పాదముల ధర్మము గల్గి యుండుటచే నాయుగమునకు ద్వాపరమని పేరు వచ్చినది. ఇక కలిశబ్దమునకు "కల్యన్తేఽస్మిన్నితి" అనివ్యుత్పత్తి. దీనియందు కలహించుకొందురని అర్థము. ధర్మము మూడుపాదములు తగ్గియుండును. పాపభూయిష్ఠము. పుణ్యప్రసక్తి లేశమాత్రము.

అట్టి యా ద్వాపరయుగంలో శ్రావణమాసంలో కృష్ణపక్షంలో అష్టమినాడు శ్రీకృష్ణభగవానుని అవతరణము జరిగింది. అనాటి ప్రజలెంత పుణ్యము చేసికొన్నారో!

"శ్రావణే బహుళే పక్షే కృష్ణజన్మాష్టమీ వ్రతమ్।
న కరోతి నరో యస్తు భవతి క్రూర రాక్షసః॥ -నిర్ణయసింధు

'శ్రావణ' అనే పదం 'శ్రవణమ్' అనేపదమునుండి బుట్టినది. "శ్రుతిః స్త్రీ శ్రవణం శ్రవః" అని అమరకోశము. చెవి యని, వేదమనీ అర్థములున్నవి. 'ధర్మాధర్మాదికం అనేన శ్రూయత ఇతి శ్రవణమ్' అని వ్యాఖ్యానము.దేనిచేత ధర్మాధర్మములు వినబడునో యావేదమును శ్రవణమందురు. గురు,శిష్య పరంపర ప్రాప్తమై శ్రవణముద్వారా భువికి అవతరించిన వేదమే శ్రవణము. శ్రవణమంటే శృణోతి అనే ధాతువు యొక్క ల్యుట్ ప్రత్యయము. 'వినుట' - 'వినికిడి' అని అర్థములు. శ్రావణమాసంలో అంతరిక్షమునుండి మేఘముల వాదము 'దదద' యని వినిపించును. ఆ మేఘగర్జనమే, మేఘనాదమే, వేదనాదము. ఆ వాదమునకే శ్రుతి, శ్రవణమని పేరు. 'శ్రోణ' యని వేదము పేరుపెట్టింది.

"శృణ్వన్తి శ్రోణామమృతస్య గోపాం
పుణ్యామస్యా ఉపశృణోమి వాచం" - ఋగ్వేదము.

అమృతస్వరూపిణియగు వేదమునకు 'గోప' అనగా రక్షకురాలు గావున నీ మాసమునకు 'శ్రోణ' - శ్రావణమాసమని పేరు వచ్చింది. అందుకే శ్రావణపూర్ణిమనాడు రక్షాబంధనమను వేడుకను ప్రజలు చేసికొంటున్నారు. ఆనాడు నూతనయజ్ఞోపవీతధారులై వేదాధ్యయన మారంభిస్తారు. కొత్తగా నుపనయనమైనవార్కి 'ఉపాకర్మ'ను చేసి కొత్తగా వేదాధ్యయన మారంభిస్తారు.

వేదములు పరమేశ్వరునిచేత నిరంతరం రక్షింపబడుచుండుటచే, రక్షకుడైన పరమేశ్వరునికి 'గోపః' అని పేరు. గోప, గోపాలక నామధేయములతో శ్రీకృష్ణావతారమును పరమేశ్వరుడెంచుకొనెను. "గాం పాతీతి గోపః". గో శబ్దమునకు భూమి, వేదాది అర్థములెన్నో గలవు. ఆవు, సూర్యకిరణమనీ అర్థములున్నవి.

"యో బ్రహ్మణం విదధాతి పూర్వం యో విద్యాం తస్మ

గోపయతి స్మ కృష్ణః" - గోపాలపూర్వ తాపనీయోపనిషత్।

పూర్వము బ్రహ్మను సృష్టించి ఆయనవద్ద వేదవిద్యనుంచి రక్షించినవాడు కృష్ణుడని యర్థము.

"అంతకాలే సంసృజ్య విశ్వాభువనాని గోప్తా" -అధర్వశిరోపనిషత్

ప్రలయాంతమున సమస్తభువనములను సృష్టించి రక్షించుటచే భగవంతుడు గోప్తా, గోపః అగును.

శ్రీకృష్ణుడు గోప, గోపాల, గోవింద శబ్దములతో పిలువబడుచున్నాడు. గోకులంలో గోపస్త్రీలు, గోపికలతో విహరించినట్లు గాథలున్నవి. ఆ గాథలలోని వైదికతత్త్వమును చూద్దాము. కృష్ణోపనిషత్తులో నొక గాథ గలదు.

శ్రీమన్నారాయణ స్వరూపుడు, సర్వాంగసుందరుడు జగన్మోహనుడునైన శ్రీరామచంద్రుని చూచి, ఆయన సౌందర్యమునకాశ్చర్యపడిన మహర్షులు రామునితో నిట్లు పలికిరి - "నీయవతారములలో రామావతారం గణనీయమైనది. జగన్మోహనుడవగు నిన్ను ఆలింగనం చేసికొనవలెనని మా సంకల్పమును మన్నింపుము" అని. అపుడు రాముడు వారితో నిట్లనెను.

"నాయొక్క తరువాత అవతారము కృష్ణావతారము. అపుడు మీరందరు గోపికలుగా అవతరించినన్నాలింగనము చేసికొండు. ఇతర అవతారములలో కుదరదు" అని చెప్పెను.

"తం హోచుర్నోవద్యమవతారాన్ వై గణ్యన్తే ఆలింగామో భవంతమితి। భవాన్తరే యూయం గోపికా భూత్వా మామాలింగథ। అన్యేయే2 వతారాస్తేహి గోపాన్న స్త్రీశ్చ నో కురు"-కృష్ణోపనిషత్. అట్లు కృష్ణావతారమున మహర్షులందరు గోపికలుగా జన్మించి కృష్ణుని ఆలింగన చుంబనాదులతో విహరించి తరించిరి. ఈ విషయాన్ని కృష్ణలీలా తరంగిణిలో నారాయణ తీర్థులవారు "యజ్ఞ పత్న్యస్తమీశానం లీలాగోపాల విగ్రహమ్" అనగా మహర్షులు యజ్ఞమున బ్రాహ్మణ భార్యలుగా అవతరించి లీలా మానుష విగ్రహుడగు శ్రీకృష్ణుని సేవించి తరించిరి అని తెల్పిరి.

ఆ కృష్ణోపనిషత్తు మరల "వేదవాక్కులు, ఉపనిషత్తులు గోపికలుగాను ఆవులు (గోవులు) గాను జన్మించి పరబ్రహ్మ స్వరూపుడైన కృష్ణుని సేవించినట్లు" తెలుపుచున్నది. గోపికాస్త్రీలు బ్రహ్మరూపములగు ఋగ్వేదమంత్రములట.

"శేషనాగో భవేద్రామః కృష్ణో బ్రహ్మైవ శాశ్వతమ్।
అష్టావష్ట సహస్రే ద్వే శతాధిక్యః స్త్రియస్తథా ఋచో
పనిషదస్తా వై బ్రహ్మరూపా ఋచః స్త్రియః" -కృష్ణోపనిషత్.

"ధరా సా వై సత్యభామా - దయా సా రోహిణీ మాతా।
అఘాసురో మహావ్యాధిః - కలిః కంసస్సభూపతిః"

భూదేవి-సత్యభామ, దయ-రోహిణి, మహావ్యాధి-అఘాసురుడు, కలి-కంసుడు, శేషసర్పము-బలరాముడుగను అవతరించినట్లు ఉపనిషత్తు చెప్పుచున్నది.

"కృష్ణాత్మికా జగత్కర్త్రీ మూలప్రకృతీ రుక్మిణీ" జగత్తు సృష్టికి కారణభూతురాలు, మూలప్రకృతియగు మాయ కృష్ణుని భార్యయగు రుక్మిణీగా నవతరించినది.

"యా మా సా మాయా" లక్ష్మియే మాయ. ఆ లక్ష్మియే రుక్మిణి.
గోపరూపో హరిస్సాక్షాన్మాయా విగ్రహధారిణః"

శ్రీహరి మాయావిగ్రహరూపుడు, గోపరూపుడని యర్థము. గోకులమనగా వ్రజాస్థానము, గోస్థానము అనగా వేదమంత్ర మండలమని శ్రుతి ఇట్లు చెప్పుచున్నది.

" వ్రజం గచ్ఛ గోస్థానమిత్యాహ। ఛందాంసి వై వ్రజో
గోస్థానః । ఛందాంస్యేవాస్మై వ్రజం గోస్థానం కరోతి"

- తైత్తిరీయ బ్రాహ్మణమ్।

మంత్రములనెడి గోవులకు - వేదవాక్కులకు నిలయములగుటచే, ఛందస్సులు- వేదములు గోస్థానములు.అవే వ్రజములు. సామాన్యులకు వ్రజములు గొల్లపల్లెలుగా కనపడును. వైదికదృష్టిగలవారికి వ్రజములు గోస్థానములు అనగా వేదమంత్ర నిలయములుగా కనపడునని వేదమాత చెప్పుచున్నది. అచట గోపికలు వేదవిద్యాకలాస్వరూపములుగా దర్శనమిస్తారట.

"గోభూమి వేదవిదితో వేదితా గోపీజన విద్యా కలాప్రేరకః"

- *గోపాల పూర్వతాపనీయోపనిషత్.*

గోవులను వేదమంత్రములుగను, గోభూమిని వేదమంత్ర నిలయమనీ, తెలిసికొన్న తత్త్వవేత్త ఆ గోపీజనము యొక్క విద్యాకళలతో ప్రేరేపింపబడినవాడై వేదములయందలి

యనేక తత్త్వములను, రహస్యములను తెలిసికొనగల్గును. కాని సామాన్యుల దృష్టిలో గోపీజనవిద్యా కళలనగా రాసక్రీడాది శృంగారచేష్టలే. తత్త్వదృష్టిలో గోపీజనమనగా విద్యాకలాస్వరూపమనీ, జ్ఞానస్వరూపమగు వేదము. ఆ గోపీజనమును అనగా వైదిక జనమును తనకు అభిముఖముగ చేసికొనుటచే కృష్ణుడు గోపీజనవల్లభుడాయెను. అందుకే గోపస్త్రీలతో నిరంతరం విహరించిననూ అయన నిత్యబ్రహ్మచారిగాను పరమాత్మగాను గీర్తింపబడుచున్నాడు.

**"గో గోపగోపీజనమధ్య సంస్థం గోపం భజే గోకుల - పూర్ణచంద్రమ్"**

ఇచట నొక గాథను గోపాలోత్తర తాపోపనిషత్ ఇట్లు వివరించుచున్నది.

ఒకనాడు గోపస్త్రీలు యమునానది కావతల ఒడ్డుననున్న దూర్వాసమహర్షికి భోజనము నివ్వగోరినవారై, యముననెట్లు దాటగలమని కృష్ణుని అడిగిరి. అపుడు కృష్ణుడు

**"యతః శ్రేయో భవతి కృష్ణేతి బ్రహ్మచారీ త్యుక్త్వా మార్గం**
**వో దాస్యతి। యం మాం స్మృత్వా అగాధా గాధా భవతి।**
**యం మాం స్మృత్వా అపూతః పూతః భవతి ।**

"కృష్ణుడు బ్రహ్మచారియని చెప్పిన యమున మీకు మార్గమునివ్వగలదు. మీకు శ్రేయస్సు నిచ్చును. నన్నుస్మరిస్తే యమునలో లోతుండదు. నన్ను స్మరించిన పాపియును పవిత్రుడగును". అపుడు ఆ గోపస్త్రీలు కృష్ణుని స్మరించి యమునను దాటిపోయినారు.

**"ఏవం కృష్ణో బ్రహ్మచారీ"** అని ఉపనిషద్వాక్యము.
**"స గోపాన్ జీవాన్ ఆత్మత్వేన సృష్టిపర్యన్త మాలాతి.**
**స గోపాలో2 హ్యోమ్। పరంబ్రహ్మ కృష్ణాత్మకః నిత్యానందైక్య**
**స్వరూపః సో2 హమ్। తత్సత్ గోపాలో2 హమేవ"**
**గోపాన్ - జీవాన్ ఆలాతీతి గోపాలః ।**

*- గోపాల పూర్వతాపనీయోపనిషత్*

గోవులనగా జీవులు. సృష్టి పర్యంతము జీవులను - గోవులను తనలోనట్టి పెట్టుకొని పాలించినవాడగుటచే గోపాలుడగుచున్నాడు. ఆ గోపాలుడే నిత్యానందైక్య స్వరూపుడగు కృష్ణుడు. అనగా ప్రలయాంతమున జీవులందరూ ఆనందస్వరూపుడగు కృష్ణునితో ఐక్యము జెంది యాయనలో విశ్రాన్తి నొందియుందురు. ఆ జీవులను పాలించుచూ, కాపాడుచూ మరల సృష్టించును అని అర్థము. గోవిందశబ్దమును పరిశీలింతము.

**"గౌరేషా తు తథా వాణీ తాం చ విందయతే భవాన్।**
**గోవిందస్తు తతో దేవ మునిభిః కథ్యతే భవాన్॥"** - హరివంశము.

గోవులు వేదవాక్కులు. వీనిచేతనే తెలియబడువాడు, లేక వానిని బొందువాడు గోవిందుడని మహర్షుల వచనమని హరివంశము తెల్పుచున్నది.

గోభిరేవ యతో వేద్యః గోవిందః సముదాహృతః"

- విష్ణుసహస్రనామ శంకరభాష్యము.

యుగే యుగే ప్రణష్టాం గాం విష్ణో విందసి తత్త్వతః।
గోవిందేతి తతో నామ్నా ప్రోచ్యతే ఋషిభిస్తథా॥

- మత్స్యపురాణము.

నష్టాం వై ధరణీం పూర్వమవిందం వై గుహాగతామ్।
గోవింద ఇతి తేనాహం దేవైర్వాగ్భిః అభిష్టుతః ॥

- భారతమ్.

పూర్వము సోమకాసురుడను రాక్షసుని చేతిలో నష్టపడిన భూమిని(గాం)తెలిసికొని కాపాడినవాడగు నిన్ను దేవతలు, ఋషులు గోవిందుడని స్తుతించుచున్నారు. అట్లే రాక్షసులు అనగా వేదనిందకుల బారినుండి గోవును, అనగా వేదమును ప్రతియుగమునందును కాపాడుచున్న నా దేవదేవుని గోవిందుడని స్తుతించిరి. రావణాసురుని బారి నుండి వేద స్వరూపిణి యగు సీతను కాపాడి తెచ్చిన శ్రీరాముడు గోవిందుడే !

ఆ గోవిందుడగు నారాయణుని స్వరూపమును చూద్దాము.

1) "నరస్యేదం నారం। అవతారేషు నారం వపుః అయతే ఇతి నారాయణః" - నరసంబంధమైన శరీరము నారము. అవతారములలో నరశరీరమును బొందువాడు నారాయణుడు.

2) "నారాః అపః జీవాః వా। తేషాం అయనం స్థానం యస్యసః" - నారములనగా జలములు లేక జీవులు. వానిలో నివాసస్థానమున్నవాడు నారాయణుడు.

3) "రాః శబ్దాః అయన్తే నిర్గచ్ఛన్తే యస్మాత్ స రాయణః। రాయణాదన్యః అరాయణః। న అరాయణః- నారాయణః- శబ్ద గమ్యః" - అమరకోశము.

రాః అనగా శబ్దములు. ఎవనినుండి శబ్దములు బయలువెడలుచున్నవో నాతడు రాయణుడు. రాయణుడు గానివాడు అరాయణుడు. అరాయణుడు గానివాడు నారాయణుడు. అనగా శబ్దములచేత - వైదికశబ్దములచేతనే తెలియదగినవాడని యర్థము.

నరనారాయణులు కృష్ణార్జునులు, "కృష్ణో వర్ణశ్చ మే యస్మాత్ కృష్ణోఽ హమర్జున" యని భారతము. నా రంగు (నలుపు) కృష్ణవర్ణము గాన నేను కృష్ణుడనని అర్జునునితో కృష్ణుడు చెప్పెను.

1) సర్వం కరోతీతి కృష్ణః 2) దైత్యాః కర్షతీతి కృష్ణః
3) కృష్ణవర్ణాత్ కృష్ణః - అమరకోశము.

అన్నిటిని చేయువాడు, దైత్యులను (రాక్షసులను) నలిపివేయువాడు, నల్లనిరంగు గలవాడు కృష్ణుడు అని అర్థము. అర్జున శబ్దమునకు తెలుపురంగు అని అర్థము.

"అవదాతస్సితో గౌరః వలక్షో ధవళోః ర్జునః" -అమరకోశము.

లోకమును కృష్ణార్జునులు పాలించుచున్నారు అని ప్రసిద్ధి. వేదవచనము గూడ. వీరిరువురి మధ్య అరుణవర్ణము. ఆ అరుణవర్ణము కాషాయరంగు. ఈ ముమ్మరు జీవుడు, పరమాత్మ వేదమునని యనేక వేదప్రమాణములున్నవి. వీరే లక్ష్మణుడు, రాముడు, సీతగా, రామాయణములోను నర,నారాయణ, సరస్వతీ స్వరూపులుగా భారతములోనూ, పూరి పుణ్యక్షేత్రమున, బలరామ, కృష్ణ, సుభద్రలుగాను కీర్తింపబడుచున్నారు.

"నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్।
దేవీం సరస్వతీం చైవ తతో జయముదీరయేత్॥"

- భారతమ్.

నారాయణ, నర, సరస్వతీ - ఈ ముగ్గురే కృష్ణార్జునులు, వేదమున్నూ . వీరే పగలు, రాత్రి, సంధ్యా సమయములుగా గీర్తింపబడుచున్నారు.

భగవంతుని పూజించునపుడు ప్రతినామము చివర " ఓం నమః" అని చేర్చబడి ఉచ్చరింపబడును.

"ఓమితి బ్రహ్మాభవతి। నకారో విష్ణుర్భవతి। మకారో రుద్రోభవతి" - తారసారోపనిషత్.

ఓంకారము బ్రహ్మ, నకారము విష్ణువు, మకారము శివుడునని తారసారోపనిషద్వాక్యము. దీనిని బట్టి ఓంకారము వేదమునకు, నకార మకారములు, (విష్ణు, శివులకు) కృష్ణార్జునులకును, వాచకములగునని చెప్పవచ్చును.

శివునకభిషేకము రుద్రాధ్యాయ మంత్రములతో చేయబడును.

"ఉతైనం గోపా అదృశన్నదృశన్నుదహార్యః। ఉతైనం విశ్వాభూతాని సదృష్టోమృడ యాతినః"

- రుద్రాధ్యాయము.

1) అజ్ఞులైన పల్లెప్రజలు నీరు తెచ్చుకొనుచూ ఉదయముననే సూర్యుని చూచిరి.
2) సూర్యకిరణములన్నియు జలభరితములై సూర్యుని చూచుచున్నవి.
3) గోపికలు పర్వతమును (అహార్యః) ఎత్తిన కృష్ణుని చూచుచున్నారు.
4) హార్యః అంతేజారస్త్రీలు. "నహార్యః అహార్యః"అహార్యః అంటే పతివ్రతలు.

పతివ్రతలైన గోపికాస్త్రీలు కృష్ణుని నిరంతరం జూచుచూ ఉన్నారు. వారు కృష్ణునితో విహరించిననూ తమ పాతివ్రత్యమును పోగొట్టుకొనలేదు. "గోపికావేదాః" అని భాగవతమ్.

5) గోపాః అంటే వేదవాక్కులు. వేదవాక్కులు, వేదమంత్రస్వరూపిణులైన గోపికలు నిత్యం

భగవద్దర్శనం చేస్తూఉంటారు. మనకు భగవంతుని దర్శనమును కలుగజేస్తారు.

కృష్ణలీలాతరంగిణిలో శ్రీనారాయణతీర్థుల వారు యీ విషయమునే తెల్పిరి.

" ఇతిగోప్యః పరానందం గాయన్త్యః ప్తాః పృథక్ పృథక్।
అపరా శ్రుతయో భూయో భూయస్తత్రైవ సంగతాః ॥
ఏవం కృష్ణాత్మ తత్త్వజ్ఞాః కృష్ణ బ్రహ్మాత్మనా స్థితాః ।
సర్వోపనిషదాం సారం గాయన్త్యః కృష్ణమానతే।
పునఃపునః బోధయన్తం ధర్మసారగిరా హరిమ్।
ఊచుర్గోప్యో హరే స్తత్త్వం వ్యంజయంత్యో యథాగమాః॥
బ్రహ్మానుభూతిరసికాం శౌరేర్వాగ్ల క్షణాంసుధామ్।
గోప్యః పిబన్త్యో మోదన్తే కృష్ణబ్రహ్మణి తాః స్థితాః॥
సంసారరోగసంతప్తాః కృష్ణ బ్రహ్మరసాయనమ్।
గోప్యః పిబంత్యవస్త మ్ముక్తాః రమంతే హ్యాభయంగతాః ॥
ఆత్మారామాః పరానందా నిత్యతృప్తాః పునఃపునః ।
ఆత్మానుభూతిం గాయన్త్యః కృష్ణైకరసతాం గతాః॥
రమన్తే పరమానందే కృష్ణబ్రహ్మణి తాః భృశమ్।
త్యక్త దేహాద్యహంమానాః నిర్విశేషసుఖే స్థితాః॥

ఇందు గోపికలు వేదవాక్కులుగాను, యోగులుగాను వర్ణించబడిరి. కృష్ణుని పరబ్రహ్మ స్వరూపమెరిగి, అపరబ్రహ్మతో నిత్యసహవాసము గల్గినవారెవరు? గోపికలు కృష్ణునితో నిత్యసహవాసము గల్గియున్నారు. కాన యీ గోపికలెవరు? గోపికలు వేదవాక్కులే. ఆ గోపికలు ధర్మస్వరూపుడైన హరిని నిరంతరం గానం చేస్తూ ఉంటారట. ఆ గానమే ఉపనిషత్సారమట. ఆ గానముతో, కృష్ణుని నిత్యసహవాసముతో బ్రహ్మానందానుభూతిని పొందినారట. సంసార రోగతప్తులైనవార్కి కృష్ణబ్రహ్మయే దివ్యౌషధము. ఆ దివ్యౌషధమును సేవించి ముక్తిపొంది తరించిరి. ఆత్మారాములై, ఆత్మానందానుభూతిజెందినవారై కృష్ణునితో నభేదమునొందిరి. దేహాదులయందలి యభిమానమును పోగొట్టుకొని, నిరంతర శాశ్వతసుఖము, పరమానందమునిచ్చెడి ఆ కృష్ణపరబ్రహ్మమున నిత్యము మనస్సును లగ్నము చేసి ముక్తినొందిరి. ఇదంతయు భోగుల విషయం గాదు. యోగులవిషయమే. ఆ యోగులే మహర్షులు. వేదవాక్ స్వరూపులు - గోపికలు. గోపికల పేరు వికృతిరూపమును ధరించి 'గొబ్బెమ్మలు' అయింది. గోపి-గొబ్బి అయినది. సంక్రాన్తి పండుగలలో మధ్యలో కృష్ణుని ప్రతిమగా పెద్దగొబ్బెమ్మను, చుట్టూ ఎనిమిది చిన్నగొబ్బెమ్మలను పెట్టి పూజలుచేస్తూ ఉంటారు. చివరగా, భగవద్గీత ప్రారంభంలోని ప్రార్థనాశ్లోకమును చూద్దాము.

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః।
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్॥"

గోవులన్నియు ఉపనిషత్తులు. గోపాలుడు పాలుపితికెడివాడు. అర్జునుడు దూడ. పాలను త్రాగి అనుభవించువాడు విద్వాంసుడు. పితకగా వచ్చిన పాలే అమృత స్వరూపిణియగు భగవద్గీత. ఈ విధంగా కృష్ణతత్త్వమును, గో,గోప,గోపీతత్త్వమును ఎంతయినా చెప్పవచ్చును.

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్।"
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥

ధర్మహాని, అధర్మాభ్యుదయము గల్గినపుడు నేను అవతారములెత్తుదును. సజ్జనరక్షణ, దుర్జనశిక్షణకు ధర్మసంస్థాపనకు ప్రతియుగమందు పుట్టుదునని శ్రీకృష్ణుడర్జునునితో చెప్పినమాటలు.

శ్రీశంకర భగవత్పాదులు, (జగద్గురువులు) జగద్గురువగు కృష్ణుని భజనయే మరణకాలమున ప్రాణికోటికి రక్ష. ఇతరములేవియు గాదని ప్రబోధించిరి.

"భజ గోవిందం భజ గోవిందం గోవిందం భజ మూఢమతే ।
సంప్రాప్తే సన్నిహితే కాలే నహినహి రక్షతి డుకృఞ్కరణే ॥"
స్కాందపురాణ మిట్లు చెప్పుచున్నది. -
"ఋగ్వేదో2థ యజుర్వేదః సామవేదో హ్యథర్వణః॥
అధీతాస్తేన యేనోక్తం హరిరిత్యక్షరద్వయమ్।
భవన్తి సర్వశాస్త్రాణి కృష్ణనామ్ని స్థితాస్యయే।
కృష్ణస్య దర్శనే బుద్ధిః జాయతే యస్య దేహినః।
వక్త్రావలోకనాత్తస్య పాపం యాతి నిరంతరమ్॥"

హరి యని రెండక్షరములనుచ్చరించగానే నాల్గువేదములనధ్యయనం చేసినట్లే, ఎందుకనగా సమస్త వేదశాస్త్రాలు కృష్ణ అను పేరులోనే ఉన్నాయి. అని అర్థము.

"హరియను రెండక్షరములు హరియించును పాతకముల నంబుజనాభా।
హరి నీ నామ మహత్త్వము హరిహరి పొగడంగ వశమే హరి శ్రీకృష్ణా॥" -కృష్ణశతకము.

ఇట్లు కృష్ణావతారము యొక్క యదార్థ వైదికతత్త్వము నెరిగి శ్రీకృష్ణుని ప్రేమకు పాత్రులగుదుముగాక!

"నమామ మాధవం హరీమ్"



# అలంకారములు - సౌందర్యము

భగవంతుడు మానవుల కిచ్చిన అపూర్వమైన కానుకలు నామరూపములు. అందు సాధారణముగా మానవులు రూపమునకు, సౌందర్యమునకుఎక్కువ ప్రాధాన్యమిస్తూ ఉంటారు. తాము చాల అందముగా నున్నామనీ, తమరూపమే ఎక్కువ అందమైనదనీ, ఆ యందమునందరూ మెచ్చుకోవాలనీ తాపత్రయ పడుతూ ఉంటారు. అందుకోసం హెచ్చుగా ధనమును వెచ్చించి పలురకముల అలంకార సామగ్రిని సమకూర్చుకుంటారు. అనేక వేషభాషలు, రంగులు, నగలు, పూలు మొదలగువానిని ధరిస్తూ ఉంటారు. ఈ అలంకార విశేషములు, నిజమైన అలంకారములగూర్చి తెలిసికొందాము.

"అలంకరోతీత్యలంకారః, అలంక్రియతేఽ నేనేత్యలంకారః" అని వ్యుత్పత్తులు. అలంకరించునది అలంకారము. "భూషణేఽలం""అలంఖలు ప్రతిషేధయోః" అని వ్యాకరణ సూత్రప్రకారం అలంశబ్దానికి భూషణ, నిషేధార్థములున్నవి. "అలంక్రియతేఽనేనేతి చారుత్వహేతురలంకారః" అని ప్రతాపరుద్రీయమను అలంకారశాస్త్ర గ్రంథము అలంకారము సౌందర్యసాధనమని తెల్పుచున్నది.

"అలంకారస్త్వాభరణం పరిష్కారో విభూషణం। మండనంచ" -

"అలంభూషణపర్యాప్తి శక్తివారణవాచకమ్ - మాస్మ మాలంచ వారణే"

- అమరకోశము.

"అలంకారస్త్వాభరణం భూషణం మండనంపునః। విభూషణం పరిష్కారః"

- వైజయన్తీకోశము

"అలంకారస్తు హారాదా వుపమాదా వలంకృతిః"

- మేదినీకోశము.

"శోభాదాయకత్వమలంకారః" మొదలగు కవివాక్య ప్రకారంగా అలంకారములు శోభాదాయకమ్ములైన సౌందర్యసాధనములు. అవి వస్త్రములు, నగలు, కేశమ్ములు, పూలు, సెంట్లు, రంగులు మొదలగునవి. ఇట్టి యీ యలంకారములు మూడు రకములు. సాత్త్విక, రాజస, తామసములు. నిరాడంబరమైన అలంకారమును గల్పించుచూ, పవిత్రతను ఇచ్చునవి సాత్త్వికములు. ఆడంబరముతో నిండియుండినవి రాజసములు. చూచుటకు వికారముగను, అసహ్యముగను ఉండి దుర్భరమైనవి తామసములు. అయినాగూడ అట్టి యీ తామసాలంకారములతో తమ యందము గొప్పదని మానవులుబలాట పడుతూ ఉంటారు. పై అమరకోశము 'పర్యాప్తి' (చాలును) అనే అర్థాన్ని గూడ బోధిస్తూ ఉంది. అందుచేత నీయలంకారములు చాలినంత మాత్రమే ఉన్నచో బాగుండును. మితిమీరిన దుర్భరమే.

అసలీ యలంకారములు లేకుండగా నుండెడి సహజ సౌందర్యమే ఉత్తమాలం కారమని కాళిదాసు తన వాఙ్మయము ద్వారా లోకమునకు చాటిచెప్పినాడు.

"సరసిజమనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీం తనోతి।
ఇయమధిక మనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివ హి మధురాణాం మండనం నాకృతీనామ్"

- అభిజ్ఞాన శాకుంతలమ్।

దుష్యంతుడు కణ్వాశ్రమంలో మొదటిసారిగా శకుంతలను జూచిన దృశ్యమిది. చుట్టూ నాచున్ననూ, పద్మము రమణీయము. చంద్రునిలోని మచ్చ మలినమైననూ, శోభాదాయకము. అలంకారములు లేకున్ననూ, నారబట్ట కట్టుకొన్న యీ శకుంతల బహుసుందరముగ నున్నది. మధురమైన ఆకారముగల సుందరీమణులకేది యలంకారము గాదు? ఎట్టి అలంకారము అనవసరము అని యర్థము. శకుంతలకు సహజసౌందర్యమే అలంకారము. ఇతర అలంకారములెందుకు? ఆమెయే అలంకారములకలంకారము. బాహ్యాలంకారములన్నీ తృణప్రాయములే.

ప్రసన్నమైన చిరునవ్వు మానవుల ముఖమును రమణీయముగా చేయును. ఆ నవ్వే వెలలేని యలంకారము. రామాయణంలో శ్రీరాముని అడుగడుగునా వాల్మీకి మహర్షి 'స్మితపూర్వభాషీ' అనిచెప్పను. అమ్మవారిని 'దరహాసోజ్జ్వలన్ముఖీ', "మందస్మిత ప్రభాపూర మజ్జత్కామేశమానసా" యని ప్రార్థిస్తున్నాము.

శ్రీశంకర భగవత్పాదులమ్మవారిని ప్రార్థిస్తూ -

"త్వదీయం సౌందర్యం తుహినగిరికన్యే తులయితుం।
కవీంద్రాః కల్పన్తే కథమపి విరించి ప్రభృతయః॥" - సౌందర్యలహరి

అని చెప్పినారు. దీన్కికి

"ఇతి శ్లోకే దేవ్యాః సౌందర్య మింద్రియగోచరాత్, మోహవిక్షేపకరాత్ బాహ్యసౌందర్యాత్ విలక్షిత మితి కవిః - సేయం సౌందర్యానుభూతిః ఆత్మానందానుభూతిరేవ" - అని వ్యాఖ్యానము. బాహ్యాలంకారోపేతమైన బాహ్యసౌందర్యము ఇంద్రియగోచరము, మోహజనకము, క్షణికము, తుచ్ఛము, నశ్వరము.దీనికన్న విలక్షణమై,అతీంద్రియ గోచరము, శాశ్వతమునగు నాత్మానందానుభూతియే అలంకారము. అట్టి అలంకారములు శుద్ధమైన నవ్వు, వినయము, శాంతము, శీలము, సద్గుణములు, బ్రహ్మచర్యము, సద్విద్య, మంచి వాక్శుద్ధి, సంస్కృతవాణి, పాతివ్రత్యము, క్షమ మొదలగునవి.

"వారు మంచిదయిన ఊరు మంచిద'ని సామెత. మంచివారు అనగా మంచి మాట-వాక్శుద్ధి అలంకారము. మరి మామూలు లౌకికవాక్కు కన్న వైదికవాక్కు అలంకారమే గాక మానవులను పవిత్రము చేయును. వైదికవాక్కు సంస్కారముగల వాక్కు.

"ప్రభామహత్యా శిఖయేవ దీపః త్రిమార్గయేవ త్రదివస్య మార్గః,
సంస్కారవత్యేవ గిరా మనీషీ తయా స పూతశ్చ విభూషితశ్చ॥"

-కుమారసంభవమ్

ప్రకాశముగల జ్వాలలతో దీపమువలె,గంగానదితో స్వర్గమువలె, సంస్కారముగల వాక్కుతో (సంస్కృతవాణి) విద్వాంసుడువలె, పార్వతీదేవితో హిమవంతుడలంకరింప బడుటయే గాక పవిత్రము చేయబడుచున్నాడని యర్థము. కాన మానవుల కలంకారము సంస్కృతవాణియని తెలియును. 'సంస్కరోతీతి సంస్కృతం' - "సంపరిభ్యాం కరోతౌ భూషణే సమవాయే చ" అని వ్యాకరణ సూత్రప్రకారంగా, ఎట్లైతే మనమిండ్లకు మాలిన్యము తొలగించి, సున్నము రంగులతో నలంకరింతుమో, మన మనోమాలిన్యము పోగొట్టి, శుద్ధిగావించి, అలంకరించి, పవిత్రము చేయు వాణియే సంస్కృత వాణి. వేదమే "భద్రైషాం లక్ష్మీర్నిహితాధి వాచి" "సాహిశ్రీరమృతాసతామ్" "ఇమే సోమమరంకృతాః"

అని వేదవాక్కు - లక్ష్మియని-యలంకారమని చెప్పుచున్నది. వేదవేత్తల ముఖారవిందములు అర్షవిద్యాలంకార శోభితములై ప్రసన్నగంభీరములై విరాజిల్లు చుండును.

వేదవేత్త "భారతి"యని గీర్తింపబడుచున్నాడు.

"విద్యాభారేణసంపూర్ణః సర్వభారంపరిత్యజేత్ । దుఃఖభారం నజానాతి భారతీసా ప్రకీర్తితా" - శబ్దకల్పద్రుమమ్. దుఃఖభారమెరుగక, భారములన్నీ త్యజించి, విద్యాభారముచే పరిపూర్ణుడు 'భారతీ' యగునని యర్థము. 'భరణాత్ భరణం-భారః" యని వ్యుత్పత్తి. విద్యయనే అభరణముతో (విద్యా అభారేణ) పరిపూర్ణుడు "భారతి"యని యర్థము గూడ చెప్పవచ్చును. విద్యయే మానవుల కాభరణమనిగమనించదగును.

తల్లి పిల్లవాని నలంకరించుకొనును. అపిల్లవానియలంకారము తల్లియొక్క తృప్తి కొసమే- "అత్మనస్తుకామాయ" అని బృహదరణ్యకోపనిషత్తు చెప్పుచున్నది. అట్లే భార్యయొుక్క అలంకారములన్నీ, వేషభాషలు సయితము భర్తప్రీతికొరకే గాని తదితరులకుగాదు. భర్తయొక్క అలంకారము, వేషభాషలు భార్యకే తృప్తిగల్గించవలెనుగాని ఇతరులకుగాదని ఉపనిషద్బోధ -

"అత్మనస్తు కామాయ జాయా ప్రియాభవతి.
అత్మనస్తు కామాయ భర్తా ప్రియోభవతి" - అవి.

భార్యకు భర్త, భర్తకు భార్యయే నలంకారములు. 'భరణాత్ భర్తా'. భర్త అనే పదమునకే అభరణమని యర్థము. నేటి వాతావరణమందు బాహ్యాలంకారములు మోహజనకములై

మానవుల పెడత్రోవ బట్టించి కీడుగల్గిస్తున్నవి.అందుకే 'ఇంటికి దీపం ఇల్లాలు' అను నార్యోక్తి ప్రసిద్ధము. ఇల్లాలు ఇంటికి దీపం, అలంకారము, శోభయని చాటుచున్నది.

అలంకారములు లేకపోయినా, కురూపియైననూ, విద్యాసమలంకృతుడైన మానవుడు సుందరుడగునని శంకరాచార్యులవారి బోధ - "కురూపోఽపి విద్వాన్ విద్యయా బహుశోభతే". రామాయణంలో హనుమంతుడట్లు సుందరుడని వాల్మీకి మహర్షి చెప్పెను.

'సంస్కారక్రమ సంపన్నామద్రుతా మవలంబితామ్।
ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయహారిణీమ్।
అనయా చిత్రయా వాచా త్రిస్థానవ్యంజనస్థయా।
కస్య నారాధ్యతేచిత్తం ఉద్యతాసేరరేరపి॥

- రామాయణమ్॥

హనుమంతుడు వానరుడు. అలంకారములు లేవు. కురూపి. అకారము వికారము. అయితే చతుర్వేదవేత్త. వ్యాకరణ విద్వాంసుడు. అందుచే నాయననోట నపశబ్దము లేదు. సంస్కారయుక్తమై, కల్యాణప్రదమైన సంస్కృతవాణి సమలంకృతుడైన యీ హనుమంతుడెవరి మనసును అనందింపజేయడు. ఖడ్గధారియగు శత్రువునిగూడ అహ్లాదపరుచును. సంస్కారములనగా వేదములు అని రామాయణములో చెప్పబడినది. "సంస్కారాస్తేఽభవన్ వేదాః" - వేదములు సంస్కారములు అని అర్థము. అలంకారములు, బాహ్యసౌందర్యము లేకపోయినను, కురూపియైనవానికి సంస్కృత వాక్కే నిజమైన యలంకారము.అందుచే హనుమంతుడు సుందరుడు.

పార్వతీదేవి యీశ్వరుని పతిగా బొందగోరి,అనేకాలంకారములు ధరించి, సుందరమైన వేషముతో, తపస్సుచేయుచున్న శివుని సేవించును. శివుడు ఆమె సౌందర్యమునకు ముందు మోహితుడై, ఇంద్రియక్షోభమును నిగ్రహించుకొని తుదకు పార్వతిని నిరాకరించి వెళ్ళును. అపుడు పార్వతీదేవి బాహ్యాలంకారములు, బాహ్యసౌందర్యము భర్తగాబోవు శివునికి, భగవంతునికి ప్రీతికరములుగావని తనఅలంకారములు, సౌందర్యమును నిందించుకొనును. భర్తకు ప్రీతిగల్గించని అలంకారములు, సౌందర్యము వ్యర్థమని తలచును. భర్తలకు ప్రీతికరమైనదే భార్యల నిజమైన సౌందర్యమని కాళిదాస హృదయము.

"వ్యర్థం సమర్థ్య లలితం వపురాత్మనశ్చ।
నినింద రూపం హృదయేన పార్వతీ।
ప్రియేషు సౌభాగ్యఫలా హి చారుతా॥" - కుమార సంభవమ్.

అలంకారములు లేకుండా, నారబట్టలను ధరించి తపస్సు చేసెడి పార్వతీదేవి సౌందర్యమునకు శివుడు దాసుడైనాడు. (తవాస్మిదాసః).

బాహ్యసౌందర్యము పరమశివునే మోహింపచేసినది. మరి సామాన్యుల విషయమున నేమి చెప్పవలెను? శివునివలె నిగ్రహించుకొనలేనిచో పతనము తప్పదు.

స్త్రీలకు సిగ్గు అలంకారమనీ, బాహ్యాలంకారములు మోహజనకములై కీడుగల్గించుననీ, మానవులకు విద్య, సంస్కృతవాణి యలంకారములనీ భర్తృహరి ప్రబోధము.

"వ్రీడాచేత్కిము భూషణైః ? "అన్యథా భూషణం పుంసాం శమో
లజ్జేవ యోషితామ్". - భర్తృహరి సుభాషితమ్।
"కేయూరా నవిభూషయన్తి పురుషం హారా న చంద్రోజ్జ్వలాః।
న స్నానం న విలేపనం న కుసుమం నాలంకృతా మూర్ధజాః॥
వాణ్యేకా సమలంకరోతి పురుషం యా సంస్కృతా ధార్యతే
క్షీయన్తేఽఖిల భూషణాని సతతం వాగ్భూషణం భూషణమ్॥"
"విద్యానామ నరస్య రూపమతులం" - "విద్యావిహీనః పశుః"

మానవులకు కేయూరాదిహారములు, స్నానము, చందనాదులు, బాగా అలంకారము చేయబడిన కేశములు అలంకారము గాదు. మోహజనకములు, అపాయకరములు, నశ్వరములు - సంస్కృతవాణి యొకటియే శాశ్వతమైన, నిజమైన, పవిత్రమైన అలంకారము. అందుకే వేదవేత్తలు శిరోముండనము గావించుకొని, పాపరహితులై, ప్రసన్నగంభీర ముఖములతో శోభిల్లుచుందురు. వారికి శిరోముండనమే మండనము. కావున వారి ముఖములలో సరస్వతియే లక్ష్మీరూపమున తాండవించును. కావున విద్యయే మానవునికి సాటిలేని, వెలలేని రూపము. బ్రహ్మవిద్య,బ్రహ్మవర్చస్సునిచ్చి యాతని యలంకారమును, సౌందర్యమును ద్విగుణీకృతము గావించును. ఆ విద్యారూపము లేనివాడు ఎన్ని అలంకారములు, వేషములున్నను, పశువుతో సమానమే. ఇంకనూ విద్యయొకటియే చాలదు. సంస్కారము, వినయము, సద్గుణములు విద్యావంతునకలంకారములు.

"దుర్జనః పరిహర్తవ్యో విద్యయాఽలంకృతోఽపి సన్
మణినా భూషితస్సర్పః కిమసౌ న భయంకరః?"

మణితో నలంకరింపబడినప్పటికీసర్పము భయంకరమైనట్లు, విద్యతో నలంకరింపబడినప్పటికీ దుర్జనుడు పశువే అగును. అందుకే "గుణాః పూజాస్థానం గుణిషు న చ లింగం న చ వయః" అని ఉత్తరరామచరిత నాటకము బోధిస్తున్నది. గుణములే అలంకారములు గాని, వయస్సు, వేషభాషలు గావని అర్థము.

"శుచి భూషయతి శ్రుతం వపుః ప్రశమస్తస్య భవత్యలంక్రియా।"

- కిరాతార్జునీయమ్.

పరిశుద్ధమైన వేదవాక్కు మానవులదేహముల నలంకరింపజేయును. ఇంకనూ, మనశ్శుద్ధి మానవులకలంకారము. పరిశుద్ధములైన మానవుల ముఖములు బహు సుందరములు. అట్లు శుద్ధులైనవారికి శమము (మనస్సు, క్రోధ, కామాది మాలిన్యరహితమై యుండుట) అలంకారమట. అట్లు పరిశుద్ధమైన సత్పురుషుని మనస్సు బురదలేకుండగా, నిర్మలమై, ప్రసన్నమైన జలములతోనున్న తీర్థమువలె నుండెనట. అట్టి నిర్మలమైన నీరు సత్పురుషుని మనస్సు వలె బహురమణీయముగా నున్నదట.

"అకర్దమమిద తీర్థం భరద్వాజ నిశామయ ।
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా॥"

- రామాయణమ్.

"వివిక్తవర్ణాభరణా సుఖశ్రుతిః ప్రసాదయన్తీ హృదయాన్యపి ద్విషామ్
ప్రవర్తతే నాకృతపుణ్యకర్మణాం ప్రసన్న గంభీరపదా సరస్వతీ"

- కిరాతార్జునీయమ్.

మంచిరంగు, ఆభరణములు, అవయవములు, ప్రసన్నగంభీరముమైన పాదములుగల (మందగామిని) కన్యవలె వివేకమును గల్గించునట్టిది, భగవంతుని వర్ణించుట కవతరించిన అక్షరములే ఆభరణములుగా, గురుపరంపరా ప్రాప్తమై శ్రవణరూపంలో భూమికి అవతరించి, శత్రువులను గూడ నానందింపజేసెడి యీ వేదవాణి ఎన్ని పుణ్యకర్మలు చేసికొన్నవారికో గాని దక్కదు గద! ఈవాణి పాదములు ప్రసన్న గంభీరములు. కావున వేదములోని ప్రతి యక్షరము నొక ఆభరణమే. ఆయాభరణములతో బహుశోభమానయగు వేదవాణి మానవుల మాలిన్యమును పోగొట్టి శుద్ధిచేసి, వివేకమును గల్గించి, పవిత్రము చేసెడి (గొప్ప) మహత్తరమైన దివ్యాలంకారము.

"అలంకారప్రియో విష్ణుర్జలధారాప్రియశ్శివః"

విష్ణువునకలంకారములు,శివునకు జలధారలు ప్రీతికరములు. భగవంతునకే అలంకార మని పేరు. అలం అంటే సమర్థుడని అర్థము. అట్టి యా భగవంతుడలం కారోపేతుడై ఎట్లుండునోనని మన తృప్తికొరకే మనము దేవుని యలంకరించుచున్నాము.ఆ భగవంతుడు నిర్గుణుడు, రూపరహితుడైనచో నాయనకు జలములే అలంకారములు. జలములన్న సామాన్యముగ 'నీరు' అని గ్రహించక వేదమంత్రస్వరూపములుగ గ్రహించ వలెనని వేదమే చెప్పుచున్నది. సామాన్య జలముతో నభిషేకము మానవులకొక క్రొత్త శోభనిచ్చును. రాజులకు పట్టాభిషేకము, సార్వభౌమత్వమునిచ్చును. పరమేశ్వరునికి నిత్యాభిషేకము దివ్యశోభనిచ్చును. రాజాధిరాజత్వమునిచ్చును.

"విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చ వో నమో నమః'

- రుద్రాధ్యాయము.

శివుడు ఈ మంత్రముతో నభిషేకము చేయబడుచుండును. రూపరహితము, ప్రపంచ మందలి యన్నిరూపములు తానేయయిన పరమేశ్వరునికి నమస్కారమని యర్థము. - ప్రపంచములోని అన్ని రూపములు, సౌందర్యములు, అలంకారములు పరమేశ్వరునివే యని అర్థము. ఇంకనూ

" శీలం పర్వస్య భూషణమ్"

- భర్తృహరి వచనము.

శీలము అనగా సచ్చరిత్ర మానవుల కలంకారమని యర్థము.

"ద్విజస్కంధాధి రూఢా స్త్వామగ్నయోప్యను యాన్త్యమీ।
హృదయేష్వేవ తిష్ఠన్తి వేదా యే నః పరం ధనమ్।
వత్స్యన్త్యపి గృహేష్వేవ దారాశ్చారిత్ర రక్షితాః॥".

- రామాయణమ్.

బ్రాహ్మణులందరు, వనవాసమునకు పోవుచున్న సీతారాములవెంట బయలు దేరుచూ ఇట్లు అంటారు. బ్రాహ్మణుల భుజస్కంధములమీద మోయబడు అగ్నులు మాత్రమే మీవెంట వచ్చును. మాకు ధనములగు వేదములు మాహృదయములలోనే ఉండును. మా భార్యలు ఇండ్లలోనే ఉందురు. వారికి వారి సచ్చరిత్రలే అలంకారములు. అవి వారిని రక్షించును. వారికి వేరే రక్షణతో పని లేదు. కాపలా అనవసరము. వారిని గూర్చి ఏ మాత్రము భయపడనక్కరలేదు.

మానవులకు శిరోముండనమే గాదు. భస్మధారణగూడ నలంకారమే। శిఖలు, భస్మధారణ గల్గిన ముఖములు తేజోవిరాజమానములు. ఇంకా బ్రహ్మచర్యవ్రతదీక్షితులైనచో వారి ముఖములు బ్రహ్మతేజో విరాజమానములు.బహుశోభాయమానములు. అందుకే అమ్మవారిని

"భస్మరేఖాంకితలసన్మస్తకాయై నమో నమః"। అని, శివుని "భస్మోద్ధూళిత విగ్రహః"

అని కృష్ణుని "గోధూళి ధూసరిత కోమల గోపవేషమ్" అని ప్రార్థిస్తున్నాము. గోధూళితో బూడిదరంగు గల్గి గోపవేషము ధరించిన శ్రీకృష్ణుని వేషము కోమలంగా నున్నదట.

చివరగా లంకలో సీతను వెదకుచున్న హనుమంతునికి అలంకారములు లేని సీతాదేవి,సంస్కారములు లేని వేదవిద్యగా దర్శనమిచ్చింది. సీతయని తెల్పుకొనుటకు చాలా కష్టపడెను. సంస్కారములు అంటే వ్యాకరణాది సంస్కారములు లేనిచో వేదముయొక్క విజార్థము తెలియదు.వేరే తప్పుడు అర్థముల తెల్పునట్లు అలంకారములు లేని సీతను తెల్పికొనుట కష్టముగా తోచినదట.

"దుఃఖేన బుబుధే సీతాం హనుమానవలంకృతామ్।
సంస్కారేణ యథాహీనాం వాచమర్థాంతరంగతామ్॥"

- రామాయణమ్.

కావున మానవులకలంకారములవసరమే. కాని ఆడంబరములు లేని, రాజస, తామస భావములు లేని, సాత్వికమైనవి, మోహజనకములుగాని అపాయరహితములైన పవిత్రములైన అలంకారములవసరమే.

"స్త్రీణాం ప్రియాలోకఫలో హి వేషః" అని కుమారసంభవం ద్వారా కాళిదాసు పలుమార్లు హెచ్చరిస్తున్నాడు.

తమ భర్తలకు ప్రీతికరముగా నుండెడివేషమే స్త్రీలకు పవిత్రమైన యలంకారము. అట్లే పురుషుల వేషము గూడ భార్యలకే పరిమితము ప్రీతికరము గావాలియని కవులు, ఋషులు, వేదము యొక్క ప్రబోధము, హెచ్చరిక!

సీతారాములంతటివారు అడవిలో బంగారులేడి బాహ్యసౌందర్యమునకు మోహితులై కష్టములననుభవించిరి. శివుడుగూడ పార్వతీదేవి బాహ్యసౌందర్యమునకు మోహితుడై ఇంద్రియక్షోభననుభవించెను. సామాన్యుల విషయము చెప్పనలవి గాదు.

కావున స్త్రీ,పురుషులందరూ బాహ్యాలంకారములకు, బాహ్యసౌందర్యమునకు భ్రమపడి, కష్టములు కొనితెచ్చుకొనగూడదు. గోతిలోపడగూడదు! మోసపోగూడదు!

ఆర్షవిద్యా (సంస్కృతవాణీ) సమలంకృతులై జన్మపావనము చేసికొని, పవిత్ర వేషభాషలు అలంకారములు ధరించి భారతీయ పవిత్ర సాంప్రదాయమును నిలబెట్టుదురుగాక!

ఇతిశమ్

"నమామ వేదమాతరమ్"



# శివ, శివలింగ తత్త్వము

"సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్", "యదాతమస్తన్న దివా న రాత్రి ర్న చాసీచ్చాసీత్ శివ ఏవ కేవలః" అని వేదమంత్రములు. సృష్టికి ముందు నిరాకారము,నిర్గుణము, నామరూపరహితమగు 'సత్' పదార్థమొకటియే నున్నదనీ, అది శివుడునని తెల్పుచున్నవి. సృష్టి, స్థితి, లయములను ధర్మముల వలన ఆయనకు బ్రహ్మ, విష్ణు,శివ యను నామము లేర్పడినవి. అందు శివునికిగల నామరూపములలో నొకానొక ప్రత్యేకత, వైశిష్ట్యము గలదు. శివుని రూపములు రెండు. ఒకటి పురుష రూపము. రెండవది లింగ రూపము. వీని తత్త్వమును వేద,పురాణములు, ఉపనిషత్తులు మీమాంస చేసి యిట్లు లోకమునకు వెల్లడించినవి.

శివశబ్దమునకనేక వ్యుత్పత్తులున్నవి. అనేకార్థములు గలవు. శివశబ్దము 'శీఙ్ స్వప్నే' అను ధాతువునుండి పుట్టినది.

1. **శామ్యతీతి శివః -** పరమానందరూపత్వాత్ నిర్వికారోభవతి. ప్రశాంతో భవతి - బ్రహ్మా నంద స్వరూపుడు, నిర్వికారుడుగాన (శాంతించి) శమించి యుండు వాడు.

2. **శమయతీతి శివః -** అందరిని బ్రహ్మానందమున శమింపజేయువాడు.

3. **శేరతే సజ్జన మనాంసి అస్మిన్నితి శివః -** సజ్జనుల మనస్సులీయనయందు శయనించి యుండును. అనగా విశ్రమించి యుండును,

4. **శేతే సజ్జన మనస్సు ఇతి శివః -** సజ్జనుల మనస్సులలో శయనించి యుండువాడు.

5. **శివం వేదః తద్యోగాత్ :-** శివమనగా వేదము. "ఓం శ్శాంతి శ్శాంతి శ్శాంతిః" అని ప్రపంచ మునకు శాంతిమార్గమును చూపి, ప్రపంచమును శాంతింపచేయు, చేయగల వేదము శివమగును. దాని యోగము గలవాడు శివుడు.

6. **శివప్రదత్వాత్ శివః -** మంగళముల నొసగువాడు.

7. **అరిష్టం తనూ కరోతీతి శివమ్. తద్యోగాత్ శివః -** అరిష్టముల నాశనము చేయునది శివమ్. దానిని గల్గినవాడు. ఈ విషయములను, వ్యుత్పత్తులనీ ఋగ్వేదమంత్రము తెల్పుచున్నది.

"ఓం ప్రపంచశమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యన్తే" అనగా సర్వప్రాణుల విశ్రాన్తి స్థానము శివతత్త్వము అని అర్థము.

"మోక్షే భద్రే సుఖే శివం హరే యోగాంతరే వేదే వాలుకా గుగ్గులావపి"- త్రికాండ శేషము. శివశబ్దము, మోక్షము, మంగళము, సుఖము, యోగము, వేదము మొదలగు అర్థముల నిచ్చుచున్నది.

'శమీ సక్తుఫలా శివా' - అని అమరకోశము. దోషముల శమింపజేయు జమ్మిచెట్టుకు శివయని పేరు. శివాయనగా పార్వతీదేవి." శివా భవానీ రుద్రాణీ"

"శ్వః శ్రేయసం శివం భద్రం కల్యాణం మంగళం శుభమ్"

- అమరకోశము.

"శివా భూరి మాయు గోమాయుః" - శివ అనునదినక్కకు పేరు. నక్క ఎంత మోసకరమైనదైనను, తన శకునము చేత సంతోషపెట్టుట ద్వారా 'శివ' యగుచున్నది.

"శకునేన మోదహేతుత్వాత్ శివా సృగాలః" అని వ్యాఖ్య.

"శం నిత్యసుఖ మానందమికారః పురుషః స్మృతః

వ కారః శక్తి రమృతా మేళనం శివ ఉచ్యతే"

- శివ పురాణమ్.

శం అంటే నిత్యసుఖము. ఆనందము. ఇకారము పరమ పురుషుడు. వకార మమృత స్వరూపిణియగు శక్తి. ఈ ముగ్గురి సమ్మేళనమే 'శివ' అగుచున్నది. అనగా ఆనందమయమైన శివశక్తి సంయోగమే శివశబ్దార్థము.

"శివస్తథా సుకృత్యాది వశీకృత్యాధితిష్ఠతి ।

సర్వం వశీకృతం యస్మాత్తస్మాత్ శివ ఇతి స్మృతః"

-శివపురాణమ్

సకలవిధ కర్మలను తన వశమున నుంచుకొనువాడు "వశి" అగుచున్నాడు. 'వశి' యే 'శివ' అయినది. శివ శబ్దమునకు వశియనగా జితేంద్రియుడని యర్థము.

కావుననే శివుడు లోకోపకారకమైన సాహసకృత్యమును ఎవరును చేయలేని పనిని చేసెను. సముద్రమథనమున బుట్టిన కాలకూట విషమును తనకంఠమున గ్రహించి శ్రీకంఠ, నీలకంఠాది నామముల ప్రసిద్ధి గాంచెను. పూర్తిగ విషమును ఉదరమున మింగలేదు. అందుచేత లోకమున "పొట్ట నిండ విషము" అని నిందాపాత్రము కాలేదు. కంఠమున ధరించుటచే నది యాయన కలంకారమాయెను.

లలితా సహస్రనామములలో మొదటిది "శ్రీమాతా" . అచట 'శ్రీ' యనగా లక్ష్మియని సామాన్యార్థము. కాని భాస్కరరాయ వ్యాఖ్య. 'శ్రీ' అంటే 'విష'మని అర్థమును చూపుచున్నది.

'త్రియం విషం కంఠే మాతి స్థాపయతి' "అనయోః పక్షయోః నామ పుంలింగం భవతి శివశక్త్యో రభేదాత్" అని భాస్కరరాయ వ్యాఖ్య.

శ్రీయన విషము.దానిని కంఠమందు ధరించునది లేక ధరించువాడు. శివశక్తుల కభేదము గనుక ఇచట 'శ్రీమాతా' యను పదమును పుం, స్త్రీ లింగములలో గ్రహించదగునని యర్థము.

అమరకోశవ్యాఖ్యాకారుడు లింగయసూరి 'శ్రీకంఠ' అను పదమునకు "కాలకూటరూప విషరూపా శ్రీః తాం కంఠే దధాతీతి" అని పైవిషయమునే చూపెను. కావున శ్రీమాతా యనగా శివుడు, శక్తి యగుదురు. అయితే వేదము "ఋచస్సామాని యజూంషి సా హి శ్రీ రమృతా సతామ్" అని సత్పురుషులకు ఋగ్యజుస్సామాత్మకమగు వేదరాశి "శ్రీః" అగునని చెప్పినది కావున "శ్రీమాతా"అనగా వేదరాశిని కంఠమందు ధరించినవాడు అని అవగతమగుచున్నది. ఈరకమైన 'శ్రీః' 'అమృతా' అగునట. కావున ఒకే 'శ్రీః' యను పదమునకు విషము, అమృతము అనిరెండర్థములవగతము లగుచున్నది. సత్పురుషులకు విషము గూడ అమృతమే.అట్లు విషమును అమృతముగా స్వీకరించు మహాశక్తి సంపన్నుడే పరమశివుడు. లోకమున-

"అనభ్యాసే విషం శాస్త్రం అభ్యాసేత్వమృతం స్మృతమ్" అని భర్తృహరి వచనము.

ఇష్టము లేక అభ్యాసము లేనపుడు శాస్త్రము విషతుల్యము.

ఇష్టము, అభ్యాసమున్నచో నా శాస్త్రమే అమృతమగునట.

దేవదేవుడగు శివుని విషయంలో విషమే అమృతమయ్యెను. అపుడు శివుని కంఠము నుండి వేదరాశి ఓంకారరూపమున బయల్వెడలెను.

"ఓంకారశ్చాథ శబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా ।
కంఠం భిత్త్వా వినిర్యాతౌ తస్మాన్మాంగలి కావుభౌ"॥

అట్టి పరబ్రహ్మయగు శివుని కంఠమునుండి అప్రయత్నముగ "ఓంకార"శబ్దమును, "అథ" శబ్దమున్ను బయల్వెడలి మంగళప్రదములయినవి. శివమయ ములయినవి.

" అకారః సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమః శివః॥
హకారాన్తః కలారూపో విమర్శాఖ్యః ప్రకీర్తితః"

- శివపురాణము.

అన్నివర్ణములలోను మొదటిదైన అకారము ప్రకాశము. అది శివశబ్దవాచ్యము. చివరి వర్ణము హకారము. అది సకలకలారూపము. అదియే పరాశక్తియని 'సంకేతపద్ధతి' యని గ్రంధము తెల్పుచున్నది. అకార, హకార సంయోగముతో "అహం" అను శబ్దమేర్పడుచున్నది.

" తత్ర తీవ్రేణ తపసా తోషితాదిందుశేఖరాత్।
సర్వవిద్యాముఖం తేన ప్రాప్తం వ్యాకరణం నవమ్॥
నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచ వారమ్।
ఉద్ధర్తు కామః సనకాదిసిద్ధానేతద్విమర్శే శివసూత్రజాలమ్॥
యేనాక్షరసమామ్నాయమధిగమ్య మహేశ్వరాత్।
కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం తస్మై పాణినయే నమః॥"

-సిద్ధాన్త కౌముదీ - బాలమనోరమా.

వర్షమహాముని శిష్యులలో జడబుద్ధియగు పాణిని, హిమాలయములకేగి శివుని గూర్చి తపస్సుచేయగా, శివుడు మెచ్చి పాణినికి సమస్త విద్యలకు మూలమగు వ్యాకరణమును ప్రసాదించెను. "మహాకాలో మహానటః" అని కోశము. నటరాజు శివుడు. ఆయన నృత్తమునకు తాండవమని పేరు. నాట్యము చేయుట శివుని ప్రత్యేకత. ఒకనాడు శివుడు నాట్యం చేయుచుండగా సనకసనందనాది మహర్షులతో పాటు పాణిని గూడ సభనలంకరించెను. నాట్యం చివరిలో శివుడు తనచేతిలోని ఢక్కను పదునాల్గు సార్లు మ్రోగించెను. ఆ పదునాలుగు నాదములు పదునాల్గు శివసూత్రములుగ అవతరించినవి. ఆ పదునాల్గు శివసూత్రములను శివుని నుండి పాణిని పొందెను. ఆ మహేశ్వర సూత్రములు. "అఇఉణ్, ఋఌక్, ఏఓఙ్, ఐ ఔ చ్, హయవరట్, లణ్, ఞమఙణనమ్, ఝభఞ్, ఘఢధష్, జబగడదశ్, ఖఫఛఠథచటతవ్, కపయ్, శషసర్,హల్- ఇతి మాహేశ్వరాణి సూత్రాణి" సమస్త వాఙ్మయమునకు యీ శిసూత్రములే ఆధారము. మూలము.

శివునికంఠము నుండి బయల్వెడలిన 'ఓం' కారమును విడదీయగా 'అఉమ్' అయినది. "అ" ను 'మ' ప్రక్కన చేర్చగా 'ఉమ' అయినది. ఉమయే బ్రహ్మవిద్య. ఓంకారము బ్రహ్మవిద్య గద! ఓంకారము ఉమగా మారుటచే ఉమ గూడ బ్రహ్మవిద్యయే. వేదమాతయే.

ఆ ఉమను మహేశ్వరుడు ఎపుడు తన దేహార్ధభాగమున నుంచుకొనును. ఆవేదమాత శివునికి అర్థాంగిగా నుండును. అనగా వేదమునకు పరమేశ్వరుని గల భార్యాభర్తృ సంబంధము నిత్యము. శాశ్వతము. వారినిబట్టియే లోకమున అందులోను భారతీయ వివాహ వ్యవస్థ స్థాపించబడినది. లక్ష్మీనారాయణ స్వరూపులు, లేక పార్వతీపరమేశ్వర స్వరూపులగు నూతన దంపతుల దాంపత్యము, వేదమాతృ పరమేశ్వరుల దాంపత్యమువలె సుస్థిరము అని కాళిదాస మహాకవి తన రఘువంశ, కుమార సంభవములనెడి కావ్యముల ద్వారా భారతీయ వ్యవస్థను చాటిచెప్పెను.

"వాగర్థావివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే।
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ॥"

పార్వతీపరమేశ్వరులు వాగర్థముల వలె శాశ్వత సంబంధముగలవారు. వారిరువురికి

సప్తర్షులు, వివాహము చేయ సంకల్పించి హిమవంతునితో నిట్లు చెప్పుదురు.

"తమర్థ మివ భారత్యా మతయా యోక్తు మర్హసి"।

వేదవాక్కుతో పరమార్థమును జతచేసినట్లు, యోగము చేసినట్లు, నీ కూతురైన పార్వతితో శివుని యోగము చేయుము.

"వ్యక్తం సర్వముమా రూపం అవ్యక్తంతు మహేశ్వరమ్।
ఉమాశంకరయోర్యోగో యః సయోగో విష్ణురుచ్యతే॥"

-రుద్రహృదయోపనిషత్।

వ్యక్తమనగా కనిపించునది. ఆ వ్యక్తమంతయు ఉమా స్వరూపము. కనిపించని దంతయు అవ్యక్తము. ఆ అవ్యక్తము శివస్వరూపము. ఉమా శంకరుల యోగమునకు విష్ణువని పేరు.

"పుంలింగం సర్వ మీశానం స్త్రీలింగం భగవత్యుమా ।
ఉమారుద్రాత్మికాః సర్వాః ప్రజాః స్థావరజంగమాః ॥"

- రుద్రహృదయోపనిషత్।

పుంలింగములో నున్న దంతయుననగా పురుషులందరు శివస్వరూపులు. స్త్రీలింగములో నున్నదంతయుననగా స్త్రీలు ఉమాస్వరూపులు. ప్రజలంతా ఉమాశంకర స్వరూపులని ఉపనిషత్తులు ప్రతిపాదించుచున్నవి. తద్వారా స్త్రీలు వేదమాతృ స్వరూపులు,పురుషులు వేదపురుషులైన భగవత్స్వరూపులుగాను దర్శింపబడుటయే భారతీయ వివాహవ్యవస్థ. ఉమా శంకరుల యొక్క యోగము వలె స్త్రీ పురుషుల యోగము (వివాహము ద్వారా) విష్ణువని చెప్పబడుచున్నది.

బ్రహ్మ, విష్ణువుల కన్న తృతీయనేత్రముండుట శివునికిగల మరొక విశేషము. అందుచేత శివునికి 'త్ర్యంబక' అని 'త్రినయన' అని పేర్లు. త్ర్యంబక అంటే మూడు కన్నులు గలవాడని సామాన్యార్థము. మూడు వేదములు గలవాడని విశేషార్థము. కాన శివుడు "త్రయీ తనుః, అనగా మూడు వేదములు కలిపి ఆయన దేహమేర్పడినది.

"యథావృక్షస్య సంపుష్పితస్య దూరాద్గంధోవాతి" అని వేదమంత్రము.

బాగా వికసించిన పుష్పములుగల వృక్షమునుండి చాలాదూరము వరకు సుగంధము వీచును. పరిమళము వ్యాపించును. అట్లే పుణ్య కర్మలు చేయువాని నుండి గూడ మంచి సుగంధము చాల దూరము దాకా వచ్చును. వానికి అత్తర్లు, సెంట్లు అనవసరము. అట్లే మహా దేవుడైన పరమ శివుడు అనెడి తీగకు వేదరూపపుష్పములు పూచుటచే వాటిని నుండి మంచి విద్యాగంధము వీచుచున్నదట. ఆ గంధము ప్రజలకు పుష్టిని, వృద్ధిని సమకూర్చునది. అందుకే శివుని "సుగంధి" యని వేదము వర్ణించుచున్నది.

"త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టి వర్ధనమ్।
ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయ మా మృతాత్"

-యజుర్వేదము.

అట్లు సుగంధి, పుష్టి వర్ధకుడగు త్ర్యంబకుని అనగా వేదత్రయీమయుడు నగు పరమ శివుని సేవింతము. బాగా పరిపక్వమయిన దోసపండు ఎట్లు అనాయాసముగ తీగెనుండి విడిపోవునో అట్లే అనాయాసముగ మృత్యువు నుండి లేక మృత్యురూప సంసార బంధము నుండి, లేక అజ్ఞానము నుండి మోక్షమిచ్చి జ్ఞానమొసగెడి పరమేశ్వరుని సేవింతమని అర్థము. గజేంద్రమోక్ష కథగూడ యీ మంత్రతాత్పర్యమే. గజరూపుడైన జీవునకు అజ్ఞానమనెడి మొసలిబారి నుండి వేదమయుడగుగరుత్మంతుని వాహనముగ చేసికొన్న శ్రీహరి జ్ఞానమొసగి మోక్షమిచ్చెను. శ్రీహరి వేదమయుడగు గరుత్మంతుని మీదవచ్చి మోక్షమిచ్చెననగా జీవులకు వేదము ద్వారా భగవద్దర్శనము జ్ఞానమున్నూ గల్గును.భగవత్ జ్ఞానమే జ్ఞానము. ఈ జ్ఞానము గల్గుటకు అజ్ఞాననాశనమునకు మోక్షమని అర్థము.

శ్రీహరికి, హరునకు భేదాలేదు. అ భేదమే. వీరిద్దరు తమ వద్దనున్న వేద విద్యద్వారా ప్రజల అజ్ఞానమనే చీకటిని పారద్రోలి జ్ఞానామృతమును ఇచ్చి ఆ ప్రజలకుగూడా దైవత్వమును గల్గించు దేవ దేవులు. శివుని ఫాలమునందుగల తృతీయ నేత్రమును చంద్రకలగా చెప్పుదురు. అది చంద్రుని పదహారవకల. సామాన్యముగ చంద్రునికి పదిహేను కలలు సుప్రసిద్ధము. కాని పదహారవ కలయొక్కటి గలదు. అది బ్రహ్మ విద్యా స్వరూపము. వేద విద్యయంతయు చంద్రుని పదహారవకలలో నిక్షిప్తమైయుండును. ఆ కలను పరమేశ్వరుడు తన శిరమున చూడామణిగా ధరించెను.

కాళిదాసమహాకవి కుమారసంభవ కావ్యం ద్వారానీ విషయమును లోకమునకెరుగ పరిచినాడు. దేవతలందరూ తారకాసురునిచేత పీడింపబడి బ్రహ్మదేవుని శరణుజొచ్చిరి. అపుడు ప్రత్యక్షమయిన బ్రహ్మదేవునితో దేవతలు తారకాసురుని లీలలను బాధలను మొరపెట్టుకొనిరి. అపుడు

" సర్వాభిః సర్వదా చంద్రః తం కలాభిర్నిషేవతే।
నాదత్తే కేవలాం లేఖాం హరచూడామణీ కృతామ్"॥

- కుమారసంభవం

చంద్రుడెల్లవేళల నారాక్షసుని తన కలలన్నిటితోను సేవించుచున్నాడు. అయితే నారాక్షసుడు శివుని శిరోరత్నముగను, ఫాలమందలి నేత్రరూపముగ నున్న చంద్రుని కేవలమగు లేఖను స్వీకరించుటలేదు. స్వీకరించలేడు. ఎందుకనగా నా లేఖ "కేవలా" అగును కనుక. కేవల శబ్దము పరమేశ్వర లేక వేద, లేక మోక్షవాచకము. కనుక వేద విద్యాస్వరూపము,

"కేవల"మగు చంద్రకల జోలికి తారకాసురుడు వెళ్లలేకపోయెను. దాని తాత్పర్యము - వేదనిందకులైన వారిని, వేదము పరమశివుని తృతీయ నేత్రరూపమై భస్మముచేయును.

శివునకు శర్వుడని పేరు. శివునికి ఎనిమిది మూర్తులు గలవు. అందు భూమి ఒక మూర్తి. ఆ భూమి మూర్తికి శర్వ అని పేరు. శర్వునికి సుకేశియను భార్య ద్వారా కుజుడు (అంగారక) అను కుమారుడు గల్గెనని లింగ, వాయు పురాణములు తెల్పుచున్నవి.

అలంకారప్రియో విష్ణుర్జల ధారా ప్రియశ్శివః।

విష్ణువునకు అలంకారములన్న ప్రీతి। శివునకు జలధారలన్న ప్రీతి. శివుని రూపాన్తరము శివలింగము. నిత్యము శివలింగమునకు జలధారలతో నభిషేకము జరుపబడుచున్నది. జలములను సాధారణమైన నీరుగా గ్రహించక వేద మంత్ర స్వరూపములుగా గ్రహించవలెను. జలములతో నభిషేకము వలన నాజలములలో నొక శక్తి పుట్టును. అట్టి జలమును తీర్థముగా స్వీకరించిన సమస్త దోషములు నశించును. అందుకే శివుని ప్రధానమైన వైద్యునిగా వేదము గిర్తించుచున్నది. "ప్రథమో దైవ్యో భిషక్".

"చరాచర జగత్ బిందు నాదాత్మకమ్।

బిందు నాదాత్మకం లింగం జగత్కారణత్వాత్"

చరా చరరూపమగు జగత్తు బిందువు, నాదముల నాధారము చేసికొనియుండును. అట్లు జగత్కారణ భూతములైన బిందునాదములే శివలింగస్వరూపమని శివపురాణం తెల్పుచున్నది. త్యాగరాజు శివుని "నాదతనుమనిశం శంకరం నమామి" అనగా నాదదేహము గల శివుని నమస్కరింతునని కీర్తించినాడు. రుద్రాధ్యాయంలో "నమో హిరణ్యబాహవే" అన్న మంత్రమును విష్ణుసూరి వ్యాఖ్యానం చేస్తూ "హిరణ్యశబ్దేన ప్రాథమికః శుక్లబిందు రుచ్యతే" హిరణ్యమనగా శుక్ల బిందువు అని చెప్పెను. ఇంకను ఆ వ్యాఖ్యానం.

"ఇదమత్ర రహస్యం యథా కశ్చిత్ సమ్రాట్ దివ్య విగ్రహ ఆదర్శే స్వవదనమాలోక్య ప్రమోద మనుగచ్ఛతి, తథా పరమేశ్వరోఽపి స్వాశ్రిత మాయా శక్తౌ దర్పణస్థానీయాయాం స్వప్రతి బింబం సమీక్ష్య తేన రూపేణ బిందుస్వరూపతా మయతే। ప్రకృతిశ్చ చిద్రసాసిక్తా స్వగతరజస్తమసీ ఆవిష్కరోతి, తతశ్చ సాభాసాస్త్రయోఽబిందవ: ప్రభవన్తి. సోమసూర్యవహ్నినా మభిః। తతశ్చ జ్ఞానేచ్ఛా క్రియాశక్తి స్వరూపం బిందుత్రయం మిళిత్వా బిందుచక్ర ముపదిశన్తి। తచ్చ సత్త్వ ప్రాధాన్యాత్ హిరణ్యముచ్యతే".

ఇది ఒక రహస్యము. అందముగల రాజు అద్దములో తన ముఖము చూచుకొని ఆనందించునట్లు పరమశివుడు అద్దం వంటి తన మాయాశక్తిలో తన ప్రతిబింబమును చూచుకొనును. అపుడా రూపము బిందువుగా గన్పడును. శివుని రూపము బిందు రూపము నొందును. ప్రకృతియు చిద్రూపరసముతో నిండినదై (రససిక్తయై) తన దేహమునుండి రజస్సును తమస్సును విడచును. అపుడు మూడు బిందువులుద్భవించును. అవియే సూర్య,

చంద్ర, అగ్ని నామములతో నొప్పుచున్నవి. జ్ఞాన, ఇచ్ఛా, క్రియా శక్తులీమూడు బిందువులకు గలవు. ఇట్టి యీ మూడు బిందువులతో బిందు చక్రమేర్పడును. ఆ బిందు చక్రము సత్త్వ ప్రధానమై, హిరణ్యమని చెప్పబడుచున్నది. ఆ హిరణ్యమే శుక్ల బిందువు శివ స్వరూపము. బిందునాదములే శివ శక్తులస్వరూపమగు శివలింగము.

"శ్రీచక్రం శివయోర్వపుః" అని శంకర భగవత్పాద వచనము. శ్రీచక్రంలో శ్రీ పరమేశ్వరి, వేదమాత. చక్రం బిందుచక్రము, హిరణ్యమనబడు శివుడు. కావున శ్రీచక్రము శివశక్తి స్వరూపము గావున శివలింగ స్వరూపమే యగును. శ్రీచక్రము శివలింగమునకు ప్రతిరూపము.

శివలింగము క్రింద పీఠముండును. ఆ పీఠము అంబయని, శ్రీయని, పైలింగము, చిత్స్వరూపి, చక్రరూపి యయిన శివుడని శివపురాణము తెల్పుచున్నది:

"పీఠమంబామయం సర్వం శివలింగం చ చిన్మయమ్॥"

దేవాలయములోని శివలింగము, క్రింద పీఠముల తత్త్వమిదియే।

"లీనం గమయతీతిలింగం" అను వ్యుత్పత్తి భాగవతంలో గలదు. పరమేశ్వరునిలో లీనమగు దానిని తెలియ పరచునది 'లింగ' మగును. పార్వతీదేవి ఒకసారి శివుని ఒక ప్రశ్నవేసింది.

"ఇంద్రియైః రహితో దేవః శూన్యరూపః సదాశివః॥

ఆకారో నాస్తి దేవస్య కిం తస్య పూజనే ఫలమ్॥"

లింగరూపంలో దేవుడగు శివునిరూపము శూన్యము. అవయవములు, ఆకారము లేవు. అట్టి ఆయనను పూజించిన ఫలమేమి? అని. శివుడు ఇట్లు సమాధానమిచ్చెను.

" ప్రేతే పూజా మహేశాని కదాచిన్నాస్తి పార్వతి।

రుద్రస్య పరమేశాని రౌద్రీ శక్తిరితీరితా॥

రౌద్రీ తు పరమేశాని ఆద్యాకుండలినీ భవేత్।

వర్తతే పరమేశాని బ్రహ్మవిష్ణు శివాత్మికా।

సార్ధత్రివలయాకారైః శివం వేష్ట్య సదా స్థితా।

శక్తిం వినా మహేశాని ప్రేతత్వం తస్య నిశ్చితమ్॥

శక్తి సంయోగమాత్రేణ కర్మకర్తా సదాశివః।

అతఏవ మహేశాని పూజయేత్ శివలింగకమ్॥

సౌందర్యలహరిలో శ్రీశంకరభగవత్పాదులు -

"శివః శక్త్యా యుక్తో భవతి శక్తః ప్రభవితుం

న చేదేవం దేవో న ఖలు కుశలః స్పందితుమపి॥"

అని చెప్పిరి. శక్తియనగా పార్వతి. ఆ శక్తి లేనిచో శివుడు శక్తిహీనుడై, నిర్వీర్యుడై కొలదిగ గూడ కదులుటకు అశక్తుడగును. కావున శక్తిలేని శివుడు ప్రేతయగును. ఆ ప్రేతకు పూజలు

విష్ఫలము. అయితే రుద్రునికి 'రాత్రి' యను శక్తి గలదు. బ్రహ్మవిష్ణుశివాత్మకమగు నాశక్తికి 'కుండలిని' యనిపేరు. ఆ రాత్రిశక్తి (కుండలిని) శివుని మూడున్నర వలయము లతో చుట్టుకొని యుండును. ఆశక్తి సంయోగముతో శివునికి ప్రేతత్వ విముక్తిగల్గి మరల శక్తిమంతుడై కర్మలుజేయ సమర్థుడగుచున్నాడు. ఆ శక్తియే పీఠము. అట్టి శివలింగార్చన, శివలింగాభిషేకము సమస్తపాపనాశకరము. శుభప్రదము.

శివలింగావిర్భావము గూర్చి కథగలదు. ఒకప్పుడు బ్రహ్మవిష్ణువులు నేను గొప్పంటే నేను గొప్పయని వాదించుకొనిరి. వారి వాదన తీర్చుటకు శివుడు పరమ జ్యోతిర్మయ లింగాకారముగ నావిర్భవించెను. ఆ శివలింగము జాడ తెలిసికొనలేక,బ్రహ్మ హంసవాహనము మీద ఊర్ధ్వలోకములకు,వరాహరూపియై విష్ణువు పాతాళలోకమునకు వెళ్ళిరి. అచట ఎంత వెతికినను ప్రయోజనము లేదు. కొన్నివేల సంవత్సరములు పరిశ్రమ చేసినను ఆలింగము జాడను, ఆలింగము యొక్క ఆద్యన్తములను కనిపెట్టలేకపోయిరి. అపుడు శివలింగము శిరము నుండి పడుచున్న నొక కేతకీ పుష్పము (మొగలి పువ్వు) వారితో నిట్లనెను. నేను అనేకవందల కల్పములనుండి శివలింగము శిరమునుండి ప్రయాణము చేసిచేసి ఇన్నాళ్ళకు మిమ్ము కలిసితిని. ఇంక నాలింగము పాదసన్నిధికి చేరవలెనన్న ఎంత దూరము పోవలెనో, ఎన్ని సంవత్సరములు పట్టునో అంతుపట్టుటలేదని చెప్పెను. చివరకు శివుడు కరుణించి బ్రహ్మవిష్ణువులకు దివ్యవాణి ద్వారా ప్రబోధము చేసి శివలింగము యొక్క ఆద్యన్తములను తెలియజేసెను.

భూమి అంతా పీఠమనియు, ఆకాశము లింగమనియు వేదైకవచనము. పానువట్టముపై శివలింగమున్నట్లు భూమిపైని యాకాశము విరాజిల్లుచున్నది కావున భూమ్యాకాశములు శివశక్తులుగా తెలియనగును. భూమ్యాకాశములను ద్యావా పృథివీ శబ్దములతో వేదము వ్యవహరించుచున్నది. ఈ శివశక్తి స్వరూపములైన ద్యావా పృథువులే మాతాపితరులని తైత్తిరీయ శ్రుతి "ఇదం ద్యావా పృథివీ సత్యమస్తు పితర్మాతః" యని ప్రబోధించుచున్నది. శ్రీనివాస (వెంకటేశ్వర) కల్యాణగాధలోని ఆకాశరాజు, ధరణీదేవియున్నూ యీ ద్యావా పృథ్వులే. ధరణి యనగా భూమి.

అధునిక విజ్ఞాన శాస్త్రవేత్తలు గూడ లింగస్వరూపమువలె నాకాశము వక్రమనీ, దేశ, కాలాదులు, తుదకు బ్రహ్మగూడ వక్రములై లింగాకారములని వర్ణించిరి. వినాయకుని తొండము వక్రమై లింగస్వరూపమగును. ఆయన ముఖము పీఠము. ఆయననుండి ఉత్పన్నమైనదంతయు వక్రమే. అనన్తకోటి విశ్వములు గూడ వక్రములై లింగస్వరూపములే. విశ్వాతీతుడైన పరబ్రహ్మాకారము గూడ లింగరూపమే.

ఇట్టి యీ శివలింగమును బ్రహ్మవిష్ణువులేగాక శివుడు గూడ ప్రతిష్ఠించి పూజించినట్లు పురాణగాథలు గలవు.

"బ్రహ్మణా విష్ణునా వాపి రుద్రేణాన్యేన కేన వా ।
లింగప్రతిష్ఠా ముత్సృజ్య క్రియతే స్వపదస్థితిః॥
కిమన్యదిహవక్తవ్యం ప్రతిష్ఠాం ప్రతికారణమ్ ।
ప్రతిష్ఠితం శివేనాపి లింగం విశ్వేశ్వరం యతః ॥
శాక్తైర్వా వైష్ణవై ర్వాపి సౌరై ర్గాణపతై2 ర్థ వా।
శివార్చన విహీనస్య కుతః సిద్ధిః భవేత్ప్రియే॥"

- శివపురాణమ్

బ్రహ్మవిష్ణుశివులు గాని మరెవ్వరైనను లింగమును ప్రతిష్ఠ చేయనిచో వారి పదవులకు గండమే. శివుడంతటివాడే శివలింగప్రతిష్ఠ చేసి పూజించుచుండగా, శివలింగ ప్రతిష్ఠా, మహిమల కారణమేమని చెప్పదగును? శాక్తులు గాని, వైష్ణవులు గాని, సౌరులుగాని, గాణాపత్యులుగాని శివార్చన లేనిచో కార్యసిద్ధి నొందరు అని శివుడు పార్వతీదేవికి చెప్పెను. శివపూజా ప్రాశస్త్యమును శివుడే చెప్పెను. ఆయనగాక మరెవ్వరు చెప్పగలరు? ఇట విశేషమేమనగా - శివునకు తనను పూజ చేయమని చెప్పుటలో తాత్పర్యము గాదు.

" లోకం లింగాత్మకం జ్ఞాత్వా లింగే యో2ర్చయతే హి మామ్
న మే తస్మాత్ప్రియతరః ప్రియో వా విద్యతే క్వచిత్ ॥"

జగమంతయు నండాకారముగ నున్నది.( బ్రహ్మాండము) ఆ బ్రహ్మాండము యొక్క ఆకారమును శివలింగముగా భావనచేసి లింగార్చన చేయువారు నాకత్యన్త ప్రీతిపాత్రులగుదురు. అనగా భగవంతుని సర్వాత్మకునిగను, బ్రహ్మాండమును శివలింగముగను పూజించుటయే అసలైన, యథార్థమైన శివలింగార్చన అగును. కాబట్టియే జగత్తులోని పుంలింగముగ నున్నదంతయు శివస్వరూపము, స్త్రీ లింగముగ నున్నదంతయు ఉమా స్వరూపముగను భావనచేసి, లోకములోని స్త్రీ, పుంలింగములను వాని ప్రతిరూపమైన శివశక్తుల మేళనమగు శివలింగము ద్వారా పూజించుటయే తాత్పర్యము, అంతరార్థము. తద్ద్వారా ఇహము, వాగర్థముల సేవ ద్వారా పరము సంప్రాప్తమగును.

మరియొక తత్త్వమవగతమగుచున్నది - శివలింగము పరమేశ్వర స్వరూపము.క్రింది పీఠము ఉమాస్వరూపము గద! ఉమయనగా వేదవిద్య గద! కావున నిత్యము పరమేశ్వరున కాధారము - పీఠము బ్రహ్మవిద్యయే అనగా వేదములే . ఆ వేదము నిరంతరము లింగాకారుడు, బ్రహ్మాండాకారుడునగు పరమేశ్వరుని వహించుచూ, వాహనముగా నున్నట్లు తెలియనగును. ఈ విషయమును ఋగ్వేదము "బ్రహ్మాణం బ్రహ్మవాహసమ్" అని తెల్పినది.

పరబ్రహ్మకు శబ్దబ్రహ్మయగు వేదమే వాహనమని వేదము తనను తాను వర్ణించుకొనినది. కావున శివలింగము క్రింది పీఠమును సామాన్యముగ పానవట్టముగ గ్రహించక, పరాశక్తి

రూపముగాను, వేదమయమగు శబ్దబ్రహ్మగాను దర్శించవలెను. కావున శివలింగము, తదాధార పీఠపూజ, పరబ్రహ్మ, శబ్దబ్రహ్మ (వేదము)ల పూజయే. వాగర్థ పూజయే.

"ఉమా శంకరయోర్యోగో యః స యోగో విష్ణు రుచ్యతే"

ఉమాశంకరుల యోగము విష్ణువు అగునట అనగా శివలింగమే విష్ణువు. విష్ణువే శివలింగము.

శివవిష్ణువులలో భేదము లేదని వేదము ఘంటాపథముగ రుద్రహృదయోపనిషత్ ద్వారా చాటిచెప్పినది.

"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే ।
శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః ॥
యథా శివమయో విష్ణురేవం విష్ణుమయః శివః ।
యథాంతరం న పశ్యామి తథా మే స్వస్తిరాయుషి ॥ "

అని స్మృతి బోధ. నిత్యము సంధ్యావందన సమయంలో పఠించవలసిన ప్రార్థనా శ్లోకములు. శివుడే విష్ణువు. విష్ణువే శివుడు. శివుని రూపం, లింగరూపము గూడ విష్ణురూపమే. విష్ణువు రూపం శివుడే । విష్ణువుశివమయము. శివుడు విష్ణుమయము. వీరిరువురిలో భేదమును చూడనంతవరకు నాఆయుస్సు సుస్థిరము అని యర్థము.

" రుద్రో దివా ఉమా రాత్రిః తస్మై తస్యై నమో నమః"

- రుద్రహృదయోపనిషత్.

రుద్రుడు పగలు. రాత్రి ఉమ. ఆయనకు, ఆమెకు నమస్కారము. శివశక్తులవలె పగలు రాత్రియును భార్యాభర్తలవలె శాశ్వతముగా గల్సియుండుటచే నా రేయింబవళ్ళ సమ్మేళనమే-యోగమే శివలింగస్వరూపము అగును. పగలు శివలింగము, రాత్రి పీఠరూపమగు శక్తి యగును. పగటికి రాత్రికి మధ్య నున్న సంధ్యయే వినాయక స్వరూపము. తల్లి దండ్రుల సంధి రూపమే సంతానమని వేదము "మాతా పూర్వరూపం । పితోత్తర రూపం । ప్రజా సంధిః" అని చెప్పినది గద! ఇట్లు శివ, శివలింగతత్త్వముల నెరింగి ప్రజలు గూడ శివమయులై, శివలింగస్వరూపులై, లింగార్చనాపరులై, శివారాధకులై వేదారాధకులై అనేకానేక శివములను (మంగళములను) శక్తులను పొంది తరింతురు గాక!

" రుద్రో వా ఏష యదగ్నిః" అని వేదము ద్వారా రుద్రుడు అగ్నిస్వరూపుడని తెలియు చున్నది. ఆయనయే సూర్యుడు. అట్టి అగ్ని తేజమును, వేడిమిని శాంతింపచేయుటకై నిత్యము "నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః" అనగా రుద్రుడా! నీకోపము శాంతించుగాక, నీకోపముకొక నమస్కారము. మమ్ముల బాధింపక గాపాడుము" అని

జలములతో నభిషేకము చేయటం జరుగుచున్నది. అపుడు రుద్రుడు చల్లబడి, శాంతించి, శివుడై మానవులకు సుఖ, శాంతులనొసగును. ఎవరియింట నిత్యము రుద్రాభిషేకముండునో, శివలింగార్చనయుండునో నా యింటికదియే శ్రీరామరక్ష.

శివుని పూజకు ముందు పీఠపూజ విధిగా,ప్రధానంగా చేయవలెను. "ఆధార శక్త్యై నమః మూలప్రకృత్యై నమః" అని. పీఠము ఆధారశక్తి. మూలప్రకృతి. వేదమాత। సమస్త లోకముల కాధారశక్తి వేదమాత- వేదములు. లోకంలో భార్యను పూజించి, ఆమెయనుగ్రహం సంపాదించినచో భర్తయొక్క అనుగ్రహం పొందటంచాల సులభము గద! అట్లే వేదమాతృపూజ చేసి, వేదమాత యొక్క అనుగ్రహం సంపాదించినచో శివుని అనుగ్రహం పొందటం చాలా తేలిక. దేవతలందరిలోను శివుడు భక్తసులభుడు.

ఇట్లు ప్రజలందరు శివలింగార్చన ద్వారా శివాయగు పరాశక్తి యొక్కయు, శివమగు వేదముల యొక్కయు, శివుని యొక్కయు అనుగ్రహపాత్రులగుదురు గాక! శక్తిమంతులై శివస్వరూపులగుదురు గాక! వేదాధ్యయనము పీఠపూజకు ప్రతిరూపము. కావున వేదాధ్యయనము చేయువారు, వేదసేవాతత్పరులునూ అందరు శివస్వరూపులగుదురు గాక!

"దేవః శివః వేదః శివః వేదాధ్యాయీ శివః స్మృతః ।"

"శివనామని భావితే2 న్తరంగే
మహతి జ్యోతిషి మానసీమయార్ద్రే ।
దురితాన్యపయాన్తి దూరదూరే
ముహురాయాన్తి మహాన్తి మంగళాని॥"

"శివశివేతి శివేతివా భవభవేతి భవేతివా
హర హరేతి హరేతివా భజమనశ్శివమేవ సన్తతమ్॥".

ఇతిశమ్

"నమామి శంకరం హరిమ్"



# సంస్కృతము - దేవభాష

సంస్కృతము దేవభాష, అమృతభాష, గీర్వాణభాష అను భిన్న భిన్న నామములతో వ్యవహరింపబడుచున్నది. ఆ నామములు సార్థకనామములు. భారతములో వేదవ్యాసుడు శ్రీకృష్ణుని స్తుతించు సమయమున ధర్మజునినోట "సంస్కృతో2సి" అని పలికించినాడు. పరమాత్మకు 'సంస్కృతః' అని పేరు గలదు. ఆ పరమాత్మ రూపనామ రహితుడయ్యు చరాచరాత్మకమగు ఈ జగత్తుమ సృష్టించి, తానే జీవునితో కూడా అందు ప్రవేశించుచున్నాడు. ప్రపంచమంతయు శరీరాత్మకము. ఈ శరీర మచేతనము. శరీర సామాన్యము శవాకారము.

"శవాకారం యావద్భజతి మనుజస్తావ దశుచిః"

అని శంకర భగవత్పాదులు శరీరము శవాకారమనియు, అది అపవిత్రమైనదనియు చెప్పిరి. ఇట్టి అపవిత్రమైన దేహమును తన యునికిచే సంస్కరించి సంస్కృతుడయినాడు పరమాత్మ. అట్టి సంస్కృత స్వరూపుని చిత్తసంస్కారము ద్వారా తెలియజేయు భాష కనుక దేవభాష. పరమాత్మ అమృతస్వరూపుడు. అట్టి అమృతస్వరూపుని అమృతత్వమును ప్రతిపాదించు భాష కనుక అమృతభాషయని పేరు. గీర్వాణులనగా దేవతలు. భారతదేశమునందలి ప్రజలు నదీనదములను, లతావృక్షాదులను, పశుపక్ష్యాదులను - అది యిది యననేల, సర్వమును పరమాత్మ స్వరూపముగా భావించెడి ప్రమాణబుద్ధి కలవారు. ఇట్లంతటా దేవతాబుద్ధిని కల్పించి, ఉపాసింపజేసెడి భావమును కల్పించెడి భాష గీర్వాణభాష. ఈ శక్తి ప్రపంచములో సంస్కృతేతర భాషల యందెచటను కానరాదు. సంస్కృతభాషాగతమైన ప్రతి పదము ధాతుజము.

"సర్వన్నామ ధాతుజమాహ శకటస్య చ తోకం" అని పతంజలి వాక్యము. శాకటాయనుడు సంస్కృతభాషా గతమైన ప్రతినామము ధాతుజమని చెప్పుటచే సంస్కృతము యొక్క సర్వోత్కృష్టత వ్యక్తమగుచున్నది. సీతాన్వేషణమునకు బయలుదేరిన హనుమంతుడు లంకలో సీతను చూచి రాముని సన్నిధికి మరలివచ్చెను. రాముడు సీత యెట్లున్నదని యడుగగా,

"సంస్కారేణ యథాహీనాం వాచమర్థాంతరం గతామ్"

వ్యుత్పత్త్యర్థహీనమై, అర్థాంతరమును చెప్పెడి వాక్కువలె నున్నదని చెప్పెను. "అవ్యుత్పత్తి హతామివ'' - అని మరియొక మాట నుపయోగించెను. అవ్యుత్పత్తిహతమైన వాక్కువలెనున్నదని పోల్చెను. కనుక వ్యుత్పత్త్యర్థములేని వాక్కు అపార్థముచే మానవుల పెడద్రోవ పట్టించును.

శాబ్దస్యహి బ్రహ్మణ ఏషపంథాః యన్నామభి ర్ధ్యాయతి ధీరపార్థైః
పరిభ్రమం స్తత్ర న విందతే 2 ర్థాన్ మాయామయే వాసనయా శయానః
తతః కవిర్నామను యావదర్థ స్స్యాదప్రమత్త వ్యవసాయబుద్ధిః

సంస్కృతభాషాగతమైన శబ్దమునకు అధిభౌతిక, అధ్యాత్మిక, అధిదైవికార్థములని మూడుండును. అందులో కేవలము అధిభౌతికార్థమునే చెప్పి శబ్దము విరమించదు. అధ్యాత్మిక, అధిదైవికార్థములను ప్రతిపాదించుటయే శబ్దము యొక్క ప్రధానలక్ష్యము. లత తొలుదొల్త మొగ్గ తొడుగును. ఆ మొగ్గ క్రమముగా పుష్పించును. ఆ పుష్పము కొంతకాలమునకు ఫలమగును. మొగ్గ యొక్క లక్ష్యము, పుష్పము యొక్క లక్ష్యము ఫలమే. ఇది యనుభవ సిద్ధమైన విషయము. ఇట్లే శబ్దము అధిభౌతికాధ్యాత్మికార్థములను చెప్పినను, అధిదైవికార్థమే - అనగా పరమార్థమే దాని ప్రధాన లక్ష్యము. అశ్వశబ్దమునకు ఆంధ్రభాషయందు 'గుఱ్ఱము' అని యర్థము. ఆంగ్లభాష యందు 'హార్స్' అనియు, హిందీభాషలో 'ఘోడా' అనియు అర్థము. తమిళభాషలో 'కుదిరై' కన్నడములో 'కుదరే' అని యర్థములు. 'గుఱ్ఱము' అను శబ్దమునెంత విచారించినను, ఆపేరు దానికెందుల కొచ్చినదో తెలియదు. పశువాచకమని మాత్రమే గ్రహించగలము. అట్లే 'హార్స్' 'ఘోడా' మొదలగు పదములను విచారించినచో ఆపదము లెట్లేర్పడినవో తెలిసికొనలేము.పశువు మాత్రమే ఆపదములచే చెప్పబడుచున్నదని తెలియగలదు. ఈ గుఱ్ఱము మొదలగు దేశీయపదములపార్థములు. వీనిచే పరమార్థమును తెలిసికొనజాలము. ఈ యపార్థములతో తృప్తిచెందినచో పరమార్థమునకు దూరుల య్యెదము. ఈ భౌతికార్థజ్ఞానము చేత తృప్తినొందుట అవివేకము, అజ్ఞానమని వ్యాస తాత్పర్యము. క్రాంతదర్శియగు తత్త్వవేత్త ఆపదమునందలి వ్యుత్పత్త్యర్థమును గ్రహించి, క్రమముగా పరమార్థతత్త్వమును గుర్తించి ఆనందించును. ఆ యానందప్రాప్తి కొరకే మానవుడు ప్రతిక్షణము పరితపించుచుండును. ఇక అశ్వశబ్దమును చూతము.

"అశ్నుతే అధ్వాన మిత్యశ్వః"

మానవునివీపున మోయుచు బహుదూరము బహువేగముతో పఱుగిడెడి శక్తి ఒక్క అశ్వమునకు తప్ప ఏ యితర ప్రాణికోటికి లేదు. ఇది అధిభౌతికార్థము. ఇంద్రియములకు (మనస్సు) అశ్వములని వ్యవహారము కలదు.

"ఇంద్రియాణి హయాన్యాహుః" -భగవద్గీత

మనమొకచోట కూర్చుండి పూర్వపరిచితములైన, దూరస్థములైన ఆయా ప్రదేశములను మనస్సుతో చూచుచున్నాము. వాస్తవమునకు చూచునది, వినునది మనస్సే. అన్ని పనులను ప్రేరేపించునది మనస్సే. "అశ్నుతే అధ్వానమ్" అను వ్యుత్పత్తి ననుసరించి అంతటా క్షణములో బహువేగముతో ప్రసరించునది కనుక మనస్సు అశ్వము. అది యాధ్యాత్మికము. "రశ్మయో వై అశ్వాః" - సూర్యకిరణముల కశ్వములని పేరు. ఇచట "అశ్నుతే అధ్వానమ్" అనెడి వ్యుత్పత్త్యర్థము ననుసరించి సూర్యమండలమునుండి బయల్వెడలి క్షణకాలములో బ్రహ్మాండ భాండమునంతయు అతి శీఘ్రవేగముతో వ్యాపించునవగుటచే కిరణముల

నశ్వములనుట సార్ధకమే అగును. సూర్యునకు 'సప్తాశ్వః'. 'సప్తసప్తిః' 'హరిదశ్వః' అను యనేక నామములు గలవు. 'సప్తాశ్వః' అను పదమునకు ఏడు గుఱ్ఱములు కలవాడనియు, 'హరిదశ్వః' అను పదమునకు పచ్చని గుఱ్ఱములు కలవాడనియు ఆంధ్రీకరించుచున్నారు. ఇట్లాంధ్రీకరించుటవలన ప్రభువుల వలె ఏడు గుఱ్ఱములు పూన్చిన రథమునెక్కి సూర్యుడు ప్రాగ్దిశమండి పశ్చిమమునకు పయనించుచున్నాడన్న భావమే కలుగునుగాని పరమార్థమవగతమగుటలేదు. వాస్తవమునకు సూర్యున కుదయాస్తమయములు లేవు.

"నోదయాస్తమయౌరవేః" - అని వాయుపురాణము కూడ ఈ విషయమునే తెలియ జేయుచున్నది. అట్లే పచ్చని గుఱ్ఱములు లేవు. "హరిదశ్వః" అను శబ్దమునందలి హరిచ్ఛ బ్దముచే సప్తవిధములైన వర్ణములు కల, అశ్వః - కిరణ సమూహము కలవాడని అర్థము. సూర్యుని కిరణ సమూహములు ఏడు. ఈ యేడును రక్తపీతాది వర్ణభేదముచే సప్తధా విభక్తములైనవి. ఆ కిరణములలోని యేడువర్ణములే ప్రపంచమును సప్తవర్ణాత్మకముగా చేసినవి. లోకమున మనకగుపడు యితర వర్ణములన్నియు పై సప్తవర్ణముల యొక్క సంకరములే. ఇంతే కాదు. సూర్యునకును 'అశ్వః' అను వ్యవహారముకలదు. సూర్యమండలము తన చుట్టు తానమిత వేగముతో తిరుగుచున్నది. ఆ వేగ పరిమాణమును ప్రాచీనులిట్లు చెప్పినారు.

"యోజనానాం సహస్రే ద్వే శతే ద్వే చ యోజనే ।
ఏకేన నిమిషార్థేన క్రమమాణ నమో 2 స్తు తే।"

సూర్యుడు తనచుట్టు తాను రెప్పపాటుయొక్క సగము కాలములో 2,202 యోజనముల వేగముతో పరిభ్రమించుచున్నాడు. అనగా నిమేషమునకు (రెప్పపాటుకాలము) 4,404 యోజనములు. ప్రస్తుతము లోకములో యోజనమునకు 8 మైళ్ళని వ్యవహారము కలదు. దానిని బట్టి రెప్పపాటు కాలములో 35, 232 మైళ్ళ వేగముతో సూర్యుడు పరిభ్రమించుచున్నాడు. 5 రెప్పపాటుల కాలము ఒక సెకనగును. అట్టిచో ఒక సెకనుకు 1,76,160 మైళ్ళ వేగముతో పరిభ్రమించుచున్నాడు.60 సెకన్లు ఒక నిముషము. కనుక ఒక నిముషమునకు 1,05,69,600 మైళ్ళ వేగముతో తిరుగుచున్నచో గంటకు 63,41,76,000 మైళ్ళ వేగముతో సూర్యుడు పరిభ్రమించుచున్నాడన్నమాట! కనుక "అశ్నుతే అధ్వానమ్" అను వ్యుత్పత్త్యర్థము ననుసరించి సూర్యునియం దశ్వవ్యవహారము అన్వర్థమే యగుచున్నది. ఒక్క అశ్వశబ్దమును నిర్వచించినచో ఇట్లమేయములైన అనేకార్థములు గోచరించుచుండగా, భాషాంతరీకరణము ఏ ప్రయోజనమును సాధించుతుంది? ఇట్లే గోశబ్దమును భాషాంతరీకరించినను పరమార్థము మరుగునపడిపోవును.

"త్రిధా హితం పణిభిర్గుహ్యమానం గవి దేవాసో ఘృత మన్వంవిందన్"

ఈ మంత్రమునందలి 'ఘృత' శబ్దముచే పరంబ్రహ్మతత్త్వము చెప్పబడుచున్నది. ఇట్టి

పరబ్రహ్మతత్త్వమును దివ్యశక్తిసంపన్నులై, అంతర్ముఖులైన మహాపురుషులు వేదాత్మికయగు గోవునందు అనగా వేదవాక్కునందు దర్శింతురు. కనుక నిచటి గోశబ్దము వేదమును, వేదప్రతిపాదితమైన బ్రహ్మను చెప్పుచున్నది.

"గచ్ఛతీతి గౌః" - అనెడి వ్యుత్పత్త్యర్థము ననుసరించి సూర్యుడును గోశబ్దముచే పిలువ బడుచున్నాడు. "ఆదిత్యో2 పిగౌరుచ్యతే" అని యాస్కవచనము. ఇంతేకాదు. "గావ ఆదిత్య రశ్మయః" - సూర్యకిరణములకును ఈపై వ్యుత్పత్తిచే గోవ్యవహారము కలదు.

"సుషుమ్నో 2పిగౌరుచ్యతే" - సూర్యమండలము నుండి బయల్వెడలి చంద్రమండలము నందు పడెడి సూర్యరశ్మికి 'సుషుమ్న' యని పేరు. అది కూడ గోశబ్దముచే చెప్పబడుచున్నది.

"చంద్రమా గౌరుచ్యతే" - చంద్రుడును పై వ్యుత్పత్తిననుసరించి గోశబ్దముచే చెప్పబడు చున్నాడు. "గౌరితి పృథివీనామధేయం" భూమి సూర్యునిచుట్టు తిరుగుచుండుటచే "గచ్ఛతీతి గౌః" అను వ్యుత్పత్తిచే భూమియు గోశబ్దముచే చెప్పబడుచున్నది.

"గౌరితి పశునామధేయం" - పశువగు గోవు బయలుదేరునపుడు ఒక్కమారు తలయెత్తి ఎచటికి వెళ్ళవలెనో చూచి స్వాభీప్సిత ప్రదేశమునకు మాత్రమే వెడలును. ఇది యితర పశువులకు లేని యసాధారణ లక్షణము. గోమయ, గోమూత్ర, గోక్షీర, దధి, ఘృతములకును గోవ్యవహారము కలదు. గోచర్మమునకును గోవ్యవహారము కలదు. కాన గో శబ్దమీవిధముగా అనేకార్థములను బోధించుచున్నది. వేదమునందీయర్థములకు ప్రయోజనము కలదు. ఇట్టి గో శబ్దమును ఆవు, కౌ, "గాయ్" పశుమాదు యిత్యాదిగా భాషాంతరీకరించినచో, సంస్కృత భాషలోని గో శబ్దము తెలిపినట్లుగా ఆధిభౌతిక, ఆధ్యాత్మిక, అధిదైవికార్థములనీ భాషాంతరీ కృత పదములు తెలియజాలవు. అపార్థములను మాత్రమే గ్రహించి తృప్తిచెందవలసి యుండును.

" య ఏవ వైదికాశ్శబ్దాః త ఏవ హి లౌకికే "

వేదమునందలి శబ్దములే లౌకిక సంస్కృతమునందలి శబ్దములు. వేదగత శబ్దము లన్నియు పరమాత్మను బోధించుటయే లక్ష్యముగా కలవి. ఈ విషయమునే జగద్గురువులు ఆదిశంకరులు, వ్యాసుడు మొదలగువారు "సర్వేశబ్దాః బ్రహ్మవాచకాః" శబ్దములన్నియు బ్రహ్మవాచకములని వివరించి భాష్యములలో ధ్రువపరచినారు. అట్టిచో లౌకిక సంస్కృత శబ్దములయొక్క లక్ష్యము కూడ పరమాత్మయే యగును. భాషాంతరీకరణముచే అలక్ష్యము చెడిపోయి, అపార్థ బుద్ధి మాత్రమే కలుగును.

వేదములందలి కథలకు, పురాణములందలి కథలకు సరస సమన్వయము కుదరదు. సమన్వయము లేనందుచే అన్నియు నక్లీలములుగానే యగుపించుతవి.

"సేతిహాసాః సపురాణాః వేదాః"

వేదములు యితిహాస పురాణ సహితములు. మన పురాణేతి హాసములకు బీజములు వేదమునందలి పురాణేతిహాసములే. వేదమునందలి ప్రతిపదము యిట్లనేకార్థ ప్రతిపాదక మగుటచే క్రాంతదర్శనులగు మహర్షులు ప్రకరణానుగుణముగా సరస సమన్వయము కావించుకొనగల్గుదురు. అట్లే పురాణములందలి కథలను సరస సమన్వయము చేసికొనవలె నంటే లౌకికసంస్కృత శబ్దముల యర్థమును వ్యుత్పత్త్యర్థ బలముచే నిర్ణయించుకొనవలెను. అట్లుగాక వ్యుత్పత్త్యర్థములను విడిచి భౌతికార్థమునే గ్రహించినచో కథాసమన్వయము కుదరకపోగా అపార్థదూషితములై, అపహాస్యములకు నిలయములై, సమాధానము చెప్పజాలని దయనీయస్థితి పొందవలసి వచ్చును.

భగవంతునకు "జారః" అని సార్థకనామము కలదు. ఇది యితర భాషలలో నింద్యార్థమును స్ఫురింపజేయును. అట్లే చోరశబ్దము. భగవంతుని జారుడని, చోరుడని కవులు వర్ణించు చుందురు. వేదమునందు "జార ఆభగం" అని కలదు. "అత్ర జారశబ్దేన ఆదిత్యఉచ్యతే" అని భాష్యకారులు, నిరుక్తము. "రాత్రేర్జరయితా ఆదిత్యఇత్యర్థః" - సూర్యుడుదయించి నంతనే రాత్రి యంతమగుచున్నది. ఇట్లే "మాత్రే జారః" అని అగ్నికిని, "దుహిత్రే జారః" అని బ్రహ్మకును, "స్వస్రే జారః" అని సూర్యునకు, పరమేశ్వరునకు, "సుభద్రాప్రాణనాథః" అని శ్రీకృష్ణునకు వ్యవహారములు కలవు. ఈ పదములనెట్లు భాషాంతరీకరించెదరు? ఒకవేళ భాషాంతరీకరణమే జరిగినచో లోకమునకు వారు తెలియజెప్పెడి అమూల్య రహస్యములేముండును? లోకమును పెడదారిన పట్టించుటేగాక వేదశాస్త్రపురాణేతి హాసాదు లయందప్రమాణ బుద్ధిని కల్పించుటయు, ప్రాచీనాచార సంప్రదాయములందు ఏహ్యాభావ మును కల్పించి ఆస్తిక్యభావమును నశింపజేయుటే ఫలితాంశమగును.

"స్వస్మిన్ధీయతే ఇతి స్వధా" - పరబ్రహ్మ స్వధా - త్రయీవిద్య - చతుర్వేదములు.

"యామ్నై రయం చంద్రమసీ స్వధాభిః" -అగ్నివాయ్వాదిత్యులు

"స్వధయా అన్నేనలక్షిత తద్భోగేన గృహీతః" - అని భాష్యకారులు.

స్వధా = అన్నం. "జీవో మృతస్య చరతి స్వధాభిః"

స్వధాభిః = విద్యాకర్మపూర్వ ప్రజ్ఞలు

జీవేశ్వరులు స్వధా శబ్దముచే చెప్పబడుచున్నారు. ఇట్లు భిన్నభిన్నార్థములను చెప్పి తుదకు పరంబ్రహ్మను ప్రతిపాదించు స్వధాశబ్దమునకు భాషాంతరీకరణ మేవిధముగా చేయగల్గుదురు? చేసినచో భాషాంతరీకృత పదములు ఆయా ప్రకరణానుగుణముగా ఈ పరమార్థమును తెలియ జేయు శక్తి కలిగియుండునా? కనుక వేదశాస్త్రములను భాషాంతరీకరించుట కంటే యథాస్థితముగా నధ్యయనము కావించి పరమార్థమును తెలిసికొనుటే పరమ పురుషార్థ మగును. శ్రేషమున్నూ.

# ప్రాచీన వృత్తులు - విద్యలు

ప్రాచీనకాలములో మన భారతదేశము వృత్తులు, విద్యలతో కళకళలాడుచు, అత్యంత సమర్థవంతమై, ప్రపంచములోని ఇతరదేశములకు ఆదర్శవంతముగాను, పరమ ప్రామాణికముగాను వెలిసినది. వేదవేదాంగములు, వ్యాకరణ, తర్క, మీమాంసా,వేదాంతాది అధ్యాత్మిక విద్యలు, వైద్యశాస్త్రము,కామశాస్త్రము, ధనుర్వేదాది విద్యలు, కమ్మరము, కుమ్మరము, కంచరము, నగలు, వాణెములు చేయుట, ఇండ్ల నిర్మాణము, వంతెనలు కట్టుట, చెరువులు త్రవ్వుట, దేవాలయ నిర్మాణము, బండ్లు,రథముల నిర్మాణము,వడ్రంగము, శిల్పములు చెక్కుట మొదలగు వృత్తులలో ప్రజలు నిష్ణాతులై యుండెడివారు. శాస్త్రవిద్యలు, పారిశ్రామిక, కుల, వృత్తివిద్యలు, అట్లే వృత్తులు, పరిశ్రమలతో గ్రామములు సర్వసమృద్ధములు, సర్వ సమర్థములై యుండెడివి.

ఒక్కొక్క వృత్తినవలంబించువారు కులమనే పేరుతో సంఘముగ నేర్పడిరి. కులములన్నీ కులవృత్తులతో బద్ధమైయుండెడివి. ఒక్కొక్క కులమువారు ఒక్కొక్క కళను, వృత్తిని, విద్యను కాపాడుకొనుచు, పోషించుకొనుచు ఆయావృత్తులతో జీవనము సాగించెడి వారు. కులమనగా సజాతీయ సంఘము. సద్గుణ, సదాచార సంపన్నవంశము. అట్టి వంశముల సంఘమున్నూ "సంఘేశక్తిః కలౌయుగే" అను యార్యోక్తిననుసరించి, సమాన ఆచార, వృత్తి, ప్రవృత్తులు గల నీకులములు తగాదాలు లేక పరస్పరము గౌరవించుకొనుచు, కలిసి మెలిసి యుండెడివి. "సమాన శీలవ్యసనేషు సఖ్యమ్" - కులముల మధ్య తగాదాకు తావు లేదు. ప్రొద్దుటినుండి సాయంత్రం వరకు వారు తమ వృత్తులలో, పనిపాటలలో మునిగి యుండుటచేత తగాదాల ప్రసక్తి లేదు. వచ్చినను వారిలో వారు పరిష్కరించుకొను సామర్థ్యము గలవారు.

వేదము -

"నమస్తక్షభ్యో రథకారేభ్యశ్చ వో నమోనమః। కులాలేభ్యః కర్మారేభ్య శ్చవో నమోనమః। పుంజిష్టేభ్యో నిషాదేభ్యశ్చవో నమః। ఇషుకృద్భ్యో ధన్వకృద్భ్యశ్చవో నమః।"

అనగా వడ్రంగులు, రథకారులు, కుమ్మరులు, కమ్మరులు మొదలగు వృత్తిమంతులందరు రుద్రస్వరూపులని, వారందరికి నమస్కారమని గౌరవించినది.

ఈ వృత్తిమంతులందరు పరిశ్రమల సంఘములుగాను, వారి గృహములన్నీ పారిశ్రామిక గృహములుగను ఏర్పాటు చేసికొని,చక్కనికట్టుబాట్లు నియమములతో నడుచుకొనేవారు. ఈవృత్తివిద్యలను నేడు సాంకేతిక విద్యలనుచున్నారు. ఈ వృత్తులు, వృత్తివిద్యలు భారతదేశమునకు పట్టుకొమ్మలుగా, వెన్నెముకగా నిలిచియున్నవి. ఫ్యాక్టరీలు, భారీ పరిశ్రమలు లేవు.

ఈ వృత్తివిద్యల నేర్చుకొనుటకు ఇప్పటివలె పూర్వము కళాశాలలుండేవి గావు.

నిపుణులైన వృద్ధులే కర్మాగారములు, వారే కళాశాలలు. గురువులు. వారి యిండ్లే పారిశ్రామిక కర్మాగారములు. అగురుకులములలో నా గురువులు తమ కులమందలి బాలబాలికల కాయా సాంకేతిక విద్యలలో తగు శిక్షణను ఇచ్చి, అపై క్రమశిక్షణను, మంచి విజ్ఞానమును, వినయ సంస్కారములను గుణములను వారిలోకి Injuct చేసేవారు. గురువులు తమ శిష్యుల వివేక, శ్రద్ధా, పాటవములను పరీక్షించి, తృప్తిజెంది, అపుడు వారికి వృత్తివిజ్ఞాన రహస్యములను ఉపదేశించెడివారు. పారితోషికముల (Prise) నిచ్చెడివారు. ఆ పరీక్షలెంతో కఠినముగా నుండెడివి. శిష్యులు పరీక్షలలో నుత్తీర్ణులయ్యేడివారు. నేటివలె ప్రశ్నాపత్రములు Leak అగుట, కాపీచేయుట వంటి సులభపద్ధతులు వారికి తెలియవు. నేడు పరీక్షలో పాస్ అగుట చాలా సులభము.

గురువు అంటే -

'గుకారస్త్వంధకారః స్యాత్ రుకారస్తన్నిరోధకః"।
గుకారస్వదితి ప్రోక్తః రుకారోజ్ఞాన వాచకః ॥ -శక్తి రహస్యమ్.

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుః సాక్షాత్పరంబ్రహ్మా తస్మై శ్రీ గురవే నమః ।
"యథా ఘటశ్చ కలశః కుంభశ్చైకార్థ వాచకాః ।
తథా మంత్రోదేవతాచ గురుశ్చైకార్థ వాచకాః ॥

-సుందరతాపనీయోపనిషత్.

"మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ"

- అని తైతిరీయశ్రుతి.

భారతీయ సాంప్రదాయమున దేవులు నల్గురని తెలియనగును. 'వేదము' - తల్లి,తండ్రి, గురువు, అతిథి' అని యీ నల్గురను నల్గురు దేవులని బోధచేస్తున్నది. అందు గురువు బ్రహ్మ, విష్ణు, మహేశ్వర స్వరూపుడు. గుకారము అంటే చీకటి. రుకారము చీకటిని పారద్రోలునది. కావున 'గురు' అనగా చీకటిని పారద్రోలి జ్ఞానమును ప్రసాదించు జ్ఞానదీపము - జ్ఞానజ్యోతి - అని శక్తి రహస్యగ్రంధము చెప్పచున్నది. గుకారము 'సత్' అనగా బ్రహ్మయని, రుకారము జ్ఞానవాచకమనీ, కాన గురువనగా బ్రహ్మజ్ఞానమును గల్గినవాడు. సంస్కృతభాషలో ఎట్లు ఘట,కలశ,కుంభ శబ్దములు ఘటమని ఒకే అర్ధమునిచ్చునో అట్లే మంత్ర, దేవతా,

గురు శబ్దములు 'గురు'వని ఒకే అర్థమును చెప్పునవి అని సుందరతాపనీయోపనిషత్ ద్వారా తెలియనగును. అట్టి గురువులు తమ శిష్యులకెంతో విజ్ఞానము ప్రసాదించి, వారిని ప్రజ్ఞావంతులుగా చేయవలెనని ఎంతో తపనపడెడివారు. అట్టి గురువులు నేడు చాలా అరుదు. దొరుకుట కష్టము.

ఆ గురువులచే సుశిక్షితులై, ప్రజ్ఞావంతులైన నా బాలబాలికలు సంస్కారక్రమసంపన్నులై మంచి అనుభవమును, ప్రావీణ్యము సంపాదించుకొనేవారు. వారు గురువును మించిన శిష్యులుగా తయారయ్యేడివారు. 'శిష్యాదిచ్ఛేత్ పరాజయమ్' - అనగా శిష్యులు తమకన్న గొప్పవారై తమని ఓడించాలని గురువుల యాశలు సఫలీకృతమయ్యేడివి. శిష్యులనట్లు తీర్చిదిద్దుటకై, బరువు, బాధ్యత, శ్రద్ధ, జాగ్రత్త వహించి కష్టపడిన యా గురువులు, తమ శిష్యుల చూచి గర్వపడేవారు.

వృత్తివిద్యలుగాని మరేవిధమైన విద్యలుగాని, వృత్తులుగాని నేర్చుకొను విద్యార్థులు తమ వినయవిధేయతలు, భక్తిశ్రద్ధలు, శుశ్రూషలతో గురువుల మెప్పించి, వారుపెట్టు కఠోర పరీక్షలకు నిలబడి, గురువుల నుండి అపారమైన విజ్ఞానసంపదను, సిరిసంపదలను సంపాదించెడివారు. పాపము! పూర్వపు విద్యార్థులకు సమ్మెలు, నిరాహారదీక్షలు తెలియవు. చదువుకొనుట, పనులను నేర్చుకొనుట, పనులలో మునిగితేలుట, పరిశోధనలు చేయుట, కొత్త కొత్త విషయముల సంపాదించుట, కొత్త కొత్త నాణ్యమైన వస్తువులను తయారుచేయుట. ఇవే వారికి తెలిసింది. అందుచే వారి విద్య స్వానుభవముతో గూడినదగుట చేత నయ్యది వారికిని ప్రపంచమునకు ఉపయోగపడేది. అందుచే ప్రశాంత, సుఖజీవనము, ధార్మికచింత అనాటి వారి సొత్తు. నిరుద్యోగ సమస్యకు తావు లేదు.

ఏవిద్య యందైననూ, ఏ వృత్తియందైననూ నిపుణులైన వారెక్కడ ఉంటే అక్కడకు పోయి విద్యార్థులాయా విద్యలను, వృత్తులను నేర్చుకొనెడివారు. తండ్రియొద్ద కొడుకుగాని, అన్న వద్ద తమ్ముడుగాని నేర్చుకొనునంతకాలము బంధుభావముతో గాక గురుశిష్య భావముతో మెలిగేవారు. ఆ కర్మాగారములనుండి బయటికి వచ్చినచో గురుశిష్య భావము వీడి బంధుభావముతో మెలిగేవారు. పూర్వము సమష్టి కుటుంబములుండేవి. తండ్రి కుటుంబ మునకు పెద్ద. గురువున్నూ, తండ్రి లేనిచో అన్న. అట్టి తండ్రులు, కొడుకులు, అన్నలు, తమ్ములు, గురువులు, శిష్యులు, సమష్టి కుటుంబములు, చదువులు, వృత్తులు ఇంచు మించు లేనట్లే. దొరకునా అటువంటివి? కనీసం కనబడునా?

నేటి చదువులు ఎంతవరకు ఉపయోగపడుచున్నవో, ఎవరికుపయోగపడుచున్నవో అను ప్రశ్నకు సమాధానము అయోమయము, భయంకరమున్నూ. అట్లే వృత్తులున్నూ. చదువునదొకటి. పనిచేయుట వేరొక విషయములో. చదివిన చదువునకు, పనికి సంబంధము

లేదు. కాన వా చదువు తనలో ఇంకిపోవలసినదే. ఈనాటి చదువులు గుమాస్తాలను తయారుచేయుచున్నవిగాని తమ కాళ్ళమీద తాము నిలబడుటకు ఉపయోగపడుట లేదు. ఉపయోగపడవు. గుమాస్తా ఉద్యోగము గూడ సంపాదించుకొనుట కష్టమే. ఒకవేళ గుమాస్తా ఉద్యోగము వచ్చిననూ, కుమారుని చదువు, వృత్తుల విషయం మరల ప్రశ్నయే? ఏమి చదవాలి? ఏ పని చేయాలి? పూర్వపురోజులలోనయితే వృత్తులకు, విద్యలకు వెతుక్కోవలసిన అగత్యముండేదిగాదు. తండ్రి తరువాత కుమారునికి, అన్న తరువాత తమ్మునికి పారం పర్యంగా వచ్చును. లేదా అట్టి వృత్తి మరియొకటి నేర్చుకొని, స్వయంకృషితో సంపాదనాపరులై కష్టములను, నిరుద్యోగ సమస్యను ఎదుర్కొనెడివారు.

నేడు హెచ్చు భాగం విద్యార్థులు గుమాస్తా చదువులలో నున్నారు. ఇంజనీర్లు, డాక్టర్లు గూడ ఉద్యోగాన్వేషణలోనున్నారు. స్వయం ఉపాధి, స్వయంకృషి చేబడదామను ప్రయత్న లేశము గూడ లేదు.

వృత్తివిద్యల నభ్యసించుటకు కుదరనివారు కాలక్షేపమునకు ఏదో చదవక తప్పదు. కాలక్షేపమునకై చదివినవారు నిరుద్యోగులుగా మిగిలిపోవుచున్నారు. ఏ వృత్తి , ఉద్యోగము లేనిచో తీరికగా కూర్చున్న యువతీయువకుల మనస్సులు వారి చెప్పుచేతలలో నుండవు. ఆ మనస్సు దయ్యమై వారిని పెడత్రోవ పట్టించును. A Lazy man's mind is devils Laboratory అని పెద్దలు అందుకే చెప్పారు. అందుకనే

"ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీః - కృషితో నాస్తి దుర్భిక్షమ్"

అని తెలిసికొన్నవారు ధన్యులు. అందుచే ప్రతిమానవునికి విద్యగావాలి. వృత్తి గావాలి. ఏరకమైన విద్య గావాలి? ఏరకమైన వృత్తి కావాలి?

విద్యార్థి అంటే విద్యను అర్థించువాడు. "విద్యాచ అర్థశ్చ విద్యార్థౌ. తావస్యస్త ఇతి విద్యార్థీ". విద్యను, అర్థమును సంపాదించుకొన్నవాడు విద్యార్థి. అర్థమనగా ధనము, పరమార్థ మున్నూ. పరమార్థమంటే బ్రహ్మ. కాబట్టి నిజమైన విద్యార్థి యంటే బ్రహ్మవిద్య నర్థించువాడు. సంపాదించువాడు. ఈ విద్యయే నిజమైన విద్య. ఇతర విద్యలు కేవలం ధనసంపాదనకు, భౌతిక విజ్ఞాన ప్రాప్తికి ఉపయోగపడును. బ్రహ్మవిద్య లేక వేదవిద్య, మంచి వివేకమును, ప్రబోధమును, విజ్ఞానమును, అతీంద్రియ విజ్ఞానమును, వినయమును, సంస్కారమును సంపాదించిపెట్టును.

" సమ్యగారాధితా విద్యా ప్రబోధవినయావివ" - రామాయణమ్.

బాగుగ నారాధింపబడిన, అభ్యసింపబడిన విద్య, వివేక,వినయములనిచ్చునని రామాయణ ప్రబోధము. వివేక వినయముల నిచ్చునదే నిజమైన విద్య.

"విద్యా దదాతి వినయం వినయాద్యాతి పాత్రతామ్
పాత్రత్వాద్ధనమాప్నోతి ధనాద్ధర్మం తతస్సుఖమ్॥" -భర్తృహరి సుభాషితమ్.

మంచి విద్యవలన వినయము, వినయముచే నందరిచేత మెప్పు, ఆ మెప్పుతో ధనము, ధనముతో ధర్మము, ఆ ధర్మము వలన సుఖశాంతులేర్పడును అని అర్థము.

క్షణశః కణశశ్చైవ విద్యామర్థంచ సాధయేత్ ।
క్షణే నష్టే కుతో విద్యా? కణే నష్టే కుతో ధనమ్॥"

ప్రతిక్షణము విలువైనది. పోయిన క్షణము తిరిగి రాదు. అట్టి ప్రతిక్షణములోను విద్యను సాధించాలి. ఆ క్షణము గడిచిపోతే చదువెక్కడ? క్షణము పోతే చదువుపోతుందనే బాధతో నెలాగయినా కష్టపడి విద్యను సాధించాలి. అట్లే ప్రతికణము విలువైనది. ప్రతికణంలో నుండి ధనము లాగాలి-సంపాదించాలి. ఆకాస్త కణం చేజారితే ధనము చేజారిపోవును. అందుచే కష్టించి ప్రతికణం నుండి ధనమును పిండాలి. అపుడు గద! 'కష్టే ఫలీ'. కష్టపడిన వారికి మంచి ఫలితము తప్పక లభించును.

మానవుని జీవితములో బాల్యదశ మిగుల విలువైనది. విషయగ్రహణమునకు ధారణశక్తి అవసరము. బాల్యదశ అట్టి ధారణమునకనుకూలమైనది. అట్టి దశలోనే సరియైన విజ్ఞానబీజములు పడవలెను. మంచి పునాది పడవలెను. ఆ పునాదిమీద బాలబాలికల భవిష్యత్తు, భవిష్యత్తులో వారు సాధించు విజయములాధారపడి యున్నవి. చిన్నతనములో కాలమును వ్యర్థపరుచుకొని తరువాత పరితపించి ప్రయోజనము లేదు. చిన్నతనంలోనే విద్య వశమగును కాని వయసు మీదపడుచున్న కొలది విద్య వంటబట్టుట కష్టము. అనలు అంటనే అంటదు. అంటకపోగా అది విషము అగును. 'ఆకొన్న కూడె యమృతమ'ని సుమతి శతక వచనము. బాగుగ ఆకలియున్నపుడు తిన్న అన్నము అమృతమగును. ఆకలి లేనపుడు తిన్నచో నది అజీర్ణమై, విషమగును. అట్లే - ఏవిద్యయయిననూ సరే

"అనభ్యాసే విషంశాస్త్రం అభ్యాసేత్వమృతం మతమ్" అభ్యాసము లేకున్న, మనసు లేకున్న, విషయగ్రహణశక్తి లేకున్నచో నావిద్య విషమే. అట్లుగాక అభ్యాసము, మంచిమనసు, శ్రద్ధ, పట్టుదల యున్నచో నది అమృతమే.

నేడు అట్టి శ్రద్ధ, గురువులయెడ భక్తి, భయము, గౌరవము, ఆసక్తి లోపించినవి. ఈరోజులలో చదువకపోయినా, కళాశాలలకు పోకపోయినా ఇబ్బందిలేదు. సులభ పద్ధతులు చోటుచేసుకొన్నవి. అతి సులభముగా పట్టభద్రులగుచున్నారు. కావున చదువు,పని సన్నగిల్లినవి. విద్యార్థికి విద్యార్థిలక్షణములు నశించినవి. స్వశక్తి, స్వయముగా ఆలోచించు

సామర్ధ్యమును క్షీణించిపోవుచున్నవి. రానురాను విజ్ఞానవంతమైన, వీర్యవత్తరమైన సమాజము, విజ్ఞానరహితమై, నిర్వీర్యమై పోవుచున్నది. విద్యాసంస్థలో సమ్మెలుచేయుట, దురభ్యాసములపాలగుట, తరగతులు వదిలి యథేచ్ఛముగ, స్వైరముగ తిరుగుట, అనవసర విషయములలో జోక్యము చేసికొనుట మొదలగునవి చోటుచేసుకొన్నవి. ఇట్టి స్థితి కడు శోచనీయము.

నేటి విద్యార్థులే రేపటి పౌరులు. కావున విద్యార్థులు వివేకముతో విధులను బాధ్యతల గుర్తించి, సంస్కారవంతులై, సన్మార్గప్రవర్తకులై ఇతరులకు మార్గదర్శకులు గావలెను. విద్యాలయముల పవిత్రదేవాలయములుగ దర్శించి, అహంకారదూరులై, తామసప్రవృత్తిని వీడి, వినయమూర్తులై, చక్కటి విద్యను, ఉన్నతవిద్యనభ్యసించి, వృత్తిమంతులై, భారతదేశమునకు పూర్వపు ఔన్నత్యమును వేదమాత, పరమేశ్వరుల (విద్య, అర్థ) ఆశీస్సులతో సంపాదించిపెట్టుదురుగాక!

అచార్యః పూర్వరూపమ్। అంతేవాస్యుత్తర రూపమ్।
విద్యాసంధిః । ప్రవచనగ్ం సంధానమ్॥
సహనావవతు। సహనౌభునక్తు । సహ వీర్యం కరవావహై।
తేజస్వి నావధీతమస్తు। మా విద్విషావహై ।

*ఓం శాంతిః శాంతిః శాంతిః*





# నవరాత్రులు - వైదిక తత్త్వము

భారతీయుల పండుగలలో దసరా పండుగలు ప్రాచీనములు, ప్రధానములు. ఆ పండుగరోజులను ప్రజలానందంగాను, అత్యంత వైభవంగాను గడుపుదురు. వ్రతదీక్షబూని జన్మ పావనం చేసికొందురు. దసరాను సరదాగా చేసికొందురు. ఈ వ్రతమునకు "నవరాత్రవ్రత" మని పేరు. ఈ వ్రతమునాచరించి ఎందరెందరో తరించిరి. ఈ వ్రతాచరణము వలన పాపములన్నీ భస్మమగునని దేవీభాగవతాది పురాణములు ప్రబోధించుచున్నవి.

"మహాపాతక సంయుక్తో నవరాత్రవ్రతం చరేత్।
ముచ్యతే సర్వపాపేభ్యో నాత్రకార్యా విచారణా"

ఈ వ్రతము శరత్కాలంలో నాచరింపబడుచున్నది. వసంతఋతువులో గూడ వసంత నవరాత్రవ్రతం చేయబడుచున్నది.

"ద్వావృతూ యమదంష్ట్రాఖ్యౌ నూనం సర్వ జనేషు వై।
శరద్వసన్త నామానౌ దుర్గమౌ ప్రాణినామిహ॥
ద్వావేవ సుమహాఘోరౌ ఋతూ రోగకరౌ నృణామ్।
వసన్త శరదావేవ జననాశకరావుభౌ॥
వైద్యానాం శారదీ మాతా పితా తు కుసుమాకరః।"

-దేవీ భాగవతమ్

శరద్వసన్తాలు రెండును యముని కోరలు. ప్రాణులకు దుఃఖహేతువులు, మహాఘోరమైనవి, రోగకారకములు, జననాశకరములు. వైద్యులను శరత్కాలము తల్లివలె, వసన్తకాలము తండ్రివలె కాపాడును. అనగా ప్రజలా ఋతువులలో వ్యాధిపీడితులై సర్వదా వైద్యముకోసం తిరుగుతూ వైద్యులను పోషించుచున్నారు. అని అర్థము.

"శృణాతి పంకం ఇతి శరత్" అని వ్యుత్పత్తి బురదను పోగొట్టి నిర్మలముగా నుంచునది 'శరత్' అగును.

"అకర్దమ మిదం తీర్థం భరద్వాజ నిశామయ।
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా"

- రామాయణమ్.

బురద లేకుండక ప్రసన్నమైన, నిర్మలమైన జలములతో నీతీర్థము-పాపపుటాలోచనలు లేక నిర్మలమైన సత్పురుషుని మనస్సువలె బహురమణీయముగ నున్నదని యర్థము. "శీర్యతే ఇతి శరత్" అని నింకొక వ్యుత్పత్తి. నశించి రాలిపోవుకాలమని యర్థము. "శీర్యతే

ఇతి శరీరం" శరీర శబ్దానికిగూడ నిదే వ్యుత్పత్తి గనుక శరీర-శరత్ పదములు సమానార్థకములు.

శరత్కాలము ప్రత్యక్షముగా శివమయము అనగా రుద్రమయమని నారాయణ తీర్థులవారు చెప్పిరి.

" భోభో వ్రజపుర నార్యః శారద సమయం పరం శివం మత్వా"

"శంకే శంకరం శారద సమయం"

- కృష్ణలీలా తరంగిణి.

శరత్కాలం రుద్రరూపము అంటే జనప్రాణహరము అని, శివరూపము, శంకర రూపమంటే ప్రజల మనోమాలిన్యం అనే బురదను నిర్మూలించి వారికి మంగళకరమగుననీ తెలియనగును. అట్టి యీ శరత్కాలములో ఆశ్వయుజమాసంలో నవరాత్ర విధిఉత్తమోత్తమము, ఉత్తమజన్మ కారకము, సదాచార ప్రవర్తకమనీ సర్వవ్యాధినివారకమనీ, సర్వోప్రదవ నాశకమనీ దేవీ భాగవతం బోధిస్తున్నది.

నవరాత్రవ్రతం చైవ విధేయం విధి పూర్వకమ్॥
జపేన్నవాక్షరం మంత్రం సతతం ధ్యానపూర్వకమ్॥
నవరాత్రవ్రతం కుర్యాన్నర నారీగణశ్చ యః॥
వాంఛితం ఫలమాప్నోతి సర్వదా భక్తితత్పరః॥
అశ్వినే శుక్లే పక్షేతు నవరాత్ర వ్రతం శుచిః
కరోతి భావ సంయుక్తః సర్వాన్కామాన వాప్నుయాత్ ॥
నవరాత్రవ్రతం పుణ్యం వ్రతానా ముత్తమోత్తమమ్।
శుద్ధో2యం కురుతే భక్త్యా సర్వవ్యాధి నివారకమ్॥
జన్మోత్తమ కులే ప్రాప్య సదాచారో భవేన్నరః॥

- దేవి భాగవతమ్

సర్వరోగోపశమనం సర్వోపద్రవ నాశనమ్
శ్రద్దిదం సర్వారిష్టానాం నవరాత్రవ్రతం శుభమ్॥

- స్కాంద పురాణమ్.

అవ్రతములో నవాక్షరములతో గూడిన దేవీ మంత్రమును జపించాలి.

మానవులను శీతోష్ణములు బాధించును. శీతబాధా నివారణకు శరన్నవరాత్ర వ్రతము, ఉష్ణబాధా నివారణకు వసన్త నవరాత్ర వ్రతము నాచరించినచో మానవులే గాదు, దేవతలు గూడ అమృతత్వము నొందెదరని వేదము ప్రబోధించుచున్నది.

"నవరాత్రేణ వై దేవా అమృతత్వ మానశుః"

- తాండ్య మహాబ్రాహ్మణమ్.

ఇక నవరాత్ర మనగానేమి? రాత్రి, నవశబ్దముల విచారించుదాము.

రాత్రి సూక్తము రాత్రి దేవతను ప్రతిపాదించును. రాత్రి దేవతలిరువురు. జీవితమునకు సంబంధించినది ఒకటి, ఈశ్వర సంబంధమైనది రెండవది. మొదటి దేవత యొక్క అనుభవమునందరు ననుభవింతురు. తత్సంబంధముచేత ప్రతిదినము, సమస్త వ్యవహారములు లుప్తమగుచుండును. ఏ రాత్రియందీశ్వరుని వ్యవహారము లుప్తమగునో నా రాత్రిని ఈశ్వరరాత్రి యందురు. ఆ రాత్రినే మహాప్రళయమనీ, కాలస్వరూపమని అందురు. ఆ సమయమున మరొక వస్తువేదీ ఉండదు. మాయతో గూడిన బ్రహ్మ మాత్రమే ఉండును. ఆ బ్రహ్మ యొక్క మాయయే 'రాత్రి' అని పిలువబడుచున్నది.

" బ్రహ్మ మాయాత్మికా రాత్రిః పరమేశలయాత్మికా।
తదధిష్ఠాతృదేవేశీ భువనేశీ ప్రకీర్తితా॥

- దేవీపురాణమ్

బ్రహ్మ మాయాత్మికయు, లయాత్మికయునగు 'రాత్రి'కి అధిష్ఠాన దేవతయే 'భువనేశ్వరి' యని కీర్తింపబడుచున్నదని అర్థము.

" రాత్రి వ్యఖ్యదాయతీ పురుత్రా దేవ్యక్షభిః విశ్వా"

- వేదము.

జీవుల కర్మలు ఫలోన్ముఖములు, పరిపక్వములు కానపుడు వానిని తనలోనే లయం చేసికొని, సమయం వచ్చినపుడు మరల జీవులను సృష్టించి వారి కర్మలకు ఫలమునిచ్చు యా దేవతనే రాత్రి రూపిణి యగు చిచ్ఛక్తిగా వ్యవహరించుదురని మంత్రార్థము. ఈ రాత్రి దేవతయే ప్రకృతియట.

"ప్రకృతి స్త్వంచ సర్వస్య గుణత్రయ విభాగినీ।
కాళరాత్రి ర్మహారాత్రిర్మోహ రాత్రిశ్చ దారుణా॥"

ఆ రాత్రి దేవియే సత్త్వ, రజస్తమో గుణములతో మహాసరస్వతి, మహాలక్ష్మి, మహాకాళి రూపములతో నారాధింపబడుచున్నది. ఆమెయే కాలరాత్రి, శివరాత్రి, మహారాత్రి, మోహరాత్రి యనీ కీర్తింపబడుచున్నది. మోహరాత్రి యనగా కృష్ణాష్టమినాడు రాత్రి పుట్టి, కంసాదులను మోహింపచేసి, శ్రీకృష్ణుని నందుని ఇంటికి తీసికొనిపోవుటకు సాయపడిన జగన్మాత. యోగమాయ.

"కాలరాత్రిం బ్రహ్మసంస్తుతాం వైష్ణవీం స్కందమాతరమ్।
సరస్వతీ మదితిం దక్ష దుహితరం నమామః పావనాం శివామ్॥"

అను వేదమంత్రము కాలరాత్రి యనగా లక్ష్మీ, సరస్వతి, పార్వతియని తెల్పుచున్నది. వైష్ణవి అంటే లక్ష్మి. స్కందమాత అంటే పార్వతి.

"యో రాత్రౌ చక్రరాజస్థామర్చ యేత్పర దేవతామ్।
స ఏవ లలితా రూపః తద్రూపా లలితా స్వయమ్"

-లలితా సహస్రనామ భాష్యమ్.

రాత్రియందు శ్రీచక్రరాజమండలి లలితాదేవిని ఎవరు పూజింతురో వారు లలితా స్వరూపులగుదురు. లలితాదేవి వారి స్వరూపముగలదియగునని యర్థము.

ఇట్లు రాత్రి శబ్దమునకు 'రాత్రి' యనే యర్థమును గ్రహించి కొందరు రాత్రిపూట పూజ చేయుచున్నారు. "నవా హెరారాత్ర" దీక్షయని రాత్రిం పగళ్ళు పూజచేయువారు కొందరు. "అష్టరాత్రౌ నదోషో2యం నవరాత్ర తిథిక్షయే" అని నిర్ణయసింధు ధర్మశాస్త్ర ప్రమాణముచే రాత్రి యనగా తిథియని యర్థము. "రాత్రశబ్దస్య తిథి వాచకత్వాత్" అని వ్యాఖ్యానము. "తిథిశ్శరీరం దేవస్య" అనిగూడ చెప్పబడుటచే తిథి అంటే దేవుని శరీరమని, కావున రాత్రి అనేది దేవుని శరీరమని అర్థము తెలియును. రాత్రి శబ్దమునకు "దివస"మని యర్థము నిర్ణయసింధువు ద్వారా గోచరించుచున్నది. కాన నవరాత్ర వ్రతమనగా తొమ్మిది దినములు చేయు వ్రతమని యర్థము. "అష్టరాత్రౌ న దోషో2 యం" అని, "త్రికాలం పూజయేత్" అని స్మృతి వాక్యముల ద్వారా తిథులు తక్కువైనను, ఎనిమిది తిథులు (ఎనిమిది రాత్రులు) వ్రతమాచరించిన నవరాత్ర వ్రతమే యగును. ఎనిమిది, తొమ్మిది రోజులు చేయలేక మూడు రోజులు ఆచరించినను నవరాత్రవ్రతమేయగునని చెప్పబడుచున్నది. ఈవిధముగ ప్రతి పత్తునాడు (పాడ్యమి) మొదలుపెట్టి నవమినాటితో వ్రత సమాప్తి చేయవలెను. కనీసం ఒక్కరోజు ఆచరించిననూ నవరాత్ర వ్రతమగును.

"ప్రతిపచ్ఛారదీం జ్ఞాత్వా సో 2 శ్నుతే సుఖమవ్యయమ్" - నిర్ణయసింధువు. ప్రతిపత్తు నాడు శారదాదేవి నర్చించినవాడు శాశ్వత సుఖమందును. ప్రతిపత్ అంటే బుద్ధి అని అర్థము గలదు. "ప్రతి పదేవ శారదా । ప్రతి పద్రూపాశారదా।" అనగా ప్రతి పత్తు శారద - శారద ప్రతి పద్రూపిణి అని అర్థము.

" బుద్ధిర్మనీషా ధిషణా ధీః - ప్రతిపత్ జ్ఞప్తిచేతనాః" - అమరకోశము.

మానవులు బుద్ధియే శారదయనీ, శారదయే బుద్ధియని గ్రహించి,తమ బుద్ధిని శారదాదేవి అనుగ్రహంతో సరిదిద్దుకొని చక్కని మేధావంతులై సుఖము పొందెదరు. ప్రతిపత్తునాడు (పాడ్యమినాడు) శారద నర్చించిన వాతని బుద్ధి శారదయే యగును. అనగా శివమయ మగును. మంగళకరమగును. మనోమాలిన్యరహితమై, నిర్మలమైన బుద్ధి మనుష్యుని సన్మనుష్యుని చేయును. రాత్రి శబ్దమునకు దేవియని పరమేశ్వరియని యర్థముగలదు.

"అశ్వినే మాసి మేఘాన్తే ప్రతిపద్యా తిథిర్భవేత్।
తస్యాం నక్తం ప్రకుర్వీత రాత్రి దేవీంచ పూజయేత్"॥

వర్షాకాలం చివర అశ్వయుజ శుద్ధ ప్రతిపత్తునాటి రాత్రి, రాత్రి దేవిని పూజించవలెనని యర్థము. కాన ఇచట రాత్రియొక దేవతగా చెప్పబడినది.

"రాత్రి రూపా యతో దేవీ దివారూపో మహేశ్వరః"
రాత్రి వ్రత మిదందేవి సర్వపాప ప్రశమనమ్"॥.

పరమేశ్వరి రాత్రి రూపిణి-పరమేశ్వరుడు దివా రూపుడు. దివా అంటే పగలు. ఆ పరమేశ్వరీ పూజయే రాత్రి వ్రతము. రాత్రి వ్రతము పరమేశ్వరీ వ్రతము.

"నిశా నిశీధిని రాత్రిః- విభావరీ తమస్వినీ"

- *అమరకోశము.*

"అంబికా కైతవే సిద్ధౌ నిద్రాయాం నిశికీర్త్యతే"

- *విశ్వకోశము.*

రాత్రికి నిశా అని విభావరియని పేర్లు. అట్లే నిశాయంటే "అంబికా" అని విశ్వకోశము చెప్పుచున్నది. అంబికా అంటే జగదంబయే. లక్ష్మీ అష్టోత్తరశతనామములో -"వాచం పద్మాలయాం పద్మాం శుచిం స్వాహాం స్వధాం సుధామ్ । ధన్యాం । హిరణ్మయీం లక్ష్మీం నిత్యపుష్టాం విభావరీమ్" అని గలదు. లక్ష్మీదేవియే రాత్రిదేవి, స్వాహాదేవి, వేదవాక్కు అని అర్థము. ఈ దేవి "నిత్యపుష్ట" అని గూడ పిలువబడుచున్నది. నిత్యము, సుఖము నిచ్చి పోషించునదియని యర్థము. "రాతి సుఖం ఇతి రాత్రిః" అను వ్యుత్పత్తి నిత్యము సుఖమిచ్చునది రాత్రియని తెల్పుచున్నది. సామాన్యుల దృష్టిలో రాత్రి తాత్కాలికంగా భౌతిక సుఖమిచ్చు రాత్రియే. కాని వైదిక దృష్టిలో, యోగుల దృష్టిలో నా రాత్రి శాశ్వతసుఖమునిచ్చు రాత్రి దేవత-లక్ష్మీదేవిగను, సరస్వతిగాను, అంబికా అనగా దుర్గ, కాళికాగాను తుదకు వేదవాణిగను గోచరించును. ఆ రాత్రి దేవియే నవదుర్గ, మహాకాళి.

"నవదుర్గాం మహాకాళీం బ్రహ్మావిష్ణు శివాత్మికామ్"

- *లక్ష్మీ అష్టోత్తరశతనామావళి.*

ఆ రాత్రి దేవత బ్రహ్మ, విష్ణు, మహేశ్వర స్వరూపిణియగు మహాలక్ష్మీదేవియే, కనుక రాత్రి వ్రతమనగా రాత్రిపూట పూజయని మాత్రమేగాక మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి రూపిణియగు మహారాత్రి దేవీవ్రతము. ఆ మహారాత్రి దేవతయే జగదంబ-గాయత్రి-వేదమాత.

భగవద్గీతలో రాత్రి (నిశా)ని గూర్చి కృష్ణపరమాత్మ ఇట్లు ప్రబోధించినాడు.

"యా నిశా సర్వభూతానాం యస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః"॥

సాధారణముగ ప్రాణికోటి దృష్టిలో రాత్రి రాత్రియే. ఆత్మజ్ఞానము లేనివారికి రాత్రి యొక్క యదార్ధ స్వరూపము గోచరించదు. అపుడు యోగులైనవారు ఇంద్రియనిగ్రహము గలవారై రాత్రిదేవత యొక్క యధార్ధ స్వరూపమును దర్శించగల్గుదురు. అపుడా రాత్రి వారికి పగలు అగును. అజ్ఞులు, ఇంద్రియ నిగ్రహము లేనివారు పగలు సాంసారిక వ్యవహార ములలో తిరుగుచుందురు. విజ్ఞులైన యోగులు సాంసారిక వ్యవహారములకు దూరముగా నుండి కళ్ళు మూసుకుని ధ్యాననిమగ్నులై యుందురు. వారికి బ్రహ్మయందే దృష్టి. కనుక వారికి అపుడు పగలు రాత్రి యగును.

కావున జ్ఞానహీనులగు సంసారులకు ఆత్మ రాత్రి వంటిది. జ్ఞానులకు సంసారము రాత్రి వంటిది. ఇట్లు ఈ రెండు రకములైన రాత్రి స్వరూపుడు పరమేశ్వరుడు అని విష్ణుసహస్రనామ స్తోత్రము దాని శంకర భాష్యముల ద్వారా తెలియును.

"శబ్దాతిగః శబ్దసహః శిశిరః శర్వరీకరః" శర్వరి అంటే రాత్రి.
"సంసారిణామాత్మా శర్వరీ.జ్ఞానినాంతు సంసారః
శర్వరీ। తాముభయేషాం కరోతీతి శర్వరీకరః"

-అని శంకరభాష్యము.

"కాలరాత్ర్యాది శక్త్యాదివృతా స్నిగ్ధౌదనప్రియా" అని లలితాసహస్రనామములో లలితా దేవికి కాలరాత్రి అను శక్తిగలదని చెప్పబడుచున్నది. రామాయణంలో హనుమంతుడు రావణాసురునికి జ్ఞానబోధచేస్తూ సీతాదేవి కాలరాత్రి స్వరూపిణి, విద్యాదేవతయగు వేదమాతయని హెచ్చరికలు చేసెను.

"తదలం కాలపాశేన సీతావిగ్రహరూపిణీమ్।
కాలరాత్రీతి తాం విద్ధి సర్వలంకా వినాశినీమ్॥

- రామాయణమ్.

సీతాదేవి కాలరాత్రి. కాలరాత్రియే సీతావిగ్రహరూపంలో నున్నది. ఆమె జోలికిపోయినను అవమానించినను మొత్తం లంకను భస్మము చేయును. నిన్ను సర్వనాశనము చేయును. అయితే -

సమ్యగారాధితా విద్యాప్రబోధ వినయావివ "బాగుగ నారాధింపబడినచో నా సీత, వేదవిద్య జ్ఞానము, వినయములవిచ్చునట్లు గాపాడునని చెప్పను. కాలరాత్రియగు సీతయే వేదవిద్య- ఇక్కడ విచారణ చేద్దాము.

"కలఏవ కాలః (స్వార్థేఅవ్ ప్రత్యయః)

"ధ్వనౌతు మధురాస్ఫుటే కలః" అని అమరకోశము. "కం సుఖం లాతీతి కలః" కల అనగా సుఖమును ఇచ్చునది అని అర్థము.

మధురః అస్ఫుట ధ్వనిః కలః - సఏవ కాలః

అని సౌభాగ్య భాస్కర వ్యాఖ్య. కలయన అస్ఫుటమైన మధురధ్వని. ఆ కలయే కాలము. సృష్ట్యాది యందు వేదములు ముందుగా ఓంకారధ్వనిగా అవిర్భవించినట్లును, ఆ ధ్వనియే నాదమని -అది కల కల ధ్వని యనియు, అదే కాలస్వరూప ధ్వనిగా చెప్పబడుచున్నది. కావున కాలమన వేదధ్వని యగును. ఆ వేద ధ్వనియే రాత్రి. ఆ కాలరాత్రి యనెడి శక్తితో లలితాదేవి యున్నదని యర్థము. దీనినిబట్టి రామాయణంలో సీతను కాలరాత్రిగా వర్ణించుటను బట్టి-వేదము రాత్రి స్వరూపిణియని కాలరాత్రి యనగా వేదశక్తి యనియు తెలియనగును. వేద నిందకులను వేదశక్తి నాశనము చేయగలదు. వేదమును చక్కగా అరాధించిన ప్రబోధ వినయములను-జ్ఞానమును, వివేకమువిచ్చి పోషించి శాశ్వత సుఖమునీయగలదు. అట్లు రాత్రిదేవతయే వేదమాతయని గ్రహింపనగును. లలితాదేవి జాగరిణి అని స్వపన్తీ అని స్తోత్రము చేయబడుచున్నది. జాగరిణి అంటే దివా (పగలు) స్వరూపిణి. స్వపంతీ అంటే రాత్రి రూపిణియని అర్థము. జాగరిణి అంటే జాగ్రదవస్థ. స్వపన్తీ అంటే స్వప్నావస్థ.

"శ్రీశ్చ తే లక్ష్మీశ్చపత్న్యౌ। అహోరాత్రే పార్శ్వే" అని పురుషసూక్తము - శ్రీశ్చ లక్ష్మీశ్చతే సవితుః పత్న్యౌ। ఉభే తే పత్న్యౌ భార్యే। తేకే। అహో రాత్రే యే పత్నీత్వేన కల్పితే పార్శ్వే ఉభయ పార్శ్వవర్తిన్యౌతే" అని సాయణ భాష్యము. అదిత్యునకు. అదిత్యరూపియైన పరమేశ్వరునికి శ్రీః-లక్ష్మీః అని ఇద్దరు భార్యలు. ఆ ఇర్వురే అహోరాత్రములు, అహస్సు (పగలు) శ్రీదేవి, రాత్రి - లక్ష్మీదేవి. ఈ ఇర్వురును పరమేశ్వరుని భార్యలు అని యర్థము. కావున లక్ష్మీదేవియే (విష్ణుపత్నియని ఇతర వ్యాఖ్యాతలు గూడ వ్రాసిరి) రాత్రిదేవత.

నవరాత్రియనగా నవఅంటే పరమేశ్వరుడనీ రాత్రి అంటే పరమేశ్వరి అని నిర్ణయసింధువు తెల్పుచున్నది. కావున నవరాత్రి వ్రతమనగా పార్వతీపరమేశ్వరుల వ్రతమనీ, అనగా వాగర్థముల అరాధన యనీ తెలియనగును. నవ శబ్దమునకు తొమ్మిది అనబడు సంఖ్య, క్రొత్తది, స్తోత్రము చేయబడినది అని అర్థములున్నవి. నవరాత్ర వ్రతమనగా తొమ్మిది రాత్రులు లేక తిథులు లేక దినములు చేయు వ్రతము అని, నిత్యనూతనము, నిత్యము స్తుతింప బడినదై శాశ్వత సుఖమునిచ్చి పోషించు పరదేవతను అరాధించు వ్రతమనీ, యర్థము. ఇంకనూ, లలితా సహస్రనామ భాష్యమున "విశ్వరూపా" అను నామమునకు వ్రాసిన భాష్యమున రాత్రి శబ్ద విచారణ చేయబడినది.

"యా ఏతాపూర్వ పక్షాపర పక్షయో రాత్రయః తా మధుకృతాః॥

యాన్యహాని తే మధువృషాః" అని వేదము.

అత్ర మధుకృచ్ఛబ్దః రాత్రి పరః మధువృష శబ్దశ్చదివసపరః అని భాష్యము.

రాత్రులు మధుకృతులు, పగళ్ళు మధువృషులని వేదము. సత్కర్మలు చేయువారికి రాత్రులు మధువును తయారుచేయును. ఆ మధువును పగళ్ళు వర్షించును. అట్లు మధువును తయారుచేయు రాత్రిని సరఘ-అనగా తేనెటీగ యని "ఇయం వా వ సరఘా" అని వేదము చెప్పుచున్నది.

నవశబ్ద విచారణ : స్కాంద పురాణమిట్లు చెప్పుచున్నది. " పరః పరతరం బ్రహ్మ ప్రకర్షేణ నవమ్। అపరః ప్రణవస్సాక్షాత్ శబ్దరూపః సునిర్మలః" బ్రహ్మపరమని, అపరమని రెండు విధములు. పరబ్రహ్మ స్వాభావికముగా, స్వతఃసిద్ధముగా నవస్వరూపుడు. అపరబ్రహ్మ శబ్దరూపమగు వేదము. అది ప్రకృష్టమైన నవస్వరూపము - అదే ప్రణవ స్వరూపము. బ్రహ్మ నవశబ్దముచేత, వేదము ప్రణవ శబ్దముచేత చెప్పబడుచున్నవి.

"నూయతే స్తూయతే ఇతి నవః-ణుస్తుతౌ - అమరసుధా.

నవశబ్దమునకు స్తుతింపబడుచున్నవాడుయని యర్థము. 'నవో నవోభవతి జాయమానః' అనివేదమంత్రము. పరమేశ్వరుడు నిత్యనూతనుడు, స్తోత్రము చేయబడుచున్నవాడు అని తెల్పుచున్నది.

"ఇంద్రః నవీయాన్, నవతరః కల్యాణః, స్తుత్యః" అని సాయణభాష్యము గూడ నవ శబ్దమునకు కల్యాణప్రదమని యర్థమును తెల్పుచున్నది. ఇంద్రుడు నవుడు, నవతరుడట. అనగా నిత్య నూతనుడు కల్యాణప్రదుడు, స్తోతవ్యుడని అర్థము.

"నవే తస్మి న్మహీపాలే సర్వం నవమివాభవత్" - *రఘు వంశము 4-11.*

దిలీప మహారాజు తర్వాత పుత్రుడైన రఘుమహారాజు సింహాసనమును అధిరోహించెను. స్తుత్యుడు, నూతనుడైన రఘుమహారాజు రాగానే అంతయు నవముగానయ్యెనట. అంతయు స్తుత్యము, అనగా పూజనీయుము, నూతనముగాను కన్పడెను.

అట్లే 'పురాపి నవం పురాణం' అను నిర్వచనము ద్వారా పురాణములెంత ప్రాచీనములైనను నిత్యనూతనములుగా ప్రసిద్ధిచెందినవి, అట్లే నవధాత్రులు గూడ ఎంత ప్రాచీనములైనను నిత్యనూతనములు, స్తుత్యములు, పూజనీయములు అని గ్రహింపనగును.

"ఏకా వ ఆసీత్ప్రథమా సా నవాసీత్" అని శ్రుతి

నవయోనిః నవ చక్రాణి దధిరే నవైవ యోగా నవ యోగిన్యశ్చ

నవానాంచక్రా అధినాథస్యోనా నవభద్రా నవముద్రా మహీనామ్

- త్రిపురోపనిషత్

లలితేతి నామయుక్తం తపకిల విద్యా నవావృతయః

*-లలితాసహస్రనామభాష్యమ్।*

ప్రప్రథమమున దేవి యొకతెయే ఉండెను. ఆమె తొమ్మిది రూపములు ధరించెను. ఆమె తొమ్మిది చక్రాలు, తొమ్మిది ముద్రలు, తొమ్మిది యోగినులు, తొమ్మిది యోగములు, తొమ్మిది భద్రములతో విలసిల్లుచున్నది. అట్లే తొమ్మిది ఆవరణలుగల్గి లలితయను నామము గల్గియున్నది. అట్లే తొమ్మిదికోణములు గల్గి శ్రీచక్రమని వెలుగొందుచున్నది. ఆమెను "ఓం దుర్గే రక్షిణి స్వాహా" యని నవాక్షరమంత్రముతో జపించవలెను. ఆ దేవి యొక్క తొమ్మిది రూపములకు తొమ్మిదిశక్తులు గలవట. ఆ శక్తులకు తొమ్మిదిమంది అధిష్ఠానదేవతలు ఉంటారట. వానికి ప్రతిరూపమైన తొమ్మిది ముఖములు గల్గిన రుద్రాక్షను ధరించుటచే నా నవశక్తులు ప్రీతినొందునని దేవీభాగవతసూక్తి. నవరూపములు గల ఆ దేవత ప్రీతి జెందును.

"నవ వక్త్రంతు రుద్రాక్షం నవ శక్త్యాధి దైవతమ్।
తస్యధారణ మాత్రేణ ప్రీయన్తే నవశక్తయః॥"

ఈ విధముగ నవ, రాత్ర శబ్దముల అర్థములు గోచరించుచున్నవి.

చివరగా యీ ఛలాక్షర సూత్రమును జూతము.

"మంత్రాద్యో జయతి గుణీ నవచరణః త్రింశదర్ధాభః" మంత్రాదికి జయము.అది గుణములు గల్గినది. నూతనములైనది లేక తొమ్మిది చరణములతో నొప్పునది. పదిహేను అక్షరములు గలది. ఆనందమయుడు. సౌందర్యనిధి యగు శివునితో గూడినది. మంత్రముల కాది (మంత్రాది) యననోంకారము. చరణములన్న పాదములు లేక చక్రములు అని యర్థము. నవరాత్రులలో నవచక్రములుగల శ్రీచక్రమును అట్లే తొమ్మిది చరణములుగల వేదమునర్చించవలెనని తెలియనగును. ఈ తొమ్మిది చక్రములే దొమ్మిది మూలప్రకృతులు. అవే తొమ్మిది రాత్రులు. "నవభిరపి మూలప్రకృతిభిః నవచక్రాత్మికం చక్రమేకమ్" అని భక్తిరసాయనము ద్వారా తెలియును. కావున నవరాత్ర వ్రతమనగా నిత్యనూతనమైన రాత్రి దేవిని లక్ష్మీదేవిని వేదమాతనారాధించుటయని గ్రహింపనగును.

"లక్ష్మీ వాగాది రూపేణ నర్తకీవ విభాతి యా" భాగవతమ్, మరియు సూత సంహిత.

లక్ష్మీదేవి వేదవాగ్రూపముగ నర్తకివలె ప్రకాశించుచున్నది. లేక లలితాదేవి అనగా పార్వతి, లక్ష్మీ సరస్వతుల రూపంలో నర్తకివలె ప్రకాశించుచున్నది. కావున వేదమాతృ స్వరూపిణియగు రాత్రిదేవి దుర్గ, లక్ష్మీ, సరస్వతుల రూపములలో విలసిల్లుచున్నదని యర్థము. లలితాసహస్రనామములలో నీదేవి వాక్, శ్రుతి, విద్యా, ఆత్మవిద్య, మహావిద్య, శ్రీవిద్య, త్రయీ స్వాహా, స్వధా, మతిః మేధా, శ్రుతిః, స్మృతి అని నామములతోను, భాషారూపా అనియును గీర్తింపబడుచున్నది. "మంత్రాక్షరమయీం లక్ష్మీం మాతౄణాం రూపధారిణీమ్। నవదుర్గాం మహాకాళీం కన్యాం తాం పూజయామ్యహమ్॥". వేదమంత్ర స్వరూపిణి, మహాకాళి.

మహాలక్ష్మి, మహాసరస్వతియని ముగ్గురమ్మల రూపమును ధరించిన యీ కన్యను పూజ చేయుచున్నాను. అని అర్థము. నవరాత్రులలో తొమ్మిదిమంది కన్యలను నవదుర్గలుగా భావించి పూజించవలెను. ఆ కన్యల పేర్లు - కుమారి, త్రిమూర్తి, కల్యాణి, రోహిణి, కాళి, చండిక, శాంభవి, దుర్గ, సుభద్ర అని. సర్వకార్యసిద్ధికి బ్రాహ్మణకన్యను, జయప్రాప్తికి రాజకన్యను, లాభప్రాప్తికి వైశ్య కన్యను, పుత్రప్రాప్తికి శూద్రకన్యను పూజించవలెనని ధర్మశాస్త్ర వచనము. ఒక సంవత్సరమున్న కన్య పనికిరాదు.

" బ్రాహ్మణీం సర్వకార్యేషు జయార్థే నృపవంశజామ్।
లాభార్థే వైశ్య వంశోత్థాం సుతార్థే శూద్ర వంశజామ్॥"

ఈ విధముగ నవరాత్ర వ్రతముచేసి రాత్రిదేవియగు వేదమాత యొక్క అనుగ్రహ పాత్రులగుదురుగాక!

"వాచా సరస్వతీ భిషక్" అని "సంసార పంక నిర్మగ్న సముద్ధరణ పండితా" యని సంసారమనెడి బురదను పోగొట్టి, మానసిక చికిత్స ద్వారా విచికిత్స చేసెడి వైద్యురాలగు వేదమాత సేవచేసి తరింతముగాక!

ఇతిశమ్
"నమామ రాత్రిదేవతామ్"



# సుఖ దుఃఖములు

మానవుని జీవితం ఎపుడూ సుఖదుఃఖ ద్వంద్వరూపము. కొందరు సుఖాన్ననుభవిస్తూ ఉంటే కొందరు దుఃఖముతో క్రుంగిపోతుంటారు. సూర్యుడుదయించి కళకళలాడుతుంటే చంద్రుడు వెలవెలబోతూ ఉంటాడు. సూర్యోదయం కాగానే పద్మం వికసిస్తుంది. కలువ ముడుచుకుపోవును. చంద్రోదయమయితే కలువ వికసించును. పద్మం ముడుచుకుపోవును. లోకం తీరు ఇంతే. సుఖంతో ఉన్నవ్వాడు చివరిదాకా ఉంటాడా అంటే ఉండదు. చూస్తూ ఉండగానే క్షణంలో దుఃఖసముద్రంలో మునిగిపోతాడు. మరల తెప్పరిల్లుకొని మళ్ళీ పైకిలేచి, సుఖసామ్రాజ్యాన్నేలుతాడు.

సుఖంగా ఉన్నంతసేపూ మానవుడు తనంతవాడు లేడనీ, అంతా తన ప్రజ్ఞయేననీ విఱ్ఱవీగుతుంటాడు. ఆ దశలో తను పట్టినదంతా బంగారమే. కాస్త తేడా వస్తే చాలు, నీరుకారిపోయి, కోపము, విసుగు, చికాకు, ఆవేశములకు లోనగును. సాత్త్వికభావము, వినయము, విచక్షణ మరుగునపడి ఇంకిపోవును. ద్వేషము పగచేరి, చదువుసంస్కారములను పారిపోయేటట్లు చేస్తాయి. ఏమాత్రం నిదానము, సహనము, శాంతి ఉండవు.

తనవద్ద ధనమున్నంతకాలం తాను లక్ష్మీపుత్రుడననీ, లక్ష్మి తనను వరించినదనీ గర్వపడుచుండును. దీనికి తోడు అధికారం, పదవి ఉంటే ఇంక చెప్పనక్కరలేదు. ఇక అతనికి కళ్ళు కనపడవు. చెవులు వినపడవు. మాటలు మాత్రం తియ్యగా ఉంటాయి. వానిని సుమతి శతకకారుడు

"అధరము గదలియు గదలక
మధురములగు భాషలుడిగి మౌనవ్రతులౌ।
అధికారరోగ పూరిత
బధిరాంధకశవముజూడ పాపము సుమతీ॥ అని అంటాడు.

దానధర్మాలకు అసలు తావే లేదు - లేదా శక్తిమించి దానధర్మాలు చేస్తూ ఉంటాడు. కొంతమంది డబ్బు ఉన్నా సరే దానము చేయలేరు, తాననుభవించలేదు. అపుడా ధనం గతి ఏమి?

"దానం భోగో నాశస్తిస్రో గతయో భవన్తి విత్తస్య।
యో నదదాతి నభుంక్తే తస్య తృతీయాగతిః"

ధనమునకు గతులు మూడు. దానం, భోగం, నాశం. దానం,భోగం లేకపోతే ఆ ద్రవ్యానికి గతి మూడవదే.

అందుకని కొంతమందికి కేవలం అనుభవించటమే ధ్యేయం. అందుచే, సాంఘిక, దైవిక కార్యక్రమాలకుగాని ప్రక్కవానికి, లేనివానికి ద్రవ్యసహాయం చేయటానికి మనసు రాదు. తను, తన కుటుంబము తర్వాత తన బంధువులకు మాత్రమే ద్రవ్యం సమకూర్చటం, వారి పేర ఆస్తులు ఏర్పాటుచేయటం, వస్త్ర, వాహనాలు, నగలు ఏర్పాటుచేయటం జరుగును. ఇంత సహాయం పొందిన భార్యాపుత్రులుగాని, బంధువర్గంగాని కృతజ్ఞత చూపించకపోగా, అతనిని పీక్కుతినటం, లేదా అధికార్లకు పట్టించటం, తమకు యిచ్చిన వాటా చాలలేదని దుఃఖిస్తూ ఉంటారు. ఈ విధంగా ధనంతో తాను సుఖంగా ఉన్నానని ఆ మనిషి అనుకుంటే చాలదు. ఆ ధనం, ఆ సుఖం తన భార్యాపుత్రులకు, బంధువర్గానికి, ఈర్ష్యకు, దుఃఖానికి హేతువగుచున్నది. ప్రభుత్వము బాధించును. పన్నుల పన్నులు మీద వడ్డించును. ఈ ఉపద్రవముల నధిగమించాలంటే చెడుమార్గముల త్రొక్కవలసివస్తుంది. పైగా ఆశ పీడిస్తుంది. ఈవిధంగా ఆపదలమీద ఆపదలు కల్గి, మితిమీరిన ద్రవ్యం దుఃఖకరమగును. అట్లు దుఃఖకరమని తెలిసికోవటం కష్టము. సుఖశాంతులు లేవని బాధ. ధనమక్కరలేదని తాత్పర్యం కాదు. పూర్తిగా నిర్ధనుడై వైరాగ్యం చెందటం తాత్పర్యం గాదు. మితిమీరిన ధనం, అన్యాయ సముపార్జిత ధనం, చెడు త్రోవల సంపాదించిన ధనం నిలవదు. దుఃఖహేతువు. సమూలంగా పెకళించుకుపోతుంది. ఇంకా ఇంకా పెడత్రోవలు పట్టించును.

మకారత్రయం - మనీ, మద్యం, మగువల వైపు దోవతీస్తుంది. ఇది మరీ వినాశహేతువు. అందుకే మనిషి అంటే మనీ+షి అని చమత్కరిస్తుంటారు.

అందుకని ప్రతివాడు మనీషిగా కాక మనీషిగా బ్రతకాలి. మనీషి అంటే మనీషగల్గినవాడు. మనీష అంటే బుద్ధి, వివేకము. ఆ వివేకబుద్ధి ఉంటే దుఃఖముల బారిపడనీయ సుఖములనిచ్చును. కళ్యాణపరంపర సాగును.

అట్లే తాను కష్టపడి సంపాదించిన ద్రవ్యము కళ్యాణప్రదము. అందుకే

"సుఖం హి దుఃఖాన్యనుభూయశోభతే" అని వేదశాస్త్రాలు, (పెద్దలు) ధర్మముపదేశిస్తున్నవి.

అట్టివారికి దుఃఖము ఆపదలు వచ్చినవానినధిగమించగలరు. ధైర్యముగ ఎదుర్కొంటారు. సుఖదుఃఖములు సమానముగ జూడగలరు. 'సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ' - భగవద్గీత. వారికి లాభనష్టములు, జయాపజయములు రెండు సమానములే. కేవలం సుఖం, కేవలం దుఃఖం రెండూ కష్టమే. సుఖదుఃఖాలు రెండు సమానంగా ఉన్నపుడే జీవితము హాయిగా, సాఫీగా నడుచును.

పూర్తిగా సుఖమే ఉంటే భగవంతునితో అసలు పని ఉండదు. భగవంతుడు కనపడదు. దుఃఖమున్నపుడే భగవంతుడు గుర్తుకువస్తాడు. పూజలు, వ్రతాలు, దీక్షలు, తిరుపతి, అయ్యప్పస్వామియే శరణమ్.

ఓం శ్రీ స్వామియే శరణమయ్యప్ప! అంటూ బయల్దేరుతాడు. ఆ దేవుడు గూడ తనకు అనుకూలుడైతేనే సుఖం, అపుడే ఆయన నిజంగా దేవుడు. ప్రతికూలుడైతే దుఃఖం, దేవనింద, వేదనింద వగైరా, వగైరా.అందుకే తర్కశాస్త్రమిట్లు చెప్పుతోంది.

సర్వేషామనుకూలతయా వేదనీయం సుఖమ్

ప్రతికూలతయా వేదనీయం దుఃఖమ్

ఇక చివరగా, సుఖంవస్తే పొంగిపోక, దుఃఖం వస్తే క్రుంగిపోక ఉండగల్గటమే దైవత్వం. దాన్ని సాధిస్తే జీవితమంతా పూలబాట. దానికి భగవద్భక్తి, వేదమార్గమే శరణ్యం.

మాముపేత్యపునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్।

నాప్నువన్తి మహాత్మనః సంసిద్ధిం పరమాంగతాః ॥

అని కృష్ణుని వచనం ప్రమాణము.

ఒకానొక కవి అంటాడు - "విపదస్సన్తునః శశ్వత్" నాకెపుడూ ఆపదలు రావాలి! అని ఎందుకు? ఆపదలున్నపుడేగద! దేవునితో పనిపడేది. సంపదలున్నపుడు పని పడదుగద!

ఇతిశమ్

"నమామ వేదమాతరమ్"

# రుద్రంలో వైష్ణవము

సాధారణంగా లోకంలో నారాధింపబడే ఆదిత్య, అంబికా, గణపతి, విష్ణు, శివులు వేర్వేరు దేవతలని మన భావన. ముఖ్యంగా శివ,విష్ణువుల మధ్య భేదము బాగా తలెత్తుతూ ఉంటున్నది. ఈ విధంగా భేదబుద్ధి అజ్ఞానమనీ, ఒకే పరమేశ్వర తత్త్వమే వివిధ ధర్మముల బురస్కరించుకొని వివిధ దేవతలుగా భావింపబడుచున్నారనీ, వీరిలోనే దేవుని పూజించినా, ఆ పూజ, ఆ పారమేశ్వర తత్త్వమునకే జెందుననీ, జగద్గురువులు, ఆదిశంకరాచార్యులవారు ప్రబోధించి, "పంచాయతనపూజ" ననుగ్రహించి లోకానికెంతో మేలుచేశారు.

"ఏకో దేవః కేశవో వా" శివోవా - అనగా ఉన్నది ఒక్కదేవుడే. ఆయన పేరు కేశవుడుగావి శివుడుగాని గావచ్చును.

"ఆకాశాత్పతితం తోయం యథాగచ్ఛతి సాగరమ్।
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి"॥

ఆకాశమునుండి వర్షించిన నీరంతయు, వివిధ నదుల ద్వారా సాగరమును చేరునట్లు, అన్ని రకముల దేవుల పూజలు ఆ పరమేశ్వరునే చేరునని యర్థము.

" శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే।
శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః॥"
యథా శివమయో విష్ణు రేవం విష్ణుమయః శివః॥
యథాంతరం న పశ్యామి తథామే స్వస్తిరాయుషి"॥

విష్ణురూపమే శివుడు. శివరూపమే విష్ణువు. శివుని హృదయం విష్ణువు. విష్ణుహృదయం శివుడు. విష్ణువు శివమయము. శివుడు విష్ణుమయము. ఈ విధముగా శివుడు, విష్ణువుల మధ్య భేదము చూడని నా ఆయువు శుభప్రదమగుగాక యని ప్రతిరోజూ మనం చేసే ప్రార్థన.

త్యాగరాజస్వామివారు శివుడవో! మాధవుడవో! ఎవరని నిర్ణయించేదిరా! యని యీ పరమేశ్వర తత్త్వమును తన కీర్తనలో గానం చేశారు.

శివసహస్రనామములోని హరిశ్చ హరిణాక్షశ్చ 2) సుతీర్థః కృష్ణ ఏవచ 3) విష్వక్సేనో హరిర్యజ్ఞః 4) వైష్ణవః ప్రజవీతాళో 5) ధాతా శక్రశ్చ విష్ణుశ్చ అని నామముల ద్వారా శివుడు విష్ణుమయమని తెలియును. అట్లే విష్ణుసహస్రనామములలోని 1) స్వయంభూః శంభురాదిత్యః 2) రుద్రో (భూతపతిః) బభ్రుః బహుశిరాః - 3) సర్వః శర్వః శివః స్థాణుః అని నామములద్వారా విష్ణువు శివమయమని దెలియనగును. ఇట్లే శివ, విష్ణువుల అభేదమును రుద్రంలో వైష్ణవమును దర్శించుట ద్వారా గ్రహించవచ్చును.

రుద్రమంటే రుద్రాధ్యాయము. దీనికి శతరుద్రీయమని, రుద్రోపనిషత్ అని పేర్లు. ఈ రుద్రమంత్రాలు నమక, చమకములు. నిత్యము రుద్రాభిషేకసమయంలోనే వీని

ప్రసిద్ధి.వానిలో నొక మంత్రాన్ని చూద్దాము. దీనికి సాయణ, భట్టభాస్కర, విష్ణుసూరి, అభినవశంకర భాష్యాలిట్లు ఆదిత్య, రుద్ర, విష్ణు, ఆధ్యాత్మపరమైన అర్థాలను వివరిస్తున్నాయి.

"ఉతైనం గోపా అదృశన్న దృశన్నుదహార్యః ।
ఉతైనం విశ్వాభూతాని పదృష్టో మృడయాతినః ॥"

1) రుద్రపరమైన అర్థముః 1) ఏనం - ఈ రుద్రుని, ఉదహార్యః - ఉత్ అహార్యః- పైకి ప్రాణములు హరింపబడని, గోపాః - జీవులు (ప్రాణులు) అదృశన్-చూచిరి లేక 2) 'అహార్య ధర పర్వతాః' అని అమరకోశము, ఇతరకోశముల వలన అహార్యః అనగా పర్వతమని అర్థము. ఉదహార్యః అనగా ఉన్నతమైన పర్వతము. అనగా స్థావరాత్మక ప్రపంచము, గోపాః - అనగా జీవులు,అనగా జంగమాత్మకమైన ప్రపంచమున్ను ఈ రుద్రుని దర్శించి, సేవించుచున్నవని రెండవ యర్థము.

2) ఆదిత్యపరమైన అర్థము : ఏనం - ఈ ఆదిత్యుని (సూర్యుని) ఉదహార్యః - ఉద జలమును, హార్యః - హరించెదు (గ్రహించెదు) గోపాః (గాం-భూమిని, పాః- రక్షించెదు) కిరణములు, అదృశన్ చూచినవని యర్ధము. నీటిని తీసుకుపోవు పల్లెప్రజలు, స్త్రీలున్నూ సూర్యుని చూచినారని సామాన్యార్థము.

3) విష్ణుపరమైన యర్థము : 1) ఏనం - ఈ విష్ణువును (కృష్ణుని) ఉదహార్యః - జలమును తెచ్చు, గోపాః-గోవులు, గోపికలు అదృశన్-చూచిరి అని ఒక యర్థము. 2) హారీ యనగా జారస్త్రీ. అందరిచేత దూషింపబడు స్త్రీ. "కన్యా ప్రసూతిజా జారీ హారీనామ్నైవ దూషితా" - (వైజయన్తీ కోశ -87-96) కాన హార్యః అంటే జారస్త్రీలు. నహార్యః - అహార్యః అంటే జారస్త్రీలు కానివారు. ఏమాత్రము దూషింపబడనివారు సచ్ఛీలురు. ఉదహార్యః - ఉన్నతమైనవారు, జారస్త్రీలు కానటువంటి, గోపాః-గోపాంగనలు. ఏనం-ఈ శ్రీకృష్ణపరమాత్మను అదృశన్ అదృశన్ - మాటిమాటికి చూచిరి. చూచి తరించిరి. ఈ గోపాంగనలు, కృష్ణునితో నున్నప్పటికి, జారస్త్రీలు కాలేదు. దూషింపబడలేదు అట్టి పవిత్రమూర్తులు. మహాపతివ్రతులు.

ఈ రుద్రమంత్రార్థమునే వ్యాసమహర్షి భాగవతం దశమస్కంధంలో వివరింభారు.

"ఇతి సంచింత్య భగవాన్ మహాకారుణి కోహరిః ।
దర్శయా మాస లోకం స్వం గోపానాం తమసః పరమ్॥
సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ యజ్జ్యోతిః సనాతనమ్।
తేదదృశుః బ్రహ్మలోకమ్।
నందాదయస్తు తం దృష్ట్వా పరమానంద నిర్వృతాః।
కృష్ణం చ తత్ర ఛందోభిః స్తూయమానం సువిస్మితాః॥"

- భాగవతమ్-10-18

అజ్ఞానావృతులగు గోపులకు, గోపికలకు, యోగులు, మహర్షులు, పండితులు దర్శించెడి ఆ పరబ్రహ్మను దర్శింపచేసి, తరింపజేయదలచి శ్రీకృష్ణుడు తన లోకమును చూపెను. వారపుడు "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" యని వేదప్రతిపాద్యమగు బ్రహ్మజ్యోతిస్సును చూచిరి. ఆ బ్రహ్మలోకంలోనే వారింకనూ వేదములచే స్తోత్రము చేయబడుచున్న శ్రీకృష్ణుని జూచి, చకితులై, పరమానందభరితులైరి. ధన్యులయిరి.

"గోప్యో2 స్య నిత్యముదిత హసితప్రేక్షణం ముఖమ్।
పశ్యన్త్యో వివిధాన్ తాపాన్ తరన్తి స్మా శ్రమం ముదా॥"

-భాగవతం-10-43

గోపికలందరు నిత్యము మందహాసంతో దర్శనీయుడగు కృష్ణునిచూచి తమ తాపముల బోగొట్టుకొని అనగా అజ్ఞానమును పోగొట్టుకొని తరించిరి అని యర్థము. ఇదియే రుద్రమంత్రార్థము-రుద్రంలో వైష్ణవము.

4) అధ్యాత్మపరమైన అర్థము : విష్ణుసూరి భాష్యప్రకారము, ఉత-దేహోత్పత్త్యనంతరం, ఏనం-శరీరాన్తర్గతం సన్తం, గోపాః-గావః- నామ ఇంద్రియాణి, తత్పాః - తత్పాలకా దేవాః - ఇంద్రియాధిష్ఠాన దేవాః, అదృశన్నిత్యర్థః - అనగా, దేహము పుట్టిన తర్వాత, దేహాంతర్గతమైన చైతన్యమును (పరమాత్మను లేక ప్రత్యగాత్మను) ఇంద్రియ పాలకులు అనగా ఇంద్రియా ధిష్ఠాన దేవతలు దర్శించిరని యర్థము.

5) వేదమంత్రపరమైన అర్థము : భాగవతంలో పలుచోట్ల 'గోపికా వైవేదాః" - గోపికలు వేదములు' అని గలదు. కృష్ణలీలాతరంగిణి గూడ గోపికలు అంటే వేదాలనీ అంటే వేద మంత్రాలని చెప్పింది.

ఇతి గోప్యః పరానందం గాయన్త్యస్తాః పృథక్ పృథక్।
అపరాః శ్రుతయో భూయో భూయో తత్రైవ సంగతాః॥"

-కృష్ణలీలా తరంగిణి

ఈ శ్లోకంలో గోపికలను శ్రుతులు అని అన్నారు. శ్రుతులంటే వేదాలే గద! దీనిని బట్టి పై రుద్రమంత్రార్థమును ఇట్లు చెప్పవచ్చును.

ఏనం - ఈ నిర్గుణ పరబ్రహ్మను, ఉదహార్యః - ఉత్- ఉన్నతమైన, అహార్యః - హరింపశక్యముగాని అనగా నశింపశక్యముగాని, నాశనములేని, శాశ్వతమైన, గోపాః- వేదమంత్రములు,అదృశన్-దర్శించినవి. ఆ మంత్రములు పరబ్రహ్మను దర్శించి, మనలకు శివ, విష్ణు, ఆదిత్య రూపునిగా దర్శింపజేసినవి.

కృష్ణుడు గోపాలుడని, శివుడు పశుపతియని ప్రసిద్ధి. ఈ సమస్త ప్రాణికోటి గో,గోప,గోపీ, పశుశబ్దాలతో వ్యవహరింపబడుచున్నారు. అనగా అజ్ఞానావృతులైన గోపులు (జీవులు), గోపాలక, పశుపతి శబ్దవాచ్యుడగు ఆ పరమేశ్వరుని దర్శించి, అజ్ఞాననివృత్తి గల్గి, జ్ఞానులయిరి. అని యర్థము.

ఇంకొక మంత్రాన్ని చూద్దాము.

"నమో గిరిశాయ చ శిపి విష్టాయచ".

గిరిశః అనగా కైలాసవాసియగు శివుడుఅనియొక అర్థము. వేదవాక్కు నివాసముగా గల్గిన పరమేశ్వరుడని మరియొక యర్థము. అతడు శివుడుగాని, మాధవుడుగాని, ఆదిత్యుడుగాని మరియెవరైనా గావచ్చును. గీః అనగా వేదవాక్కు. గిరి అంటే ఆ వేదవాక్కు నందు, శః అంటే శయనించి యున్నవాడని అర్థము.

శిపివిష్టుడనగా విష్ణువనీ, శివుడనీ, ఆదిత్యుడనీ అర్థములున్నట్లు భాష్యాలు వివరిస్తున్నాయి. "విష్ణుమూర్తిధారీ శిపివిష్టః" అని సాయణ భాష్యము.

విష్ణుమూర్తి రూపమును ధరించినవాడు శిపివిష్టుడని యర్థము. 'విష్ణుః శిపివిష్టః' అని వేదము. 'శిపివిష్టోంబికానాథః' - అని శివసహస్రనామముల ప్రకారము శిపివిష్టుడు శివుడు అగును." నైకరూపోబృహద్రూపః శిపివిష్టః ప్రకాశనః" అని విష్ణుసహస్రనామముల ప్రకారము విష్ణువగును.

"శిపివిష్టాస్తు దుశ్చర్మ ఖల్వాట హరిశంకరాః"

అని నానార్థసంగ్రహము. శివ, విష్ణువులిర్వురు శిపివిష్టులని యర్థము.

1) రుద్రపరమైన అర్థము : "పశవః శిపిరితి దర్శనాత్‌। శిపిశబ్దేన పశవఉచ్యన్తే తైర్విష్టః వ్యాప్తః సేవితః తత్పతిః ఇతి యావత్" అని అమరకోశము. శిపులనగా పశువులు. వానియందు వ్యాపించి, సేవింపబడుటచేత పశుపతి శిపివిష్టుడాయెనని యర్థము. "శిపయో జీవాః తదనుపంథాతా శిపివిష్టః సర్వసాక్షీ రుద్రః" అని విష్ణుసూరి భాష్యము. శిపులనగా జీవులు. వానియందంతర్యామియై సదా రక్షించు, సర్వసాక్షియగు చైతన్యమే రుద్రుడని యర్థము. ఆ రుద్రుడే శిపివిష్టుడు.

2) విష్ణుపరమైన అర్థముః "యజ్ఞో వైవిష్ణుః, పశవః శిపిః, యజ్ఞఏవ పశుషు ప్రతితిష్ఠతి" (తైత్తిరీయ సంహితా 2-5-5.) - వేదము. "శిపయః పశవః, తేషు విశతి ప్రతితిష్ఠతి యజ్ఞరూపేణేతి శిపివిష్టః" అని విష్ణుసహస్రనామభాష్యము (శంకర విరచితము) విష్ణుసూరి భాష్యము కూడా. శిపులనగా పశువులు, యజ్ఞ మనగా విష్ణువు యజ్ఞేశ్వరుడగు శ్రీ మహావిష్ణువు. శిపులయందు, అనగా పశువులయందు అనగా జీవులందు అంతర్గతుడై నివసించి సదా వారిని గాపాడు చుండుటచే శిపివిష్టుడాయెను.

కావున 'నమః శిపివిష్టాయ' అనగా శివ లేక విష్ణురూపధారియైన, సర్వ జీవాన్తర్యామియైన ఆ చైతన్యమునకు నమస్కారమని అర్థము.

3) ఈ మంత్రానికే భట్టభాస్కర వ్యాఖ్య ఆదిత్యపరమైన అర్థమును చెప్పుచున్నది.

'శిపివిష్టాయ - యద్వాదిత్యాత్మనే" అని భాష్యము.

శిపివిష్టుడనగా ఆదిత్యుడని యర్థము.

"శిపయోరశ్మయః తేషువివిష్ట ఇతివా" అని శంకర భాష్యము. శిపులనగా కిరణములు. వానియందు నివేశించియుండుటచే ఆదిత్యుడగును.

ఇందుకు స్కందపురాణము ప్రమాణము.

"శైత్యాచ్ఛయన యోగాద్వా శీతి వారి ప్రచక్షతే।
తత్పానాద్రక్షణాద్వాపి శిపయోరశ్మయో మతాః॥
తేషుప్రవిష్ట స్సవితా శిపివిష్టస్త ధోచ్యతే" - స్కందపురాణము.

శైత్యమువలనగాని, శయనముగల్గుట వలనగాని 'శి' యనగా జలమని చెప్పుచున్నారు. ప అనగా పానము రక్షణమని అర్థము. ఆ జలపానము వలనగాని, రక్షించుటవలనగాని శిపులు కిరణములగును. ఆ కిరణములందు ప్రవేశించియున్న ఆదిత్యుడే శిపివిష్టుడని చెప్పబడుచున్నాడు.

రుద్రమునకు శతరుద్రీయమని పేరు. దీనిని వ్యాసమహర్షి భారతంలో ద్రోణపర్వంలో అశ్వత్థామ, అర్జునులకు ఉపదేశరూపంలో పొందుపరిచాడు. శతరుద్రీయ శబ్దమును నీలకంఠ పండితులు వ్యాఖ్యానించారు.

విష్ణువు యొక్క శివమయత్వమును తెల్పుటకై శతరుద్రీయ మారంభింప బడుచున్నదంటూ యీ నీలకంఠ వ్యాఖ్య రుద్రమందలి వైష్ణవాన్ని లోకానికిట్లు వెల్లడిచేస్తుంది.

"తదేవం విష్ణోః శివమయత్వం వ్యాఖ్యాయ విష్ణుత్రాణాత్
తన్మయ స్వజగతః త్రాణమపి శైవమేవ కర్మేత్యుక్తమ్"

-భారతమ్ - నీలకంఠ వ్యాఖ్య

జగద్రక్షకుడైన విష్ణువునకు శివమయత్వము చెప్పుటచే విష్ణుకృతమైన జగద్రక్షణము శివుని కర్మయేనని ఇందు వివరింపబడుచున్నదని యర్థము.

ఇంకా నీలకంఠుడిట్లు శతరుద్రీయ తత్త్వమునిట్లు వివరించుచున్నాడు.

"యథా శివమయో విష్ణు రేవం విష్ణుమయం జగత్।
ఇతి స్మృతౌ దార్ష్టాంతికం జగతోవిష్ణుమయత్వమ్।
పూర్వయోః సర్వతోః విష్ణోర్విశ్వరూపప్రకాశనేన
వ్యాఖ్యాతమ్। అథదృష్టాన్తీ కృతం విష్ణోః శివ
మయత్వం వ్యాచిఖ్యాసుః శతరుద్రీయ మారభతే"। - (మహాభారతం - ద్రోణపర్వం)

స్మృతులన్నీ విష్ణువు శివమయుడనీ, శివుడు విష్ణుమయుడనీ చెప్పుచున్నవి. ఇంతకుముందు పర్వాలలో విష్ణువుయొక్క విశ్వదర్శనం ద్వారా జగత్తంతా విష్ణుమయమని చెప్పబడింది. ఇక యీ ద్రోణపర్వంలో విష్ణువుయొక్క శివమయత్వమును జూపుటకై యీ శతరుద్రీయ ప్రారంభమని యర్థము. కాబట్టి యీ నీలకంఠవ్యాఖ్య ద్వారా విష్ణువు యొక్క శివమయత్త్వము సుస్పష్టము.

"నమస్తారాయ నమశ్శంభవేచ" - ఇదొక మంత్రము.

తారః అనగా పరమశివుడు. విష్ణుసహస్రనామములలోని "అశోకస్తారణస్తారః", "భూర్భువస్స్వస్తరుః తారః" అను నామముల ద్వారా విష్ణువు "తారః" అగును కాని, 'తారః' అనగా ఓంకారమని యర్థము. "తారాయ - ప్రణవ రూపాయ" అని భట్టభాస్కర భాష్యము. "తారయతి సంసారాదితి తారః ప్రణవః తద్రూపాయ" అని విష్ణుసూరి భాష్యము. మరి శివ, విష్ణువులిర్వురు ఓంకారస్వరూపులే గద!

"నమో గోష్ఠ్యాయచ గృహ్యాయచ" - ఇంకొక మంత్రము. "గోష్ఠం గవాం స్థానం తత్రభవో గోష్ఠ్యః" అని సాయణభాష్యము. గోవుల అనగా ఆవుల నివాసస్థానము గోష్ఠము. ఆ ఆవుల మధ్య ఉండువాడు గోష్ఠ్యుడగును. ఆవులమధ్య నుండువాడు కృష్ణుడే. రుద్రాత్మకమైన యీ 'గోష్ఠ్యః' అను పదము విష్ణువునే చెప్పుచున్నది. "శ్రుతయో గావః తాసాం స్థానం గోష్ఠం మనోమయ కోశః తత్రప్రకాశమానః గోష్ఠ్యః తస్మై నమః" అని విష్ణుసూరి భాష్యము. గోవులనగా వేదమంత్రములు. వాని స్థానము గోష్ఠము. దీనిని మనోమయ కోశమందురు. ఆ కోశమున ప్రకాశించియుండువాడు గోష్ఠ్యుడగునని యర్థము. అతడే శివ, విష్ణు, శబ్దవాచ్యుడే.

'నమో రుద్రాయ విష్ణవే మృత్యుర్మే పాహి' అని మరియొక మంత్రము. రుద్రరూపుడైన విష్ణువునకు, లేక విష్ణురూపుడైన రుద్రునకు నమస్కారము. అట్లు శివ, విష్ణు భేదములేక, విష్ణు, శివ శబ్దములతో పిలువబడుచున్న ఆ పరమాత్మ నన్ను మృత్యువునుండి కాపాడుగాక! యని యర్థము.

ఇట్లు ఇంకా ఎన్ని మంత్రాలనైనను చూడవచ్చును. మంత్రపరిశీలన చేసినకొద్ది రుద్రంలో వైష్ణవము బాగుగ గోచరించును. ఈ విధముగ, శివుడే విష్ణువని, విష్ణువే శివుడని మనము వారిరువురి మధ్య భేదబుద్ధిని తొలగించుకోవాలి.

ఇతిశమ్

"నమామి కేశవం శివమ్"



# పుష్కరములు - వైదిక దర్శనము

వేదములవలె భారతదేశమందలి నదులన్నియు పవిత్రమైనవి. ఆ నదులలో కృష్ణానది మిగుల ప్రసిద్ధము. తనచే సృష్టింపబడిన ఈ కృష్ణానది వేదస్వరూపిణియని సాక్షాత్తుగ భగవద్వచనము. శ్రీకృష్ణ పరమాత్ముని అంగములనుండి పుట్టి, ఆ పరమాత్ముని నామమునే ధరించి లోకోపకారిణి, లోకపావని యయిన యీ నది వేదస్వరూపిణి మాత్రమే గాదు భగవత్స్వరూపిణి గూడ. ఈ నది వేదపాదముల నుండి పుట్టినదిగాన పుణ్యమూర్తియని స్కాందపురాణ వచనము.

**"ఇయం వై నిర్మితా పూర్వం మయా సా వేదరూపిణీ।**

**వేదపాదాత్ సముత్పన్నా పుణ్యా వై లోకపావనీ॥** - *(స్కాంద పురాణం)*

ఈ కృష్ణానది పంచగంగలలో నొకటి.

**" కావేరీ తుంగభద్రా చ కృష్ణవేణీ చ గౌతమీ।**

**భాగీరథీతి విఖ్యాతాః పంచగంగాః ప్రకీర్తితాః"**

ఇట్టి యీ గంగాస్నాన, పానారాధన లత్యంత శ్రేయోదాయకములు. విశేషించి పన్నెండు సంవత్సరములకొకసారి వచ్చు పుష్కరములలో నీమహానదీస్నాన,జలపానారాధనలు, దేవర్షి పితృతర్పణాదులత్యన్త పావనములు.

బృహస్పతి యొక్కొక్క రాశిలో నున్నపుడు ఒక్కొక్క నదికి పుష్కరములు వచ్చును. కన్యారాశిలో నున్నపుడు కృష్ణానదీ పుష్కరములు వచ్చును. పుష్కరములు పన్నెండు రోజులు. ఈ పుష్కరములలో పుష్కరుడను తీర్థరాజు, బ్రహ్మావిష్ణుపరమేశ్వరులు, సమస్త దేవర్షి పితృగణముతోగూడ నీనది నాశ్రయించియుందురు. ఆ పుష్కర సమయంలో నెవరు కృష్ణానదీ స్నానమాచరించి, దేవర్షి పితృతర్పణము గావించి వారిని తృప్తినొందింతురో వారుత్తమ గతి నొందెదరు.

**కన్యాగతే దేవగురౌ ద్వాదశాహ నివాసినా।**

**తీర్థరాజేన కృష్ణాయాం తత్ర యోగో మహాఫలః ॥**

**బ్రహ్మాహరిః హరశ్చైవ కృష్ణాయాం జలమార్ణవమ్।**

**తిష్ఠంత్యాశ్రిత్య కన్యాస్థే గురౌ దేవర్షి పితృభిః॥**

**యస్యాం తిథౌ గురుర్యాతి కన్యాయాంచ సమాగమమ్।**

**కృష్ణాయాం తు తదాస్నానం కులకోటీ సముద్ధరేత్॥**

పుష్కరములన నేమి? పుష్కరస్నానమననేమి? పుష్కరస్నానముచే మానవునికి పవిత్రత యెట్లు వచ్చును? అని సందేహనివృత్తికై పుష్కర శబ్దార్థ వ్యుత్పత్తులను, అందు నిగూఢమైన వైదికతత్త్వమును దర్శింతము.

పుష్కర శబ్దమునకనేక వ్యుత్పత్తులు, అర్థములున్నవి.

1. పుష్పతీతి పుష్కరమ్ - అవకాశమిచ్చి రక్షించునుగాన ఆకాశమునకు పుష్కరమని పేరు. " వ్యోమ పుష్కర మంబరమ్" - అమరకోశము.

2. పుష్కం (పోషణం)రాతీతి (అదత్తే ఇతి) పుష్కరమ్. పోషణనిచ్చునది.

3. క్రాంతం పుష్ణాతీతి పుష్కరమ్. బడలినవానిని పోషించి రక్షించునది పుష్కరమ్ - తామర పువ్వు పేరు. "రాజీవ పుష్కరాంభోరుహాణి చ" - అమరకోశము.

4. పోషయతీతి పుష్కరమ్ - ఎల్లపుడు పోషించుచు, లోకమునకు జీవనభూతమైన జలమునకు పుష్కరమని పేరు.

"జీవనం భువనం వనమ్। పుష్కరం సర్వతో ముఖమ్" - అమరకోశము

ఇవియేగాక విశ్వ, మంఖ, మేదినీ, వైజయన్తీత్యాది కోశములు పుష్కర శబ్దమునకు - ద్వీపము, ఏనుగు తొండము చివరిభాగము, సర్పరాజు, వాద్యముఖము, ఖడ్గమూలము, తీర్థము, ఓషధి, సూర్యవక్త్రము, ముఖము, కాండము, కాలవిశేషము మొదలగు అర్థముల చేర్కొనినవి.

ఇంకనూ నొకానొక ప్రధాన యోగమునకు పుష్కరమని పేరు.

"విశాఖాస్థో యధా భానుః కృత్తికాసు చ చంద్రమాః ।
స యోగః పుష్కరో నాను పుష్కరేష్వతి దుర్లభః॥"

సూర్యుడు విశాఖా నక్షత్రములోను, చంద్రుడు కృత్తికానక్షత్రములోనున్నపుడది పుష్కరయోగమని, ఆయోగము యోగములలో మిక్కిలి దుర్లభమనియు నర్థము. ఇట్లు అనేకార్థములు గలవు.

వీనిలో 'జల'మనెడి యర్థము ప్రధానము - ప్రసిద్ధము. అందుచే పుష్కర శబ్దార్థ విచారమనగా జలశబ్దార్థ విచారణమే. ఏదియో నొకానొక అంతరార్థము, వైదికతత్త్వముండుట చేతనే మానవులు (జల) పుష్కరస్నానము చేసి తరించుచున్నారు. అయ్యంతరార్థ పరిశీలన చేద్దాము.

పుష్కరమన జలము. జలమననేమి?

"జాయతే లీయతే యత్ర జగత్తజ్జల మీరితమ్"

జ-అనగా జన్మ పుట్టుక. ల-అనగా లయము. దేనినుండి జగత్తు పుట్టెనో దేనిలో లీనమగునో దానికి జలమని పేరు. అట్లు సృష్టిలయమనెడి ధర్మములు పరమేశ్వరునివేగద! కావున జలమనగా ప్రప్రథమముగ సృష్టింపబడిన పరమేశ్వర స్వరూపమని తెలియనగును. "అపఏవ ససర్జాదౌ" - అని వేదము. పరమాత్మ మొదట అపస్సులను అనగా జలములను సృష్టించెను అని అర్థము, పరమాత్ముని ప్రథమసృష్టి హిరణ్యగర్భుడు గద! కావున అపస్సులనగా హిరణ్యగర్భ (పరమేశ్వర) స్వరూపమే। ఇదియొక అర్థము.

తరువాత జలములను వేదవాక్స్వరూపముగ తెలియనగును.

లోకమున పర్వతమును, పాషాణమును, సర్పమును, వృక్షమును, అట్లే నదులను, నదీజలములను దేవతాస్వరూపముగ దర్శించి, ఆరాధించుట భారతీయుల సాంప్రదాయము. ఉదాః- 'అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః" అనికాళిదాస మహాకవి తన కుమారసంభవ కావ్యము ద్వారా హిమాలయ పర్వతమును పాషాణ స్వరూపముగ గాక దేవతాస్వరూపముగ దర్శించవలెనని చెప్పెను. వేదాద్రి, శ్రీశైలం, భద్రగిరి, పుష్పగిరి యను నీ పేర్లను పర్వతములకు పెట్టుటలోని యాంతర్యమిదియే. హిరణ్యకశిపునకు స్తంభము పాషాణరూపముగ కనబడెను. కాని అదే స్తంభమా రాక్షసుని పుత్రుడగు ప్రహ్లాదునికి నరసింహస్వరూపముగ కనబడెను. అట్లే దేవాలయములందలి శిలావిగ్రహములు కొందరకు పాషాణ రూపముగను, కొందరకు దేవతామూర్తులగను కనపడును. "ప్రతిమాసు శిలాబుద్ధిం కుర్వాణో నరకం వ్రజేత్" ప్రతిమలలో శిలాబుద్ధిగల్గినవాడు నరకమునొందునని యర్థము. అట్లే 'నదీ' శబ్దము 'నాద' శబ్దము నుండి పుట్టినది కనుక నది వేదనాద స్వరూపము.

అట్లే జలములను, నదీజలములను సాధారణమైన 'నీరు'గా దర్శించక దేవతా స్వరూపముగను, వేదవాక్స్వరూపముగను దర్శించవలెను. భారతీయులట్లు దర్శింతురు.

"ఔషధం జాహ్నవీతోయమ్" అని గంగాజలము నౌషధముగ దర్శింతురు గద!

"భూమిరాపోనలో వాయుః ఖం మనోబుద్ధిరేవచ।

అహంకార ఇతీయం మేభిన్నా ప్రకృతిరష్టధా" - భగవద్గీతా వచనమనుసరించి జలము పరమేశ్వరుని అష్టమూర్తులలో నొకటి. ఇట్లని విష్ణుపురాణము గూడ చెప్పుచున్నది.

"సూర్యో జలం మహీ వహ్ని ర్వాయు రాకాశ ఏవ చ।

దీక్షితో బ్రాహ్మణ స్సోమః ఇత్యష్టౌ మూర్తయో మతాః॥

సూర్యుడు, జలము, భూమి, అగ్ని, వాయ్వాకాశములు, దీక్షితుడైన బ్రాహ్మణుడు, సోముడు - ఇవి పరమేశ్వరుని అష్టమూర్తులు.

**"తజ్జలానితి శాంతాత్మా చితం జలము పాసతే"** - ఛాందోగ్య ఉపనిషత్

విజ్ఞులైన వారు, శాంతి చిత్తులన్నూ, జలమును మామూలు నీరుగ చూడక. అందు జలాభిమానియగు చైతన్యదేవతను దర్శించి ఉపాసింతురని ఛాందోగ్యోపనిషత్తు చెప్పుచున్నది.

పూర్వము సామ్రాజ్యపట్టాభిషేకమునకు అన్ని నదులనుండి జలములదెచ్చి, రాజులను, దేవతామూర్తులనభిషేకించెడివారు. మహారాజు కావలెనన్న జలాభిషేకము చేయవలసినదే. అట్లు జలాభిషిక్తులైన రాజులకుగాని, విగ్రహములకుగాని యొకానొక విశిష్టశక్తి-చైతన్యస్ఫూర్తి గల్గును. జలాభిషిక్తుడైన రాజు దైవస్వరూపుడే. అట్టి రాజుల పరిపాలనము సుఖ,శాన్తి నిలయము ప్రజారంజకము.

"జలధారాప్రియశ్శివః" - శివుడు నిత్యము జలాధారాభిషేక ప్రియుడట. నిత్యము శివలింగమునభిషేకించిన జలములో నొక గొప్ప శక్తి పుట్టును. ఆ శక్తిమంతమగు జలము తీర్థము.

"లక్ష్మీర్దివ్యైర్గజేంద్రై ర్మణిగణఖచితైః స్నాపితా హేమకుంభైః
నిత్యం సా పద్మహస్తా మమ వసతు గృహే సర్వమాంగల్య యుక్తా॥"

లక్ష్మీదేవి నిరంతరము ఏనుగుల తుండాగ్రములచే (పుష్కరములచే) జలములతో (పుష్కరములతో) స్నానము చేయించబడి, అభిషేకార్ద్రయై, మాంగల్యముతో గూడినదై నా యింట వసించుగాక యని యర్థము. జలధారాభిషిక్తురాలై, అభిషేకార్ద్రయయిన లక్ష్మీదేవి మంగళప్రదయగును, పుష్టిరూపిణియగును, మనకు పుష్టి నిచ్చును.

"తాం స్మరేదభిషేకార్ద్రాం పుష్టిదాం పుష్టి రూపిణీమ్॥"

"ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం"

గజముల పుష్కరములచే పుష్కర (జల) స్నానముగావించబడిన లక్ష్మి "పుష్కర" యగును.

అట్లే విష్ణుమూర్తి ప్రతిరూపమైన సాలగ్రామ శిలనభిషేకించిన జలము జన్మజన్మ పాపముల బోగొట్టును.

"సాలగ్రామశిలా వారి పాపహారి విశేషతః"

వీనినిబట్టి నిత్యము జలాభిషేకము అభిషేక జలమున్నూ మంగళప్రదమని తెలియనగును.

కన్యాదాన సమయమున వరునకు జలధారతోపాటుగ, కన్యను ధారపోయుదురు. రామాయణంలో వాల్మీకి మహర్షి వచనము జూతము. సీతాదేవి రామునితో చెప్పెడి మాటలివి.

"జీవలోకే చ పితృభిః యా స్త్రీ యస్య మహామతే।
అద్భిర్దత్తా స్వధర్మేణ ప్రేత్యభావేఽపి తస్య సా॥"

అద్భిః అనగా జలములతో (లోతుగ పరిశీలించిన వేదమంత్రములతో) అని అర్థము. లోకమున దల్లిదండ్రులచే నేకన్య జలములతో పాటుగనే వరునకీయబడునో నామె యీలోకములోను, పరలోకములోనూ నాతనికే భార్యయగును.

అట్లే జాత, మృతాశౌచ సమయములో నింటిని పవిత్రము చేయుటకు పుణ్యాహవాచన మంత్రములతో జలముల నారాధించి ఆ జలముల నిల్లంతయు జల్లుదురు. ఎందుకనగా జలములకంత శక్తి గలదు. ఆ జలములు స్వతఃపవిత్రములు. మరియొక వస్తువును పవిత్రము చేయగల్గినవి. జలముల శుద్ధి చేయగల్గిన వస్తువు లేదు. సాధారణ జలములకే ఇంతశక్తియున్న, తీర్థజలములెంత శక్తివంతములో?

"తీర్థోదకం చ వహ్నిశ్చ నాన్యతః శుద్ధి మర్హతః"।

తీర్థోదకమును, అగ్నిని శుద్ధి చేయదగిన వస్తువు లేదు. అవి స్వతః పరిశుద్ధములు.

పూజలు చేయుటకు ముందు మొదట కలశములో జలమును బోసి ఆ జలమునిట్లు ప్రార్థింతురు.

"కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్రః సమాశ్రితః
మూలే తత్ర స్థితో బ్రహ్మా మధ్యే మాతృగణాః స్మృతాః
కుక్షౌ తు సాగరా స్సర్వే సప్త ద్వీపా వసుంధరా
ఋగ్వేదో2థ యజుర్వేదః సామవేదో హ్యథర్వణః
అంగైశ్చ సహితాః సర్వే కలశాంబు సమాశ్రితాః॥"

ఈ జలపూర్ణమైన కలశముయొక్క ముఖమున విష్ణువు, కంఠమున శివుడు, మూలమున బ్రహ్మ, మధ్య మాతృగణములు, ఉదరమున సాగరములు, భూమియునుగాక ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము సాంగముగ కలశములోని జలము నాశ్రయించియున్నవి. దీనినిబట్టి వేదములు జలముల నాశ్రయించి యుండునని దెలియ నగును. ఇంకొక వేదమంత్రమును జూతము.

"ఆపో వా ఇదగ్ం సర్వం విశ్వా భూతాన్యాపః, ప్రాణావా ఆపః, పశవ ఆపో2న్న మాపో2మృతమాపః. సమ్రాడాపో, విరాడాపః, స్వరాడాపః ఛందాం స్యాపో, జ్యోతీం ష్యాపో, యజూంష్యాపః, సత్యమాపః, సర్వదేవతా ఆపో భూర్భువ స్సువరాపఓమ్"॥

జలములే యీ విశాల విశ్వము, సమస్తభూతములు, ప్రాణములు, పశువులు, అన్నము, అమృతము, ఛందస్సులు, జ్యోతిస్సులు, యజుస్సులు, వేదములు, సత్యము, సమస్త దేవతలు, ఓంకారమున్నూ అని అర్థము.

కావున జలములనగా సామాన్యజలములుగాదు. చతుర్వేద స్వరూపమనీ అనగా వేదమంత్రస్వరూపమనీ, దేవతాస్వరూపమనీ ఓంకారస్వరూపమనీ, అమృతస్వరూపమనీ తెలియనగును.

బ్రాహ్మణో జంగమం తీర్థం త్రిషు లోకేషు విశ్రుతమ్।
యేషాం వాక్యోదకేనైవ శుధ్యన్తి మలినా జనాః ॥" - పరాశర స్మృతి.

బ్రాహ్మణులు నడిచే తీర్థములు. వారి వాక్కులనెడి ఉదకము చేత (జలముతో) మాలిన్యము వొందిన జనులు శుద్ధి వొందెదరు అని యర్థము. ఇట బ్రాహ్మణుల వాక్యములనగా వేదవాక్కులే. వేదమంత్రములే. ఈ వేదవాక్కులు జలములతో పోల్చబడినవి. కావున జలములు వేదవాక్కులుగా పోల్చదగినవి, దర్శించదగినవి గాని సామాన్యమైన నీరుగా దర్శించరాదు.

"పయః కీలాల మమృతమ్" -అమరకోశము.

జలములమృతమని యర్థము. "అమృతమాపః" అని వేదము జలమమృతమని చెప్పెను. "త్వం తదాప ఆపో జ్యోతీరసో2 మృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్" అని వేదమే అపస్సులు. అనగా జ్యోతిస్సులు, రసము, అమృతము, బ్రహ్మ ఓంకారమని మరియొకచోట తెల్పెను. "సా హి శ్రీరమృతా సతామ్" - అని వేదము. అనగా సత్పురుషులకు అమృత స్వరూపిణియైన వేదవాణియే లక్ష్మి యని యర్థము.

"వందేమహి చ తాం వాణీ మమృతా మాత్మనః కలామ్।"

అని భవభూతి మహాకవి వేదవాణి. అమృతయని చెప్పెను. అభిధాన చింతామణి మొదలగు కోశములు జలములనమృతములని బేర్కొనినవి.

"జీవం జీవరసం దివ్యమమృతం జలముచ్యతే।

జలము దివ్యమైన అమృతమట. విష్ణుసహస్రనామస్తోత్రము "అమృతః శాశ్వతః స్థాణుః" అని శ్రీ మహావిష్ణువు నమృతముగా జూపెను. కావున జలము, వేదవాణి, శ్రీమహావిష్ణువు - యీ ముగ్గురును అమృతస్వరూపములని దెలియనగును.

ఇట్టి యీ యమృతస్వరూపములైన జలములు మనము పొరపాటుగ ఉచ్ఛిష్టముగాని, తినగూడని పదార్థము తిన్ననూ, ఎట్టి దుశ్చరితమునకు పాల్పడిననూ, దానినంతయు బోగొట్టి మమ్ము పవిత్రముజేయుగాక. అని జలమును ప్రార్థించెడి వేదమంత్రమిదుగోః-

యదుచ్ఛిష్ట మభోజ్యం యద్వా దుశ్చరితం మమ।
సర్వం పునన్తు మామాపః ॥"

జలములు దేవతాస్వరూపములు, వేదవాక్స్వరూపములు గావుననే వానికట్టి శక్తి. ఇంకనూ

"ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః॥
అయనం తస్య తాః పూర్వం తస్మాన్నారాయణో మతః॥ - విష్ణుపురాణము

ఆపస్సులనగా జలములు. ఇవి నరుని పుత్రులు. అందుచే నారములని చెప్పబడు చున్నవి. ఈ నారములే (జలములే) నివాసస్థానముగ గల్గినవాడు నారాయణుడగును. నరుడన శ్రీమహావిష్ణువే- "విష్ణుః నారాయణో నరః"-అని విష్ణుసహస్రనామస్తోత్రము. కాన నారాయణుని-పరమేశ్వరుని నివాసస్థానము నారములు-జలములు-అనగా వేదమంత్రములే యగును. ఇంకొక మంత్రము

" ఆపో హి ష్ఠా మయోభువః। తా న ఊర్జే దధాతన।
మహే రణాయ చక్షసే। యో వ శ్శివతమో రసః॥
తస్య భాజయతేహ నః॥"

పరమాత్మ దర్శనము కడు రమణీయము. మోక్షప్రదము. జలములారా! అట్టి రమణీయమైన పరమాత్మ దర్శనమును మాకు ప్రసాదింపుడనియు, మీలోని శివతమమైన

రసమును (రసో వై సః - రసమనగా పరమాత్మ) మాయందు నింపుదని యర్థము. అప్, సలిలం, జలం, ఉదకం మొదలగు పదములకు సాధారణముగ జలమనియే (నీరే)నని యర్థము. కాని పరమాత్మను దర్శింపజేయగల లక్షణము వేదవాక్కులకు మాత్రమే గలదు. అట్లు తమలో నివాసముండెడి పరమాత్మను - శివతమ రసమును - దర్శింపజేయగల్గిన యీ జలములు వేదవాక్కులే యగును. అనగా వేదమంత్రములని యర్థము.

"సో2పో2సృజత - వాచ ఏవ - వాగేవా2స్య సా2సృజత"। "గౌరీర్మిమాయ సలిలాని తక్షతీ ఏకపదీ, ద్విపదీ, సాచతుష్పదీ, అష్టాపదీ సహస్రాక్షరా పరమేవ్యోమన్" బ్రహ్మయందు ప్రతిష్ఠింపబడి, గౌరవర్ణము గల వాగ్దేవత సలిలరూప వాక్కులను సృజించుచూ శబ్దము చేసింది. మొదట ఓంకారముగా (ఏకపది వెల్వడింది తరువాత వ్యాహృతి రూపంగాను, సావిత్రి రూపంగా ద్విపది అంటే రెండు పదములు గలదిగా ఆవిర్భవించింది. తర్వాత వేద చతుష్టయ రూపంలో చతుష్పదిగాను... అలా వాఙ్మయరూపంలో ఆవిర్భవించింది అని అర్థము. ఇట్లీ వేదమంత్రముల వలన అప్, సలిల శబ్దములు వేదవాక్పరములుగా దెలియనగును. కావున జలములను సాధారణ జలములుగ గాక పరమేశ్వర స్వరూపముగను వేదవాక్స్వరూపముగాను దర్శించవలెను. (ఆపః వాచేవ).

"తస్మాదుపాసకో దేవీం ప్రార్థయే దప్స్వరూపిణీమ్"।

ఉపాసకుడైన మానవుడు అప్స్వరూపిణియైన దేవినారాధించవలెను. అబ్దేవతయన వాగ్దేవతయే. కావున జలస్నానములెంత పవిత్రములో తెలియనగును. సామ్రాజ్య పట్టాభిషేకములో, రాజునుగాని, విగ్రహములగాని, శివలింగమును, లక్ష్మీదేవిని, సాలగ్రామశిలను జలములతో నభిషేకించుటయనగా వేదమంత్రములతోనభిషేకించుటయే - కావున నట్లభిషేకార్హులైన వారు పరమ శక్తిమంతులు. మంగళప్రదులు. అట్లే వివాహములలో గూడ నన్వయించుకొన దగును. వధువునకు యుగఛిద్రము ద్వారా జలములతో నభిషేకము చేస్తారు గద!

ఇక నదీజలముల పరిశీలింతము.

"భూమిష్ఠ ముద్ధృతాత్పుణ్యం తతః ప్రస్రవణోదకమ్।

తతో2 పి సారసం పుణ్యం తస్మా న్నాదేయ ముత్తమమ్। - అగ్ని పురాణము

భూమినుండి పైకిగొని రాబడిన జలముకన్న సెలయేటి జలము, దానికన్న సరస్సులోని జలము, దానికన్న నదీజలముత్తమమైనదని యగ్నిపురాణము తెల్పుచున్నది.

శివాభిషేక సమయంలో నమక మంత్ర పరిశీలన చేయదగును.

"నమో నాద్యాయ చ వైశంతాయ చ"

నదులలో నుండు దేవతామూర్తియగు రుద్రుడు నాద్యుడు. - నాద్యునికి నమస్కారము.

"నమస్తీర్థ్యాయ చ కూల్యాయ చ। నమః పార్యాయ చావార్యా య చ।

నమశష్ప్యాయ చ ఫేన్యాయ చ।
నమస్సికత్యాయ చ ప్రవాహ్యాయ చ॥"

తీర్థస్వరూపుడు, నదీతీరస్వరూపుడు, తీరస్థ బాలతృణ, కుశ, దర్భ స్వరూపుడు, ఫేన (నురుగు) స్వరూపుడు, సికతీ (ఇసుక) స్వరూపుడు,ప్రవాహస్వరూపుడునగు రుద్రునికి నమస్కారము అని యర్థము. అనగా నదులు, తీర్థములు, నదీతీరములు, తీరములలోని మొక్కలు, నదులలోని నురుగు, ఇసుక, ప్రవాహము - అన్నియును పరమేశ్వర స్వరూపములే.

ఇట్టి నదులలో కృష్ణానది వేదస్వరూపిణియని పురాణములు దెల్పుచున్నవి.

ఇయం వై నిర్మితా పూర్వం మయా సా వేదరూపిణీ।
వేదపాదాత్ సముత్పన్నా పుణ్యా వై లోక పావనీ॥ -స్కాంద పురాణము

వేదపాదములనుండి పుట్టి, వేదస్వరూపిణి, పుణ్యమూర్తి, లోకపావనియగు కృష్ణానది మునుపెపుడో భగవంతునిచే సృష్టింపబడినదని యర్థము.

"కృష్ణా కృష్ణాంగ సంభూతా సర్వలోకోపకారిణీ।
ఓషధ్యాదాయ గచ్ఛన్తీ బ్రహ్మానంద స్వరూపిణీ॥" -స్కాందపురాణము.

శ్రీకృష్ణపరమాత్మ యొక్క యంగములనుండి బుట్టి, సర్వలోకోపకారార్థము ఓషధులను తీసికొనివచ్చుచూ ప్రవహించెడి యీ కృష్ణానది బ్రహ్మానందస్వరూపిణియై యొప్పుచున్నది.

"బ్రహ్మానందరసేన పూర్ణాం జలేన పూర్ణామితి మేనిరే2జ్ఞాః
తాం త్వావగాహామి పిబామి కృష్ణే దేవాన్ ఋషీన్ తర్పయిష్యే పితౄంశ్చ ।"
-స్కాంద పురాణము

సాధారణముగ నజ్ఞులకి (పామరులకు) కృష్ణానది సాధారణ జలములతో నిండియున్నట్లు కనపడును. విజ్ఞులకు (జ్ఞానవంతులకు) యీనది బ్రహ్మానందరసముతో నిండియున్నట్లు గానవచ్చును. అట్టి యీ నదీజలములలో నవగాహనము జేయుచూ (మునుగుచూ) జలమున్ను త్రాగవలెననగా బ్రహ్మానంద్దరసాస్వాదము చేయవలెనని య్యర్థము. దేవతలు, ఋషులు, పితరులకు తర్పణమీయవలెననగా వారిని తృప్తి నొందించవలెనని యర్థము.

"శ్రుతీనాం సర్వస్వం సుకృత మథ మూర్తం సుమనసామ్।
సుధాసారస్యం తే సలిలమశివం నశ్శమయతు."

- *జగన్నాథ పండితుని గంగాలహరి.*

నిఖిలవేదసారములగు నీనదీ జలములమృత స్వరూపములు. ఇట్టి నదీజలములు మన యశుభముల బారద్రోలుగాక! యని యర్థము.

ఇట్టి వేద, వాక్స్వరూపములైన నదులను, నదీజలములను తీర్థములందురు.

అందుకనియే, 'తీర్థోదకంచ వహ్నిశ్చ నాన్యతః శుద్ధి మర్హతః' యనెడి భవభూతి మహాకవి వచనము సార్థకము. తీర్థోదకము (నదీజలము) వేదస్వరూపము గనుకనే స్వతః శుద్ధము. ఇతర పదార్థముల శుద్ధి చేయును. తరింపజేయును. కాని వేదరూప తీర్థమును శుద్ధి చేయ గల్గిన ఇతర వస్తువువేదియును లేదుగద!

తీర్థజలము గూర్చి వాల్మీకి మహర్షి యభిప్రాయమిది.

అకర్దమమిదం తీర్థం భరద్వాజ నిశామయ।
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా॥ - రామాయణము

బురదలేని, స్వచ్ఛమైన, నిర్మలమైన యీ తమసానదీ తీర్థజలము పాపపుచింతలేని, నిర్మలమైన, ప్రసన్నమైన, స్వచ్ఛమైన సత్పురుషుని మనస్సు వలెనున్నదని యర్థము.

సత్పురుషులనగా బ్రహ్మానందరసాస్వాదన చేసిన బ్రహ్మజ్ఞానులు. వేదవిద్యా వ్రతసాతులు. అట్టి సత్పురుషుల మనస్సు వేదవిద్యామయము. కావున తీర్థజలము వేదవిద్యాస్వరూపమని స్పష్టము.

తీర్థమన మంత్రమని వైజయన్తీ కోశము, అనేకార్థ సంగ్రహము మొదలగు కోశములు చెప్పుచున్నవి.

"తీర్థం మంత్రాద్యు పాధ్యాయ శాస్త్రేష్వంబుని పావనే।' - వైజయన్తీ కోశము.

"పుష్కరం ద్వీపతీర్థా హి ఖగరాజౌషధాన్తరే। ఖే జలేంబుజే చ।"

- అనేకార్థ సంగ్రహము.

తీర్థమనగా మంత్రము, ఉపాధ్యాయుడు, శాస్త్రము, జలము అని అర్థము. పుష్కరమనగా ద్వీపము, తీర్థము, సర్పము, ఖగరాజు, ఔషధము, ఆకాశము, జలము, పద్మము అని అర్థము. కావుననే తీర్థస్వరూపులు, జగద్గురువులునగు మహాత్ములు "విద్యాతీర్థ" యని "భారతీతీర్థ" యని పిలువబడుచున్నారు. వీరు గూడ పుష్కర స్వరూపులే.

కాన పుష్కరమనగా తీర్థము. జలము-మంత్రము అని తెలినది. ఇంకనూ -

"మనో హి సరస్వాన్ - వాక్ సరస్వతీ" - అని వేదమంత్రము.

సరస్వాన్ అనగా సముద్రుడు. ఈ సముద్రుడే మనస్సు. సరస్వతి అనబడు 'నది' సముద్ర దయిత (భార్య). ఈ నది వాక్కు అని అర్థము. అనగా నది వేదవాక్స్వరూపిణి, సముద్రుడు మనోరూపుడు అని స్పష్టము. కావుననే

"చకారాతి ప్రసన్నాత్మా తీర్థే పరమపావనే।
మనః ప్రసన్నం సంజాతం స్నాత్వా సారస్వతే జలే ॥" -దేవీ భాగవతము

సారస్వతమగు (సరస్వతి నది లేక వేదవాక్కు) పవిత్ర తీర్థజలములో స్నానము చేసినవాని మనస్సు ప్రసన్నము, పావనమగును. ఇదియే నదీజల స్నానమందలి యాంతర్యము.

అగ్నిపురాణము - వైద్యుడు, నదిలేని ప్రదేశమున నివసింపరాదనీ, శుద్ధమైన నదీజల మెచట ప్రవహించునో నా ప్రదేశము పరమపుణ్యమైనదనీ, అట్టి నదీస్నానమాచరించక పితరులకు దేవతలకు తర్పణమీయకుండ ఉండరాదని చెప్పినది.

వైద్యరాజ నదీహీనే దేశే న నివసేత్సదా।
శుద్ధం నదీగతం తోయం పుణ్యం తద్వత్ర సారితమ్॥
అనంతర్ప్య పితౄన్ దేవాన్ నదీపారం చ న వ్రజేత్।"

-అగ్నిపురాణము.

సుమతి శతకము ఈ విషయాన్నే ఇలా వివరించినది :- అప్పిచ్చువాడు వైద్యుడు నెప్పుడు నెడతెగక పారు నేరును ద్విజుడున్. చొప్పడిన యూర మండుము చొప్పడ కున్నట్టి యూరజా రకుము సుమతీ !

ఇంతవరకు పుష్కరశబ్దమునకు జలమనీ, ఆ జలము వేదస్వరూపమనీ, వేదమంత్ర స్వరూపమనీ, నదులు, నదీజలములు పరమేశ్వరస్వరూపమనీ, పరమేశ్వరుని నివాసస్థానమనీ తెలియనగును.

గణపతి సహస్రనామములలోని గణపతి పేర్లలో 1) పుష్కరస్థః 2) మంత్రః 3) మంత్రపతిః 4)మంత్రీ యని ఉన్నవి. వీనినిబట్టి గూడ పుష్కరమనగా మంత్రమని, వినాయకుడు పుష్కరస్థుడనియు స్పష్టము. పుష్కరస్థుడనగా మంత్రములందు సుప్రతిష్ఠుడని అర్థము. పుష్కరశబ్దమునకు మరికొన్ని అర్థముల పరిశీలించిన కొత్త విశేషములు కాననగును.

"ఏవం నారాయణ స్యార్థే మహీ పుష్కర సంభవా।
ప్రాదుర్భావేత్ప్రయస్త స్మా న్నామ్నా పుష్కర సంజ్ఞితా॥"

-పద్మ పురాణము.

నారాయణుని ఇచ్ఛచే పుష్కరము (జలము) నుండి యుద్భవించిన పృథివి (భూమి) పుష్కరమని పిలువబడుచున్నది.

"న్యగ్రోధః పుష్కరద్వీపే పుష్కరస్తేన సః స్యాత్" - మత్స్యపురాణము. పుష్కరద్వీపములో పుష్కరమను పేరుగల మఱ్ఱిచెట్టుగలదు. ఆ మఱ్ఱిచెట్టు బ్రహ్మకు స్థానమని విష్ణుపురాణము.

"న్యగ్రోధః పుష్కరద్వీపే బ్రహ్మణః స్థానముత్తమమ్॥" - విష్ణుపురాణము
"సః ప్రజాపతిరేకః పుష్కరపర్ణే సమభవత్।" - వేదము

ప్రజాపతి యొకడు పుష్కరపర్ణమందుండెనని యర్థము. గణపతి సహస్రనామమందలి పుష్కరస్థః' అను నామము. పుష్కరమందున్నవాడు గణపతియని పై వేదార్థమును స్పష్టము సేయుచున్నది. మఱ్ఱియాకుమీద పరుండియుండెడు విష్ణువే యా ప్రజాపతి. ఆ విష్ణువే గణపతి (శుక్లాంబరధరం విష్ణుమ్). ఈ విషయమునే దేవీభాగవతమిట్లు చెప్పుచున్నది.

"వటపత్ర శయానాయ విష్ణవే బాలరూపిణే" -దేవీభాగవతమ్

వటపత్రమందు - పుష్కరపర్ణమందు - శయనించియున్న బాలరూపుడైన విష్ణువునకు నమస్కారమని యర్థము.

పుష్కరమనగా వేదవాక్కులని చూపబడినది గద! కాన పుష్కరపత్రమందు శయనించుట యనగా వేదవాక్కులలో శయనించుటయని తెలియనగును. పరమేశ్వరుడు 'గిరీశః' అని కీర్తింపబడుచున్నాడు. (గిరి శేతే ఇతి గిరీశః) వేదవాక్కులందు శయనించినవాడు కాన గిరీశః, వటపత్రశాయీ, పుష్కరపర్ణశయానః అను పదములు సమానార్థకములు.

పుష్కరశబ్దమునకు సర్పరాజని యర్థము గలదు. 'వటపత్ర శయానాయ విష్ణవే' అని దేవీభాగవత వచనము చూతము. వటపత్రము మీద శయనించిన విష్ణువనగా సర్పరాజైన యాదిశేషునిపై శయనించిన విష్ణువని చెప్పనగును. కాన పుష్కరపూజయనగా అవ్యాకృతతత్త్వ స్వరూపుడగు యాదిశేషుని పూజయేనగును.

లలితా సహస్రనామములో లలితాదేవికి 'పుష్కరా', పుష్కరేక్షణా' యను నామములు గలవు. వీనికి భాస్కరరాయవ్యాఖ్య ప్రకారమర్థము చూతము.

1. పుష్కరా - పుష్కంరాతీతి పుష్కరా - పోషణనిచ్చునది. గాన లలితాదేవి పుష్కరయగును.
2. పుష్కరేక్షణా - ఈ నామమునకు రెండు సమాసములున్నవి. 1) పుష్కరే ఈక్షణం యస్యాః సా (పుష్కర + ఈక్షణ) పుష్కరములందు ఈక్షణము గల్గినది. పుష్కరములన జలములు. ఈ జలములు నాల్గురకములు.

"తాని వా ఏతాని చత్వార్యంభాంసి - దేవా మనుష్యా పితరో2 సురాః" - అని వేదము.

దేవతలు, మనుష్యులు, పితరులు, అసురులను యీ నాల్గురకముల జలములందు ఈక్షణగలది అనగా నిరంతరము వారిని చూచుచూ పోషించునదియని యర్థము.

"అంభోనిధి రనంతాత్మా" యని విష్ణుసహస్రనామములోని అంభోనిధియను నామముకు శంకరా చార్యులవారు భాష్యము వ్రాయుచు పైన చెప్పబడిన భాస్కరరాయ వ్యాఖ్యకు త్రోవచూపిరి.

2) పుష్కరే క్షణా అని సప్తమీ విభక్తి లోపించని అలుక్ సమాసము. పుష్కరశబ్దమునకు భూమి, జలము అని యర్థములున్నవి-గద! క్షణ శబ్దమునకు నిర్వ్యాపార స్థితి, కాలవిశేషము, ఉత్సవము అని యర్థములున్నవి.

"క్షణో నిర్వ్యాపార స్థితౌ కాలవిశేషోత్సవయోః' -అమరకోశము.

కావున పుష్కరే క్షణా అనగా భూమ్యాది విషయములందు నిర్వ్యాపార స్థితి గల్గినదనియు, జలములందు ఉత్సవములుగలదియనియు నర్థములు. జలములందు ఉత్సవమనగా పుష్కరోత్సవము. ఇట్లీ లలితానామముల బురస్కరిం చుకొని పుష్కరోత్సవమనగా లలితాదేవ్యా రాధనయేనని చెప్పవచ్చును.

ఇట్లు పుష్కరశబ్దార్థము నింకనూ పరిశీలించుకొనవచ్చును. పుష్కరమనగా వేదమంత్ర పదములని స్పష్టము చేయు వేదమంత్రములెన్నియో గలవు.

"యోఽపాం పుష్పం వేద। పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి" ఇత్యాది మంత్రముల న్నియు అపస్సులు వేదమంత్రములని దెలియుచున్నవి.

కావుననే మానవులు పుష్కరోత్సవములు సలిపి, నదీపుష్కర స్నానమాచరించి, దేవర్షి పితృతర్పణము గావించి తరింతురుగాక!

కృష్ణాష్టోత్తర స్తోత్రములో శ్రీకృష్ణునికి 'తీర్థపాదః' 'సర్వతీర్థాత్మకః, సర్వగ్రహరూపీ' యను నామములున్నవి. శ్రీకృష్ణపరమాత్మ సర్వతీర్థస్వరూపుడు. ఆయన పాదములే తీర్థములు. అట్టి తీర్థముల సేవించి కృష్ణపరమాత్మునియనుగ్రహ పాత్రులగుదురు గాక!

**కృష్ణాయాం వేదరూపిణ్యాం దేవర్షి పితృతర్పణాత్।**
**పుష్కరేమ ధ్రువం శమ్యాత్ పుష్కరే క్షణయా శివః॥**

ఇతిశమ్

"నమామ పుష్కరం వేదమ్"



# ఆర్షవాణి

**"ఇదం కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే ।**
**వందేమహి చ తాం వాణీ మమృతా మాత్మనః కలామ్॥"**

సనాతనకవి పరమేశ్వరుడు. వేదము గూడ. తరువాత కవులు వాల్మీకి, కాళిదాసాదులు. సనాతనమగు వాణి వేదవాణి. ఈ వాణి అమృతా. అమృతస్వరూపిణి. (సాహి శ్రీరమృతాసతామ్) బ్రహ్మదేవుని అంశ. అట్టి సనాతనకవులకు, అమరవాణికిని, నమస్కారమని భవభూతి మహాకవి వాణి.

**"అహమస్మి ప్రథమజా"** - అందరికన్న ప్రప్రథమంగా పుట్టినదానని వేదవాణి తన్నుగూర్చి తెల్పినది. వేద దేవ పదములు పర్యాయపదములు. "వేదో2సి యేన వేద త్వం దేవ వేద దేవే భ్యో వేద అభవః ।" యను వేద మంత్రము దేవ, వేద పదములు సమానములని తెల్పుచున్నది. కాన వేదవాణియే దేవవాణి. దేవవాణియే వేదవాణి. దీనికి సంస్కృతవాణియని పేరు గలదు.

"సంస్కృతం నామదైవీ వాగన్వాఖ్యాతా మహర్షిభిః" - కావ్యాదర్శ.

సంస్కృతమనబడెడి ఈ దైవీవాణి మహర్షులచే దర్శింపబడినది అని అర్థము. ప్రపంచములో మొదటి ఋషి పరమేశ్వరుడు. (ఋషిర్దర్శనాత్) సర్వప్రపంచ దర్శనము గలవాడగుట చేత పరమేశ్వరుడు ఋషి. అ పరమేశ్వరుని దర్శించుటచేత వేదవాణి ఋషి. వేదమును, భగవంతుని, అతీంద్రియార్థ దర్శనముగల మహనీయులు దర్శించుటచే (క్రాంత దర్శనము) ఋషులు అయిరి. అట్టి ఋషులచేత దర్శింపబడిన వేదవాణి - సంస్కృతవాణి-ఆర్షవాణి అయినది. "ఋషిర్వేదే వసిష్ఠాదౌ" అని మేదినీ, వైజయంతీత్యాది కోశములు ఋషిశబ్దము వేదము, వసిష్ఠాది ఋషులకు వాచకమని చెప్పుచున్నవి.

**"యుగాన్తే2 న్తర్హి తాన్ వేదాన్ సేతిహాసాన్మ హర్షయః।**
**లేభిరే తపసా పూర్వమనుజ్ఞాతాః స్వయంభువా॥"**

యుగాన్తమున అంతర్హితములైన ఇతిహాసోపేతమైన వేదములను బ్రహ్మదేవుని అనుజ్ఞతో తపస్సు ద్వారా పొంది, ప్రపంచమున కందించారీ మహర్షులు.

యజ్ఞేన వాచః పదవీయ మాయన్। తామన్వ విందన్ ఋషిషు ప్రవిష్టామ్ - ఋగ్వేదము

ధీరులైనవారు ఋషులయందు ప్రవిష్టమై, నిహితమైన వేదవాణిని పొంది, యజ్ఞముల ద్వారా వేదవాణి యొక్క మార్గముల నడుచుచూ వేదవిహిత ధర్మాచరణ చేస్తారని ఋగ్వేదము చెప్పుచున్నది.

**"ఋషిర్వేదః। తదుక్తం ఋషిణా ఇత్యాదౌ తథాదర్శనాత్"**

"ఋషిర్వేదమంత్రః॥ - సిద్ధాన్త కౌముదీ. - తత్త్వ బోధినీ

"ఋషిః పఠతి గ్రావాణః పఠతి" - పాతంజల మహాభాష్యము ప్రకారం ఋషి వేదము-వేదమంత్రము ఋషి అని తెలియనగును. కాన వేదవాణియే ఆర్షవాణి.

ఈ ఆర్షవాణియే సంస్కృతవాణి. ఈ వాణియొకటే మానవుల కలంకారమనీ, ఇతర అలంకారములన్నీ నశించెడివనీ భర్తృహరి మహాకవి ప్రబోధము.

"వాణ్యేకా సమలంకరోతి పురుషం యా సంస్కృతా ధార్యతే।
క్షీయన్తే ఖిల భూషణాని సతతం వాగ్భూషణం భూషణమ్"

'కరోతి' అను ధాతువునకు 'సం', 'పరి' అను ఉపసర్గలు వచ్చినపుడు, అలంకారము, ఏకత్వము అను అర్థములు వచ్చునపుడు "సం పరిభ్యాం కరోతౌ భూషణే సమవాయేచ" అను సూత్రము ద్వారా 'సుట్' అనబడు ఆగమము వచ్చి సంస్కరోతి, పరిష్కరోతి అను రూపములు నిష్పన్నమగునని పాణిని మహర్షి తెలిపెను.

ఇతర అర్థములలో సంకరోతి, పరికరోతి అనియే రూపములుండును. సంస్కరోతి అను ధాతువునకుక్త ప్రత్యయము 'సంస్కృతమ్'. కావున సంస్కృతం అంటే మానవులను అలంకరించునది, సమైక్యపరచునది అని పాణిని మహర్షి సంస్కృతవాణి యొక్క మహత్త్వమును లోకమునకు చాటిచెప్పినాడు. ఇంకనూ,

"సంస్కృతం సంస్కృతం నామ సపదం స్యర్థ సంజ్ఞకమ్।
అన్వర్థాక్షర మేతద్ధి సంస్కరోతీతి సంస్కృతమ్॥"

సంస్కృతమను పదము వ్యర్థమైన సంజ్ఞ కాదు. మానవుల సంస్కరించునది గావున సంస్కృతం అను సంజ్ఞ అన్వర్థ సంజ్ఞయే. సంస్కారముగల భాష గాన సంస్కృతం అని [illegible]. సరికాద శాస్త్రములచే సుశిక్షితమగుట. సంస్కారమనగా వేదము అని గూడ అర్థము గలదు. "సంస్కారాసే _2 భవవ్ వేదాః" అని రామాయణము ద్వారా వేదములే సంస్కారములుగా శ్రీరాముని యందు ప్రవేశించినట్లు తెలియనగును. వేదరూప సంస్కారముగల భాష సంస్కృత భాష. ఇది వైదిక సంస్కారము. లౌకిక సంస్కారము గూడ సంస్కృతభాషలో గలదు.ఎట్లనగా :-

బూజు, దుమ్ము, మలినముల తుడిచి, కడిగి, సున్నము, రంగులు వేసి ఇంటికి సంస్కారము చేసినట్లు (ఇంటిని సంస్కరించినట్లు) మానవులను సంస్కరించేది, సంస్కరించ గలిగేది ఏది? మానవ శరీరానికి బాహ్యశుద్ధికోసం నీరు, సబ్బులు, గంధము, సెంటు వగైరా అవసరము. అంతఃశుద్ధి ఎట్లు గల్గును? చిత్తశుద్ధి ఎట్లు గల్గును? చిత్త మాలిన్యమెట్లు తొలగించబడును? అట్లు చేయగలిగినది యీ ఆర్షవాణి యొకటే.

"మతిభేద తమస్తిరోహితే గహనే కృత్యవిధౌ వివేకినామ్।
సుకృతః పరిశుద్ధ ఆగమః కురుతే దీప ఇవార్థ దర్శనమ్"

- కిరాతార్జునీయమ్.

అజ్ఞానాంధకారము దట్టముగా ఆవరించి, మతిభేదముగల్గి కిం కర్తవ్యతా మూఢులైన వివేకవంతులకు, పరిశుద్ధమైన వేదము, దీపము చీకటిని తొలగించి పదార్థ దర్శనము గావించి నట్లుగా అజ్ఞానమును నిర్మూలించి, పరమార్థ దర్శనము గావించి, వారిని కర్తవ్యోన్ముఖులను చేయునని అర్థము.

అంతఃశుద్ధికి, చిత్త శుద్ధికి లౌకికోపకరణములు లేవు.ఉన్నను పనిచేయవు. చిత్తశాంతి నీయజాలవు. ఇచ్చినను తాత్కాలికమే. శాశ్వత సుఖశాంతులను ప్రసాదించునది వేదమే.

శరీరమునకు సోకిన వ్యాధి నివారణకు లౌకిక వైద్యులకు శక్తి చాలవచ్చును. చాలకపోవచ్చును. అపుడీ లౌకికవైద్యులకు గూడ ద్రోవజూపు అలౌకికవైద్యుడు పరమేశ్వరుడు. (ప్రథమోదైవ్యోభిషక్). ఆ వైద్యుడు వేదమనెడి వైద్యముతో (రుద్రాభిషేకము, సహస్ర నామపూజలు) ఎటువంటి వ్యాధినైనా నిర్మూలించగలడు. "వాచా సరస్వతీ భిషజా" అని వేదమే పరమేశ్వరుని వైద్యునిగను, తనను గూడ దివ్యవైద్యరాజమని తెలిపినది. అందుకనియే లలితాసహస్రనామములలో లలితా పరాదేవిని, భాషారూపిణిగను (వాణి), సమస్త వ్యాధుల నివారంచునదిగను, మృత్యువనెడి దారువునకు గొడ్డలిగను, సంసారమనే బురదలో మునిగినవారిని ఉద్ధరించుదానిగను, జన్మ, మృత్యు, వృద్ధాప్యములతో తపింపబడువార్కి విశ్రాంతి నొసగుదానివిగను ఆరాధిస్తున్నాము.

భాషారూపా బృహత్సేనా, సర్వవ్యాధి ప్రశమనీ, మృత్యుదారు కుఠారికా, సంసారపంక నిర్మగ్న సముద్ధరణ పండితా। జన్మ, మృత్యు, జరా తప్త జన విశ్రాన్తి దాయినీ" - లలితాసహస్రనామములు.

"వేద్యో వైద్యః సదాయోగీ" - విష్ణుసహస్రనామములు.

ఈ ఆర్షవాణి అనేకరహస్యములను, ధర్మములను, విధులను, వైద్యప్రక్రియలను , రసాయనిక, భౌతిక,అణువిజ్ఞానమును మానవులకు ప్రసాదించెడి దివ్యవిజ్ఞానభాండాగారము. ప్రపంచంలో మొట్టమొదట దివ్యమైన కంప్యూటర్. ఎట్లనగా...

ఇతర భాషాపదములకు యోగశక్తి లేదు. అవి కేవలం భౌతికార్థ బోధకములు. ఉదా : గుఱ్ఱము, ఘోడా, హార్స్ అను ఇతర భాషా పదములు గుఱ్ఱమనెడి భౌతిక పదార్థమునే జూపును. మరి సంస్కృత భాషాపదములకు యోగశక్తి కలదు. అవి ఆధిదైవిక, ఆధ్యాత్మికార్థ ములతోపాటు ఆధిభౌతికార్థముల జూపును. గుఱ్ఱమును సంస్కృతంలో 'అశ్వ'మందురు కాని అశ్వమనెడి పదము యోగశక్తి ద్వారా 'వ్యాపించునది' అని అర్థము గల్గినది. అపుడు వ్యాపించు లక్షణముల గల పరమేశ్వరుడు, సూర్యకిరణము, వాయువు, భూమి, మనస్సు ఇవియేగాక గుఱ్ఱము ఇవన్నియు అశ్వశబ్ద వాచ్యములే. అశ్వమనే పదం ఎంతదూరమైనా అలనటజెందక పరిగెత్తుచూ వ్యాపించెడి లక్షణము గుఱ్ఱమునకు ఉన్నట్లు తెల్పుతోంది.

ఇట్టి యీ లక్షణమును, అర్థమును ఇతర భాషాపదములు చెప్పజాలవు. ఇంకనూ, ఆర్షవాణి మానవాళినిట్లు హెచ్చరిస్తున్నది.

" సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవో మనాంసి జానతామ్
సమానో మంత్రః సమితిః సమానీ సమానం మనః
సహచిత్త మేషామ్। సమానీ వ ఆకూతిః సమానా హృదయాని వః"

*- ఋగ్వేద-5.*

మానవులందరు కలిసిమెలిసి తిరగాలి, విరోధము వీడి, ఒకరి మనస్సు నొకరెరిగి మసలు కోవాలి. అందరి ఆలోచన, సంకల్పము ఒక్కటిగా ఉండాలి. అందరు హృదయములను విప్పుకొని ఒకే హృదయముతో, ఒకే మనస్సుతో మెలగాలి. ఈవాణి బృహదారణ్యకోపనిషత్తు ద్వారా, అందరు యుద్ధములు మానాలి. స్పర్థలు, ద్వేషములు విడనాడాలి. పరధనము, ఆస్తులను కాజేయరాదని బోధిస్తుంది. అణువు చాల శక్తిగలదని, అగ్నిగోళమనీ, అందుచే అణువిస్ఫోటన మనర్థదాయకము, భయంకరము, ప్రమాదకరమనీ, అందుచేత అణువును పరమేశ్వర స్వరూపముగను (అణుః బృహత్ కృశః స్థూలః గుణభృన్నిర్గుణో మహాన్ - విష్ణుసహస్రనామము) పరమాణువు - పరంజ్యోతి స్వరూపము - లలితాదేవి స్వరూపముగను (పరంజ్యోతిః పరంధామ పరమాణుః పరాత్పరా - లలితాసహస్రనామ) ఆరాధించి, ప్రపంచం బూడిద కాకుండా చూచుకోండి, సుఖశాంతులతో వర్ధిల్లండి. "ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః" అని హెచ్చరిస్తోంది. శాంతిని ప్రసాదిస్తోంది.

జగద్గురువులు, శంకర భగవత్పాదులు గూడ "వేదోనిత్యమధీయతాం తదుదితం కర్మస్వనుష్ఠీయతామ్" అని ప్రబోధించిరి. నిత్యము వేదాధ్యయనము చేయండి, వేదవిహిత కర్మలను చక్కగ అనుష్ఠించండి, తరించండి అని మానవాళికి హితబోధ చేసిరి. కనుక ఇట్లు వేదగర్భ, హిరణ్యగర్భయగు యీ వేదవాణిని - ఆర్షవాణిని - సంస్కృతవాణి నారాధించి తరించవలెనని ఆర్షవాణి మానవాళికిచ్చు శుభసందేశము. అందుకని మానవాళి యొక్క ప్రధానకర్తవ్యము.

*"వాణీం భజత గైర్వాణీమ్"*
*"నమామ సంస్కృతం మహత్"*



# రథసప్తమీ వైశిష్ట్యము

మాఘశుద్ధసప్తమికి రథసప్తమి యని పేరు. ఇతర మాసములలోని సప్తమీ తిథులకన్న మాఘమాసమందలి సప్తమీ తిథి వైశిష్ట్యమేమి ?

సూర్యుని గమనములు ఉత్తరాయణము, దక్షిణాయనమని రెండు విధములు, ఆషాఢమాసం నుండి పుష్యమాసం వరకు దక్షిణాయనము - సూర్యుని గమనం ఏడు గుఱ్ఱములు పూన్చబడిన బంగారు రథంమీద సాగుతుందని వేదము " హిరణ్యయేన సవితారథేన" అని తెలుపుతోంది. దక్షిణాయనంలో దక్షిణదిశగా పయనిస్తుంది సూర్యరథం; పుష్యమాసం చివరలో ఉత్తరాయణం ప్రారంభమగును. సూర్యుని మకరరాశి ప్రవేశం ఉత్తరాయణం ప్రారంభ సూచకము మాఘశుద్ధ సప్తమినాడు అరథం ఉత్తర దిక్కువైపు తిరుగుతుంది. అందుచే మాఘ శుద్ధ సప్తమికి "రథసప్తమి" అని పేరు వచ్చింది.

అందుచే మాఘసప్తమి పరమ పవిత్రదినముగా భావించి భారతీయులు ఉపవాసముండి సూర్యుని ఆరాధిస్తారు.

"భా" అంటే సూర్యకాంతి. "రతి" అంటే ఆరాధన. "భారత" అంటే సూర్యుడు, కావున సూర్యుని ఆరాధించువారు అందురూ భారతీయులు. "భారతి" అంటే వేదమాత.

వేదమాత నారాధించువారును భారతీయులే, సూర్యగ్రహణ తుల్యా సా మాఘవ్య సప్తమీ మాఘ శుక్ల సప్తమీ సూర్యగ్రహణముతో సమానము కాన ఆరోజు అరుణోదయవేళ స్నాన, జప, అర్ఘ్యప్రదాన, తర్పణ, దానాదులు అనేక కోట్ల పుణ్యఫలములను ఆయురారోగ్య సంపదలనిచ్చును.

సప్తమినాడు షష్ఠీ తిథి గూడయున్నచో షష్ఠీ సప్తమీ తిథుల యోగమునకు "పదక" మని పేరు. ఈ యోగము సూర్యుని కత్యన్త ప్రీతికరము. ఆ సమయమున ఏడు జిల్లేడు ఆకులను ధరించి నదీ స్నానము చేసినచో ఏడు జన్మలలో చేసిన పాపములు నశిస్తాయని గర్గమహాముని ప్రబోధము. ఈ పద్మక యోగము సూర్య గ్రహణతుల్యము.

జిల్లేడు ఆకునకు అర్కపత్రమని పేరు. సూర్యునికి "అర్కః" అని పేరు. అందువలన సూర్యునికి జిల్లేడు అంటే మిగులప్రీతి. అందుచే రథసప్తమినాడు సప్తాశ్వములకు చిహ్నంగా ఏడు జిల్లేడు ఆకులను, అవి దొరకనిచో చిక్కుడుగాని రేగి గాని ఆకులను ధరించి స్నానమాచరిస్తారు. "సప్తార్కపత్రాణి, సప్తబదరీపత్రాణి సంయోజ్య, శిరసినిధాయ స్నానం కుర్యాత్" జిల్లేడు, రేగి ఆకులను రెంటిని కలిపి శిరస్సున ధరించి స్నానమాచరించాలని శాస్త్రవచనము. ఈ యేడు జిల్లేడు ఆకులు సూర్యుని రథమునకుగల సప్తాశ్వములకు

చిహ్నం మాత్రమే గాక ఏడుజన్మల్లో చేసిన పాపములను, ఏడు రకములుగా వ్యాధులను నశింపచేస్తాయట. "సప్తమి"యే నశింపజేస్తుంది.

యద్యత్కర్మ కృతం పాపం మయా సప్తసు జన్మసు ।
తన్మే రోగం చ శోకం చ సహసా హన్తు సప్తమీ ॥
సప్త సప్త । మహాప్రీత సప్త లోకప్రదీపక ।
సప్తమ్యా సహితోదేవ । గృహాణార్ఘ్యం దివాకర॥
సప్త సప్త । మహాసప్త సప్తద్వీపా వసుంధరా ।
సప్తార్క పర్ణాన్యాదాయ సప్తమ్యాం స్నానమాచరేత్ ॥

సప్తాశ్వములు గలిగినవాడు, 'సప్త' యను పేరు గల గుఱ్ఱముగల వాడగుటచే సూర్యునికి "సప్త సప్త" అని పేరు. మహాసప్త అని గూడ పేరు వచ్చింది. తన సప్తాశ్వములతో సప్తలోకములను ప్రకాశింపజేస్తున్నాడు.

అశ్వములనగా కిరణములు, ఇంకను సప్తద్వీపములు గల భూమిని పరిపాలించు చున్నాడు. అందుచే సప్తమి తిథితో గూడిన దేవదేవా మా యీ యర్ఘ్యమును స్వీకరించి, మా రోగములను పోగొట్టుము అని అర్థము, "సప్తసప్తిర్మరీచిమాన్" అని అమరకోశం సూర్యుని సప్త సప్తి అని చెప్పింది.

సప్తాశ్వరథమారూఢం శ్వేత పద్మధరం దేవం
తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥

అని సూర్యుని నిత్యం ఆరాధించుట పరిపాటి అయింది. రథసప్తమియే సూర్యుని తల్లియగు ఒకానొక దేవతగా గూడ నారాధింపబడుచున్నది.

జననీ త్వంహి భూతానాం సప్తమీ సప్త సప్తికే ।
సప్తవ్యాహృతికే దేవి । నమస్తే సూర్యమాతృకే॥

- మాఘ మాహాత్మ్యము

సూర్యుని యొక్క సప్తాశ్వ సంచారము గలది, సమస్త భూతములకు (ప్రాణులకు) తల్లియును, ఏడు లోకములలోను వ్యాపించియున్నది, భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్యయను సప్తలోకములకు సప్తవ్యాహృతి రూపములు గలిగియున్నది. సూర్యునికి తల్లియగు రథసప్తమిదేవికి నమస్కారమని యర్థము.

1) యదా జన్మకృతం పాపం మయా జన్మసు జన్మసు ।
తన్మేరోగం చ శోకం చ మాకరీ హంతు సప్తమీ ॥

2) ఏతజ్జన్మ కృతం పాపం యచ్చ జన్మాంతరార్జితమ్ ।
మనోవాక్కాయజంచ జ్ఞాతాజ్ఞాతే చ యే పునః ॥

3) ఇతి సప్తవిధం పాపం స్నానాన్మే సప్త సప్తికే ।
సప్తవ్యాధి సమాయుక్తం హర మాకరి । సప్తమి ।

4) సప్త సప్తి వహ ప్రీతః సప్తలోక ప్రదీపన
సప్తమీ సహితోదేవ । గృహాణార్ఘ్యం దివాకర ॥

*- ధర్మసింధు2-అ*

ఈ జన్మలోను, జన్మాంతరంలోను రెండు, మానసిక, వాచిక, శారీరకములు, మూడు, తెలిసిచేసేవి, తెలియకచేసేవి రెండు కలసి మొత్తం పాపములు ఏడు. ఏడు పాపములు నేడు రోగాలకు కారణములు. మకరసంక్రమణ సందర్భంలో వచ్చిన రథసప్తమీ దేవీ । మా పాపములను రోగములను హరించుము. సప్తమీ దేవితో గూడిన దేవా, సప్తాశ్వరథాధిరూఢుడగు సూర్యదేవా ! సప్తలోకములకు దీపమువంటి దేవా ! నీకిదే మా అర్ఘ్యము - స్వీకరించి మా పాపములను, పోగొట్టుము అని అర్థము.

అనేనైవ తు మంత్రేణ పూజయేచ్ఛ దివాకరమ్ ।
కృత్వా షోడశధా రాజన్ సప్తాశ్వ రథమండలే ॥

సప్తాశ్వములుగల రథ మండలములోని సూర్యునికి పై మంత్రములతో షోడశోపచారపూజ సలుపవలెను అని అర్థము.

అశ్వములనగా కిరణములు. సప్తాశ్వములనగా సప్తకిరణములు. సప్తాశ్వరథమండలము. అనగా సప్తకిరణమండలము. ఈ రథమండలమునే భౌతికశాస్త్రము "స్పెక్ట్రం" అని అంటున్నది. కిరణములే కాంతులు - వర్ణములు - రంగులు - ఆ ఏడురంగులు - Vibjyor, Violet, Indigo, Blue, White, Yellow, Orange, Red.

కావున రథసప్తమినాడు సప్తాశ్వరథస్థుడైన సూర్యునారాధించుట యనగా సప్తకిరణముల లేక సప్తవర్ణముల సమారాధనమే. సప్తఅశ్వములే సప్త స్వరములు. సప్త ఛందస్సులు - సప్తవాక్కులు, సప్తఋషులు. సప్త విభక్తులున్నూ. ఇవియన్నియూ లోకయాత్రా కారకములు. పాలకములు కాన సప్త అశ్వ, సమారాధన అయురారోగ్యైశ్వర్య ప్రదములు.

"రథ్యతే ఇతి రథః" రమన్తే అత్ర రథాఃఇతి । అను వ్యుత్పత్తులు రమణీయత్వము వొందిచునది, ఇచట అందరు రమింతురు గనుక రథమను అర్థముల దెల్పుచున్నవి.

దేవాలయములలో శివాదిదేవులకు కళ్యాణోత్సవములు చేస్తారు "బ్రహ్మాణం

బ్రహ్మవాహనం" అను శ్రుతివచనానుసారం పరబ్రహ్మ స్వరూపులయిన కృష్ణ, రామ, శివాదులకు గజ, శేష గరుడాది వాహనముల మీద ఊరేగింపు చేసినమూ, చివరకు రథోత్సవము జరుపుదురు.

రథోత్సవము అనగా సప్తాశ్వ రథమండలంలో బ్రహ్మ స్వరూపుడగు పరమేశ్వరుని కూర్చుండబెట్టి ఊరేగించుట, ఆరాధించుటయే. ఇదియొక ప్రత్యేకమైన, విశిష్టమైన ఉత్సవము. ఈ ఉత్సవములకు రథోత్సవముతోగాని పరిపూర్ణత సిద్ధించదు. సప్తాశ్వరథ మండలమే వేదమండలము. వేదమునకు బ్రహ్మ అని పేరు. భగవంతునికి బ్రహ్మయని పేరు గాన "బ్రహ్మణం బ్రహ్మవాహనం" అని శ్రుతివచనమునకు - రథోత్సవ రూపంగా రథసప్తమీ సమారాధనయే పరోక్షంగా, తాత్పర్యంగా భావించదగును. అందుకే జగన్నాథ రథ చక్రములను పురాణములు నాలుగు వేదములుగా కీర్తించినవి. మత్స్య పురాణం సూర్యుని రథచక్రాలను వేదములని పేర్కొన్నది. అట్లే ఇతర పురాణములున్నూ.

అందుకనియే రథసప్తమినాడు, బంగారముగాని, వెండిగాని, రాగిగాని రథమును చేయించి అలంకరించి, కుంకుమాదులు, దీపములతో నలంకరించి, అందు ఎర్రని రంగుగల సూర్యుని ప్రతిమ నుంచి, పూజించి, గురువునకు ఆ రథమును దానమీయవలెనని, ఆ రోజు ఉపవాసముండి సూర్యసంబంధమగు రథోత్సవాది కార్యక్రమములను చూచుచూ కాలక్షేపం చేయాలి - ఇట్లు రథసప్తమీ వ్రతముచే, సూర్యభగవానుని అనుగ్రహముచే ఆయురారోగ్యాది సకల సంపదలు కురియునని పురాణప్రబోధము. అట్టి రథసప్తమీ వ్రతము మన సంప్రదాయమున నిలచియుండుట భారతీయతకు చిహ్నము.

ఇక వేదముల ద్వారా రథసప్తమీ వైశిష్ట్యము ఇట్లు తెలియదగును.

1) ఆ సత్యేన రజసా వర్తమానో నివేశయన్
అమృతం మర్త్యంచ। హిరణ్యయేన సవితా
రథేన అదేవోయాతి భువనా విపశ్యన్।
ఉద్వయం తమ స్సస్పరి పశ్యన్తో జ్యోతిరుత్తరమ్।,

ప్రతిరోజు సూర్యుడు చీకటిని పోగొట్టుచు, అంధకారముమీదుగ పైకి రావటమే ఉత్తరాయణము - అందరిని తరింపచేయుటకై సూర్యుడు సప్తాశ్వరథారూఢుడై అవతరించు చున్నాడు గాన సూర్యుడు ఉత్తరుడు అగుచున్నడు. అందరిని తరింపజేయు ఆ సూర్య జ్యోతిస్సును చూచు చున్న లోకము తరించుచున్నది, "ఉత్తర" మగుచున్నది.

"సప్తాస్యాసన్ పరిధయః.................. వేదాహమేతం
పురుషం మహాన్తం ఆదిత్యవర్ణం తమనః పరస్తాత్"

అని పురుషసూక్త మంత్రము యొక్క అర్థమున్నూ పై విషయమునే బోధిస్తున్నది. ఈ మంత్రములోను పరమ పురుషుడగు భగవంతుడు ఆదిత్యుని యొక్క "వర్ణ" స్వరూపమని చెప్పుట ద్వారా మరల వర్ణ (రంగు) సమారాధన ప్రధానముగా వేదమందు నిర్దిష్టము.

సూర్యోదయము వేళ కనపడు ఉషః కాంతి పుంజమే అరుణవర్ణ మండలము - సంధ్యారుణ వర్ణ మండలము. అదే సప్తాశ్వరథ మండలము. కావున ప్రతిదినము ఉషః కాలమున అరుణవర్ణోపాసన, సంధ్యా వందనం చేయటం గూడ రథసప్తమీ వ్రతము నాచరించుచున్నట్లు తెలియనగును. పరోక్షంగా ప్రతిదినము ఉత్తరాయణ పుణ్యకాలమే ఉషఃకాలము; ఆ పుణ్య సమయంలో రథసప్తమీ సమారాధన, సప్తాశ్వరథస్థుడగు సూర్యోపాసన; సంధ్యావందనం ప్రధాన కర్తవ్యముగా "అహరహః సంధ్యాముపాసీత" అని వేదశాసనమ్.

2) సప్తత్వా హరితో రథే వహన్తి దేవసూర్య । శోచిష్కేశం విచక్షణ ।

3) అయుక్త సప్త శుంధ్యువః సూరోరథస్య నప్త్యః ॥
తాభిర్యాతి స్వయుక్తిభిః ।

4) ఉద్వయం తమసస్పరి జ్యోతిష్పశ్యన్త ఉత్తరమ్ ।
దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్ ॥

5) ఉద్యన్నద్య మిత్రమహ ఆరోహన్నుత్తరాం దివమ్ ।
హృద్రోగం మమ సూర్య హరిమాణంచ నాశయ ॥

- ఋగ్వేదము

ఓ సూర్యదేవా ! రథమందున్న నిన్ను, నీ రథమును రసమును హరించు స్వభావముగల సప్త కిరణములు వహించుచున్నవి, ఆ కిరణముల తేజస్సులే నీ కేశములు కావున నీవు శోచిష్కేశుడవని ప్రసిద్ధిగాంచినావు.

సూర్యుని రథమునకు శోధించు స్వభావంగల ఏడు అదు గుఱ్ఱములు పూన్చబడినవి. అవి రథమును పడవేయకుండ జాగ్రత్తగా లాగును. ఆ అదు గుఱ్ఱములు రథముమీద సూర్యుని యజ్ఞగృహమునకు తీసికొనివచ్చును. అపుడా సూర్యునికి హవిస్సులనీయవలెను.

మనము తమస్సును, రాత్రిని అధిగమించి ఊర్ధ్వదిశగా వచ్చుచున్న సూర్యుని ఉత్తరాభిముఖముగ వచ్చు దివ్యజ్యోతిస్సుగా దర్శించి తరించవలెను.

దేవతలలో మిక్కిలి ఉత్తముడు, ఉత్తరుడు, ఉత్తరాయణముగలవాడు సూర్యుడు. ఈయన ఒక గొప్ప జ్యోతిస్సు. ఉత్తరదిశాభిముఖుడు, ఉత్తరమగుద్యు లోకము నధిరోహించు

వాడు, అందరిని తరింపజేయువాడువగు సూర్యభగవానుడు, నా ఆరాధనలు, ప్రార్థనలు స్వీకరించి, నా హృద్రోగమును, హరిమాణమనే రోగమును శమింపజేయుగాక । హరిమాణ మంటే శరీరమంతా పసుపురంగులోనికి మారు రోగము. అనగా పచ్చకామెర్లవ్యాధి.

కావున సప్తాశ్వరథమండలస్థుడయిన, సూర్య సమారాధన లేక రథసప్తమీ సమారాధన హృద్రోగమును, పచ్చకామెర్ల వ్యాధిని పోగొట్టుతుంది. ఇందుకు ఉదాహరణ మయూర మహాకవి. ఈ కవి కేవలం సూర్యోపాసనతో తన వ్యాధిని రూపుమాపుకొని సూర్యారాధనను "మయూర శతకము"ను పేర లోకమునకు చాటిచెప్పినాడు.

"సప్తయుంజంతి రథమేక చక్రం ఏకో అశ్వోవహతి సప్తనామా
త్రినాభి చక్రమజరమనర్వం యత్రేమా విశ్వాభువనాని తస్థుః"

- ఋగ్వేదము

సూర్యుడు సంచరించు రథమునకు ఒకటియే చక్రమట. దానిని ఏడు గుఱ్ఱములు (సప్తాశ్వములు) వహించుచున్నవి. రంహణ స్వభావము గల్గినది రథము. రంహణమనగా అతివేగముగ తిరుగుట. అట్టి రథమును సప్తాశ్వములు జగత్తు యొక్క అహోరాత్ర నిర్వహణకు వహించుచున్నవి. అట్లే "సప్త" అను పేరు గల ఒక అశ్వమే జగత్పాలనా భారమును వహించుచున్నది. ఈ సప్త అనబడు అశ్వమే రథము. 'రథ ఏవ సప్తమీ' అను వ్యుత్పత్తి రీత్యా రథమునకే సప్త అని పేరు. అందుచే సూర్యుడు సప్త సప్త అని, సప్త సప్తి యని కీర్తింపబడుచున్నాడు.

సప్త అను పేరుగల అశ్వమే సప్త అశ్వములుగా మారినది. ఒకే వాయువు సప్తవాయు రూపములుగాను, ఒకే తేజస్సు సప్త తేజోరూపములుగాను, ఒకే కిరణము సప్త కిరణములు గాను రూపొంది రథమును వహించుచున్నవి.

"అసౌవా ఆదిత్య ఏషో2శ్వః"

*- శతపథబ్రాహ్మణం (9-2-2-48)*

ఆ అశ్వమే సూర్యుడు అని కీర్తించింది. ఈ సూర్య మండలమే రథమని మరియొక అర్థము. సాధారణంగా ఋతువులు ఆరు, అధికమాసం ఒక అసాధారణమైన ఋతువు దీనితో ఋతువులు ఏడు.

"సప్త చితికోగ్నిః - సప్త ఋతవః సంవత్సరః - సంవత్సరోగ్నిః"

*- శతపథశ్రుతి (9-2-2-47)*

ఈ శ్రుతి గూడ సంవత్సరమునకేడు ఋతువులని పేర్కొన్నది. అట్లే సాధారణ మాసములు పన్నెండు.

"ద్వాదశమాసాః సంవత్సరస్య" అని శతపథశ్రుతి. ఆ శ్రుతియే
"త్రయోదశైతా వ్యా హ్వాతయో భవన్తి । త్రయోదశమాసాః సంవత్సరః"

- శ.బ్రా. (9-1-4-2)

అనగా సంవత్సరమునకు పదమూడు మాసములని పేర్కొన్నది. ఈ పదమూడువ మాసం అసాధారణమైన అధికమాసం. 12 మాసములు ఆరు ఋతువులు. అధికమాసం ఏడవఋతువు. ఈ సప్తర్తువుల ద్వారా రథరూపుడగు సూర్యుడు జగత్పరిపాలన చేయుచున్నాడని అర్థము.

'సప్త' అను పేరు గల అశ్వమే (వ్యాపనశీలుడు) సూర్యుడు, ఆ 'సప్త యనబడు అశ్వము (సూర్యుడు) సప్త ఋషులచే స్తుతింపబడుచున్నవాడై, సప్తరసములను ప్రతిపాదించెడి సప్తకిరణములనబడు సప్తాశ్వములచే వహింపబడుచున్నవాడై లోక పరిభ్రమణము చేయుచున్నాడు.

"అపశ్యం విశ్వతిం సప్తపుత్రిమ్" అను మరియొక మంత్రము ద్వారా సూర్యుడు అదితి యొక్క సప్తమ పుత్రుడని తెలియుచున్నది. కాన రథసప్తమినాడు అదితి యొక్క సప్తమపుత్రుడు, రథ స్వరూపుడగు సూర్యభగవానుని ఆరాధన చేయదగునని తెలియనగును. మరియొక మంత్రమును చూద్దాము

"ఇమం రథమధియే సప్తతస్థుః
సప్తచక్రం సప్తవహన్త్యశ్వాః ।
సప్త స్వసారో అభినం నవన్తే
యత్రగవాం నిహితా సప్తనామ॥"

ఆదిత్య మండలమే సంవత్సరమను పేరుగల రథమట. ఈ సంవత్సర రూప రథమును ఏడు అశ్వములు సంవహనముచేయుచుండునట. ఆ సప్తాశ్వములు - ఆయన, ఋతు, మాస, పక్ష, దివస, రాత్రి, ముహూర్తములు. ఈ రథానికి సప్త చక్రములు.

"చకనాత్ - చరణాత్, క్రమణాచ్చ చక్రాణి" అని శ్రీ సాయణాచార్య భాష్యమున వ్యుత్పత్తిని బట్టి, వేగ సంచారము, క్రమణం అనగా వ్యాపించటం లక్షణములు గలవి చక్రములనబడును. ఆ రెండు లక్షణముల చక్రములు రశ్ములు - అనగా కిరణములు. అట్టి సప్తకిరణ రూపచక్రములు గల సంవత్సర రూప రథమును, ఆదిత్య మండలమును, అయన, మాస, పక్ష, ఋతు, దివస, రాత్రి ముహూర్తములనెడి సప్తాశ్వములు నిత్యం వహిచుచూ, పరిభ్రమణం చేయించుచూ లోక పాలన చేయుచున్నవి. అట్టి సంవత్సరరూప రథము యొక్క ఆరాధన రథసప్తమి నాడు అనుష్ఠించాలి.

ఇంకను, ఆ సంవత్సర రూప రథమును సప్త స్వసలు వహించుచున్నవట. స్వస అనగా అక్క లేదా చెల్లెలు అని సాధారణంగా అర్థము. కాని వైదిక పరమైన అర్థములు.

1. స్వయం సరణాః స్వసారః
2. స్వః ఆదిత్యః తేన సారితాః
3. పరస్పరం స్వస్సృభూతాః - అనగా

1. స్వయంగా ప్రసరించునవి
2. స్వః అనగా సూర్యుడు - సూర్యుని చేత ప్రసరింపజేయబడుట చేత కిరణములు 'స్వసారః' అగుచున్నవి.
3. పరస్పరం ఆ కిరణములు స్వస్సృ భూతములగు అక్క చెల్లెళ్ల వంటివి కాన "స్వసారః' ' అగుచున్నవి. అట్టి సప్తకిరణములను సప్తఋతువులు సంవత్సర రూప రథమును లోక యాత్రకు గొని పోవుచున్నవి.

ఆ రథములో సప్తవిధములైన వేదవాక్కులు, సప్త స్వరములు ఉన్నాయట. స్వసలనగా ఉదకములనీ, సప్త సాగరములు, సప్త నదులని గూడ అర్థములు. ఇట్లు సప్త వాక్కులచే, సప్త స్వరోపేతములగు సామములచే స్తుతింపబడుచూ, రథసప్తమినాడు సూర్యుని రథము ఉత్తరాభిముఖముగ బోవుటచేత అనాడు సూర్యభగవానుని రథోత్సవము "రథోత్సవము" జరుపబడుచున్నది. అట్లు ఉత్తరాభిముఖుడై, సప్తాశ్వసమలంకృత రథము మీద ఊరేగుచున్న సూర్య భగవానుడు లోకమును చల్లగా కాచుగాక!

శ్రీ సూక్తమందలి యీ మంత్రము
"అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రబోధినీమ్ ।
శ్రియం దేవీ ముపహ్వయే శ్రీర్మాదేవీ జుషతామ్ ॥"
పై విషయమునే విశదపరచుచున్నది. ఇంకనూ "ఆదిత్య వర్ణే తపసో2ధిజాతః"
"సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ"

సూర్య సంబంధమగు లక్ష్మి (ఆదిత్య గతం తేజః) అనగా తేజస్సే సూర్యలక్ష్మి. ఈ లక్ష్మి సప్తాశ్వ రథమండలం మధ్యలో నుండునట. ఆమె నిరంతరం హస్తినాదముచే మేలు కొలుపబడుచుండునట. ఈ లక్ష్మి మేలిమి బంగారు ఛాయ గల్గినది. సూర్యుని వర్ణము గల్గినది. హస్తినాదమంటే గజఘీంకారము. కావున సప్తాశ్వ రథమండలం మధ్యస్థ యగులక్ష్మి నారాధించుట రథ సప్తమి నాటి ఆరాధనను స్ఫురింపజేయుచున్నాది.

కఠోపనిషత్తులోని యీ మంత్రము ద్వారా విశేషార్థము వొకదానిని గమనించదగినది యున్నది.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవచ
బుద్ధిం తు సారథిం విద్ధిమనః ప్రగ్రహమేవచ
ఇంద్రియాణి హయానాహుః"

శరీరము ఒక రథము. ఆ రథమందు ఉండే రథియే ఆత్మ. బుద్ధి రథ సారథి, మనస్సు కళ్లెము, సప్త ఇంద్రియములు సప్త అశ్వములు. భగవద్గీత గూడ ఇదే విషయాన్ని విశదపరచింది. బుద్ధి యొుక్క ఆజ్ఞను మన్నించక అశ్వములు (ఇంద్రియములు) దుష్టములైనచో మనస్సు కళ్లెం అదుపు తప్పి శరీరమును (రథమును) ఇష్టం వచ్చినట్లు చెడు మార్గముల పట్టించి త్రిప్పును. వివేకవంతుని బుద్ధికి అశ్వములు ఆజ్ఞానుబద్ధులై శరీరమును సన్మార్గములలో త్రిప్పును.

"యస్త్వఙ్ఞానవాన్ భవత్యయుక్తేన మనసాసదా ।
తస్యేంద్రియాణ్య వశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః ॥
యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా ।
తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథే! ॥"

- కఠోపనిషత్.

"అశ్వపూర్వాం రథమధ్యాం" అను శ్రీసూక్తమంత్రార్థ మీ విషయాన్ని స్ఫురింపజేస్తోంది. శరీరమనే రథమధ్యస్థయగు లక్ష్మియే చైతన్యలక్ష్మి. చెవులు మూసికొన్నచో వినపడు నాదమే హస్తినాదము. అదే వేణు నాదము - వీణా నాదము - వేదనాదము శంఖధ్వని. ఆ నాదముచేత నిరంతరం బోధింపబడుచు చైతన్యలక్ష్మి నారాధించుట రథసప్తమి ఆరాధనా వైశిష్ట్యమును బోధిస్తున్నది. ఈ రథసప్తమి నాటి ఆరాధనతో మానవులు తమ ఇంద్రియాలను సదశ్వములగ చేసుకొని, మనస్సు నదుపులో నుంచుకొని, తమ తమ శరీర రూప రథములను భగవంతుని వైపు ఉత్తరాభిముఖంగా త్రిప్పుకొని, అనగా సన్మార్గముల వైపు మరల్చి, ఉత్తరులై, తరించి, పవిత్రులగుదురు గాక!

లోకంలో మానవుడు అరువది సంవత్సరములు నిండగానే మనోనియంత్రణం, మనోనిగ్రహం, మనశ్శుద్ధి కోసం, ఇంద్రియాశ్వ నిరోధం కోసం ఉగ్రరథశాన్తి, ఆ పై భీమరథశాన్తి జరుపుకొను సాంప్రదాయము వచ్చింది. మనస్సు అదుపు తప్పినపుడు, కోరికలు, విషయములు, మనోరథములు ఉగ్రములై మానవుని శరీర రథమును ఉగ్రవేగమున నడుపును. అపుడు మానవుని మనస్సు చికాకు, కోపం, ద్వేషాదులతో ఉడికిపోతూ ఉంటుంది. ఆ ఉగ్రమును నిరోధించుటకు ఉగ్రరథశాన్తి అవసరమే.

అలంకార, వ్యాకరణ శాస్త్రాలు గూడ భంగ్యంతరంగా పై విషయాలనిట్లు బోధిస్తున్నది.

"ఇదమంధతమః కృత్స్నం జాయేత భువనత్రయం
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం నదీప్యతే"

- కావ్యాదర్శ

సృష్ట్యాది నుండి శబ్దమనెడి జ్యోతిస్సు (దీపము) లేనిచో ముల్లోకములు కారుచీకటిలో, అజ్ఞానాంధకారములో కొట్టు మిట్టాడి యుండెడిది అని యర్థము. శబ్ద జ్యోతిస్సును శబ్ద బ్రహ్మ అని అంటారు. ఈ శబ్ద బ్రహ్మయే వేదవాణి. సూర్యభగవానుడెట్లు మానవాళికి చీటకి నుండి వెలుగును ప్రసాదించుటకై ఉత్తరాభిముఖుడుగ ఉదయించుచున్నాడో శబ్దబ్రహ్మయగు వేదవాణి అజ్ఞానాంధకారమునుండి జ్ఞాన ప్రకాశము గల్గించుటకై ఉత్తరాభిముఖముగ మానవాళి ఉద్ధరణకై అవతరించుచున్నది.

ఇచట శబ్ద జ్యోతిస్సు గూడ రథియే. రామ, కృష్ణ గోవింద ఇత్యాది ప్రాతిపదికలే రథములు. ఆ ప్రాతిపదికలతో వాఙ్మయ ప్రపంచమును నిర్వహించు, ఆ ప్రాతిపదికరూప రథములను వహించెడి సప్తవిభక్తులే సప్తాశ్వములు. ఈ సప్తవిభక్తుల ద్వారా జ్ఞాన జ్యోతిస్సు ఉత్తరమై ప్రజలను ఉత్తరులనుగా తీర్చి దిద్దుచున్నది. తరింప జేయుచున్నది. జ్ఞాన జ్యోతీ రూపిణి యగు వేదవాణి ఉత్తరమే. అట్టి జ్ఞాన జ్యోతిస్సు ద్వారా మానవులు ఉత్తరులగుదురు గాక!

చివరిగా, యజ్ఞము గూడ రథమే. అగ్ని రథి, అగ్నికి సప్త జిహ్వాలు, కాళి, కరాళి, మనోజవా, ధూమవర్ణా, స్ఫులింగినీ, విశ్వవద, సులోహిత. అను ఈ ఏడు జ్వాలలు ఏడు గుఱ్ఱములు. యజ్ఞమునకు "సప్తతంతుః" అని పేరు. "సప్త ఛందోభిః తవ్యతే" అని వ్యుత్పత్తి. సప్త ఛందస్సులే సప్త తంతువులు. ఇట్లు యీ యజ్ఞరథసప్తమి యున్న మానవాళికి శ్రేయోదాయకమే.

ఈ విధముగ రథసప్తమీ దేవత ప్రజలకు ఆయురారోగ్యైశ్వర్యములనిచ్చి బ్రోచుగాక!

ఇతిశమ్

హరిశ్రీరామమూర్తి
శోధన్ పెయింట్స్
విజయవాడ - 10

# అయ్యప్ప స్వామి - వైదిక స్వరూపము

మనది కర్మభూమి. వైదికభూమి. ఇచట ప్రజలంతా నిత్యము వేదారాధన తత్పరులు. వేదమునకు 'భారతి' అని పేరు. అంటే సరస్వతి. "బ్రాహ్మీతు భారతీ భాషా గీర్వాక్ వాణీ సరస్వతీ" అని అమరకోశము. భారతిని అనగా వేదమాతను - సరస్వతిని ఆరాధించుటచే ప్రజలందరు భారతీయులు. ఈ లోకమే భారతము. "లోకో2 యం భారతం వర్షం" అని అమరకోశము.

"భాయాం రతాః - భారతాః" అని వ్యుత్పత్తి. 'భా' అంటే సూర్యకిరణం. కాంతి-తేజస్సు-జ్యోతిస్సు-ప్రభ. "స్యుః ప్రభా ఋుక్ ఋుచిః త్విట్ భా భాశ్చ విద్యుతి దీప్తయః" - అని అమరకోశము. ఈ 'భా'ను-తేజస్సును ఆరాధించుటచే ప్రజలు భారతీయులు. ఋుగ్యజుస్సామాది వేదములు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులున్నూ తేజస్సులేనని వేదములు తెల్పుచున్నవి.

"నారాయణః పరోజ్యోతిః" అని మంత్రపుష్పము.

"విహాయసగతిః జ్యోతిః" అని విష్ణుసహస్రనామాలు.

"ఉగ్రతేజా మహాతేజా" అని శివసహస్రనామాలు. ఇట్లు హరి,హరులిద్దరూ తేజస్సులే. ఈ హరిహరుల పుత్రుడు 'అయ్యప్ప' అని చెప్పబడుచున్నాడు. హరిహరులకు పుత్రుడెట్లు గల్గునను సందేహ నివారణకు వేదమే శరణ్యము. ఇట లలితోపాఖ్యానంలో కథ గలదు. అయ్యప్ప సహస్రనామాల్లో

"భానుమాన్ భానుతేజసః"
"దేవసేనాధిపస్తేజాః తేజోరాశిః దశాననః" - మంత్రనిధిః

"మంత్రదేవో మంత్రరాశిః మహోదృఢః ఋుగ్వేదరూపః సామవేద పరాయణః" అని నామముల ద్వారా అయ్యప్పస్వామి తేజోరాశియని, మంత్రస్వరూపుడని, వేదపురుషుడని తెలియును. అట్లే శరణుఘోషలో "జ్యోతి స్వరూపనే శరణమయ్యప్ప' అని అయ్యప్పను జ్యోతిస్సుగా ఆరాధిస్తున్నాము. ముందు ప్రార్థనలోగూడ "తేజోమండలమధ్యగం త్రినయనం దివ్యాంబరాలంకృతం' అని ఉన్నది. అంటే అయ్యప్పస్వామి రెండు తేజోమండలముల మధ్యనుండువాడని తెలుస్తున్నది. ఈరెండు తేజోమండలముల మధ్యనుండు మరియొక తేజోరాశి ఏది? ఈ సంగతి విచారింతము. ఎట్టి సందేహమునైనను వేదము తప్ప తీర్చువారు ఎవరూ లేరు.

వేదము మనకు అయిదు సంధులను ప్రసాదించినది. "అధిలోకం, అధిజ్యోతిషం,

అధివిద్యం, అధిప్రజం, అధ్యాత్మం" - అని తైత్తిరీయోపనిషత్తు. ఉదాహరణకు కొన్ని చూద్దాము.

1. అధివిద్యం-ఆచార్యః పూర్వరూపం, అంతే వాస్యుత్తర రూపం, విద్యాసంధిః ప్రవచనగ్ం సంధానమ్.

సంధి అంటే రెండు వస్తువులను కలుపునది. విద్య అనేది ఒక సంధి. ఈ సంధి గురుశిష్యుల నిద్దరిని కలుపుచున్నది. ప్రవచనమే వారి సంధానకర్త. గురు,శిష్యుల మధ్య సంధి - విద్యయని అర్థము.

2. అధి ప్రజం - మాతాపూర్వ రూపం పితోత్తర రూపం - ప్రజా సంధిః. ప్రజననగ్ం సంధానమ్.

తల్లి పూర్వరూపము - తండ్రి ఉత్తరరూపము - వీరిరువురి మధ్య సంధి సంతానము. సంధానము ప్రజననము. తల్లిదండ్రులిద్దరి మధ్య సంధానకర్త, సంధి - సంతానమట.

3. అధ్యాత్మం- అధరాహ నుః పూర్వరూపం - ఉత్తరా హనురుత్తర రూపం - వాక్సంధిః - జిహ్వా సంధానమ్.

హనువులంటే దౌడలు. రెండు దౌడలు కలిస్తేనే గద నోటినుండి వాక్కు పుట్టేది. రెండు దౌడల మధ్య సంధి వాక్కు. నాలుక సంధానమట. వాక్కు అంటే వేదవాక్కు అంటే వేదమంత్రములు. రెండు హనువులు కలిగినవాడు "హనూమాన్" అగును. అంటే హనుమంతుడు సంధి స్వరూపుడే-వేదస్వరూపుడే. సంధియందుండువాడు 'సంధ్య' యగును. (సంధౌభవా సంధ్యా).

పైవిధముగ హరిహరులనిద్దరిని కలువుచున్నట్టి "అయ్యప్పస్వామి" గూడ సంధ్యాస్వరూపుడే యగును.

"హరికి కృష్ణవర్ణము (నలుపు), హరునికి శ్వేతవర్ణము (తెలుపు) ప్రసిద్ధము. వర్ణమనగా రంగు-తేజస్సు-జ్యోతిస్సు. ఈ నలుపు, తెలుపు వర్ణములను కాంతులను కల్పుచున్నట్టి లేక ఆ క్కాంతుల మధ్య సంధిరూపంలోనున్న కాంతి మరియొకటి గల్దదట. ఆ వర్ణము లేక కాంతియే అరుణవర్ణము లేక అరుణకాంతి యని వేదములు, కావ్య, నాటకాదులలో చెప్పబడినది. కాళిదాస మహాకవి విరచితమైన అభిజ్ఞాన శాకుంతల మనెడి నాటకమందీ విషయమిట్లు వర్ణింపబడినది.

"యాత్యేకతో2స్త శిఖరం పతిరోషధీనాం
ఆవిష్కృతో2రుణ పురస్సర ఏకతో2ర్కః
తేజోద్వయస్య యుగపత్ వ్యసనోదయాభ్యాం
లోకోనియమ్యత ఇవాత్మదశాంతరేషు".

ఒకవైపు చంద్రుడస్తమించుచున్నాడు. అరుణునితో గూడి లేక అరుణకాంతిని ముందుపెట్టుకొని సూర్యుడుదయించుచున్నాడు. ఈ ప్రపంచమంతా,ఈ రెండు తేజస్సులచేత పాలింపబడుచున్నది, నియమించబడుచున్నదని ఒక ఋషి ఆశ్రమములో నిద్రలేచిన శిష్యుడు ప్రభాత సంధ్యను గూర్చి వర్ణిస్తున్నాడు. ఆ రెండు తేజస్సులు నలుపు, తెలుపు. ఆ రెంటి మధ్యన అరుణ తేజస్సు. ఒకటి హరితత్త్వము, రెండవది (శివ) హరతత్త్వము. ఈ రెంటి నడుమ సంధి అరుణవర్ణము, బ్రహ్మతత్త్వము. బ్రహ్మ విష్ణువు నాభి నుండి పుట్టినట్లు చెప్పబడుచున్నది. ఆ అరుణతత్త్వమే సంధ్యారాగము. అదే కాషాయ రంగు. అందుకే యతీశ్వరులు, స్వాములు కాషాయరంగు బట్టలు ధరించే సాంప్రదాయం వచ్చింది. అరుణతేజస్సే సంధ్యయని, గాయత్రియని, హనుమంతుడని, లలితయని చెప్పబడుచున్నారు.

"సంధ్యారుణా నవద్యాంగి" - గాయత్రీ వ్యాహృతి స్సంధ్యా" అరుణాం కరుణాం తరంగితాక్షీం" అని లలితా సహస్రనామాలు. కావున చంద్రుడస్తమించటం అంటే చీకటి అంటే నలుపు రంగు పోతొంది. సూర్యుడుదయిస్తున్నాడంటే ముందు అరుణకాంతి, ఆ తరువాత తెలుపురంగు (కాంతి) వస్తున్నది. ఇట్లు ఈ రాత్రింబవళ్ళ (నలుపు-తెలుపు కాంతులే) హరిహర స్వరూపములనీ, ఆ రాత్రింబవళ్ళ మధ్యనుంటూ వానిని కలుపుచున్న అరుణకాంతియే సంధి, సంధ్యయని, ఆ సంధ్యావందనం సదా ఆచరించవలెననీ కాళిదాస మహాకవి అభిప్రాయం.

ఇట్లీ హరి (నలుపుకాంతి) హర (తెలుపుకాంతి) వీరి పుత్రుడు హరిహర పుత్రుడు గదా! వారి పుత్రుడు వారికి సంధి స్వరూపుడే గద! కాన యీ హరిహర పుత్రుడు సంధ్యా స్వరూపుడే. కాన అయ్యప్ప స్వామి గూడ గాయత్రీ, లలితా, బ్రహ్మ, హనుమంతుడు, గోవుల వలే సంధ్యా స్వరూపుడగును కావుననే "తేజోమండల మధ్యగం" అని అయ్యప్పస్వామి ప్రార్థనలోని అంతర్యము ఇదియే. కృష్ణ, శ్వేత తేజస్సుల మధ్యనున్న అరుణతేజస్సే అయ్యప్ప. అందుననే "అరుణోదయ సంకాశం నీలకుండలధారిణమ్". అని అయ్యప్పస్వామి అరుణకాంతి గలవాడని పేర్కొనబడినాడు. హరిహరులే - రాత్రింబవళ్ల మధ్యనున్న అరుణ తేజస్సే - సంధ్యయే - అయ్యప్ప. హైదరాబాద్‌లో నొక దేవాలయమున నిట్లే గలదు. హరిహరుల విగ్రహములు నలుపు-తెలుపు రంగులలోను, వాని మధ్య అయ్యప్ప స్వామి విగ్రహము అరుణవర్ణములతో నలరారుచున్నది. అందుకే స్వామిని "అరుణోదయ సంకాశం నీలకుండల ధారిణం" అని స్తోత్రము చేస్తున్నారు. ఇట్టి అయ్యప్ప స్వామి అరుణసంధ్యాస్వరూపుడు, వేదనిధి, ఋగ్వేదరూపుడు, మంత్ర దేవుడు, మంత్రరాశియని సహస్రనామాల్లో కీర్తింపబడుచున్నాడు. కావున అయ్యప్పస్వామి ఆరాధన అంటే వేదమాత సేవయే. వేదమాతృసేవయే అయ్యప్పస్వామి ఆరాధన. ఇందు ఎట్టి సందేహము లేదు.

ఈపై మూడు తేజస్సుల గూర్చి చాలచోట్ల కనపడును. కాళిదాస మహాకవి రచనలో ఎక్కువగాను, వాల్మీకి రామాయణంలో హనుమంతుని వర్ణనలోను కన్పడును. రఘువంశంలో గోవు సంధ్యాస్వరూపమనీ, దాని శరీరమంతా నలుపు, పైన తెల్లని రోమములు, ముఖము మీద చంద్ర వంక వలె అరుణ రాగం గలదనీ అట్టి ఆవుని సేవించిన పుత్ర సంతానము గల్గుననీ కాళిదాసు చెప్పినాడు.

లలాటో దయమాభుగ్నం పల్లవస్నిగ్ధ పాటలా ।
బిభ్రతీ శ్వేత రోమాంచం సంధ్యేవశశినం నవమ్ ॥

- రఘువంశమ్.

"ముఖం నాసికయాతస్య తామ్రయా తామ్రమాబభౌ ।
సంధ్యయా సమభిస్పృష్టం యథైతత్ సూర్యమండలమ్ ॥"

- రామాయణం, సుందరకాండ.

హనుమంతుని ముఖవర్ణము తామ్రవర్ణము రాగిరంగు, అదే అరుణవర్ణము. ముక్కు గూడ తామ్ర వర్ణము గలది. ఆ ముక్కుతో గూడిన హనుమంతుని ముఖము సంధ్యతో తాకబడుచున్న సూర్యమండలం మాదిరిగనున్నదట. కాన హనుమంతుడు అరుణ పురస్సరముగానున్న సూర్య భగవానుడే నని శాకుంతల నాటకంలోని కాళిదాసు వాక్యమునకు సరిపోవుచున్నది. (అవిష్కృతోరుణ పురస్సరఏకతోర్కః) ఇంకా అడుగడుగునా రామాయణంలో ఈ యరుణ కాంతి గూర్చి సంధ్యగూర్చి చెప్పబడినది. కావుననే ప్రతివారు నిత్యము సంధ్యా వందనము చేసి తీరవలసిందిగా మనపూర్వులు చెప్పియున్నారు. (అహరహః సంధ్యాముపాసీత) రామ పూర్వతాపనీయోప నిషత్తులో సీతాదేవిని సంధ్యాస్వరూపంగా రాముడు కొల్చినట్లు చెప్పబడుచున్నది. రామ, లక్ష్మణుల మధ్యనున్న సీత-సంధి-సంధ్యయేగద! రామలక్ష్మణులిర్వురు పరమాత్మ - జీవాత్మలు-వారి నడుమ సీతాదేవి-సంధ్య ఆమెయే వేదమాత. దీనియర్థము ఏజీవియైనా పరమాత్మను తెలిసికొనవలెనన్న వేదము ద్వారానే తెలియనగునని తాత్పర్యము. ఆ వేదమాతయే - సీతయే - గాయత్రియే - సంధ్యయే అయ్యప్ప స్వామి స్వరూపమున్నూ ఇంకా సీతాదేవియే రాముని కోసం సంధ్యావందన మాచరించుచుండునని చెప్పబడినది. మహాభారతం ప్రారంభ శ్లోకము

"నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం చైవ తతోజయముదీరయేత్ ॥

నారాయణుడు, నరుడు - కృష్ణార్జునులు -వీరి మధ్య సంధి - సంధ్య - భగవద్గీతయే సరస్వతి. ఈ సరస్వతి నెరిగినవార్కి ఆరాధించిన వార్కి జయము తప్పకగలుగునని అర్థము.

ఇంకా పై మూడు తేజస్సుల గూర్చి మామూలుగ మన వివాహాది శుభకార్యక్రమములలో ఆహ్వాన పత్రికలలో ముందు వ్రాసెడి ప్రార్థనా శ్లోకములో తెల్పబడుచున్నది. ఈ శ్లోకము రామ కర్ణామృత మందలిది.

"జానక్యాః కమలామలాంజలి పుటే యాః పద్మరాగాయితాః ।
న్యస్తారాఘున మస్తకేచ విలపత్కుంద ప్రసూ వాయితాః ।
స్రస్తాః శ్యామల కాయకాంతి కలితా యా ఇంద్రనీలాయితాః
ముక్తాస్తాశ్శుభదా భవంతు భవతాం శ్రీరామ వైవాహికాః ॥"

-రామకర్ణామృతమ్ ।

శ్రీ సీతారాముల కల్యాణ సమయంతో సీతాదేవి శ్రీరాముని శిరస్సు మీద తలంబ్రాలు పోస్తుంది. అవి కొత్త దంపతులకు శుభమునిచ్చుగాక! ఎట్టి తలంబ్రాలు? అవి తలంబ్రాలు గాదు - శుభ్రములైన, నిర్మలములైన, మలినములేని, రంగులేని ముత్యాలు.

ముందు ముత్యాలు సీతాదేవి చేతులలో నుంచబడినవి. ఆదేవి చేతులు పద్మరాగంతో మెరిసిపోవుచున్నవి. అదే అరుణరాగం. ఆ ముత్యాలు గూడ అరుణ కాంతిని పొందినవి. దేవి ఆ ముత్యాలను శ్రీరాముని శిరస్సు మీద పోయగా నవి మల్లెమొగ్గల రంగును అనగా తెల్ల కాంతిని బొందినవట. ఆ తరువాత శ్రీరాముని శిరస్సునుండి ఆయన నల్లని శరీరముపై నుండి జారుటచే ముత్యాలు గూడ నల్లకాంతిని బొందినవి. ఇట్లు ముందుగా అరుణవర్ణము, తరువాత తెలుపు వర్ణము, తరువాత నలుపు వర్ణముల కాంతితో గూడిన ముత్యాలు కొత్తదంపతులకు శుభములనిస్తాయని శ్లోక తాత్పర్యము. ఈ శ్లోకము ముందు చెప్పబడిన అభిజ్ఞాన శాకుంతల శ్లోకానికి, రామాయణ శ్లోకానికి తాత్పర్యభూతము.

కావున ఈలోకాన్ని పాలించెడివి మూడు తేజస్సులు. అవే కృష్ణ, అర్జున (తెల్పు), అరుణ తేజస్సులు, అవే హరి, హర, అయ్యప్పల రూపము అని స్పష్టము. ఇట్లీ హరిహర పుత్రుడు, తేజోమండల మధ్యస్థుడు, అయిన అయ్యప్ప స్వామి కృష్ణ, శ్వేత కాంతుల మధ్య నున్న సంధ్యా స్వరూపుడు. అరుణ కాంతి మయుడు. వేద స్వరూపుడు. మంత్ర దేవుడు. ఇట్లీ అయ్యప్పస్వామి సేవయే సంధ్యావందనము. ప్రతి వారీ అయ్యప్ప సంధ్యా వందనము చేసి తరింతురుగాక -



# ఉగాది ప్రాశస్త్యము

భారతీయుల మొదటి పండుగ ఉగాది. అందరు అభ్యంగన స్నానం చేసి, నూతన వస్త్రముల ధరించి, దేవతాపూజ చేసి విందులు వినోదాలతో కాలక్షేపం చేస్తారు. ఉగాది పచ్చడిని సేవిస్తారు. అయితే ఉగాదిని గూర్చి తెలిసికొనవలెనన్న వేదము, జ్యోతిశ్శాస్త్రము శరణ్యములు. కాలస్వరూపము, యుగ, సంవత్సర, ఋతు, మాస,నక్షత్రముల స్వరూపముల మీద ప్రాణికోటి ఆధారపడియుండును.

'ఉగాది' అనేది కన్నడ పదము. సంస్కృతములో 'యుగాది' అని అంటారు. యుగ ప్రారంభమని అర్థము. యుగప్రారంభమును పండుగగా స్వీకరిస్తారు. 'యుగాది కృద్యుగావర్తో నైకమాయో మహాశనః" -విష్ణుసహస్రనామములు. యుగాది కర్త శ్రీమహావిష్ణువు. "యుగం హస్తచతుష్కే, స్యాదౌషధే వర్షపంచకే" అని శేషకోశము. అయిదు సంవత్సరముల కాలమును యుగము అని తెల్పుచున్నది. 'యుజిర్ యోగే' అని ధాతువు నుండి పుట్టుటచే యుగము యోగము. యోగమనగా చిత్తశుద్ధి. "యోగశ్చిత్తవృత్తి నిరోధః" అని యోగసూత్రము. చిత్తమున దుష్టవిషయ నివృత్తి. పరమేశ్వరుని యందు చిత్త మును లగ్నము చేయుట-సూత్రార్థము. "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అని భగవద్గీతా వచనము. ప్రతి యుగములోను భగవంతుడు ధర్మసంస్థాపన కొనం అవతరించుచున్నాడు. యుగమనగా జన్మ అని అర్థమున్నది. ఉగాది అంటే జన్మాది. 'జననో జన జన్మాదిః భీమో' అని విష్ణుసహస్ర నామముల ద్వారా జన్మాది శ్రీ మహావిష్ణువు. "జన్మాద్యస్యయతః" అని బ్రహ్మసూత్రము జన్మాది - యుగాది భగవంతుని ద్వారా ఏర్పరుచున్నదని తెల్పుచున్నది.

"వేదవేదాంగ తత్త్వజ్ఞః సోమాచారే యుగీ గణిః"

అని వైజయన్తి కోశము ద్వారా యుగమంటే వేదము అని అర్థము తెలియనగును. యుగాది అంటే వేదాది అని అర్థము. "యో వేదాదౌ స్వరః ప్రోక్తః వేదాన్తే చ ప్రతిష్ఠితః" అను మంత్రము, "ప్రణవశ్ఛందసామివ" అని కాళిదాస వచనము వేదాది ఓంకారమని చెప్పుచున్నది. కావున ఉగాది ఓంకారము. ఓంకారము స్వర రూపంగా ఆవిర్భవించినది కావున స్వరము గూడ ఉగాదియే. ఉగాదినాడు వేదాధ్యయనం చేయటము సదాచారమై లోకోపకారకమగుచున్నది.

భగవంతుడు కాలస్వరూపుడు. అట్లే యుగ, సంవత్సర, ఋతు, మాస స్వరూపుడని విష్ణుసహస్రనామములు తెల్పుచున్నవి.

"అహః సంవత్సరో వ్యాళః, ఋతుస్సుదర్శనః కాలః,
ఉగ్రః సంవత్సరో దక్షో, వత్సరో, వత్సలో వత్సి" అని.

కావున సంవత్సరాది గూడ యుగాది-ఉగాది అగుచున్నది.

"సమ్యక్ వసతి దేవో2త్రేతి సంవత్సరః, వత్సరః" అని అమరకోశము యొక్క వ్యాఖ్య. "వసతి అత్రాఖిల మితి వత్సరః" అని శంకర భాష్యము. భగవంతుని నివాసమగుటవలననూ ప్రాణికోటి సమస్తము ఇందు వసించుట చేతను సంవత్సర, వత్సరములగుచున్నవి. "వత్సం రాతీతి వత్సరః" వత్స అనగా పిల్లవాడు, స్థిరనివాసమని అర్థము. భగవంతుని దృష్టిలో ప్రజలు పిల్లలే వత్సలే. అట్లు ప్రజలకు స్థైర్యమును, స్థిరనివాసమును కల్పించునది వత్సరము. "వత్సేరాతీతి వత్సరః". వత్సమనగా వక్షః స్థలము. ప్రాణులందరు అయన హృదయమందున్నారుగాన పరమేశ్వరుడు "వత్సరః" అని పిలవబడుచున్నాడు.

"పంచ సంవత్సరమయం యుగాధ్యక్షం ప్రజాపతిమ్" అని జ్యోతిశ్శాస్త్రము. యుగాధ్యక్షుడు ప్రజాపతి సంవత్సర స్వరూపుడు అని తెల్పుచున్నది.

"సంవత్సరో2సి పరివత్సరో2 సీదావత్సరో2 సీద్వత్సరో2సి
వత్సరో2సి ఉషసస్తే కల్పన్తామ్। అహోరాత్రాస్తే
కల్పన్తామ్। అర్ధమాసాస్తే కల్పన్తామ్। మాసాస్తే కల్పన్తామ్
ఋతవస్తే కల్పన్తామ్। సంవత్సరస్తే కల్పతామ్"

అని యజుర్వేద మంత్రము. పరమేశ్వరుడు - సంవత్సర, పరివత్సర, ఇదావత్సర, ఇద్వత్సర, వత్సర, ఉషః, అహోరాత్ర, మాస, అర్ధమాస, ఋతు స్వరూపుడని పేర్కొనుచున్నది.

ఈవిధంగా ఉగాది సంవత్సరాది యని చెప్పబడుచున్నది. సంవత్సరాది వసంతుర్తువుతో ఆరంభమగుచున్నది. చైత్ర, వైశాఖ మాసములు వసంత ఋతువు. దీని స్వరూపము చూతము.

"తీయని ఊహలు హాయిని కొలిపే వసన్త కాలమే హాయీ"
అని కవులు వసంత కాలమును వర్ణిస్తారు.

"వసన్తే పుష్ప సమయః సురభిః" -అమరకోశము.

వసంత శబ్దము "వస నివాసే" యని ధాతువునుండి పుట్టినది. "వసతి కామో2స్మిన్నితి వసంతః" అని "వసన్తి సుఖమస్మిన్నితి వసంతః" అనియు వ్యుత్పత్తులు.

మన్మధుడు ప్రజలందు సుఖముగ నివసించుటచేత వసంతమని పిలువబడుచున్నది. పూవులు పూచుకాలము అని అర్థమొకటి. శిశిరర్తువులో చెట్లు ఆకులన్నియు రాలిపోయి, వసతంతర్తువులో మరల చిగిర్చి పూలు పూచును. కొత్తగా వచ్చు మామిడి పూలను మన్మథ బాణములని వ్యవహరిస్తారు. జనులీకాలమున సుఖముననుభవించుటచే 'సురభి' యని మరియొక పేరు. 'సుష్ఠు రభన్తే ఉపక్రమన్తే శుభకార్యం కర్తుమితి సురభిః" -ఈకాలంలో జనులు శుభకార్యములు చేయనారంభింతురు గాన సురభి యగుచున్నది.

"శివోత్యంగం, శివోత్యర్థం శీతేనేతి శిశిరః " శీతము చేత దేహము, కార్యములు, కార్య ఫలములు స్వల్పములగుటచే శిశిరమగుచున్నది. మరల వసన్తకాలమున ప్రారంభమై కార్యానుకూలత, సిద్ధి ప్రాప్తించును. దేవతలు గూడ ప్రపంచ సృష్టికోసం మానసయజ్ఞమునీ వసంతర్తువులో నారంభించి గ్రీష్మ,శరదృతువులో పూర్తిచేసినట్లు తెలియదగును.

"యత్పురుషేణ హవిషా దేవాయజ్ఞ మతన్వత। వసంతో అస్యాసీదాజ్యం। గ్రీష్మ ఇధ్మః శరద్ధవిః"-పురుషసూక్తము. దేవతలు తమ యజ్ఞమునకు హవిరాదులు దొరకనందున పరమపురుషుని సామాన్య హవిస్సుగాను, వసంతర్తువును హోమద్రవ్యమగు నేయిగాను, గ్రీష్మము నింధనముగాను, శరదృతువును విశేషరూప హవిస్సుగాను సంకల్పించిరి. అపుడు ఆ యజ్ఞమునుండి ఋగ్యజుస్సామాది వేదరాశి, ప్రజలు, పశువులావిర్భవించినవి. కనుక యజ్ఞమునకు అనుకూలమైన ఋతువులు వసన్త, గ్రీష్మ, శరత్తులు. అందులోను ప్రధానమైనది వసన్తర్తువు.

"వసన్తో వర్షో గ్రీష్మ ఏతే దేవా ఋతవో2థ శరద్ధేమశిశిర ఏతే పితరః" అని యజుర్వేదము.

వసన్త, గ్రీష్మ, వర్షర్తువులు దైవములని, శరద్ధేమన్త శిశిరర్తువులు పితృసంబంధకములని వేదవచనము. వసంతర్తువులో బ్రాహ్మణులు, గ్రీష్మర్తువులో క్షత్రియులు, శరదృతువులో వైశ్యులును అగ్న్యాధానము, ఉపనయనము చేసికొనవలెనని వేదవచనము. నియమనిష్ఠలు, అనుష్ఠానము గలవాడు వసంతమున దేహపాతమొందిననాతడు వసంత స్వరూపము నొందునట. అట్లే గ్రీష్మాది స్వరూపము చెందును.

"తతః కాలే బహుతిథే కస్మింశ్చిత్సు మనోహరే
వసన్తే సమనుప్రాప్తే రాజ్ఞో యష్టుం మనో2భవత్" -రామాయణమ్

దశరథ మహారాజు మనోహరమైన వసంతర్తువు రాగానే పుత్రకామేష్టి యాగముచేయ తలపెట్టెను.

"ఋతూనాం ముఖో వసన్తః" - ఋతువులన్నిటికి వసంతర్తువు ముఖమని వేదవచనము - యజుర్వేదీయ తైత్తిరీయ బ్రాహ్మణము.

ఈ వసంతర్తువులో చైత్ర, వైశాఖ మాసములుండును.

"ఋతూనాం శారదీ మాతా పితా తు కుసుమాకరః"

శరదృతువు తల్లివలె, వసంతర్తువు తండ్రివలె ప్రజలను కాపాడుచుండునని శాస్త్రవచనము. వ్యాధులు ప్రబలుచుండుటచే మామిడి, వేప, చింత మొదలగు ఓషధులతో చేయు ఉగాది పచ్చడి ఆ వ్యాధుల నరికట్టును.

"ద్వాదశమాసాః సంవత్సరస్య - మధు, మాధవములు అనగా చైత్ర, వైశాఖములు గలదియని అర్థము. ఈ రెండు మధువును తేనెల గురిపించునవి.

"మా అసతి మాసః" -లక్ష్మీ యుండుటచే మాసమని పేరు గల్గెను. ముందు మధుమాసమును చూద్దాము - ఇది చైత్రము.

చైత్రే చైత్రికో మధుః' -అమరకోశము.

"చిత్రా నక్షత్ర యుక్తా పౌర్ణమీ చైత్రీ-చైత్రీ అస్మిన్నితి చైత్రికః, చైత్రః" చిత్రా నక్షత్రముతో గూడిన పూర్ణిమగల మాసమునకు చైత్రమని పేరు. నక్షత్రస్వరూపము చూతము.

"దేవా ఊచుః నవా ఏతాని క్షతాణి అభూవన్నితి
తన్నక్షత్రాణాం నక్షత్రత్వమ్। తాని హవా ఏతాని
క్షత్రాణి నాసైవసతే యథాసౌ సూర్యచంద్రమాః" -యజుర్వేదము.

క్షత్రమనగా తపింపచేయుట. సూర్యచంద్రులు తపింపచేయునట్లు నక్షత్రములు తపింపజేయవు. క్షత్రములు గావుగాన నక్షత్రములగుచున్నవి అని యర్థము. ఈ నక్షత్రములే అప్సరసలని వేదమింకొకచోట తెల్పినది. "భేకురయో2 ప్సరసః" "భాకురయో హ నామైతే భాం హి నక్షత్రాణి కుర్వన్తి" - శతపథ బ్రాహ్మణమ్। అప్సరసలనబడే నక్షత్రములు నశింసని దివ్యతేజస్సులు. "నక్షత్రాణి వై జనయః। యే హి జనాః పుణ్యకృతః స్వర్గం లోకం యన్తి తేషామేతాని జ్యోతింషి" -శతపథ బ్రాహ్మణమ్. "నక్షీయన్తే ఇతి నక్షత్రాణి" నశించనివి అని అర్థము.

పుణ్యకర్మలజేయు జనుల నుత్తమలోకముల నొందించు యీ జ్యోతిస్సులకు 'జనయః' అని పేరు. అట్టి నక్షత్రములలో చిత్రా నక్షత్రము యొక్క స్వరూపమిట్లు వేదములో తెలుపబడుచున్నవి.

"తేహదేవా సమేత్యోచుః చిత్రం వా అభూమ యితః
సపత్నా నవధిష్మ ఇతి తచ్చిత్రాయాః చిత్రాత్వమ్" -శతపథ బ్రాహ్మణమ్.

చిత్రానక్షత్ర సమయంలో శత్రువులను వధించి మనమందరము చిత్రమగుదుము. అనగా వారిని చిత్రంగా వధించి చిత్రం చేద్దామని సంకల్పించిరి గాన ఆ నక్షత్రమునకు 'చిత్ర' అని పేరు వచ్చినది.

కృత్తికాః ప్రథమమ్। విశాఖే ఉత్తరమ్। అనూరాధాః
ప్రథమమ్। భరణీ రుత్తరమ్' -శతపథ బ్రాహ్మణమ్

చిత్రా, విశాఖ నక్షత్రములు దేవనక్షత్రములు.

చిత్రా నక్షత్రం గూర్చి తైత్తిరీయ బ్రాహ్మణమిట్లు తెల్పుచున్నది.

"కాలకంజావై నామాసురా ఆసన్। తే సువర్గాయలోకాయ అగ్ని మచిన్వంత। పురుష ఇష్టకాముపాదదాత్ పురుష ఇష్టకామ్। స ఇంద్రో బ్రాహ్మణో బ్రువాణ ఇష్టకాముపాదత్త।

ఏషామే చిత్రా నామేతి। తేసువర్గం లోకమా ప్రారోహన్। స ఇంద్ర ఇష్టకామావృహాత్। తే నా కీర్యన్త। త ఊర్ణ నాభయో భవన్। ద్వావుద పతతామ్। తౌ దివ్యౌశ్వానా వభవతామ్।

యో భ్రాతృవ్యవాన్ స్యాత్। సచిత్రాయా మగ్నిమాదధీత। అవకీర్త్యైవభ్రాతృవ్యాన్. ఓజో బలమింద్రియం వీర్యమాత్మన్ ధత్తే". ఇతి।

కాలకంజులనే రాక్షసులు స్వర్గమున వెళ్లగోరి అగ్ని అధానమును ప్రారంభించిరి. యజ్ఞగుండమున కొక్కొక్క రాక్షసుడొక్కొక్క ఇటుకను తెచ్చి అమర్చుచుండిరి. వారి సంగతి తెలిసికొని ఇంద్రుడు బ్రాహ్మణ వేషమును ధరించి (ఆరాక్షసుల జయించగోరి) ఆ ఋత్విక్కుల మధ్యలో ప్రవేశించి తానునొక ఇటుకను తీసికొని రాసాగెను. అపుడింద్రుడు మనసులో నీ యిటుకకు 'చిత్ర' యను పేరు యుక్తము. ఈ యిటుక చిత్రవిచిత్ర (ఫలములను) ములైన పనులు చేయగల్గియుండును అని నిశ్చయించి అచట చేర్చి మిగిలినవానితో పాటు పెట్టెను. హోమము ప్రారంభించిరి. ఆ రాక్షసులు స్వర్గమునకు పోవుటకు ప్రారంభించిరి. ఇంద్రుడు తన యిటుకను ఆ చితినుండి తీసివైచెను. చితి భ్రంశమాయెను. అందుచే రాక్షసులు మార్గభ్రష్టులైరి. వారపుడు ఊర్ణనాభి అనుపేరుగల కీటకములుగ మారిరి. ఊర్ణనాభి యనగా సాలీడు. అచట తాము తంతువులతో గూడు అల్లి ఆకాశములో నిర్భయముగ నుండిరి. అయితే ఇర్వురు మాత్రం ఎక్కువ శ్రద్ధ గలవారై ముందుగను స్వర్గమునకువెళ్ళి క్రింద చితిభ్రంశము వలన వారు స్వర్గములో శునకములయిరి. కావున యీవిధముగ చిత్రేష్టకాపాతముచే ననగా చిత్రమను పేరుగల ఇటుకను తీసి, చితిభ్రంశముచేసి రాక్షసుల వినాశము గావించినందున నప్పటి నక్షత్రమునకు 'చిత్రా' యని పేరు గల్గినది. ఆ మాసమునకు చైత్రమని పేరు వచ్చినది. కనుక ఎవరైతే చిత్తా నక్షత్ర సమయంలో చైత్రమాసంలో అగ్న్యారాధన చేయునో నాతని శత్రువులు నశింతురు. అతనికి ఆ నక్షత్రమాసములు తేజస్సు, బలమునిచ్చును.

నక్ష తగతౌ అని ధాతుజమైన పదము నక్షత్రము. "నక్షతే ఇతి నక్షత్రం".

"నక్షత్రయుక్తేకాలే యః యాగం కురుతే సః యజమానః స్వర్గం నక్షత్రే ప్రాప్నోతి"

- యజుర్వేదమ్

దేవనక్షత్రములున్న సమయమున యజ్ఞము చేయువాడు స్వర్గమును, ఇష్టకామ్యమును పొందును. క్షత్ర యనగా పొందుట. కనుకనే 'నక్షత్ర' మని పదము సార్థకమని యర్థము. కనుకనే

"తతో యజ్ఞే సమాప్తేతు ఋతూనాం షట్సమత్యయుః।

తతశ్చ ద్వాదశేమాసే చైత్రే నావమికే తిథౌ, కౌసల్యాజనయద్రామమ్"

- రామాయణమ్.

చైత్రమాసంలో ప్రారంభింపబడిన నాయజ్ఞము పూర్తికాగానే, పన్నెండు మాసములు రాగానే, చైత్రశుద్ధ నవమినాడు శ్రీరామచంద్రుడు జన్మించెను.

"యజ్ఞ సమాప్తిః వైశాఖే భవేత్" అని మణిమంజీర వ్యాఖ్య వలన చైత్రమాసంలో మొదలుపెట్టబడిన యాగము వైశాఖమాసంలో పూర్తియయ్యెనని తెలుస్తున్నది. శ్రీరాముని జన్మకారణమువలన చైత్రమాసము పవిత్రము, ఆరాధనీయము.

"ఇంద్రస్య చిత్రా। ఋతం పురస్తాత్ సత్యమవస్తాత్
ఇంద్రాగ్ని యోర్విశాఖే। యుగాని పరస్తాత్ కృష
మాణా అవస్తాత్"

- తైత్తిరీయ బ్రాహ్మణమ్ 1-5-1

చిత్తా నక్షత్రమున కధిదేవత ఇంద్రుడు. ఈ నక్షత్రమున కొక ప్రక్కన ఋతము, మరొక ప్రక్కన సత్యము ఉండును. ఈ రెంటిమధ్య చిత్రా నక్షత్రముంటుందట. ఋతమనగా ఆలోచించబడు వస్తుతత్వము. సత్యమనగా పైకి చెప్పబడు వస్తుతత్వము.

విశాఖా నక్షత్రముతో గూడిన పూర్ణిమగల మాసము వైశాఖము. ఈవిశాఖకు రెండు నక్షత్రములుండును. వీనికి అధిదేవతలు ఇంద్రుడు, అగ్నియున్నూ.వీనికి ఒకప్రక్క యుగములు (ఎద్దు మీద నుండు కాడి యుగము) మరియొక ప్రక్కన కర్షకులు ఉంటారు. అందుకే వైశాఖమాసంలో కర్షకులు కొత్తగా ఎడ్లమీద కాడెలుంచి నాగళ్ళతో భూమిని దున్నుతారు. అను విషయమును పై మంత్రములు తెల్పుచున్నవి.

"యాని వా ఇమాని పృథివ్యాః చిత్రాణి, తాని నక్షత్రాణి"।

భూమిమీద చిత్రవిచిత్రములైన గ్రామనగరాదులు, స్థానములు గలవు గద! అవి అన్నియు చిత్రనక్షత్ర సదృశములే" అని యర్థము.

"నక్షత్రనేమిర్నక్షత్రీ" అని విష్ణు సహస్రనామములు.
"అహోరాత్రే పార్శ్వే। నక్షత్రాణి రూపం" - వేదము.
శ్రీమహావిష్ణువు నక్షత్రదేహము కలవాడు అని అర్థము. ఆయన నక్షత్ర స్వరూపుడు.

"యోవై నక్షత్రియం ప్రజాపతిం వేద। ఉభయో రేనం
లోకయోర్విదుః॥ హస్తఏవాస్య హస్తః॥ చిత్రా
శిరః॥ నిష్ట్యాః హృదయమ్। ఊరూవిశాఖే। ప్రతిష్ఠా అనూరాధాః"

- తైత్తరీయ బ్రాహ్మణమ్।

ప్రజాపతి శరీరము నక్షత్రమయము. ఆయన చెయ్యి హస్తా నక్షత్రము. శిరస్సు చిత్రా నక్షత్రము. స్వాతీ నక్షత్రం హృదయము. తొడలు విశాఖ నక్షత్రములు. పాదములు అనూరాధా నక్షత్రములు. ఇట్లు ప్రజాపతి నుపాసించవలెనని అర్థము. ఈవిధముగ చిత్రా, విశాఖ నక్షత్రముల స్వరూపమవగతము.

"కావ్యఖ్యాతయో రాసీద్వ్రజతోః శుద్ధ వేషయోః
హిమనిర్ముక్త యోర్యోగే చిత్రా చంద్ర మసోరివ॥

- రఘువంశమ్

వసిష్ఠమహర్షి ఆశ్రమమునకు పోవుచున్న సుదక్షిణాదేవి, దిలీపమహరాజున్నూ పరిశుద్ధ వేషధారులై, హిమముచే విడువబడిన చిత్రా నక్షత్రము, చంద్రునివలె నున్నారు. ఆ దంపతుల కాంతివిశేషము చిత్రా నక్షత్రచంద్ర సంయోగమువలె నుండును. చిత్రా నక్షత్రముతో చంద్రునికి సంబంధమున్నపుడు చైత్రమాసము వచ్చును. శిశిర ఋతువులో మంచుతో గప్పబడి యుండుటచేత కాంతి యుండదు. శిశిరము పోగానే వసంతము రాగానే మంచుతెర పోయి ఉల్లాసము, కాంతి గల్గును. ఈ యుపమానము చేత దంపతులకు దుఃఖకాలము గడిచి సంతోష కాలము వచ్చుచున్నట్లు కవి తాత్పర్యము. ఇదియే వసన్తకాల ప్రత్యేకతయని కవి సూచన.

కాళిదాస మహాకవి అభిజ్ఞాన శాకుంతల నాటకమున, విక్రమోర్వశీయ నాటకముననూ విశాఖ నక్షత్రములను వర్ణించెను. శకుంతల అనసూయా ప్రియంవదలతో వచ్చుటను దుష్యంతుడిట్లు వర్ణిస్తున్నాడు.

"కిమత్ర చిత్రం? యది విశాఖే శంశాకలలేఖామనువర్తేతే?"

- అభిజ్ఞాన శాకుంతలమ్

విశాఖ యనునది రెండు నక్షత్రముల కూర్పు. ఈరెండు విశాఖా నక్షత్రములు నాధుడగు చంద్రుని అనుసరించినట్లు అనసూయా ప్రియంవదలు శకుంతల ననుసరించిరి.

"ఏష చిత్రలేఖా ద్వితీయాం ఊర్వశీం గృహీ త్వా విశాఖా
సమీపగతా ఇవ చంద్రః ఉపస్థితః రాజర్షిః"

- విక్రమోర్వశీయమ్

రంభ ఇతర చెలికత్తెలతో నిట్లు చెప్పుచున్నది. చిత్రలేఖ, ఊర్వశీలతో కలిసి వచ్చుచున్న పురూరవ చక్రవర్తి, విశాఖా నక్షత్రములతో కలిసియున్న చంద్రునివలె యున్నాడు అని అర్థము. విశాఖా నక్షత్రములతోనున్న చంద్రుడు బహు రమణీయుడని కవి తాత్పర్యము. అట్టి విశాఖా నక్షత్రములతో గూడిన వైశాఖమాసము గూడ రమణీయము.

వైశాఖమాసమును "వైశాఖే మాధవో, రాధో" అని అమరకోశము. మాధవమాసము, రాధమాసము అని చెప్పుచున్నది. విశాఖకు రాధ అని పేరు. ఆ నక్షత్రయుక్తమైన మాసము వైశాఖము. రాధ అగును.

మధుః వసన్తః అస్మిన్నితి మాధవః - మాధవ సామ్యాన్మాధవః. వసంతర్తువు ఉండుటచేత మాధవునితో సామ్యముండుటచేత మాధవమాసమయినది.

వేదమునకు అనేకశాఖలు గలవు. అట్లు విశిష్టమైన వేదశాఖలు గల్గియుండుటచే విశాఖయని కీర్తింపబడుచున్నది. "విశిష్టాః శాఖాః వేదశాఖాః అస్మిన్నితి విశాఖా" ఈ మాసమున చెట్లు కొమ్మలు-శాఖలు, పూలు, ఫలములతో సమృద్ధిగా గల్గియుండుటచేత గూడ విశాఖ లగుచున్నవి. అందుచే నీ మాసంలో పుష్ప ఫలసమృద్ధి యుండుటచేత విశిష్ట వేదశాఖా భరితమై యుండుటచేతను శుభకార్యముల నాచరించుటకు సాధ్యపడును. ఇట్లు ఉగాది చైత్రవైశాఖమాసములతో వారంభింపబడి ప్రజలకు ఉల్లాసము చేకూర్చుచున్నది.





# దీపావళి - వైదికస్వరూపము

మనము భారతీయులము. 'భా' అంటే కాంతి, వెలుగు, దీప్తి అంటే అగ్ని. దీపము. అగ్నిని, లేక, దీపమును ఆరాధించువారు భారతీయులు. భారతదేశంలో దీపారాధన చేయని ఇల్లు లేదు. ఉండదు. భారతీయులు ప్రతికార్యమును దీపారాధన చేయకుండ ప్రారంభించరు. దీపారాధన యజ్ఞమే.... యజ్ఞమునకు సూక్ష్మరూపము దీపారాధన. ఆవళి అంటే పంక్తి. వరుసయని అర్థము. కావున దీపావళి అనగా దీపపంక్తి. దీపముల వరుసయని అర్థము. ఈ దీపావళి ఆశ్వయుజ బహుళ అమావాస్యనాడు వచ్చును. దీనిని దీపోత్సవమని పేరుతో పండుగగా చేసుకొందురు.

ఆనాటి సాయంకాలము ఇండ్లను దీపములతో నలంకరింతురు. దీపమున్న ఇంటిలో లక్ష్మి యుండును. అందుచే దీపములతో లక్ష్మీదేవికి నీరాజనమిచ్చి, నరకాసుర సంహారమునకు ప్రతీకగా టపాకాయలు మొదలగునవి పేల్చి దీపోత్సవము చేసుకొందురు. దానితో రాక్షసబాధ, క్రిమి కీటకబాధ తొలగును. కావున మనము లక్ష్మీసంపన్నులము కావలెనన్న దీపారాధన, తద్వారా అగ్న్యుపాసన చేయవలెను. శ్రీ సూక్తంలో

"చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ
సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ"

అని చెప్పబడింది. ఓ అగ్నీ! సూర్య, చంద్రుల యొక్క హిరణ్యరూపమైన లక్ష్మిని, మాకు ప్రసాదింపుమని అర్థము. అందుకే ప్రతి భారతీయుని వేదమిట్లు మేలుకొల్పుచున్నది. "ఉత్తిష్ఠత! మాస్వప్త! అగ్నిమిచ్ఛధ్వం భారతాః" భారతీయులారా! లెండు, నిదురించవద్దు. అగ్నిని ఆరాధించండి" అని అర్థము. అగ్ని ఆరాధనకు ప్రతీకయే దీపారాధన. దీపారాధన లక్ష్మిని ఇచ్చును.

"ఉద్దీప్యస్వ జాతవేదో2 పఘ్నన్ నిర్‌ఋతిం మమ"

అనగా అగ్నీ! నా పాపములను పోగొట్టి నాకు వెలుగు, వివేకమును ప్రసాదింపుమని అగ్నిని భారతీయులు ప్రార్థించుచున్నారు.

దీపమనే పదానికి 'దీప్యతే అనేన' అని వ్యుత్పత్తి. దేనిచేత సమస్తము ప్రకాశింపచేయ బడునో దానికి దీపమని పేరు. అట్లు దీప పదమునకు అగ్ని, జ్యోతిస్సు, ప్రకాశము, కాంతి, జ్ఞానము, వివేకమని అర్థములున్నవి.

పరమేశ్వరుడు లేనిచో జగత్తు లేదు కాన పరమేశ్వరుడు మొదటి దీపము. "నతత్ర సూర్యో భాతి న ,చంద్ర తారకమ్. యస్య భాసా సర్వమిదం విభాతి". ఆ పరమేశ్వర రూపదీపముతోనే ప్రపంచము, సూర్య,చంద్ర, నక్షత్రాదులు గూడ ప్రకాశించునట. అట్లే

సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు గూడ దీపములే.

"వేదాహమేతం పురుషం మహాంతమ్।

ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్"

చీకటిని పారద్రోలుచు, మనకు వెలుగునిచ్చు ఆదిత్యస్వరూపుడైన పరమేశ్వరుడే మొదటి దీపము.అట్లే పరాదేవియైన జగన్మాత కూడ.

"తామగ్నివర్ణాం తపసా జ్వలంతీమ్ - వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్"

"లక్ష్మీం క్షీరసముద్ర రాజతనయాం శ్రీరంగధామేశ్వరీం

దాసీభూత సమస్త దేవవనితాం లోకైక దీపాంకురామ్" - శ్రీసూక్తము

"జయ జయ వైష్ణవి! దుర్గే! - పార్వతి! లోకైక దీపే" - *కృష్ణలీలా తరంగిణి.*

అట్లే శ్రీరాముని -

"శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం।

సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం।"

అని రఘుకులమునకే దీపముగా కొనియాడుచున్నాము.

దీనినిబట్టి కుమారుడు తన వంశమునకు, కులమునకు దీపములాంటివాడుగా ఉండుననీ,ఉండవలెనని తెలియును. లలితాదేవి "అజ్ఞానధ్వాంత దీపికా" అట.

మానవుల దేహంలో నుండు చైతన్యము గూడ దీపము అని దక్షిణామూర్తి స్తోత్రం తెల్పుచున్నది.

"నానాఛిద్ర ఘటోదరస్థిత మహాదీప ప్రభాభాస్వరం

జ్ఞానం యస్యతు చక్షురాది కరణద్వారా బహి స్పందతే" -

చాలా చిల్లులున్న కుండలోనుండు దీపకాంతులెలా ఆ చిల్లులద్వారా బయటకు వచ్చునో యట్లే మన మనశరీరమందుగల నవరంధ్రముల ద్వారా చైతన్యస్ఫూర్తి, జ్ఞానము బయటకు ప్రసరించునని తెలియనగును. శరీరాంతర్గత పరమాత్మ ప్రకాశము దీపమువలె తమోవిరోధి లక్షణము గల్గినది.

"ఇదమంధతమః కృత్స్నం జాయేత భువన త్రయమ్।

యది శబ్దాహ్వయం జ్యోతిరాసంసారం న దీప్యతే॥" -కావ్యాదర్శ

సృష్టి ప్రారంభము నుండి శబ్దమనెడి జ్యోతిస్సు-దీపము లేనిచో ముల్లోకములు గాఢాంధకారమున మునిగిపోయి యుండెడివి అని యర్థము. శబ్దమనగా వైదికశబ్దము. ఈ శబ్దములను కావ్యమీమాంసా యనుగ్రంథము "ఆగమ పదము"లని తెల్పుచున్నది. 'ఆగమపదావళి' యే "దీపావళి" అని వర్ణించబడినది. కాన దీపావళి అంటే వేదమంత్రావళి

యని గమనించదగిన విషయము. ఈ మంత్రరాశి సామాన్యదీపరాశి వంటిది గాదు. ఇది మానవులపాలిటి జ్ఞానదీపరాశి. పైగా స్వయంప్రకాశమగు దీపరాశి. సామాన్య దీపములవలె ఫలాపేక్ష లేనిది. ఆ వేదరాశి స్వయంప్రభ.

"త్రయీమయీం హరిప్రియాం స్వయంప్రభాం గిరం భజే"। - భారతీ నిరుక్తి.

ఈ వేదములు - అగ్ని, వాయు, ఆదిత్యుల నుండి పుట్టినట్లు ఈ వేద మంత్రము ద్వారా తెలియును. "అగ్ని స్త్రేధా విహితా - అగ్ని, వాయు, సూర్యాత్మనా। సా వా ఏషా వాక్ త్రివిధా విహితా। ఋచో యజూంషి సామాని - త్రయో వేదా అజాయన్త। ఋగ్వేద ఏవాగ్నేరజాయత। యజుర్వేదో వాయోః సామవేద ఆదిత్యాత్" -ఐతరేయ బ్రాహ్మణమ్।

అగ్ని - "అగ్ని, వాయువు, సూర్యుడ"ని మూడు విధములైనది. అట్లే వేదము "ఋక్, యజుస్,సామ" అని మూడు విధములైనది. అగ్నినుండి ఋగ్వేదము, వాయువునుండి యజుర్వేదము, సూర్యుని నుండి సామవేదము ఆవిర్భవించినవి. ఇట్లు యీ మూడు వేదములు అగ్నినుండి పుట్టి, లోకమున చీకటిని పారద్రోలి వెలుగునిచ్చు దివ్య దీపములు.

లోకమున మానవుల యజ్ఞానమును చీకటి యందురు. మామూలుగా లౌకికదీపము చీకటిని పోగొట్టి వస్తువును దర్శింపచేయును. మరి యజ్ఞానమును (చీకటిని) పారద్రోలెడి దీపము జ్ఞానము. జ్ఞానమును దీపమని భగవద్గీత తెల్పుచున్నది. "జ్ఞానదీపేన భాస్వతా"। కొన్నిచోట్ల జ్ఞానమును అగ్ని అని భగవద్గీత పలికినది.

"జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః।
తేషామాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥"
అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః।
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం తమాహుః పండితం బుధాః॥ - భగవద్గీత

జ్ఞానముచే అజ్ఞానము నశించి, ఎవరి అజ్ఞానము ఆ సూర్యునివంటి జ్ఞానాగ్నిచే దగ్ధమగునో వాతనిని పండితుడని అందురు.

ఈ జ్ఞానదీపములు వేద దీపమునుండి మానవులకు సంభవించుచున్నవని వేదవచనము.

లోకమున దేవతార్చన చేయువారు షోడశోపచార పూజ చేస్తారు. అందు దీపమునిచ్చు ఉపచారమొకటి. ఆవాహనము, ఆసనము, అర్ఘ్యము, ఆచమనము, మధుపర్కము, స్నానము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పూజ, ధూపము,దీపము, నైవేద్యము, తాంబూలము, నీరాజనము, మంత్రపుష్పము అని పదహారు ఉపచారములు. అందు దీపమొకటి. దీపమిచ్చునపుడీ శ్లోకమును చెప్పుదురు.

"సూర్యేందుకోటి ప్రభ! వాసుదేవ!
దీపావళిం గోఘృతవర్తి యుక్తం।

స్వమాయయాంధీకృత సర్వలోకం
జ్ఞానప్రదీపం కురు తే నమోస్తు
ఘృతవర్తి సమాయుక్త మంధకార వినాశనమ్।
దీపం దాస్యామి తే దేవి! గృహాణ ముదితా భవ॥"

కోటి సూర్యచంద్రుల కాంతిగల వాసుదేవా! ఆవునేతితో తడిసిన వత్తులతో గూడిన యీ దీపావళిని నీకు సమర్పించుచున్నాను. దానిని గైకొని తమతమ అజ్ఞానమనెడి అంధకారములో మునిగి, గ్రుడ్డివారైన సమస్తజనులకు జ్ఞానదీపమును చూపివారికి వివేకమనెడి వెలుగును ప్రకాశింపజేయుము అని ప్రార్థించుచున్నారు. ఈ వేదమంత్రమును చూద్దాము.

"అసతో మా సద్గమయ। తమసో మా జ్యోతిర్గమయ।
మృత్యోర్మా అమృతం గమయ"

అసత్ (అసత్యం) నుండి సత్ (సత్యం), చీకటినుండి వెలుగును, అజ్ఞానము నుండి జ్ఞానమును, మృత్యువు నుండి అమృతమును నాకు గల్గించుమని ప్రార్థన. ఆ జ్ఞానదీపమునే ప్రపంచమునకు మొదట ఇచ్చినది వైదికశబ్దములు గద! ఆ వైదిక శబ్దావళియే నిజమగు దీపావళి.

వ్యాకరణ శాస్త్రారంభమున పాణిని మహర్షి ప్రార్థన ద్వారా శబ్దరూపదీపములు అజ్ఞానరూప తమస్సును భేదించి నాశనము చేసినవని తెలియుచున్నది.

"యేన ధౌతా గిరః పుంసాం విమలైశ్శబ్ద వారిభిః
తమశ్చాజ్ఞానజం భిన్నం తస్మై పాణినయే నమః"।

శబ్దములనెడి నిర్మలములైన జలములతో మానవుల వాక్కులు శుద్ధి గావింపబడినవి. అజ్ఞానమనెడి చీకటి పటాపంచలు గావింపబడినది. అట్టి శబ్దరాశిచే శుద్ధిగావించిన పాణిని మహర్షికి నమస్కారము. ఇచట శబ్దములను అగ్నులు, దీపములతోగాక జలములతో పోల్చినారు. అనగా -

"ఆకాశద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః" అని జలములగ్ని నుండి పుట్టినవనియు, అవి అగ్నిగర్భములనియు వేదము తెల్పుచున్నది."అగ్నిం యా గర్భం దధిరే విరూపాస్తా న ఆపః శగ్గ్ స్యో నా భవంతు" అని వేదము. జలమగ్ని గర్భమని తెల్పుతోంది. లోకంలో జలముల నుండి అగ్నిని (విద్యుత్ Current)ఉత్పత్తిచేయుట అందరికి తెలిసిన సంగతి. కావున జలములను అగ్నిరూపములుగాను - దీపములుగాను - గ్రహించవచ్చును. కావుననే శబ్దములు జలరూపములు; జలములు శబ్దరూపములు - ఇట్లు అవి మానవుల వాక్కులను శుద్ధి చేయగల్గుచు, జ్ఞానప్రదీపములయినవి. జ అనగ జన్మ, ల అనగ లయము. ప్రపంచము యొక్క జన్మ లయముల గూర్చి తెల్పిన విద్య బ్రహ్మవిద్య. అందలి వైదిక పదములున్నా

అదియే ఆగమ పదావళి. వైదిక దీపావళి. జలములు వైదికమంత్ర స్వరూపములు గద!

**అపరోక్షాత్మకం జ్ఞానం శాబ్దం దేశిక పూర్వకమ్**
**సంసార కారణాజ్ఞాన తమవశ్చండ భాస్కరః॥**

వేదశబ్దముల ద్వారా కల్గిన బ్రహ్మాత్మకజ్ఞానము సంసార కారణముచే గల్గు అజ్ఞానమనెడి చీకటిని పారద్రోలు చండభాస్కరుడని యర్థము.

**"మతిభేద తమస్తిరోహితే గహనే కృత్య విధౌ వివేకినామ్।**
**సుకృతః పరిశుద్ధ ఆగమః కురుతే దీప ఇవార్థ దర్శనమ్"॥**

- *కిరాతార్జునీయమ్ - 2-33*

మానవులకు కార్యాచరణ విధి యందు ఇది చేయవచ్చునా? కూడదా? అని మతి భేదమనెడి చీకటి గ్రమ్మి కింకర్తవ్యతా మూఢులైనపుడు వివేకము గల వారికి లౌకిక దీపమెట్లు వస్తువులను దర్శింప చేయునో, అట్లే వేదమనెడి పరిశుద్ధ దీపము పరమార్థ దర్శకము, మంచి మార్గదర్శకము, బ్రహ్మ దర్శకమగునని యర్థము. అట్లే -

**"అపనేయ ముదేతు మిచ్ఛతా తిమిరం రోషమయం ధియా పునః**
**అవిభిద్య నిశాకృతం తమః ప్రభయా నాంశుమతా ప్యుదీయతే"**

-*కిరాతార్జునీయమ్*

అభ్యుదయము పొందగోరువారు ముందు కోపమనే చీకటిని బుద్ధి అనే దీపముతో పోగొట్టుకొనవలెను. అపుడు వారికి జ్ఞానోదయము గల్గును. రాత్రివల్ల గల్గిన చీకటిని ముందు సూర్యుడు పోగొట్టును. ఆ తర్వాతనే గద! వెలుగునిచ్చును. ఈ వేదమంత్రమును జూతము.

**"ఆదిత్యోవా ఏష తన్మండలం తపతి। తత్ర తా ఋచః॥**
**సదృచా మండలగ్ం। స ఋచాం లోకే2 థ య ఏష ఏ తస్మిన్**
**మండలే2 ర్చిదీర్ఘవ్యతే। తాని సామాని ససామ్నాం లోకే2థ య**
**ఏష ఏతస్మిన్మండలే2 ర్చి ర్దీప్యతే - తాని యజూగ్ంషి స**
**యజుషా మండలగ్ం స యజుషాం లోకః॥**
**సైషా విద్యా త్రయ్యేవ తపతి"**

ఈభూమండలమునకు సూర్యుడు వెలుగును ప్రసాదించుచున్నాడు. కాని ఆ సూర్యుడు ఋగ్యజుస్సామాత్మకమగు తేజోలోకము. సూర్యమండలము వేద మండలము. కావున నీ మూడువేదములే ప్రపంచమునకు వెలుగునిచ్చు దివ్యదీపములు అని యర్థము.

**"వ్యోమనాథస్తమోభేదీ ఋగ్యజుస్సామపారగః ।**
**వేదాశ్శస్త్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవచ ॥"** అని ఆదిత్య హృదయ స్తోత్రము. సూర్యుడీ మూడుదీపముల ద్వారా తానొక పెద్దదీపమై చీకటిని పారద్రోలి వెలుగునివ్వగలుగుచున్నాడు.

సూర్యుడు ఋగ్యజుస్సామములనెడి వేదస్వరూపుడు. తమస్సును పారద్రోలగల్గినవాడు అని అర్థము. సూర్యమండలములో నీ వేదత్రయము అగ్నిత్రయముగా, జ్యోతిస్త్రయముగ నున్నవని యర్థము. ఇట్టి యీ మూడు తేజస్సుల ద్వారా, జ్యోతుల ద్వారా ప్రపంచమునకు వెలుగును ప్రసారం చేయుచున్నారు. ప్రాణులకు వారివారి సంస్కారముల బట్టి వివేకమును, వెలుగును ఇచ్చుచున్నారు. కావున అట్లు వెలుగును ప్రసరించెడి దీపములే వేదములు. వేదములే దీపములు గద! అవి మహోన్నతమైన, మహత్తరమైన దివ్యదీపములు. వివేకదీపములు. ఆనంద దీపములు, జ్ఞానదీపములు.

పంచదశియను వేదాంతశాస్త్రగ్రంథమున చిత్రదీప, తృప్తిదీప,నాటకదీపమని యనేక దీపప్రకరణములు శ్రీవిద్యారణ్య మహర్షిచే రచించబడినవి. అందు నాటక దీపమున మానవుని దేహము నృత్యశాలయని యందలి జీవుడు దీపమని ఇట్లు చెప్పిరి.

"స్వస్థాన సంస్థితో దీపః సర్వతో భాసయే ద్యథా
స్థిర స్థాయీ తథా సాక్షీ బహిరన్తః ప్రకాశయేత్"
నృత్యశాలాస్థితో దీపః ప్రభుం సభ్యాంశ్చ నర్తకీమ్।
దీపయేద విశేషేణ తదభావే2 పి దీప్యతే॥
ఈ క్షే శృణోమి జిఘ్రామి స్వాదయామి స్పృశ్యామ్యహమ్।
ఇతి భాసయతే సర్వం నృత్య శాలాస్థ దీపవత్॥ - పంచదశి

ఒకచోట నున్న దీపము ఇతరములైన చోటులన్నిటిని ప్రకాశింపజేయున్నట్లు హృదయమునందు స్థిరవాసమేర్పరుచుకొనియున్న చైతన్యదీపము (సాక్షి) లోపల, బయట గూడ ప్రకాశింపచేయును. నృత్యశాలలో నున్న దీపము ఆ శాల ప్రభువును, నటులను అందలి సభ్యులను ప్రకాశింపచేయును. అయితే వారెవరు లేకపోయినను, తాను ప్రకాశించుచూ ఆ ప్రదేశమునంత ప్రకాశింపచేయును గద! అట్లే చైతన్యదీపము - అదే ప్రాణదీపము లోపల తాను స్వయంప్రకాశమగుచూ జీవులను, వారి ఇంద్రియములను ప్రకాశింపచేయును. వీరు లేకపోయినను ఆ చైతన్యదీపమునకు ప్రకాశము ఎంత మాత్రము చెదరదు. అంతట ప్రకాశమునిచ్చును. నృత్యశాలా దీపమువలె, చూచుచున్నాను, వినుచున్నాను, వాసన చూచుచున్నాను, తినుచున్నాను, తాకుచున్నానని జీవచైతన్య దీపము అంతట ఇంద్రియములకు ప్రకాశమునిచ్చును.ఈ విధముగ ప్రాణదీపము ద్వారా ఇంద్రియములు గూడ దీపములు అగుచూ మానవునకు ప్రకాశమును గల్గించుచున్నవి. ఆ దీపములే దీపావళి.

'సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్' - ఇంద్రియములలో కన్ను ప్రధానమైనదట. కన్నులేనిచో లోకమంతా చీకటి గద! కనుక కన్ను గూడ చీకటిని పోగొట్టి, వస్తువులను చూపించు, లేక ప్రకాశింపచేయు దీపమే. జ్ఞానమును చక్షువు అని శాస్త్రములు చెప్పుచున్నవి. జ్ఞానచక్షువు లేనిచో లోకమంతా అజ్ఞానమనే గాఢాంధకారమున మునిగిపోవును. ఈవిధముగ

జ్ఞానచక్షువు మహాదీపమే. దీనిని సారస్వత చక్షువని కావ్యమీమాంస అను అలంకారశాస్త్ర గ్రంధమిట్లు దాని దీపస్వభావమును వివరించుచున్నది.

**"సారస్వతం చక్షు రవాఙ్మా నసగోచరేణ ప్రణిధానేన**
**దృష్ట మదృష్ట జాతం స్వయం విభజతి. మప్తస్యాపి**
**కవేః శబ్దార్థౌ సరస్వతీ దర్శయతి. తదితరస్య**
**తత్ర జాగ్రతో2 పి అంధం చక్షుః"**

- కావ్యమీమాంస.

ఈ సారస్వత చక్షువు మనోవాక్కాయముల కందని దృష్టా దృష్ట ఫలములను ప్రకాశింపచేయును. అది సరస్వతీరూప దివ్యదీపము. మానవుడు కన్నులు లేకున్నను, కన్నులు మూసుకొని నిద్రించుచున్ననూ, ఆ సారస్వత దీపమనెడి కన్ను అతనికి శబ్దార్థములను, వివేకమును ప్రకాశింపచేయును. ఆ సారస్వత చక్షురూపదీపము లేనిచో కన్నులున్నను, మేల్కొనియున్ననూ అతడు గ్రుడ్డివాడేయగును. అంతా చీకటేయని యర్థము. ఇంకనూ,

దీపము ఆధిభౌతికంగా గృహములలోని దీపము, అధ్యాత్మికంగా జీవచైతన్యరూప దీపము. అధిదైవికంగా పరంజ్యోతిస్వరూపుడైన పరమేశ్వరరూప మహాగ్నిరూప మహాదీపము. వేదమంత్రరూప దివ్యదీపము అని శాస్త్రములుద్ఘోషించుచున్నవి. అధ్యాత్మికంగా లోకములోని జీవులందరూ దీపములే. ఆ జీవావళియే దీపావళి. చిత్రవిచిత్ర దీపావళి.

ఈ వేదములను తమ దివ్యదృష్టితో - (జ్ఞానచక్షువు) దర్శించిన మహర్షులు గూడ అగ్నిస్వరూపులు - దీపములు.

"ఋషీణా మగ్ని కల్పానామ్" అని రామాయణమ్.

పరమేశ్వరుని మూడవ కన్ను - బ్రహ్మవిద్యయని వేదవచనము. అట్లు బ్రహ్మవిద్య - జ్ఞానచక్షువు-దివ్యదీపము. దివ్యదృష్టిని ప్రసాదించునది. అట్లు బ్రహ్మవిద్యావేత్తలగు వేదవిద్వాంసుల ముఖములలో బ్రహ్మవిద్య తాండవించుచూ వారిముఖములను ప్రకాశింపచేయును. బ్రహ్మవిద్య తేజోరాశి గద! అజ్ఞానధ్వాంత దీపిక గద!

అట్లే పతివ్రతా శిరోమణులగు స్త్రీల ముఖారవిందములలో బ్రహ్మవర్చస్సు తాండవించుచుండును. స్త్రీల పాతివ్రత్యాగ్నియే దీపము. అట్టి స్త్రీలు గూడ ఇంటిని, భర్తను, తదితర ప్రపంచమును గూడ ప్రకాశింపచేయు సామర్థ్యం గల దీపములే. అగ్ని సదృశులే అనగా నిప్పులాంటివారు. ఇటవొక కథ గలదు.

పూర్వమొక పతివ్రతయగు స్త్రీ, భర్త భోజనానంతరం విశ్రమించుచుండగా యాతని పాదములు వత్తుచూ కూర్చుండెను. అపుడొక సన్యాసి భిక్షకోసం వచ్చిఎన్నిసార్లు పిలిచినను ఆ స్త్రీ అటు చూడలేదు. పలుకలేదు. దానికి కోపగించి యా సన్యాసి శపించెను. కాని

యాతని శాపమామెనేమి చేయజాలకుండెను. ఆ తరువాత భర్త నిదురించగానే ఆమె సన్యాసికి భిక్షమీయరాగా నాతడు నిరాకరించును. అపుడామె ఆ సన్యాసినే శపించబోవును. దానికి భయపడి సన్యాసి, ఆమెను శాంతపరచి, క్షమాపణగోరి, భిక్షను స్వీకరించి వెళ్ళిపోవును. ఆ పతివ్రతా శిరోమణి ముఖమును చూడగానే ఆ మునియొక్క అజ్ఞానము పటాపంచలైనది. దీనిని బట్టి పాతివ్రత్యమెంత గొప్పదో తెలియనగును. పాతివ్రత్యమునకు లోకమును దహించు శక్తి గలదు. అందుకే పాతివ్రత్యము అగ్ని వంటిది. మహాదీపమే. అందుకే 'ఇంటికి దీపం ఇల్లాలు' అనే ఆర్యోక్తి వచ్చింది. అట్టి పతివ్రతా స్త్రీలే నిజమైన దీపములు. ఆ దీపములే ప్రపంచమునకు నిజమైన దీపావళి. అందుకే సాక్షాత్తూ లక్ష్మీదేవి శ్రీమహావిష్ణువు పాదములను నిరంతరం వత్తుచూ ఉండును. లలితాదేవి 'నిజభర్తృ ముఖాంభోజ చింతనాయై నమోనమః' అని లలితా సహస్రనామములో చెప్పబడినది. అట్లు సదా భర్త ముఖారవింద ధ్యానముచే, తన పాతివ్రత్యముచే భర్తను స్వాధీనము గావించుకొని "శివా స్వాధీన వల్లభా" యని గీర్తింపబడుచున్నది.

పూర్వపు భారతదేశమట్టి పతివ్రతా స్త్రీరూప మహాదీపములతో దీపావళితో వెలుగొందుచూ, ప్రపంచమునకు మకుటాయమానంగాను, మార్గదర్శకమైన మహాదీపముగా నుండెడిది. అట్టి స్త్రీల జోలికి వెళ్ళినవారు భస్మమైపోయెడివారు. అట్లుగాని స్త్రీలు చికాకు, కోపము విసుగు, అసూయ, ఈర్ష్య, ద్వేషాదులతో కన్నులున్ననూ, గుడ్డివారితో సమానమే. పతివ్రతా స్త్రీలకు గల్గు సంతానము గూడ అట్లు అగ్నిసదృశమై దేశమునకు దీపమేయగును. అట్లు ఈ ప్రజలే దేశమునకు నిజమైన దీపములు. నిజమైన సుప్రజాదీపములతో నిజదీపావళిని దేశమున చూడగలమా?

రామాయణంలో సీతను అగ్నిస్వరూపిణిగా హనుమంతుడు వర్ణించును. రావణాసురునితో దౌత్యము జరిపిన పిదప హనుమంతుని తోకకు నిప్పు అంటింతురు. దానిని చూచి సీత ఇట్లు అనును.

"యద్యస్తి పతి శుశ్రూషా యద్యస్తి చరితం తపః॥
యది చాస్తి హ్యేక పత్నీత్వం శీతోభవ హనూమతః॥

- రామాయణం - సుందరకాండ.

నేనే గనుక నిరంతరం భర్తకు శుశ్రూష (సేవలు) చేయుదాననైతే, నేనే భర్తృముఖమును గూర్చి చింతించు తపస్సు కలదాననైతే, నేనే పతివ్రతనైతే, అగ్నీ! నీవు హనుమంతునకు చల్లగా నుండుము. అనగానే అగ్ని కుడివైపు తిరిగిన జ్వాలలు గలదై హనుమంతునకు మంగళం కల్గించు విధానంగా మండినదట. అపుడు హనుమంతుడు లంకలోని భవనాలన్నింటినీ దహించి వేయును. అపుడు హనుమంతుడు సీతాదేవి గూడ నా మంటలలో చిక్కి కాలిపోయినేమోనని విచారించి ఇట్లు సమాధానపరచుకొనెను.

"ప్రదీప్తో2 గ్ని రయం కస్మాన్న మాం దహతి సర్వశః॥
దృశ్యతే చ మహాజ్వాలః కరోతి న చ మే రుజమ్॥"  -రామాయణమ్.

పెద్ద పెద్ద జ్వాలలతో మండుచున్న నీ యగ్ని నన్ను కాల్చుటలేదేమి? రవంత గూడ బాధ గల్గించదు? అట్లే -

"అథవా చారు సర్వాంగీ రక్షితా స్వేన తేజసా
న నశిష్యతి కల్యాణీ నాగ్ని రగ్నౌ ప్రవర్తతే॥
న హి ధర్మాత్మనస్తస్య భార్యా మమిత తేజసః॥
స్వచారిత్ర గుప్తాం తాం స్ప్రష్టు మర్హ తి పావకః॥
తపసా సత్యవాక్యేన అనన్యత్వాచ్చ భర్తరి।
అపి సా నిర్దహేదగ్నిం న తామగ్నిః ప్రధక్ష్యతి॥"  - రామాయణమ్.

సర్వాంగ సుందరియై, కల్యాణమూర్తియగు సీతాదేవి తన తేజస్సుతో తనను రక్షించుకొనుచూ, నన్ను గూడ రక్షించుచున్నది. ధర్మాత్ముడు, తేజశ్శాలియగు నా రామచంద్రుని భార్యకు వేరే రక్షణ అనవసరము. ఆమెకు ఆమె శీలమే శ్రీరామరక్ష. అట్టి యామెను అగ్ని కనీనం తాకనైనా తాకలేదు. తపస్సుతో, సత్యవాక్యముతో , భర్తను తప్ప ఇతరులని కన్నెత్తి చూడనైనా చూడని యీ పతివ్రతా శిరోమణి గూడ అగ్నిస్వరూపిణియే. ఒక అగ్ని మరొక అగ్నిని కాల్చునా? కాల్చలేదు. పైగా పాతివ్రత్యాగ్నియే యీ భౌతికాగ్నిని దహించివేయగలదు కాని భౌతికాగ్ని యీ పాతివ్రత్యాగ్నిని తాకలేదు.

ఉత్తరరామచరిత నాటకంలో "తేజస్తేజసి శామ్యతి" అనగా యీ భౌతిక తేజస్సు పాతివ్రత్యరూప తేజస్సులో పడి చల్లారిపోయినట్లు చెప్పబడింది. సీతాదేవి అగ్నిప్రవేశం చేసినపుడు గూడ అగ్ని ఆమెను తాకలేదని, అగ్నికుండములో నామెదూకగానే అగ్ని చల్లారిపోయినదనీ (తేజస్తేజసి శామ్యతి) వాల్మీకి మహర్షి పాతివ్రత్య మహిమను చాటిచెప్పెను.

శ్రీరాముని గూడ "కాలాగ్ని సదృశో వీర్యే ధైర్యేణ హిమవానివ" అంటూ కాలాగ్ని స్వరూపముగ వర్ణించినాడు. వ్యాసభగవానుడు రచించిన బ్రహ్మసూత్రములలో -

"ప్రదీపవదావేశః తథా హి దర్శయతి" అనే సూత్రమొకటి.

ఒక దీపమే అనేక దీపములుగా మారినట్లు పరమేశ్వరుడు అనేక దేహముల ప్రవేశించి అనేక జీవులుగా మారుచున్నాడు. కావున జీవులందరూ పరమేశ్వర స్వరూపములే. వారందరూ దీపములతో పోల్చబడిరి. కావున ప్రజలందరూ పరమేశ్వర స్వరూపులు, దీపములు గావలెనని వ్యాసమహర్షి తాపత్రయము.అందుకే ప్రజలను దీపరూపములుగ తీర్చిదిద్దుటకై "మహాభారత" మనెడి గ్రంథం రచించి ప్రపంచానికి, ప్రజలకునూ వెలుగును, జ్ఞానమును ప్రసాదించిన మహాదీపమయినాడు. వ్యాసమహర్షి ప్రార్థనా శ్లోకము-

"నమో స్తు తే వ్యాస! విశాల బుద్ధే! ఫుల్లారవిందాయతపత్రనేత్ర
యేన త్వయా భారత తైల పూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః"

మహాభారతమనెడి నూనెతో జ్ఞానదీపమును ప్రజ్వలింపచేసిన, విశాలబుద్ధిగల్గిన, పద్మనయనంబులుగల వ్యాసభగవానునికి నమస్కారము. దీనినిబట్టి మహర్షులు, వారి రచనలు గూడ దీపములే. అట్లే గురువు గూడ దీపమే.

"గుకారోఽంధకారః ప్రోక్తః రుకారస్తన్నిరోధకః"
గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః॥"

గుకారమంటే అంధకారము. రుకారము దానిని నాశనము చేయునది. గురువు బ్రహ్మవిష్ణుమహేశ్వరస్వరూపుడు. అందుచేత గురువు దీపమె గద! అట్టిచో జగద్గురువులగు శంకరాచార్యులు, అట్లే ఇతర యోగీంద్రులు, సంన్యాసులు, పరమ హంసలు (కృష్ణం వందే జగద్గురుమ్) పరమేశ్వరుడు, జగద్గురుస్థానీయములగు వేదశాస్త్రములు, పురాణేతిహాసాదులు గూడ దీపములే. ఈ వేదము 'వేదశ్చక్షుస్సనాతనమ్' అని జ్ఞానచక్షువుగా చెప్పబడినది. ఇట్టి యీ దీపముల ద్వారా జ్ఞానదీపములను బొంది జన్మచరితార్థము చేసికొనెడి జీవులు-ప్రజలు గూడ దీపములే. ఇట్టి ప్రజలు, బ్రహ్మతేజోవిరాజమానులైన పురుషులు, పతివ్రతా స్త్రీలు ఉన్ననాడే నిజమైన దీపావళి. ఇట్టి దీపములు గల పవిత్రభారతదేశం గూడ మహాదీపమై దీపావళియై ప్రపంచమునకే మార్గ జ్ఞాన, వివేకదర్శకమై పూర్వపు ఔన్నత్యము నొందుగాక! ప్రజలు ప్రపంచమునకు దివ్యప్రకాశమునిచ్చిన జ్ఞానదీపములైన వేదశాస్త్రముల అనుగ్రహపాత్రులు అగుదురు గాక! 'నమామ వేదమాతరమ్' అను నార్యోక్తి అఖండదీపమై వెలుగుగాక!

## దీపస్తుతిః

"శ్యామాం శిఖాభువి మనాగరుణం తతోఽ ధః
శ్వేతం చ పాండురఘనం తతోఽ ప్యధస్తాత్।
అపింజరం తదను తప్యతలే చ నీలం॥
అంధం తమః పటల మర్దతి దైవమర్చిః॥ - కావ్య మీమాంసా

పై శిఖలో నలుపు, క్రింద ఎరుపు, దానిక్రింద తెలుపు, దానిక్రింద పసుపు,ఎరుపు కల్గిన బంగారు రంగు,దానిచివర అడుగు భాగంలో నీలము, ఇట్లు వర్ణక్రమము గల్గిన యీ దీపముల కాంతి చీకట్లను పటాపంచలు చేసి, వెలుగును, వివేకములనిచ్చుచూ లోకమును రక్షించుగాక!

ఇతిశమ్



# అణు శక్తి

పూర్వం ధర్మయుద్ధాలు జరిగేవి. ధనుస్సు, ఖడ్గం, శూలం, వజ్రం, పాశం, అంకుశం మొదలగు ఆయుధాలను ఉపయోగించినా, ధర్మలోపం లేశం గూడ జరిగేది కాదు. సూర్యాస్తమయం కాగానే, గంట కొట్టేవారు. ఎచటవారచట యుద్ధం ఆపేసి, కాళ్ళు చేతులు తెగిపోయినా, క్షతగాత్రులైన సిపాయిలు అచటి దుమ్ముతోనే సూర్యునికి అర్ఘ్యమిచ్చేవారట. అప్పటికప్పుడు నీరు దొరకదు గద! మరి నేడు కేవలం మారణహోమమే. ధర్మప్రసక్తి లేదు.

దేవతలకు గూడ ఆయుధాలున్నాయి. అయితే అవి లోక కల్యాణకారకములు. దుష్టశిక్షణ, శిష్టరక్షణార్థం నియోగింపబడేవి. 'యాతఇషుశ్శివతమా। శివం బభూవ తే ధనుః' ఈ ఆయుధాలు దేవతాస్వరూపాలుగా చెప్పబడినాయి.

విశ్వామిత్ర మహర్షి శ్రీరామునికి వేదవిద్యతోపాటు, అస్త్రవిద్య నుపదేశిస్తాడు. అస్త్రములన్నీ మంత్రస్వరూపాలు.(మంత్రగ్రామం). ఆ మహర్షి జపించగానే మంత్రములస్త్రములై భయభక్తులతో కింకరులవలె, శ్రీరాముని సేవించి, ఆయన మనస్సున నిలిచినవి. ఎపుడు కావాలంటే అపుడు ప్రత్యక్షమై, పోవాలంటే మరల తిరిగి వెనుకకు మరలేవి.

'జపతస్తు మునేస్తస్య విశ్వామిత్రస్యధీమతః॥

ఉపతస్థు ర్మహార్హాణి దివ్యాన్యస్త్రాణి రాఘవమ్॥" - రామాయణమ్

దేవతలకు, ఋషులకు, ఆయుధాలతో పనిలేదు. ఒకవేళ ఉపయోగించినా వెనక్కి ఉపసంహరించుకోగలరు. నిగ్రహానుగ్రహ సమర్థులు. మహర్షులైతే కఠోర తపశ్శక్తి కల్గియుంటారు. "ఋషీణాముగ్రతపసాం - ఋషీణామగ్నికల్పానాం". అనగా మహర్షులు ఉగ్రతపస్సు చేసి అగ్నిహోత్రస్వరూపులయ్యారు. ముల్లోకాలను గడగడలాడించగల సామర్థ్యం ఉన్నా, అనవసరంగా యుద్ధాలు చేయక, రక్తపాతం ఇష్టంలేక, శాంతమూర్తులై, సదా మౌనం పాటించేవారు. వారి జోలికిపోతే, వారి నోటిమాట శాపమై కొన్నికోట్ల మారణాయుధాల పెట్టుగా ఉండేది. ఈ విషయాన్ని కాళిదాస మహాకవి ఇలా అంటాడు.

"శమప్రధానేషు తపోధనేషు గూఢం హి దాహాత్మక మస్తితేజః॥"

*- అభిజ్ఞాన శాకుంతలమ్।*

శాంతిప్రధానులు, తపోధనులగు మునులలో సమస్తమును దహించి పారవేయగల శక్తి నిగూఢంగా ఉంటుందట. ఇందుకు ఉదాహరణ - వసిష్ఠ, విశ్వామిత్రుల యుద్ధం :

వసిష్ఠ మహర్షి గొప్ప తపోధనుడు. రారాజు అయిన విశ్వామిత్రుడు సైన్యసమేతంగా వసిష్ఠాశ్రమానికి వస్తాడు. ఆయనకు ఆతిథ్యం ఇవ్వాలంటే వసిష్ఠుని వద్ద నందినీ ధేనువు తప్ప ఏమీ లేదు. అపుడా ధేనువు తన మహిమతో గొప్ప విందును ప్రసాదించింది. అది చూసి రాజుకి మతిపోయింది. అపుడా గోవును ఇమ్మంటే మహర్షి నిరాకరిస్తాడు. దానితో

కోపించి యుద్ధం చేస్తాడు. చాలా పెద్ద సైన్యం, ఆయుధాలతో విశ్వామిత్రుడు విజృంభిస్తాడు. వసిష్ఠుని బ్రహ్మదండం నుంచి అనేకమంది సైనికులు ఆయుధాలతో వెల్వడుతారు. ఇంకా ఎంతో మంది సైనికులు పుట్టటం, విశ్వామిత్రుని సైన్యం నశించటంతో రాజు బెంబేలుపడి ఇలా అంటాడు.

"ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజో బలం బలమ్"

బ్రహ్మతేజస్సే బలం. దానిముందితర బలమంతా వృధా. దానితో కామక్రోధాద్యరిషడ్వర్గమును జయించి కఠిన తపమాచరించి బ్రహ్మతేజస్సంపన్నుడగును. ఇక లౌకిక మారణాయుధాలతో నాయకునకు పనిలేదు. వానికన్న కొన్ని రెట్లు శక్తిగల బ్రహ్మతేజస్సే విశ్వామిత్రుని దివ్యాస్త్రం. ఈ రోజులలో యుద్ధాల సంగతి అటుంచి, ఆత్మరక్షణ కోసం బోలెడు ఆయుధాలు, గన్స్, గన్‌మెన్ చుట్టూ పెట్టుకొని వానిమధ్య ఉండవలసినదే. అయినా కష్టమే. క్షణం క్షణం భయం భయం.

స్త్రీల రక్షణ విషయం మరీఘోరం! పూర్వపు భారతీయ స్త్రీలకు ఏరకమైన భయం లేదు. వారి పాతివ్రత్యాగ్నియే వారికి శ్రీరామరక్ష. మహర్షులకు వలె పతివ్రతా స్త్రీలకు ఆయుధాలు, పోలీసులు, తుపాకులు అక్కరలేదు. వారగ్నిహోత్రంతో సమానం. దేవతలను, ఋషులను గడగడలాడించగల్గెడివారు. శాపానికి ప్రతిశాపం ఇవ్వగలరు. ఉపసంహరించుకోగలరు. - (దారాశ్చారిత్ర రక్షితాః)- చారిత్ర మంటే శీలము.

సీతాదేవి అగ్నిస్వరూపిణి, వేదవిద్యా స్వరూపిణి. కనుక అగ్నిహోత్రుడు గూడ ఆమెను ఏమీ చేయలేదు. "నాగ్నిరగ్నౌ ప్రవర్తతే". ఆమె రాక్షస నాశనానికి, లోకకళ్యాణానికి హేతువయింది. హనుమంతుని తోకకు రాక్షసులు నిప్పంటించారు. కాని అగ్ని ఆయనకు చల్లగానే వుంది. ఆ అగ్ని ఆ రాక్షసులనే కాక, లంకానగరాన్ని భస్మంచేసింది. కారణం హనుమంతుడు బ్రహ్మవిద్యా స్వరూపుడే. వేదత్రయీమూర్తి. కాన బ్రహ్మవిద్యకంత శక్తి గలదు. శివుని తృతీయనేత్రం బ్రహ్మవిద్యయే. దానినే 'ఉమ' అని అంటారు. ఆయన తృతీయనేత్రం తెరిస్తే అంతా భస్మమే.

ఆదిత్యమండలం గూడ వేదమండలమే. "వేదాశ్చ క్రతవశ్చైవ" 'త్రయీమయాయ' అని, 'ఋగ్యజుస్సామపారగః' అని ఆదిత్యహృదయ స్తోత్రం. కాన అగ్నిగర్భుడగు ఆదిత్యునిలో వేదరాశి ఉన్నదన్నమాట. అందుకే భారతీయులందరు సూర్యుని ఆరాధన ద్వారా వేదముల నారాధించుచున్నారు. "సమ్యగారాధితా విద్యా ప్రబోధ వినయావివ" ఆరాధించినవారికి వేదవిద్య విజ్ఞాన వినయములనొసంగును. వేదబాహ్యులను, వేదములను నిర్లక్ష్యం చేయువారిని, వేదనిందకులను భస్మం చేయగలదు అని రామాయణంలో సీతాదేవిని గూర్చి రావణాసురునికి హెచ్చరిస్తూ, హనుమంతుడు వేదస్వరూపాన్ని పరోక్షంగా వివరించాడు.

నేటి సమాజం పూర్తిగా పతనమైంది. నాటికి నేటికి సంబంధం లేదు. పగ, ద్వేషం మితిమీరినవి. ప్రతీకారం తప్ప ఉపకారం లేదు. దేశాల మీద దేశాలు యుద్ధం చేస్తున్నాయి. నిరంతరం మనిషి మీద మనిషి కత్తినూరటమే ధ్యేయం.

పరువు, ప్రతిష్ఠలు మంటకలిశాయి. ఆగ్రహం, ఆవేశం, మూర్ఖత్వం తప్ప నిదానం, శాంతి, వివేకం శూన్యం. ఒకరిని మించి ఒకరు ఎత్తులు, జిత్తులుగా రకరకాల మారణా యుధాలు, అణ్వస్త్రాలు, బాంబులు, క్షిపణులు మొదలగువానిని నిర్మిస్తున్నారు. దేశక్షేమం, ప్రజాక్షేమం, ప్రజాపరిపాలనతో పనిలేదు. వీలైనంత డబ్బు సంపాదించాలి. అందుకు అణ్వస్త్రాలు నిర్మించి, అవిలేని వారికిచ్చి, యుద్ధాన్ని ప్రేరేపించటం, అలా డబ్బు గడించటం నేటి గొప్ప వ్యాపారం. దేశాలకి దేశాలు నాశనమై మట్టికొట్టుకుపోతే ఎవరికి కావాలి? తమ పంతం నెగ్గాలి! కసి, పగ, ద్వేషం, ప్రతీకారం తీరాల్సిందే!

**అణ్వస్త్ర నిర్మాణం :** యురేనియం 238, దాని ఐసోటోపులు యురేనియం 236, 235లు ప్రధాన పదార్థాలు. వాని అణువుల విచ్ఛేదం వలన క్షణంలో కొన్ని కోట్ల పరమాణువులు, మరల వాని విచ్ఛేదం వలన ఇంకా చాల పరమాణువులు పుట్టటమేగాక భయంకరమైన పేలుడు శబ్దం, అగ్ని పుట్టి సెకండులో మొత్తం భస్మమగును. అణువిచ్ఛేదం,అణువిస్ఫోటనం వలన అణ్వస్త్రాలు (Atom Bombs) సిద్ధిస్తున్నాయి.

అణువిచ్ఛేదం కంటె అణుసంయోగం ఇంకా శక్తిగల ఉదజని బాంబులను ప్రసాదిస్తుంది. వీనిని Hydrogen Bombs అంటారు. సూర్యమండలంలోని అగ్ని నిరంతరం హైడ్రోజన్ అణువుల వలన ఉత్పత్తి అయ్యే హీలియం Gas ప్రభావమే. 2. హైడ్రోజన్ అణువులు సంయోగం వలన ఒక హీలియం అణువును శక్తినీ విడుదల చేస్తాయి. అనేకాణువుల సంయోగం అఖండశక్తి సంపన్నమగును. ఈ ప్రక్రియే ఉదజని బాంబుల నిర్మాణంలో ప్రధానపాత్ర వహిస్తోంది. అణువిచ్ఛిత్తికన్న అణుసంయోగం చాలా శక్తివంతమైనది. లోకంలో మనం చూస్తూనే ఉన్నాము. ఇరువురు విడిపోవటం తేలిక. విడదీయటం ఇంకా తేలిక. కాని ఇరువురిని కలపటం చాలా కష్టం. ఎంతో శక్తిని ధారపోయాలి.

అత్తాకోడళ్ళు, తోడికోడళ్ళు, అన్నదమ్ములు, తండ్రీకొడుకులు, భార్యాభర్తలు, స్నేహితులు విడిపోవటం తేలిక. విడదీయటం మరీ సులభం. వారు కలవటం అంత సులభం గాదు. కలపటం మరీ కష్టతరం. ఎంతో ప్రేరణ, త్యాగం, శక్తి,యుక్తులుపయోగించాలి. అపుడు కలిపినా ఆ కలయిక తాత్కాలికమే. కాస్త తేడా వస్తే చాలు. రామరావణ యుద్ధమే. అపుడింకా ఎక్కువ శక్తి అవసరమౌతుంది. ఆ యుద్ధం నివారించి. వారిని కలపాలంటే అపారమైన శక్తి కావాలి. శ్రమ ఫలించి కలిసిపోతే కలదు సుఖం. స్వర్గసీమయే.

వేదమేనాడో అణువుల గూర్చి, వాని వలనగల్గు అనర్థాలను తెలియజేసింది. Radio Activity అంటే ధార్మిక శక్తి, Atomic Energy అంటే కృణుశక్తి అని, వాని శక్తి ప్రమాద భూయిష్ఠమనీ హెచ్చరించింది. ఎలా?

వేదము భగవంతుని గూర్చి "అణోరణీయాన్ మహతోమహీయాన్" అని వర్ణించింది. అణువు మిక్కిలి సూక్ష్మమైనది. అంతకన్న సూక్ష్మతరము పరమాణువు. (అణీయాన్).అంతకన్న సూక్ష్మమైనది లేదు. అట్టి సూక్ష్మాతిసూక్ష్మమగు పరమాణుస్వరూపుడే భగవంతుడు. ఆయనను 'అణిష్ఠః' అని గూడ వేదం అంటుంది. ప్రపంచంలో మిక్కిలి పెద్ద వస్తువు మహాన్. దేనికంటే పెద్దది ఉండదో దానిని "మహీయాన్" అని అంటారు. భగవంతుడు మహీయాన్. ఆయనను మించిన పదార్థం లేదు.

సూక్ష్మాతి సూక్ష్మతరుడగు పరమేశ్వరుడు నా మనస్సును శివసంకల్పంతో నిరంతరం నింపాలని ప్రార్థిస్తున్నాము. "సూక్ష్మాత్ సూక్ష్మతరం జ్ఞేయం తన్మే మనః శివసంకల్పమస్తు" అంటే వెఱ్ఱితలలు వేయక పిచ్చి పిచ్చి ఆలోచనలు రాకుండా మనసును శుభ్రంగా ఉంచు స్వామి! అని అర్థం. ఈ సూక్ష్మతరుడు, పరమాణు స్వరూపుడగు భగవంతుడెక్కడ ఉంటాడు? భగవంతుడెక్కడో లేడు. ఎక్కడో దూరంగా ఉండి రక్షించటం, పాపాలను కడగటం ఆయన పని గాదు. భగవంతుడు ప్రతిదేహంలోను ఉన్నాడు.

కావున ప్రతి ప్రాణి భగవత్ స్వరూపమే. కనుకనే ఉద్ధరించేవాళ్ళు వేరే లేరు. ఉద్ధరింపబడేవాళ్ళు వేరే లేరు. ఎవరిని వారే ఉద్ధరించుకోవాలని భగవద్గీత "ఉద్ధరేదాత్మ నాత్మానం" అని ఉపదేశించింది. దేహంలో దేవుడు ఎక్కడ ఉంటాడు?

రోజూ మనం చెప్పే మంత్రపుష్పం చూడండి - అందు

"అణీయోర్ధ్వా వ్యవస్థితః।

నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా।

తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః॥

హృదయం అంటే మనం మామూలుగ దేహంలోని స్థూల హృదయ కోశాన్ని అర్థం చేసికొంటాము. కాని అసలైన హృదయం బహుసూక్ష్మంగా ఉంటుంది. ఇది పద్మ కోశం వంటిది. దేహంలో అధోముఖంగా కంఠం క్రింద చివరగా (నిష్ట్యామితస్యాంతే) నాభికి పైన ఉంటుంది. ఆ హృదయం చివర చిన్న రంధ్రం. (సుషిరం) ఆ రంధ్రంలో మహాగ్ని అనేక జ్వాలలతో నిండి యుంటుంది. ఆ జ్వాలలలో మిగుల సూక్ష్మమైన అగ్నిశిఖపైకి ప్రజ్వరిల్లుతూ ఉంటుంది. (అణీయోర్ధ్వా వ్యవస్థితః) ఆశిఖ వడ్లగింజ కొనవలె సూక్ష్మమై, పసుపు రంగుతో ప్రకాశిస్తూ అణువువలె ఉంటుందట. ఆవహ్నిశిఖ మధ్యలో పరమాత్మ ఉంటాడట. అణువు మధ్య ఉంటాడట (అణిష్ఠః).

దీనినిబట్టి పరమాణుగర్భం (Nucleus of the Atom) అగ్నిజ్వాలలతో వ్యాకులంగా ఉంటుందని పైమంత్రాల వలన తెలుస్తోంది. ఆ అగ్నిజ్వాలలోని కణములే Electrons and Protons అని నేటి శాస్త్రాలు అంటున్నాయి. పరమాణుగర్భం అగ్నిగోళమన్నమాట. ఆ అగ్నిగోళాన్ని పరమాత్మ అని వేదమంటోంది. పైన సూర్యమండలానికి, మన హృదయాంతరాళంలో అగ్నిమండలానికి భేదం లేదు. ఆదిత్యమండలంలోని పురుషుడే మన హృదయంలోని అగ్నిమండలంలోని పరమాత్మగా ధ్యానించాలని, రోజూ ఉదయం,

మధ్యాహ్నం, సాయంకాలం "యో2సావాదిత్య మండలే పురుషః్సో2సావహమ్" అనిచెప్పాలని వేదము బోధిస్తోంది. ఆదిత్యమండలంలోని పురుషుడు "మహతో మహీయాన్" హృదయంలోని పరమాత్మ "అణోరణీయాన్".

ఇట్లు ఏకాగ్రచిత్తంతో, మనస్సును హృదయంలోని పరమాణు స్వరూపుడైన పరమాత్మను ధ్యానం చేయగా చేయగా, అణుస్వరూపమగు అగ్నిహోత్రమే అణ్వస్త్రంగా మారి, శ్రీరామునికి అస్త్రాలు, కింకరులై ఆజ్ఞానువర్తులు, ఆజ్ఞాబద్ధులైనట్లు, సాధకులగు మహాత్ములకు ఆజ్ఞానువర్తియై, ఆజ్ఞాబద్ధమై మెలుగుతుంది. అందుకనియే వేదము నిరంతరం అణుగర్భం జోలికి పోవద్దు. అణువిచ్ఛిత్తి మహాభయంకరం. సర్వనాశకరం. అణువిచ్ఛేదం వలన జనించు కార్చిచ్చు (ప్రళయాగ్ని) ప్రపంచాన్ని దహించివేస్తుంది. మారణహోమాన్ని వదిలి శాంతి హోమాన్ని చేయండి. అందుకు అణుగర్భమును పరమాత్మగా ఆరాధించి తరించండి. సుఖశాంతులతో వర్ధిల్లండి అని ఋగ్వేద ప్రారంభంలోనే అగ్ని ఆరాధన మంత్రమును ప్రసాదించింది.

"అగ్నిమీళే పురోహితం। యజ్ఞస్యదేవమృత్విజం।
హోతారం రత్నధాతమమ్॥" - ఋగ్వేదము.

అగ్నిని ఆరాధిస్తే మంచి హితమును, కళ్యాణసంపదను ఇచ్చి కాపాడునని అర్థము.

"అణుః బృహత్ కృశః స్థూలః గుణభృన్నిర్గుణోమహాన్"। - విష్ణుసహస్రనామస్తోత్రము.
"పరంజ్యోతిః పరంధామ పరమాణుః పరాత్పరా।" - లలితా సహస్రనామ స్తోత్రము.

అణువు శ్రీమహావిష్ణుస్వరూపము, పరమాణువు లలితా పరాదేవతా స్వరూపమని, అట్లు అణు,పరమాణువులను దేవతాబుద్ధితో ఆరాధించాలని వ్యాసభగవానుడు నిర్ణయించి, సహస్రనామస్తోత్రాలలో చేర్చాడు. ఆయనకు కావలసింది ప్రజాక్షేమం. లోకకళ్యాణం గద! ఈ విధంగా మహర్షులు, వేదశాస్త్రాలున్నూ ప్రజలకు, ప్రపంచానికి మహోపకారం, మేలు చేశారు. అయితే చేసిన మేలు మరిచిపోయే స్వభావం గద! మానవులది!

"వినాశకాలే విపరీత బుద్ధిః".

అయితే కొందరు మేధావులణు విచ్ఛిత్తిని నిరసిస్తూ, నిరాయుధీకరణ, శాంతిని అభిలషిస్తున్నారు. ఇది మంచి శుభపరిణామమే. ఈ శుభ, సుఖశాంతులు దక్కాలంటే ముందు అధికారులు, పాలకులు, ప్రజల మనస్సులు శివసంకల్పమయములై, పరిశుద్ధము కావాలి.

"తన్మే మనశ్శివ సంకల్పమస్తు". శివసంకల్పము లేనిచో దుష్ట సంకల్పాలు, కామ సంకల్పాలు పుట్టుకొస్తాయి. "సంకల్పప్రభవాః కామాః" కామాన్నుంచి, క్రోధము వగైరా పుట్టు కొస్తాయి. క్రోధాన్ని క్రోధాగ్ని అంటారు. మనస్సులో జనించు కామ, క్రోధాలే అణ్వస్త్రాలు.

యురేనియం, ప్లుటోనియం వలన పుట్టే అణ్వస్త్రాల కన్న యీ కామ,క్రోధరూప అణ్వస్త్రాలు మహాప్రమాదకరమైనవి. భయంకరమైనవి. ముందు కామ,క్రోధాదుల జయిస్తే అసలు అణ్వస్త్రాలతో పనియే లేదు. అందుకే

"తన కోపమే తన శత్రువు తన శాంతమే తనకు రక్ష"

అని సుమతీశతకం పద్యాన్ని చిన్నతనంలోనే నేర్పించేవారు. ఇపుడు స్కూల్సులో నీతిపద్యాలు, నీతిశతకాలను కోర్సులోంచి తొలగించి, ప్రజలకు క్షేమం, మహోపకారం చేసినట్లు ప్రకటించుకొంటున్నారు.

తర్కశాస్త్రం సుఖదుఃఖ ప్రాప్తికి సాధనమగు ఇంద్రియం మనస్సు అనీ, అది అనంతమైనది, పరమాణు స్వరూపం గలదనీ చెప్పింది.

"సుఖాద్యుపలబ్ధి సాధనమింద్రియం మనః, తచ్చప్రత్యాత్మ

నియత త్వాదనన్తం, పరమాణు రూపంచ"

"అణుపరిమాణం మనః" - మనస్సు పరిమాణము

అణుపరిమాణము, పరమాణు స్వరూపంగలది కనుక అణువువలె మనస్సు పనిచేస్తూ ఉంటుంది. అణువు లక్షణాలన్నీ మనస్సుకున్నాయి. మనస్సే అణ్వస్త్రం. మనస్సును శివమయం భగవదారాధన పరం చేసికొని అదుపులో అట్టిపెట్టుకుంటే సుఖశాంతులు కురియును. లేనిచో అదుపుతప్పి మనస్సు భ్రష్టమై (Perverted) మానవుని పిచ్చివానినిగా చేస్తుంది. నోటినుండి పిచ్చిమాటలే. మూఢుడైపోతాడు. కోపాదులు జనిస్తే నిప్పుకు గాలితోడై మనస్సు మానవుని ఎంత నీచానికైనా దిగజార్చుతుంది. తామసం తప్ప సాత్త్వికం ఉండదు.

ప్రాణాయామం, అనవాదుల వలన మనశ్శుద్ధి కలుగుతుంది. ఇంకా క్రమం తప్పక నియమంగా యోగాభ్యాసం చేస్తే సాధకునికి అణిమ, మహిమాది సిద్ధులు కల్గుతాయని యోగశాస్త్ర వచనమ్. అణిమ అంటే దేహమును తన ఇష్టానుసారంగా అణువంత సూక్ష్మరూపం గలిగే శక్తి. A Super human power of becoming as small as an atom at his own will. మహిమ అంటే మహత్త్వం. దేహమును ఎంత పెద్దదిగానో వృద్ధి పరచుశక్తి. A Super human power of increasing the size of the body at his will. ఈ శక్తులు పారమేశ్వర విభూతులు అని అంటారు. అందుకే పరమేశ్వరుని - "అణోరణీయాన్ మహతోమహీయాన్" వేదం కీర్తించింది.

వేదాంత శాస్త్రం గూడ మనస్సు అద్దం వంటిదనీ, అది శుద్ధమై, నిర్మలమైనపుడు భగవద్ధ్యానం చేస్తే అందు భగవంతుడు ప్రతిఫలించి, సత్ఫలితాలను, సుఖశాంతులను పొందుతాడని ఉపదేశించింది.

ఈ విధంగా మన వేద శాస్త్రాలు అణువిచ్ఛిత్తిని నివారించినవి. నిరాయుధీకరణను ప్రోత్సహిస్తున్నవి. అణువును భగవత్స్వరూపంగా ఆరాధించమని పదే పదే మానవాళిని హెచ్చరిస్తున్నాయి. మంచితనంతో ఎంతయినా సాధించుకోవచ్చు. విరోధం వద్దు, విరోధంతో వినాశం తప్ప సాధించగలిగేది ఏమీలేదని సారాంశం.

బృహదారణ్యకోపనిషత్ "త్యజత స్పర్ధాం । యుద్ధం మాకురుత" అని హెచ్చరిస్తోంది.

*ఓం శాంతిః శాంతిః శాంతిః*



# శ్రావణ మాసము

వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిరాలు ఆరు ఋతువులు. సంవత్సరములో సూర్యుని గతిని బట్టి ఇవి ఏర్పడును. అందు గ్రీష్మ-హేమంతాల మధ్య వర్షర్తువు సంవత్సరంలో సంధిసమయం. ఇది అత్యంతప్రమాదకరం. రోగాలు, ఉపద్రవాలు సంభవిస్తాయి. సాధారణ వైద్యులు రోగాలను కొంతమటుకే అరికట్టగలరు. చేయిదాటే టట్లుతోస్తే "మేం చెయ్యవలసింది చేశాం, ఆ పైన భగవంతుని ఇచ్ఛ" అని సెలవిస్తారు. ఎంత నాస్తికుడైనా విధిగా విధికి తలవంచక తప్పదు.

కాన పురుషకారం ఒక్కటే చాలదు. దైవబలం, దైవానుగ్రహం ఎంతో అవసరం. వానిని సంపాదించాలంటే దేవతారాధన చేయాలి. ధర్మకార్యాచరణ చేయాలి. "వేదో ఽఖి లో ధర్మమూలం". సమస్తధర్మములకు మూలము వేదము. కాన వేదవిహిత ధర్మకార్యాచరణ చేత దైవానుగ్రహం సంపాదించుకొని పాపాలను పోగొట్టుకోండి అని శంకర భగవత్పాదుల ఉపదేశం.

"వేదో నిత్యమధీయతాం తదుదితం కర్మస్వనుష్ఠీయతాం।
తేనేశస్య విధీయతామపచితిః కామ్యే మతిస్త్యజ్యతాం॥
పాపౌఘః పరిధూయతామ్"

భారతీయుల దృష్టిలో వొక్కొక్క కాల భాగానికొక్కొక్క విశిష్టత వుంది. సంవత్సరంలో మేఘావృతమై మేఘమును తిరోగమించే కాలాన్ని చాతుర్మాస్య దీక్షాకాలంగా మన మహర్షులు నిర్ణయించారు. ఆ కాలమంతా ఆహారనియమాలతో ,దేవతారాధనలతో గడపాలని శాస్త్రనిర్దేశం.

కాళిదాసమహాకవి ఆషాఢ శుద్ధ ఏకాదశినుండి కార్తిక శుద్ధ ఏకాదశి దాకా చాతుర్మాస్యదీక్షా కాలమనీ, ప్రజలందరూ నప్రమత్తులై, ఆహారనియమములతో, భగవదారాధనచేస్తూ గడపాలనీ మేఘసందేశ కావ్యం ద్వారా లోకానికి గొప్ప సందేశమందించాడు.

"శాపాంతో మే భుజగశయనాదుత్థితే శార్ఙ్గపాణౌ।
శేషాన్మాసాన్ గమయ చతురో లోచనే మీలయిత్వా॥" -మేఘసందేశం

కుబేర శాపగ్రస్తుడైన యక్షుడొకడు రామగిరి అడవులలో తిరుగుచూ, విరహపీడితురాలగు భార్యకు మేఘంద్వారా సందేశం పంపుతాడు. శ్రీమహావిష్ణువు యోగనిద్రనుండి లేచు రోజున నాశాపాంతము, అప్పటివరకు ఈ నాలుగు నెలలు కళ్ళు మూసుకుని, ఆహార నియమము లతో, భగవదారాధనతో గడుపుమని సందేశం. కావున ఆషాఢశుద్ధ ఏకాదశివాడు శాపారంభము (దీక్షారంభము). కార్తిక శుద్ధ ఏకాదశివాడు శాపాంతము (దీక్షాన్తము) మధ్య నున్న నాలుగు నెలలు చాతుర్మాస్య దీక్షాకాలము అని తెలియును.

ఈ చాతుర్మాస్యదీక్షాసమయంలో శ్రావణమాసం వస్తుంది. ఈ మాసంలోని మంగళ, శుక్రవారాలు భారతీయ మహిళలకు ముఖ్యమైన పండుగరోజులు.

మంగళవారాల్లో మంగళగౌరిని, శుక్రవారాల్లో వరలక్ష్మి నారాధించి, మంగళములను, సౌభాగ్యములనొంది సుమంగళులగు చున్నారు. ఇక పురుషులకు శ్రావణపూర్ణిమ ఒక పవిత్ర దినం. ఆనాడు వటువులకు (ఉపనయనమయి అధ్యయనం చేయువారికి) అధ్యాయోపాకర్మ సంస్కారం చేసి వేదాధ్యయనమారంభిస్తారు. ఇది అనూచానంగా వస్తున్న శాస్త్ర సంప్రదాయం.

అయితే సాధారణంగా పూర్ణిమ అనధ్యయన దినం. అనధ్యయన దినాల్లో వేదాధ్యయనం చెయ్యరు. కాని శాస్త్రం శ్రావణపూర్ణిమనాడు ఉపాకర్మ సంస్కారాన్ని, క్రొత్తగా వేదాధ్యయనం ప్రారంభం విధిస్తోంది. ఇట్లు అనధ్యయన దినంనాడు కొత్తగా వేదాధ్యయ నారంభం నిర్దేశించటం లోని అంతర్యమేమి? ఇతర పూర్ణిమల కన్న శ్రావణ పూర్ణిమలోని విశిష్టత ఏమి?

ఈ మాసంలో పూర్ణిమనాడు చంద్రుడు "శ్రవణ"నక్షత్రంలో కల్సియుంటాడు గాన నీ మాసము శ్రావణమాసము. వేదవాక్కుకు "శ్రుతి" అని పేరు. మహర్షులకి వేదవాణి మహా తపస్సమాధిలో శ్రుతి గోచరమయింది. శ్రుతి అంటే చెవి. మహర్షులకు శ్రుతి గోచరమ యిందంటే మహర్షులు వేదవాణిని శ్రవణం చేశారు. అనగా విన్నారని అర్థం.

ఈనాటికీ గురుముఖం ద్వారా ఉచ్చరింపబడు వేదవాణిని శిష్యులు శ్రవణం చేసి ధారణ చేస్తున్నారు. సృష్టి మొదలు నేటిదాకా గురు శిష్యపరంపరలో శ్రవణం ద్వారా భువికి అవతరించి, నేటికీ శ్రవణంచేయబడుచూ ప్రజలను తరింపచేయుచుండుటచే వేదవాణికి 'శ్రుతి' అని పేరు సార్థకమయినది.

'శ్రుతి-శ్రవణ' శబ్దాలు సమానార్థకాలు. మహర్షులీనక్షత్రం ద్వారా వేదవాణిని విన్నారు. వేదమీనక్షత్ర స్వరూపాన్ని వర్ణిస్తూ నక్షత్రేష్టిలో ఈ విషయాన్ని వెల్లడించింది.

"శ్రుణ్వంతి శ్రోణామమృతస్యగోపాం । పుణ్యామస్యా ఉపశ్రుణోమి వాచమ్ ॥"

'శ్రోణా' అంటే శ్రవణా నక్షత్రము. ఇది అమృతగోప. అంటే అమృతాన్ని భద్రపరచు జ్యోతిస్సు. "ఋచస్సామాని యజూగంషి సా హి శ్రీ రమృతా సతాం । యమ్మయః త్రైవిదా విదుః" అని వేదమంత్రము. ఋగ్యజుస్సామాత్మకమైన వేదము సత్పురుషుల కమృతము. సిరి సంపద. ఆ వేదమును మహర్షులు తెలిసికొనిరి అని యీ మంత్రార్థము.

ఈ శ్రవణా నక్షత్రము నుండి వెలువడు వాక్కులను నేను వినుచున్నానని, పై మంత్రార్థము. దీనిని బట్టి శ్రవణానక్షత్రము పవిత్రమైన వేదవాక్కుల నిలయమనీ, ఆ వాక్కులను మహాత్ములు వింటూ ఉంటారని వేదము చెప్పుచున్నది. వినగలశక్తి గల మహాత్ములెపుడూ ఆ వేదవాణిని వినవచ్చు. వారికి గూడ సుస్పష్టంగా వినబడు సమయం శ్రావణపూర్ణిమ. అందుచేత శ్రావణపూర్ణిమ మహత్వాన్ని, వేదావతారతత్వాన్ని దర్శింపజేయుటకై ఆనాడు అధ్యాయోపాకర్మ సంస్కారాన్ని శాస్త్రాలు నిర్దేశించాయి.

"చంద్రమా మనసో జాతః" - అని వేదము. చంద్రుడు పరమేశ్వరుని మనస్సునుండి ఆవిర్భవించాడట. కావున చంద్రుడు మనః కారకుడని శాస్త్రవచనం. అట్టి చంద్రుడు శ్రావణ పూర్ణిమనాడు షోడశకలా ప్రపూర్ణుడై సాధకుల మనస్సులకుత్తేజం కలిగిస్తూ ఉంటాడు. నియమపూర్వకంగా గ్రహించవలసిన వేదరాశియొక్క అధ్యయనానికి, అభ్యాసానికి శ్రావణ పూర్ణిమ ముఖ్యము. భారతీయ సంస్కృతికి మూల భూతమగు నీ వేదవాణి నారాధించు పరమపవిత్రదినం శ్రావణ పూర్ణిమ.

ఇంకా అనాడు ప్రొద్దునపూట ఉపాకర్మ సంస్కారం పూర్తిచేసి, ఋషులను పూజించి, మధ్యాహ్నం రక్షాబంధనం వటువుకి కట్టాలి. దాన్ని మంత్రాక్షతలతో పూజించాలి.

"ఉపాకర్మణి కర్తవ్యం ఋషీణాం చైవ పూజనమ్।
తతో2 పరాహ్ణసమయే రక్షా పోటలికాం శుభామ్॥
తదను పురోధాః వటోశ్చ రక్షాం బధ్నీత మంత్రేణ
కారయేదక్షతైః శస్త్రైః సిద్ధార్థైః హేమభూషితైః"

పోటలిక అంటే రక్షాబంధనము.

రక్షాబంధనం కట్టునప్పుడు చెప్పవలసిన మంత్రము:-

"యేన బద్ధో బలీ రాజా దానవేంద్రో మహాబలః।
తేన త్వామపి బధ్నామి రక్షే మాచల మాచల।"
బ్రాహ్మణైః క్షత్రియైః వైశ్యైః శూద్రైరన్యైశ్చ మానవైః।
కర్తవ్యో రక్షితాచారః॥

బ్రహ్మణాది నాల్గు వర్ణములే గాక ఇతరులు గూడ ఈ రక్షాబంధనం కట్టించుకోవాలి. ఇది సమస్తపాపముల నుండి రక్షించును. ఇట్లు ఈ రక్షాబంధనం అనేది పెద్దవేడుక. శ్రావణపూర్ణిమనాడు దీన్ని 'రాఖీ' పండుగ అంటారు. తరువాత

"శ్రావణ్యాం శ్రవణే జాతః పూర్వం హయశిరా హరిః।
జగాద సామవేదం తు సర్వ కల్మషనాశనమ్।
స్నాత్వా సంపూజయేత్తం తు శంఖ చక్ర గదాధరమ్। -కల్పతరువు

శ్రావణపూర్ణిమనాడు శ్రవణా నక్షత్రంలో శ్రీమహావిష్ణువు హయగ్రీవుడుగా అవతరించి సర్వ కల్మష నాశకమగు సామగానం చేశారు. కనుక అనాడు అందరూ శంఖచక్ర గదాధరుడైన హయగ్రీవుని పూజించాలని కల్పతరువు అను గ్రంథం ఉపదేశిస్తోంది. శ్రావణమాసంలో హయగ్రీవారాధన సమస్త పాపక్షయకరము.

"శ్రావణే మాసి పంచమ్యాం శుక్లపక్షే నరైస్సదా
ద్వార స్యోభయతో లేఖ్యాః గోమయేన విషోల్బణాః" -మదనరత్నమ్
"పంచమీ నాగపూజాయాం కార్యా పక్షే సితే నరైః" -చమత్కార చింతామణి

శ్రావణ శుద్ధ పంచమినాడు ఇంటి ద్వారమునకు బయట రెండువైపుల ఆవుపేడతో సర్పముల బొమ్మలను గీచి, ఆ సర్పములను, దర్భలు, అక్షతలు, పెరుగు మొదలగువానితో అర్చించిన ఆ యింటికి సర్పబాధ ఉండదు.

గ్రీష్మ తాపానికి, ఎండి ఎండి, వానలు కురవగానే శ్రావణమాసంలో అనేక ఔషధులు పుట్టును గనుక ఈమాసం ప్రశస్తమవి శాస్త్రవచనం.

పురుషుల వలె స్త్రీలు గూడ వేదమాతృ స్వరూపిణి యగు శ్రావణమంగళగౌరిని, శుక్రవార వరలక్ష్మిని, వేదమాతృ స్వరూపిణులైన ముత్తయిదువలనారాధిస్తారు. గౌరీపూజ అంటే వేదమాతృపూజ. వేదాధ్యయనం చేసి పురుషుల వలె, స్త్రీలు గౌరిపూజ చేసి, వేదమాతృ పూజ చేసి, వేదమాత యొుక్క అనుగ్రహపాత్రులగుచున్నారు. అందుచేత వివాహానికి ముందు కన్యలచే గౌరీపూజలు చేయించటం సంప్రదాయం. రుక్మిణీదేవి, పార్వతీదేవి గూడ వివాహానికి ముందు గౌరీపూజ చేసిరి.

అట్లే శుక్రవారపూజ గూడ ప్రధానమైనదే- శుక్రమనగా అగ్ని, వీర్యము, తేజస్సు, శక్తి మొదలగు అర్థాలున్నాయి. "సప్తార్చిర్దమునా శుక్రః," శుక్రం తేజో రేతసీ చ బీజ వీర్యేంద్రియాణిచ" అని అమరకోశం పై అర్థాలను తెల్పుచున్నది. వీర్యంపోతే మానవులు కళాహీనులు తేజోహీనులు, శక్తిహీనులగుదురు. వీర్యాభిమానదేవత, తేజః స్వరూపిణి, శక్తిస్వరూపిణి యగు లలితా పరాదేవత లలితా సహస్రనామాల్లో "సర్వాయుధ ధరా శుక్ల సంస్థితా సర్వతోముఖీ" యని కీర్తింపబడుచున్నది. పరాదేవత మానవుల వీర్యమందు ఉండునట. కావున వీర్యమే-శుక్రమే లక్ష్మి. రేఫ, లకారములకు తేడాలేదు. కాన శుక్లమనగా శుక్రమే, (రలయోరభేదః) కావున శుక్రాభిమాన దేవత యగు వరలక్ష్మిని ఆరాధించి, శుక్రవారాలలోను, అందులో శ్రావణ శుక్రవారమున ఆరాధించి, మానవులు దివ్యతేజస్సంపన్నులై, శక్తిమంతులై, వీర్య పుష్టి నొందటమే శ్రావణ శుక్రవారపూజల ప్రత్యేకత.

శ్రావణమాసంలోని మరియొుక పర్వదినం కృష్ణాష్టమి. దీనినే కృష్ణజయన్తి అంటారు. జయంతి అనగా రాత్రి అని అర్థము.

"కించ జయన్తీ శబ్దో రాత్రి వాచకః
జయన్తీ నామ సా ప్రోక్తా సర్వ పాపప్రణాశినీ।
అభిజిన్నామ నక్షత్రం జయన్తీ నామ శర్వరీ।
ముహూర్తో విజయోనామ యత్ర జాతో జనార్దనః

-బ్రహ్మాండపురాణమ్

జయన్తి అనగా సర్వపాపములను నశింపచేయు రాత్రి, అపుడు శ్రీకృష్ణుడు జన్మించిన ముహూర్తమునకు 'విజయ' అనిపేరు. కృష్ణాష్టమీ పూజ అంటే గణపతి పూజయే.

"గణేశ రూపః శ్రీకృష్ణః కల్పేకల్పే తవాత్మజః" - బ్రహ్మవైవర్తపురాణమ్

ప్రతికల్పంలోను కృష్ణుడు గణపతి రూపంలో నీకు కుమారుడుగా జన్మిస్తాడని పార్వతీ దేవికి బ్రహ్మదేవుని వరం.

శ్రీకృష్ణునికిగల గోపాల, గోవింద అను పేర్లు ఆయన వేద స్వరూపుడు, వేదరక్షకుడని తెల్పుచున్నవి. కావున వేదపురుషుడు శ్రీ కృష్ణ పరమాత్మను పూజించినచో ఆయన మానవుల మనస్సులను దున్నుతాడుట. రైతు పొలం దున్ని కొత్త విత్తనముల నాటి చక్కని పైరును ఇచ్చునట్లు, కృష్ణుడు మానవుల మనస్సులను దున్ని, కలుపు మొక్కల వంటి అసత్య, అవైదికలక్షణాలను పీకిపారవేసి, సత్యప్రతిష్ఠ గావిస్తాడు. వైదిక లక్షణములను నెలకొల్పుతాడు. పాప ప్రక్షాళనం గావిస్తాడు అని కృష్ణ శబ్దవ్యుత్పత్తులు తెల్పుచున్నవి.

"కర్షతి చిత్తమితి కృష్ణః" అట్లే

"కృషిస్తు భక్తి వచనో ణశ్చ తద్దాస్య వాచకః ।

భక్తి దాస్యప్రదాతా యస్స కృష్ణః పరికీర్తితః ॥

కృషిశ్చ సర్వవచనో ణ కారో బీజవాచకః ।

సర్వం బీజం పరంబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే ॥"

-బ్రహ్మవైవర్త పురాణమ్ ।

కృష్ణ అను పదంలోని కృషి అంటే భక్తి. ణ కారం అంటే దాస్యం. కాన భక్తి, దాస్యముల నొసంగువాడు కృష్ణుడు. కృషి అంటే నిఖిల ప్రపంచం. ణ కారం దానికి మూలకారణం అగు బీజము. కావున కార్యకారణ స్వరూపుడు కృష్ణుడు. ప్రపంచమునకు కారణభూతుడు. అందరి మనస్సులను తనవైపు ఆకర్షించగలవాడు కృష్ణుడు. ఆయనయే శ్రీకృష్ణ పరమాత్మ. అట్టి పరమాత్మను ఆరాధించుట ద్వారా జనులు పాపములనుండి, పలు రకముల వ్యాధులనుండి రక్షింపబడుచున్నారు.

సర్వ వ్యాధి ప్రశమనీ, సర్వమృత్యునివారిణీ యగు వేదమాతను, వేదమాతృస్వరూపిణి యగు పరాశక్తిని, వేదపురుషుడగు పరమేశ్వరారాధన చేసి ప్రజలు అందరూ తరించాలని వేదమాత ఉపదేశం. వేదాధ్యయనమే గాక, వేదశబ్ద శ్రవణం గూడ పుణ్యమనీ, మహర్షుల వలె అందరు వేదమంత్ర శ్రవణం చేసి, వేదమయులు, తద్వారా దేవమయులు కావాలనీ, అట్లు దైవానుగ్రహమును సంపాదించు కాలమగుటయే శ్రావణ మాస విశిష్టత.

ఇతిశమ్

"నమామ శ్రుతిమాతరమ్"

# వినాయకుని వాహనము

1. సౌబరి అనే మహర్షికి భార్య మనోమయి. ఒకనాడు క్రౌంచుడనే గంధర్వుడు ఆమెను చూచి కాముకుడై బలాత్కరించబోవగా, నామె భయపడి ఏడువసాగెను. ఆ ఏడుపు విని మహర్షి బయటకు వచ్చి -

" వినాపరాధా మేనాం త్వం కృష్ట వానసి దుర్మతే।

భవత్వ మాఖురూపేణ సర్వదా కర్షకో భువః॥

ఏ యపరాధము లేని యీమెను బలాత్కరించపోయిన, దుర్మతి యగు నీవెలుక రూపంలో ఎల్లవేళల భూమిని త్రవ్వుచూ ఉండిపొమ్మని ఋషి శపించెను. ఆ వెంటనే పశ్చాత్తాపంతో గంధర్వుడు ముని కాళ్లమీద పడి అనుగ్రహించమని ప్రాధేయపడగా నా మహర్షి -

" వినాయకః పార్శ్వ గృహే2 వతరిష్యతి సాంప్రతమ్।

విఘ్నాసురవినాశాయ తస్య సన్నిధి మేష్యసి॥" అని అంటాడు.

విఘ్నాసురు నంతమొందించుటకు'పార్శ' మహాముని ఇంట వినాయకుడు అవతరిస్తాడు. నీవు ఆ వినాయకుని సన్నిధికి పోయి ఆయనకు సేవ చేసుకొమని గంధర్వునికుత్తమ గతిని చూపుతాడు.

2. కృష్ణయజుర్వేద తైత్తిరీయ సంహితలో -

"ఏక ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థ ఆఖుస్తే రుద్రపశుస్తంజుషస్వ" అని ఉన్నది.

ప్రపంచపాలకుడు రుద్రుడు ఒక్కడే - రెండవవారు లేరు. ఓరుద్రా! నీకు మూషకమే ప్రియమగు పశువు దానిని సేవించుమా! అని అర్థము. కావున మూషికము రుద్రరూప గణపతికి పరమేశ్వరునికి అత్యంత ప్రియమైన పశువు. వాహనము.

3. "అగ్ని ర్దేవేభ్యో నిలాయత। ఆఖూరూపంకృత్వా। సపృథివీం ప్రావిశత్, స ఊతీః కుర్వాణః పృథివీ మనుసమ్చరత్। తదాఖు కరీష మభవత్। యదాఖు కరీషః సంభారో భవతి। యదే వాస్య తత్రన్యక్తం। తదేవావరుంధే"

-తైత్తిరీయ బ్రాహ్మణం

ఒకప్పుడు కారణాంతరములచే దేవతల మీద అలిగిన అగ్ని వారికి కనపడకుండగ మూషికమై, మూషకరూపంలో పూర్తిగా నిలీనమై భూమిని ప్రవేశించి కలుగులను త్రవ్వుచూ భూమిలోపలే ఉంటూ అక్కడే తిరగసాగెను. ఆ కలుగుల నిర్మాణంలో బయటకు త్రవ్వబడిన మన్ను మూషికము యొక్క కరీషము. ఆ కరీషం అగ్ని యొక్క తేజస్సుతో నిగూఢంగా నిండి యుంటుంది అని అర్థము. మూషికములచే త్రవ్వబడిన మన్ను అగ్ని తేజోభరితమై

సారవంతమైనది. యజ్ఞభూమిని నీ మట్టితో నింపినచో నాభూమి అగ్ని తేజస్సును బొంది యజ్ఞమును చేయుటకు సంపూర్ణత్వము నొందునని యీ క్రింది సాయణాచార్య భాష్యం తెల్పుచున్నది.

"అగ్నిః కదాచిత్కేనాపి నిమిత్తేన దేవే భ్యోఽ పరక్తఃసన్ మూషకో భూత్వా తదీయం రూపంచ సంపూర్ణం కృత్వా దేవైరదృశ్యో భూత్వాన చ పృధివీం ప్రవిష్టః బిలాని కుర్వాణోఽను క్రమేణ భూమేరం తరేవ సమచరత్। యద్బిల నిర్మాణే నిః సారితం పాంసురూపం తదేతదాఖు కరీషం తస్మిన్‌సంభృతే సతి తత్రనిగూఢం యదగ్నేః తేజః తత్సర్వం ప్రాప్నోతి" ఇతి.

కావున దీనిని బట్టి మూషకము, మూషక కరీషము అనగా ఎలుక త్రవ్విన మట్టియున్నూ ఎంత విలువ గల్గినవో తెలియనగును. అట్టి అగ్ని రూపమూషకము బ్రహ్మ స్వరూపుడగు వినాయకునికి వాహనము.

ఇక వినాయకుడు - సింహ వాహనము :-

ఒకనాడు సత్యలోకంలో బ్రహ్మ సుఖంగా కూర్చొని ఆవులించాడట.

"సత్యలోకే సుఖాసీనో జజృంభే కమలాసనః"

ఆ ఆవులింత నుండి భయంకర రూపంలో నొక పురుషుడు పుట్టినాడు. వానిని చూచి బ్రహ్మ ఆశ్చర్యపడినాడు. అతడు తన ముఖము నుండి పుట్టినట్లు తెలిసికొని అతనికి సిందూరుడని నామకరణం చేసి, అతడు స్వేచ్ఛగా తిరుగునట్లు, అంతట ముల్లోకములలోను జయం తప్ప అపజయం గల్గకుండునట్లు ఆశీర్వదించి సకల శస్త్రాస్త్రములను అనుగ్రహిస్తాడు. ఆపైన పుత్రవ్యామోహం బాగా పొంగి వచ్చుటచే, బ్రహ్మ సిందూరుడెవరినైనా తన చేతులతో బంధిస్తే వాడు భస్మమైపోవునట్లు వరమిస్తాడు.

"యంవేష్టయసి బాహుభ్యాం భస్మసాత్స భవిష్యతి"

ఇక ఆ సిందూరుడు ఏ మాత్రం తపస్సుగాని , యజ్ఞంగాని చేయక, కష్టపడక అనాయాసంగా, అనాయాచితంగానే బలం, శక్తి, వరాలు పొందేసరికి అతనిలో మదం, గర్వం, తమోగుణం ప్రవేశిస్తాయి. ఆ తమోగుణం ప్రధాన కారణమగుటచేత తండ్రియనిగూడ చూడక ఆ వరం యొక్క ప్రభావమును తన తండ్రి మీదే ప్రయోగం చేసి చూడదలచాడు. బ్రహ్మను తన చేతులతో బంధింపబోయెను.

అంతదాకా పుత్రవ్యామోహంలో మునిగిన బ్రహ్మ ఒక్కసారిగా నివ్వెరపోయి, తను చేసిన తప్పు గ్రహించి - కొడుకు గద! అని ప్రేమతో వరములిస్తే తండ్రినే తన్నెదవా! తెలియక పిచ్చి వ్యామోహంలో పడి నీకు వరాలిచ్చానే, తండ్రినే ఏడిపిస్తావా? ఇలా వదిలివేస్తే లోకకంటకుడవగుదువని బాధపడి - నిన్ను చంపగల మహాపురుషుడు వినాయకుడు త్వరగా అవతరిస్తాడని శాపం పెట్టను.

"వినాయకస్తే వాశాయ శీఘ్రం హ్యావతరిష్యతి".

అపుడు బ్రహ్మ భయంతో వైకుంఠానికి వెళ్తుతాడు. సిందూరుడు వైకుంఠానికి పోయి విష్ణువుతో యుద్ధంచేయబోగా, విష్ణువు మాయమాటలతో వానిని కైలాసానికి పంపుతాడు. కైలాసంలో శివుడు తపస్సమాధిలో వుంటాడు. ప్రక్కనున్న పార్వతిని తీసికొని రసాతలానికి పోదామనుకుని పార్వతీదేవి జడకొప్పు పట్టుకొని యీడ్చుకొనిపోతుండగా పార్వతీదేవి దుఃఖించసాగింది. ప్రమథగణం శివుని వేడుకొనగా ఆయన సమాధినుండి బయటికిరావలానికి వచ్చి ఆ ఘోరదృశ్యాన్ని చూసి సిందూరునిపై త్రిశూలమును వేయబోతాడు. పారమేశ్వర శక్తి ముందు సిందూరుని శక్తి సన్నగిల్లింది. ప్రాణభయంతో సిందూరుడు పార్వతిని వదులుతాడు. అపుడు

"వినాయకం చతుర్బాహుం సాయుధం సింహవాహనం. సిద్ధిబుద్ధియుతం నిత్యం సర్వార్థ సాధకం విభుమ్। ఉరగోదరమారాత్సా పార్వతీ పశ్యతి స్మితమ్॥"

చతుర్భుజుడు, ఆయుధధారి, సింహవాహనుడు, సిద్ధి, బుద్ధిసమేతుడు, సర్వార్థములసాధించువాడు, ఉరగోదరుడు నగు వినాయకుడవతరించెను. అవినాయకుని చూసి పార్వతీదేవీ ఆనందించి ఆయనను స్మరించింది. అపుడు వినాయకుడు

"ఇతో2హ మస్యనాశార్థం భవిష్యామి తవాత్మజః॥"

నేను సిందూరుని సంహరించుటకై నీకు కుమారునిగ అవతరిస్తానని చెప్పుతాడు.

ఆ తరువాత గౌరీతిథి యగు తదియవాడు వినాయకుడు పార్వతీదేవి గర్భమును ప్రవేశిస్తాడు. గర్భం దిన దిన ప్రవర్ధమాన మగుచున్న సమయంలో పార్వతీ పరమేశ్వరులు విహారం చేద్దామని వింధ్యపర్వత ప్రాంతాలకు వెళ్తుతారు.

ఈ లోపల సిందూరుడు ఋషుల ఆశ్రమాలను, చెట్లను, చెరువులను, సరస్సులను పాడుచేయసాగాడు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను సైతం గడ్డిపోచవలె చూస్తూ అహంకార పూరితుడై యధేచ్ఛా విహారం చేస్తుండగా ఒక అశరీర దేవతావాణి "పార్వతీదేవి యొక్క గర్భం నిన్ను నాశనం చేస్తుంది. " అని పలుకుతుంది. వెంటనే కోపంతో వింధ్యాటవికి పోయి పర్యలీకవనంలో విహరిస్తున్న పార్వతీ పరమేశ్వరులను చూస్తాడు.

మాయతో వాయురూపంలో తెలియకుండగా పార్వతీదేవి గర్భమును ప్రవేశించి గోళ్ళతో గర్భంలోని శిశువు తలను త్రుంచి బయటకు తెచ్చి వింధ్యపర్వతంపై పడవేసి సిందూరుడు వెళ్లిపోతాడు.

"ప్రవివేశోదరే దై త్యో మాయయా వాయురూప ధృక్। శిత్వానఖైః కరైః ధృత్వా గర్భస్య మస్తకం బహిః. విర్గత్య తచ్ఛి రస్త్యక్తం వింధ్యాచలసమీపతః॥"

నర్మదానదీ తీరంలో శిరస్సు పడినచోటఒక గణకుండం ఏర్పడింది.

"గణే కుండం తత్రాభూదపతద్యత్ర తచ్ఛిరః॥"

ఈ తతంగమేమీ తెలియని శివపార్వతులు కైలాసం చేరారు. పార్వతీదేవి నిండు చూలాలైనది. ఇక ప్రసవించబోయే ముందు ఆమెకు వినాయకుడు తన స్వరూపంలో కననడి దుష్ట శిక్షణకు, మాతృశుశ్రూషకు తానవతరించబోతున్నట్లు చెప్పాడు. పార్వతీదేవి ప్రసవించింది. పిల్లవాడు పుట్టాడు. కాని శిరస్సు లేదు. పార్వతీదేవికి భయం, శోకం ముంచుకు వచ్చాయి. ఈ వార్త నందీశ్వరుని ద్వారా అంతటా పాకింది. దేవతలంతా అక్కడికి వచ్చారు. ఆ సమయంలో తటాలున శివునికి గజాసురసంహారం, గజాసురుని కిచ్చిన వరం గుర్తుకు వస్తాయి. అపుడు గజాసురమస్తకం తెచ్చి అబాలుని మొండెమునకు శ్రీహరి అతికించుతాడు. అప్పటినుండి వినాయకుడు గజాననుడైనాడు.

ఈ వార్తను నారదుడు సిందూరుని వద్దకు మోసుకెళ్ళి చెప్పగానే సిందూరుడు మండిపడి, మూర్ఛపోయి, ఆ పిల్లవానిని చంపుటకు వెళ్ళుతాడు. నాలుగు చేతులతో నాలుగు ఆయుధాలు కల్గియున్న ఆ పసికందును చూచి జాలిపడతాడు. పిల్లవానితో "ముక్కుపచ్చలారని నువ్వు నన్ను చంపగలవా? నాసంగతి ఎలావున్నా ముందు నీ ప్రాణం దక్కించుకో!" అని అంటాడు. అపుడు ఆ పసిపిల్ల వాని రూపంలో నున్న భగవంతుడు- "అత్యంత స్వల్పమైన దీపం మొత్తం చీకటిని పారదోలుతుంది. అట్లే చిన్న అంకుశానికి పెద్ద మదగజమును లొంగునట్లు మదోన్మత్తులు గూడ నశించక తప్పదు". అని అంటాడు.

'లఘీయాన్పి యథా దీపో నాశయత్యఖిలం తమః అంకుశేనాపి హన్యన్తే మదోన్మత్తా యథా గజః' అని చెప్పి పసిబాలుడైన వినాయకుడు తన నిజమైన విశ్వరూపం ప్రదర్శిస్తాడు. ఆ విశ్వరూపం చూచినా గూడ సిందూరుడు ఏమాత్రం చలించక, ఇంకా అజ్ఞానంధాకారంలోనే మునిగిన వాడై యుద్ధానికి తలపడి మరణిస్తాడు. ఆపై బ్రహ్మాదులందరూ ఆయనను స్తుతించి యథాశక్తి పూజించి, సత్కరించి, ఆయుధాదులు, కానుకలు సమర్పించుకొంటారు.

శ్రీ మహాగణపతి వీరారాధ్యుడు-వీరాగ్రరూపుడు. సింహవాహనుడు. ఈ సింహవాహనుడైన వినాయకుడే చింతామణి గణపతి. స్కందపురాణంలో చింతామణి గణపతి గూర్చి కథ గలదు.

పూర్వం త్రేతా యుగంలో సంతానం లేని అభిజన్మహారాజు సంతానార్థమై భార్యా సమేతుడై వైశంపాయన మహర్షిని శరణు జొచ్చుతాడు.ఆయన ప్రసన్నుడై రాజును సింధునదీ తీరంలోని అత్యంత శోభాయమానమైన సరస్తీరంలో నాలుగు నెలలు తపస్సు చేసి రాజ్యానికి మరలిపొమ్మంటాడు.ఆరాజు ఆసరస్తీరంలో తపస్సు చేయసాగాడు.ఆప్రాంతంలోనే బ్రహ్మ గూడా తపోదీక్షలో ఉంటున్నాడు.సరస్వతి ఉపచారములు,తపస్సు కు కావలసిన ఏర్పాట్లను చేస్తున్నది.ఒక రోజున ఆమె వివస్త్రయై బ్రహ్మవడిలో కూర్చుంటుంది.తాను కూతురు గనుక తండ్రి వళ్ళో అలా కూర్చోవటంలో శంకించదు. వివస్త్ర పరమసౌందర్యవతి అయిన స్త్రీ స్వరూపాన్ని చూడగానే బ్రహ్మ కామ మోహితుడయ్యెను-వారిరువురికి వాదోపవాదాలు

జరుగుతాయి.చివరికి సావధానచిత్తుడై సరస్సుకు తిరిగి వచ్చినప్పటికీ మనోనిగ్రహం లేనందున రేతస్సు స్ఖలించి సింధునదీ పశ్చిమ తీరప్రాంతంలో పడుతుంది.ఆ బ్రహ్మ రేతస్సును అభిజన్మహారాజు భార్య స్నాన సమయంలో తన గర్భస్థం చేసికొంటుంది. నాల్గు నెలల దీక్షాకాలం పూర్తిఅయ్యే సరికి ఆమె గర్భవతి అయింది.

అట్లు అభిజన్మహారాజుకు పుట్టిన పుత్రుడు గణుడు. మోహగుణం గల బ్రహ్మ వీర్యాంశ వలన జన్మించిన గణుడు గూడ బలశాలి, మోహపిశాచి అగును. ఇక ఋషులను పీడించటం, దేవతలను జయించటం, వివేకం నశించటం వగైరా దుర్లక్షణాలన్నీ అబ్బుతాయి.

ఒకనాడు పరివారంతో వేటకు వెళ్లి అలసిపోయిన వాడై కపిలమహర్షి ఆశ్రమానికి గణుడు వెళ్లాడు. స్వాగతసత్కారాలు, అర్ఘ్య పాద్యాదుల తర్వాత ఆతిధ్యం. కపిలమహర్షి తన వక్షస్థలమందుంచుకొన్న చింతామణి ద్వారా గణునికి, పరివారానికి ఘనంగా ఆతిధ్యం ఇస్తాడు. ఆ చింతామణికి, దాని ప్రభావానికి ముగ్ధుడై ఆ మణిని యాచిస్తాడు. మహర్షి తిరస్కరిస్తాడు. గణుడు బలాత్కరించి మణిని లాక్కుని పోతాడు. మహర్షికి కోపం తెప్పిస్తాడు. వాని మరణం కోసం విష్ణువును ధ్యానించగా యోగమాయ ప్రత్యక్షమై - 'వినాయకుడు తప్ప మరే దేవుని చేతిలోను గణునికి చావులేదు'.

"వినా వినాయకం విప్ర పోవధ్య పుర్వదైవతైః"॥

కనుక నీకు ఓంకారముతో ప్రారంభం, నమః అంతముగా అష్టాదశ వర్ణములుగా వినాయక మహామంత్రాన్ని ప్రసాదిస్తున్నాను. దానిని సదా జపించగా సిద్ధిగల్గుతుంది అని చెప్పుతుంది. ఇంకా - దివ్యాంబరధారి, దివ్యభూషణాలంకృతుడు చతుర్భుజుడు, సింహవాహనుడు, సిద్ధి, బుద్ధి సమేతుడు, పరశుధారి, మోదకహస్తుడై వినాయకుడు నీయజ్ఞ కుండలినుండి ఆవిర్భవిస్తాడు. నీ వాంఛితమును నెరవేరుస్తాడు.

"కుండాంతరావిర్భవితా చతుర్బాహు వినాయకః

దివ్యాంబరధరో దివ్యభూషణః సింహవాహనః"

అని చెప్పి యోగమాయ అంతర్ధానమయింది. అదేరోజు రాత్రి గణునికి కలలో ఒకానొక స్వరూపం-వినాయక స్వరూపం కపిల మహర్షి తోపాటు కలసి తనను సంహరించినట్లు కనపడింది. దానితో భయపడి రాత్రికి రాత్రి మంత్రులతో సమావేశమై కపిల మహర్షిని సంహరించాలని నిశ్చయిస్తాడు. ముందుగా తాను సైన్యంతో కపిల మహర్షి ఆశ్రమానికి రాగానే అచట వినాయకుని రూపం కనపడుతుంది. అపుడు కపిల మహర్షిని ఆ క్రొత్తరూపం ఎవరని అడుగుతాడు.

మహాత్ముడైన అభిజన్మహారాజు సమస్త పాతకముల పుట్ట అయిన నీకు తండ్రి అయినాడు. నీ పాప ఫలం నీవు అనుభవించునట్లు పరమేశ్వరుడు నిన్ను చంపుటకై వినాయకుని రూపంలో అవతారించాడు అని కపిల మహర్షి చెబుతాడు. ఆ తరువాత

యుద్ధంలో గణుడు మరణిస్తాడు. అభిజిత్తుకు గణపుత్రులకు వినాయకుడు శరణమిస్తాడు. చింతామణిని కపిల మహర్షికి ఇప్పిస్తాడు. కపిలమహర్షి ఆ చింతామణిని వినాయకునికి సమర్పిస్తాడు. గణుని చంపి మణిని స్వాధీనం చేసి కున్నందున ఆ మణిని స్వీకరించవలసిందిగా ప్రార్థించగా వినాయకుడు చింతామణిని స్వీకరించి, సింహవాహనుడని, చింతామణి గణపతి యని ప్రసిద్ధుడైనాడు. ఆ పిదప కపిల మహర్షి నను గ్రహించుటకై కపిల మహర్షి ఇంట్లో కపిల నామంతో వినాయకుడు అవతరించి 'కపిల గణపతి' యని పేరుబొందెను.

అందరినీ సంతోష పెట్టిన యా గణపతి యొక్క ప్రసన్న రూపాన్ని ప్రసన్న వదనారవిందాన్ని చూచి దేవతలు పుష్పవర్షం కురిపించారు.

"అవకీర్యా బ్రువన్ దేవాః త్వన్నామ సుముఖేతి చ।

తతస్సుముఖనామ్నాऽపి దేవే విఖ్యాతి మాప సః ।"

దేవతలంతా సుముఖడవని కీర్తించటం వలన వినాయకుడు 'సుముఖుడ' ని ఖ్యాతినొందెను.

వింధ్య హిమాలయాల మధ్య హైమవతి నగరంలో అభినందనుడనే రాజు మదమత్తుడై కొంతమంది ఋషులను పిలిచి ఇంద్రుడు లేకుండా యజ్ఞంచేయమని, అలా చేయవిచో వారి తలలు నరికి వేస్తానని చెప్పుతాడు. ఈ సంగతి నారదమహర్షి ద్వారా ఇంద్రునికి తెలిసింది.

క్రోధంతో తపించి పోయి, యజ్ఞంలో నేను లేకుండా ఏ దేవుడు గూడ పూజార్హుడు గాడు కనుక ఆ యజ్ఞాన్ని ధ్వంసంచేస్తే సరిపోతుందని తలచి కాలుడనే వానిని పిలిచి, తాను లేకుండా యజ్ఞం చేసేవారిని సంహరించమనీ, అనేక రూపాలతో వెళ్ళి యజ్ఞానికి విఘ్నాలు కలిగించి, యజ్ఞాన్ని పాడుచేయమనీ, తర్వాత ముల్లోకాలను పీడించి తనకు శాంతిని కలిగించమనీ, భూలోకానికి విఘ్నరూపంలో వెళ్లమనీ ఆదేశిస్తాడు.

" భూలోకం విఘ్నరూపేణ గచ్ఛ నాశయ తాం యజిమ్"

కాలుడు,విఘ్నరూపంలో వెళ్లి యజ్ఞం చేసే అభినందనుని చంపి, యజ్ఞాన్ని నాశనంచేసి. ఇంద్రుని వర గర్వంతో మహర్షులను పీడించసాగాడు. భూలోకం యజ్ఞరహితమై, కర్మరహితమైనది.

అపుడు ఋషులందరూ ప్రాణులందరి హృదయములందు నివసించెడి, సర్వవ్యాపి, సర్వసాక్షి, సృష్టికర్త, పాలకుడు,నాశకుడు, చతుర్వేదములు నిఃశ్వాసముగా కల్గువాడునగు జనార్ధనుని మనసా ధ్యానించగా వారికి వినాయక స్వరూపం కనపడింది.

విఘ్నాసుర సంహారార్థం, భక్త సంరక్షణార్థం, వరేణ్యమహారాజు గృహంలో జన్మిస్తానని వినాయకుడు వారికి అభయమిస్తాడు. ఆ ప్రకారంగా వరేణ్యుని భార్య పుష్పికాదేవి గర్భంలో

ప్రవేశించాడు. తరువాత పుష్టికాదేవి 'పుత్రుణ్ణి' ప్రసవించి, ఆ పిల్ల వానిని చూచి భయముతో అరిచింది. చతుర్భుజుడు, ఆయుధహస్తుడు, గజముఖుడు నగు నాబాలుడు మహాతేజస్సుతో విరాజిల్లు చున్నాడు. పుష్టికాదేవి అరవగానే రాజు, పరివారం వచ్చి చూచి, నివ్వెరపోయి, అదేదో వికృతరూపం జన్మించటం అరిష్టమనీ భయపడిరి. రాజు వెంటనే ఆ బాలుని తీసుకొని వెళ్లి పార్శ్వముని ఆశ్రమం ప్రక్కనున్న సరోవరంలో వదలిరమ్మని భటుల నాజ్ఞాపించాడు. భటులట్లే చేశారు.

పార్శ్వముని స్నానానికి వచ్చి సరస్తీరంలో నున్న బాలుని చూచి, ఈ పిల్లవాడు నాతపః ఫలమా? తపః ఫలాన్ని ప్రసాదించుటకు, పరమేశ్వరుడిట్లు బాలుడుగా అవతరించాడని సంతోషంతో నాబాలుని ఆశ్రమానికి తెచ్చి తన భార్య దీపవత్సల చేతిలో పెట్టినాడు. అత్యంతాశ్చర్యకరమైన ఆ బాలుని దివ్యరూపం చూచి దీపవత్సల-

"ఇదం వైనాయకం రూపం మమ భాతి"

అనగా ఈ రూపం వినాయకుని రూపముగా నాకు తోచుచున్నదని చెపుతుంది. అపుడు సౌబరి మహర్షిచే శాపగ్రస్తుడైన క్రౌంచుడనే గంధర్వుడు భీకరమగు మూషకరూపుడై పార్శ్వముని ఆశ్రమానికి వస్తాడు. ఇక మూషకం చేసే పనులన్నీ చేయసాగాడు. యజ్ఞకుండాలను త్రవ్వటం, వస్తువులను, పాత్రలను పాడుచేయటం ఒకటేమిటి-పార్శ్వమునికి తలనొప్పిగా తయారయ్యాడు.

ఆయన బాధను వినాయకుడు గ్రహించి, మూషకం సంగతి తేలుస్తానని చెప్పి, మూషకాన్ని పట్టుకొని, దాన్ని చేత్తో తాకగానే ఆ మూషకానికి జ్ఞానోదయమైనది. ఆ మూషకం వెంటనే స్వామి పాదాల మీదపడి తనకథను శాపం సంగతి స్వామికి విన్నవించి, తనను ఆయనకు వాహనంగా ఉండేటట్లు వేడుకొంటాడు. స్వామి అంగీకరించాడు. మూషకాన్ని సంహరించుటకు వెళ్లిన వినాయకుడు మూషక వాహనుడై వస్తాడు.

తర్వాత బ్రహ్మదేవుని ద్వారా వసిష్ఠాది మునులు పార్శ్వముని ఆశ్రమంలో విఘ్నాసుర సంహార కర్తయగు వినాయకుని అవతరణం గూర్చి విని పార్శ్వముని ఆశ్రమానికి వచ్చి వినాయకుని చూచి తరిస్తారు. అపుడు వరుణుని ద్వారా ఇంద్రునిచే ప్రేరితుడగు విఘ్నాసురుడు కాలరూపియై ముల్లోకముల పీడించుచున్నాడని తెలిసికొని వినాయకుడు మూషకవాహనుడై విఘ్నాసుర సంహారానికి వెళ్ళుతాడు.

అనేకరక మాయాయుద్ధంలో విఘ్నాసురుడు విజృంభిస్తాడు. అతడు పక్షిరూపంలో ఎగురుతాడు. వినాయకుడు కమలాన్ని విసురుతాడు. రాక్షసుడు అగ్నిగా మారగా స్వామి మేఘాన్ని సృష్టించి వర్షం కురిపిస్తాడు. రాక్షసుడు పర్వతముగా మారగా స్వామి వజ్రం ప్రయోగిస్తాడు. వాడుకూడా వజ్రంగా మారగా స్వామి శక్తిని ప్రయోగిస్తాడు. దానితో దైత్యుని బలం క్షీణించింది-వానికి ప్రాణభయం కలిగి స్వామి పాదాల మీదపడి క్షమాపణ కోరుతాడు.

స్వామి యనుగ్రహించి తనకు ప్రియుడుగా చేర్చుకుంటాడు. తను చెప్పినట్లు చేయమంటాడు. తనపేరు వినబడుచోట, పేరును స్మరించు చోట, తనను పూజించు చోట, స్తుతించుచోట, తన భక్తులుండుచోట విఘ్నముండరాదు. తద్భిన్నమైన ప్రదేశాలలో విఘ్నము విహరించవచ్చు అని స్వామి పలుకగా విఘ్నాసురుడు చిన్న కోరిక కోరుతాడు. తన పేరుతో స్వామి వ్యవహరింపబడాలని కోరిక విన్నవిస్తాడు. దానికి స్వామి అంగీకరించి-

"త్వన్నామపూర్వకం నామ మమ లోకే భవిష్యతి।

విఘ్నరాజేతి చ ఖ్యాతిం సర్వసిద్ధి ప్రదం నృణామ్"

విఘ్నం అనగా అజ్ఞానమే. పరమేశ్వరుని అనుగ్రహంతో విఘ్నరూపమైన అజ్ఞానాన్ని నివారించుకొని జ్ఞానం సంపాదించుకోవాలి. జ్ఞానమే పరమాత్మ స్వరూపం. కనుక పరమాత్మతో అభేదం పొంది పరమాత్మలోనే లీనమగుట. విఘ్నరాజగు వినాయకుని పూజలోని అంతర్యమ్.

ఇట్లు ఇంకా అనేక కథలు గలవు

చివరగా-

గణపతి సహస్రనామాలలో:-

"జిహ్వాసింహాసనప్రభుః, లిపిపద్మాసనధరః వాణీజిహ్వః, శబ్దబ్రహ్మ" అని నామములు ఉన్నాయి. ఈ నామాల ఔచిత్యం చూద్దాము.

మానవునికి మాటలు నోటినుండి నాలుక ద్వారా సిద్ధిస్తున్నాయి. మాటలకు నాలుక ప్రధాన కారణం. నాలుక లేనిచో మూగతనమే. తెలుగులోని నాలుక, ఇంగ్లీషులో టంగ్, అట్లే ఇతర భాషలలోని పదాలు కేవల భౌతికమైన నాలుకనే చెప్పును. కానీ సంస్కృత పదమైన "జిహ్వ" సూచించు అర్థాలను పరిశీలించుదాము.

జిహ్వ - "హ్వేఞ్ స్పర్ధాయాం శబ్దేచ" అని ధాతువు నుండి పుట్టింది. శబ్దమును పుట్టించునది జిహ్వ. అట్లే "హ్వయతి రసవద్వస్తు శబ్దంవా"అని వ్యుత్పత్తి - రసవత్తర పదార్థములను తినగోరేది,శబ్దమునకు అధారం, శబ్దోత్పత్తికి కారణమైనది జిహ్వ. అని అర్థం.

ఆసనం అంటే ఆధారం. కనుక శబ్దమునకు (మాటకు) ఆధారం అంటే ఆసనం జిహ్వ. అనగా శబ్దానికి ఆసనం జిహ్వ. కనుక జిహ్వ అనే సింహాసనం మీద కూర్చొని యుండు ప్రభువు శబ్దము. ఆ శబ్దమే శబ్ద బ్రహ్మ. ఆ శబ్ద బ్రహ్మయే శ్రీమహాగణపతి. వాణి అనగా వేదవాణి యనెడి జిహ్వగల వాడని అర్థం. అంటే వేద వేద్యుడని తాత్పర్యము."అహంతే హృదయం రామ! జిహ్వాదేవీ సరస్వతీ" -రామాయణమ్, యుధకాండ. బ్రహ్మదేవుడు శ్రీరామునితో "నేను నీ హృదయమై, సరస్వతి జిహ్వయై కార్య సాధన చేశా"మని చెప్పిన మాటలివి.

లిపిద్వారా శబ్దము లేర్పడు చున్నవిగాన శబ్దబ్రహ్మయగు వినాయకుడు లిపియనే పద్మాసనంలో నిత్యం ఆసీనుడై యుంటాడని అర్థం.

పైగా క్షేమేంద్రకవి జిహ్వనిట్లు ప్రార్థిస్తున్నాడు.

"జిహ్వే! ప్రమాణం జానీహి భోజనే భాషణే2 పిచ"

ఓ నాలుకా! భోజనం, భాషణములలో నీ పరిమితిని ఎరిగి మనలుకో-అని అర్థం. దీనిని బట్టి జిహ్వకు మూషక లక్షణాలు గమనించవచ్చు. మూషకం ఏట్లు ఎవరికి తెలియకుండా స్తేనుని వలె పదార్థములు దొంగిలించి తన కన్నంలో పడవేస్తుందో, అట్లే జిహ్వయనే మూషికం (అంటే జిహ్వ చాపల్యం) చాటుగా తినకూడని వస్తువులను ఉదరం అనే కన్నంలో పడవేస్తుంది. అపై రోగాలు ప్రాప్తించటం, పరమేశ్వరసేవ, జిహ్వను అదుపులో పెట్టుకోవటం, తద్వారా ఆరోగ్యసిద్ధి గల్గును. వినాయకుడే జిహ్వఅనే మూషకమును అదుపులో పెట్టగల ప్రధానాతి ప్రధానదేవత. కనుకనే మూషక వాహనుడైనాడు. వినాయకునికి తప్ప జిహ్వ అనే మూషకం ఎవరి వశంలోను ఉండదు.

అట్లే మాటలాడునపుడు మాటలు జాగ్రత్తగా మాట్లాడాలి. పొరపాటున నాలుక జారితే అంతా నాశనానికి దోవ తీస్తుంది. ఇలా నాలుక జారటం గూడా మూషకలక్షణమే.

"జిహ్వాగ్రే వసతే లక్ష్మీః జిహ్వాగ్రే మిత్రబాంధవాః।
జిహ్వాగ్రే బంధనం చాపి జిహ్వాగ్రే మరణం ధ్రువమ్।

జిహ్వాగ్రే అనగా నాలుక మీద అని అర్థం. జిహ్వను బట్టి అనగా జిహ్వ మీద బుట్టు మాటల బట్టి సిరిసంపదలు కురుస్తాయి. స్నేహితులు, బంధువులు, ప్రేమానురాగాలు, బంధాలు, విరోధాలు తుదకు మరణం గూడ ఏర్పడతాయి.

కనుక జిహ్వను జయిస్తే ప్రపంచాన్ని జయించినట్లే!

జిహ్వను జయించాలంటే మానవప్రయత్నం చాలదు. జిహ్వను (అను) మూషకమును-వాహనంగా తన అదుపులో నుంచుకోగల్గిన భగవంతుని ఆరాధిస్తే మానవులకు సాధ్యం అగును. అందుకని నిత్యం వినాయకుని ప్రతిరోజు అర్చిస్తే - జిహ్వఅనే మూషకం అధీనంలో ఉంటుంది. తద్వారా మంచి మాటలు సిద్ధిస్తాయి. మంచి బుద్ధి సిద్ధిస్తుంది. అందుకనే అన్నారు "నోరు మంచిదైతే ఊరు మంచిది" అని. అలానోరు మంచిది కావాలంటే మూషికవాహనుడైన వినాయకుని అనుగ్రహం పొందాలి.

"అధరాహనుః పూర్వరూపం। ఉత్తరామను ఉత్తరరూపం । వాక్సంధిః । జిహ్వ సంధానం"

- తైత్తిరీయోపనిషత్.

వాక్కు రెండు పెదవులు కలిస్తేనే బయల్వెడలును. కనుక వాక్కు సంధ్యా స్వరూపము. జిహ్వ సంధానకర్త్రి, వాక్కు జిహ్వ అనే సింహాసనం మీద ఉండునది అర్థం. ఆ వాగ్దేవత "శ్రీమత్సింహాసనేశ్వరి" అని కీర్తింపబడుతోంది. ఆ వాగ్దేవతయే శబ్ద బ్రహ్మయగు వినాయకుడు.



# ఉగాది అంటే ఏమిటి?

మన ఆంధ్రుల పండుగలలో మొట్టమొదటిది ఉగాది. చాంద్రమానం లోనిది. ప్రతి యేట మొదటినెల, మొదటి పక్షం, మొదటివారం, మొదటితిథి- అనగా మొట్టమొదటి రోజున వస్తుంది. ఆరోజు చైత్రశుక్లపాడ్యమి. ఆ రోజున ప్రజలంతా పూజలతో, ఆనందోత్సాహాలతో గడుపుతారు. అసలీ ఉగాది అంటే ఏమిటి?

మామూలుగా ఉగాది అంటే సంవత్సరాది పండుగ అని ప్రసిద్ధి. "అహః సంవత్సరో వ్యాళః"- విష్ణు సహస్రనామాలు. "కాలాత్మనా స్థితః విష్ణుః సంవత్సరః" అని శంకర భాష్యము. కాలస్వరూపుడైన శ్రీమహావిష్ణువే సంవత్సరము. విష్ణువే కాలాత్మకుడై సంవత్సరమనే పేరుతో అవతరించాడు అని అర్థము.

ఉగమంటే జన్మ, ఆయుస్సు అని శబ్దరత్నాకర, సూర్యరాయాంధ్ర నిఘంటువులు. "ఉగము ద్రుంగించెదుదన్ " అని రాఘవ పాండవీయ నాటకము తెల్పుచున్నది. దీన్నిబట్టి ఉగాది అంటే ప్రపంచం యొక్క జన్మ ఆయుస్సులకు మొదటి రోజు అని అర్థము. ఉగాది అనేపదం తెలుగు, కన్నడ, సంస్కృత పదము గూడ. ఉక్+అది=ఉగాది. సంస్కృతవ్యాకరణం ప్రకారం "ఉక్" అంటే 'ఉక్' ప్రత్యాహారము. ఇది ఉ,ఋ,ౠ అనే అక్షరాలకు సంజ్ఞ, అనగా ఉ,ఋ,ౠ అనే అక్షరాలని అంటారు. ఉ అంటే శివుడనీ, ఉ అదిగా గలదేవత ఉగాది దేవత ఉమయని చెప్పెదరు. ఉమ అంటే పార్వతి, బ్రహ్మవిద్య. ఇంకా

"ఉత్తరజ్ఞా ఉత్తరాఖ్యా ఉకారా ఉత్తరాత్మికా।
ఋమాతా ఋభరా ఋస్థా ఋౠకార స్వరూపిణీ।
ఋకారా చ ౠకారాచ ౡ తక ప్రియ వాదినీ"

- అన్నపూర్ణా సహస్రనామములు.

అన్నపూర్ణా దేవి ఉ, ఋ,ౠకార స్వరూపిణియట. "ౠకారోదేవతాంబాయాం భువి కుధ్రే చ కీర్తితః" అని కోశముల ప్రకారం ఋ, ౠకారములకు దేవతల తల్లియైన అదితి, భూమి, స్వర్గము, పర్వతము మొదలైన అర్థాలెన్నో గలవు. కాన ఉగాది ఉమా, లేక బ్రహ్మవిద్య, అన్న పూర్ణాస్వరూపము. "భక్తి ప్రియాయ భవరోగ భయాపహాయ ఉగాయ దుఃఖభవ సాగరతారణాయ" అని స్తోత్రంలో శివుడు "ఉగః" అని చెప్పబడుచున్నాడు. కావున ఉగాది అంటే శివుడు ఆదిగా గలది అని అర్థము.

ఉగాది తెలుగు పదమైతే దాని సంస్కృతరూపం'యుగాది'. యుగాది ఉగాది గా మారింది. యుగశబ్దానికి అమర, వైజయన్తీ, నానార్థరత్నమాల, మేదిని, శాశ్వతాదికోశాలు- జంట,కాలము, సంవత్సరము, నాల్గుహస్తముల ప్రమాణము, కృతత్రేతాదియుగాలు, రథము లేక బండికాడి, ఓషధి మొదలైన అర్థాలనిచ్చాయి.

"అశ్రేయాన్ శ్రేయసీం జాతిం జాతిః గచ్ఛ త్యాసప్తమాద్యుగాత్"

- మనుస్మృతి. 10-64

ఆ సప్తమాద్యుగాత్ అంటే సప్తమ జన్మనః ప్రభృతి - అని వ్యాఖ్యానం ప్రకారము యుగమంటే జన్మ అని అర్థము " జాత్యుత్కర్షః యుగే జ్ఞేయః పంచమే సప్తమేఽ పివా"

- యాజ్ఞవల్క్యస్మృతి 1-96

యాజ్ఞవల్క్య మహర్షి గూడ యుగం అంటే జన్మ అని చెప్పాడు. కాన యుగాది అంటే జన్మాది. వ్యాసభగవానుని బ్రహ్మసూత్రాలలో "జన్మాద్యస్యయతః" అనేది రెండవ సూత్రము. ఆ జగత్తు యొక్క జన్మాది బ్రహ్మయని అర్థము.

'జననో జన జన్మాదిః భీమో భీమ పరాక్రమః' అని విష్ణు సహస్రనామములు జనుల జన్మాది శ్రీమహావిష్ణువని చెప్పుచున్నవి. యుగాది అంటే జన్మాది అంటే బ్రహ్మ, విష్ణువు అని అర్థం గోచరిస్తోంది. ఆప్టే, బ్రౌన్ నిఘంటువులు జన్మ, వయస్సు అని అర్థాలను చెప్పుచున్నాయి.

"పక్షోమాసోఽయనేవర్షాః యుగాః కల్పోమహాలయః ।"

- గణపతి సహస్రనామముల ప్రకారం. యుగమంటే గణపతి.

"యుగరూపో మహారూపో మహా నాగహనోవధః"

-శివ సహస్రనామముల ప్రకారం యుగము యొక్క రూపము శివుడట.

"అయనో వత్సరో యుగః"

- దక్షిణామూర్తి సహస్రనామాలు. యుగమనగా దక్షిణామూర్తియట

"యుగాకారం, యుగాధీశం యుగకృత్ యుగనాశనమ్"

- బిల్వాష్టోత్తరముల. రీత్యా బిల్వము (మారేడు) యుగాకారము, యుగకర్త, యుగనాశకములు.

"యుగాదికృత్ యుగావర్తో నైకమాయో మహాశనః" -విష్ణుసహస్రనామములు.

శ్రీమహావిష్ణువు కృతత్రేతాది యుగకర్త "యుగాది" కర్తగూడ.

"ఆదిరన్తోలయః కర్తా, ఆదిరాదికరోనిధిః" -శివసహస్రనామాలు.

అసలు ఆది శబ్దానికే శివుడని అర్థము.

"అధీత సాంగవేదోయః సోనూచానో యుగీ గణీః " - వైజయన్తీ కోశ 29-163.

యుగీఅంటే వేద వేదాంగవేత్త. సూర్య రాయాంధ్ర నిఘంటువు గూడ అంగీకరించింది. "యుగం అస్య అస్తీతివా" "యుగం అధీతఇతి వా" అని సమాసాల ప్రకారం యుగమంటే శిక్షాద్యంగములతో గూడిన వేదవాఙ్మయము అని స్పష్టము. ఇంకా యుగాది అంటే సృష్టికి పూర్వమే అవతరించిన వేదాలకు ఆదియగు 'ఓంకారము' అగును. వ్యాకరణ శాస్త్ర రీత్యా

ఉక్ ప్రత్యాహారంలో ఋక్ గూడ ఉన్నది. ఋక్ అంటే ఋగ్వేదము. ఉగాది అంటే ఋగాది గూడ. ఋగ్వేదానికి ఆది ఓంకారమే గద.

"యో వేదాదౌ స్వరః ప్రోక్తః" అని వేదమే వేదాది (వేదములకాది) ఓంకారమని ఘోషిస్తోంది. యుగాదియే వేదాది.

ఈ యుగశబ్దానికి దేవుడు, వేదము, రధము లేక బండి యొక్క కాడి యని అర్థములుండుటచేత పెళ్లిళ్లలో లగ్నం కాగానే వెంటనే వివాహ ప్రక్రియ యుగంతో ప్రారంభింప బడుతోంది. వరుడు నవ వధువు తలమీద యుగాన్ని (కాడి) ఉంచి ఆకాడి రంధ్రము ద్వారా అభిషేకించి ఆమెను పవిత్రురాలను చేస్తున్నాడు. 'యుజ్యత ఇతి యుగః, యోగః' అనే సమాసం, 'యుజిర్ యోగే' అనే ధాతువు ననుసరించి యుగమంటే యోగమని అర్థము. యుగమే యోగము. పరస్పరము కూడుకొని యుండునది, పరస్పరం కూర్చునది అని అర్థము. నూతన వధూవరులనెడి కొత్తజంట (యుగము) వేద, దేవస్వరూపమైన యుగము (కాడి) చేత కూర్చబడి, పరస్పరము కూడికొని యున్నవారై సరికొత్త యుగమును అనగా జీవితమును లేక జన్మను ప్రారంభిస్తారు. ఆ యుగము చేత యీ యుగము కూర్చబడి క్రొత్త యుగము నారంభించుటచేత కొత్త దంపతులకు పెండ్లిరోజు యుగాది - అదే వారికి నిజమైన, విలువైన ఉగాది.

"యుగం కృతయుగం చాత్ర చామర్షే 2త్ర ప్రయోజనమ్ ।
తద్యుగం యుగ సంకాశం రధ శీర్షే ప్రతిష్ఠితమ్॥"

-మత్స్యపురాణము, 131 అ.

యుగమంటే కృతయుగం. అది సత్యయుగం, ధర్మయుగం. జ్ఞానయుగం. ఈకృతయుగమే రధానికి కట్టే యుగం (కాడి) వంటిదట. అంటే రధానికి కట్టుకాడి సత్య, ధర్మ, జ్ఞాన స్వరూపము. కాబట్టి పెళ్ళిళ్ళలో యుగానికి ప్రాముఖ్యత వచ్చింది.

'అరాః సంవత్సరాః పంచ నేమయ ష్షృతవః స్మృతాః
రాత్రిర్వరూధా ధర్మశ్చ ధ్వజ ఊర్ధ్వం సముచ్ఛ్రితః॥
యుగాక్ష కోటీ తేతస్య అర్థకామావుభౌ స్మృతౌ॥"

-మత్స్య పురాణము 124-46.

సూర్యుడు రోజూ బంగారు రధం మీద తిరుగుతాడట. ఆ రధానికి సంవత్సర మనేది ఒకే ఒక చక్రము. నాల్గు వేదాలు గుఱ్ఱములు. ఋతువులు ఇరుసులు. ధర్మము ధ్వజము. యుగానికి (కాడి) ఉన్న రెండు కొనలు అర్థకామములు. ఇలా చాల వర్ణన ఉన్నది.

పెళ్లిలో కొత్త పెళ్లి కూతురును యుగము యొక్క రెండు కొనల రంధ్రముల నుండి అభిషేకిస్తారు గద! అరెండు కొనలు అర్ధకామాలు గద! ధర్మము ధ్వజము గద! లగ్నం సమయంలో నరుడు "ధర్మేచ అర్థే చ కామే చ నాతిచరామి - నాతి చరితవ్యా" - అంటే ధర్మము, అర్థము, కామము లలో నేనతిక్రమించను. నీవతిక్రమించచాదు అని ప్రమాణం చేస్తాడు. దానికి గుర్తుగా యుగము యొక్క రెండు కొనల నుండి జలధారలతో వధువు నభిషేకిస్తున్నాడు. ధర్మబద్ధమైన అర్థ, కామాలు వర్షించుగాక యని గూఢ యర్థము. ఇట్లు ధర్మార్థ కామములను వర్షించు దైవస్వరూపమైన యుగంతో వారంభింపబడుటచే వా వివాహము మంగళప్రదము. అ యుగారంభమే వివాహానికి యుగాది - ఉగాది.

బంగారు రథం మీద నున్న సూర్యుడు సంవత్సర చక్రాన్ని ఒడుదుడుకులు లేకుండా త్రిప్పుచూ ప్రపంచాన్ని కాపాడు చున్నట్లే జీవిత రధాన్ని దంపతులిద్దరూ యుగంధరులై, (అనగా ఆ రథం కాడిని ఇద్దరు భుజాలపై వేసికొని మోయుచూ) లాగుచూ, సంసార చక్రాన్ని ఒడుదుడుకులు లేకుండా, చక్కగా, సాఫీగా నడిపించు కొనుచు, కాపాడుకొందురుగాక!

"వారణాసీశ్వరీ సంవత్సరారంభ సుపూజితా"। యని సరస్వతి సహస్రనామాల ప్రకారం సంవత్సరాదినాడు పూజింపబడి ప్రీతి నొందెడి దేవత సరస్వతియట. అమెయే బ్రహ్మవిద్య- వేదమాత- ఈవిధంగా దేవతలంతా కాలస్వరూపులు. కాలము దైవస్వరూపము. ప్రతి సంవత్సరం ఉగాది నాడు పూజలందుకొని వేదమాత ప్రజలనను గ్రహించు గాక!

ఈ విధంగా ఉగ, యుగ, ఉగాది, యుగాది స్వరూపముల నెరిగి వైదిక యుగాన్ని ఆరాధిస్తూ, ఆ యుగము చేత రక్షింపబడుచూ ప్రతి సంవత్సరము ఉగాది పండుగ చేసికొంటూ ప్రజలు తరింతురు గాక!

'నమామ వేదమాతరమ్' అని ప్రతి ఇంటిలోను ప్రతి ఉగాదినాడు మ్రోగాలి.



# ఓం అథ - ఓం అథ - ఓం అథ.

వేదాది యందుగల స్వరము ఓం కారము. వేదమంత్రములు, పరమేశ్వరుని నామములు (విష్ణు, లలిత, శివ ) ఓం కార పూర్వకముగ నుచ్చరింపబడుచుండును. ఓం శివాయ నమః, ఓం శ్రీ మాత్రే నమః, ఓం విశ్వస్మై నమః అని ఓం కార పూర్వకంగా నమాంతములగు నామములు మంత్రములేయగును. కనుక ఓంకారము మహా మహిమోపేతమగు మంత్ర రాజము.

వేదము ఓంకారముతో "శ్రీగురుభ్యోనమః హరిః ఓం" అని నారంభింపబడునట్లుగా శాస్త్రములు అథ అను శబ్దముతో నారంభింపబడుచున్నవి. యోగశాస్త్రము-అథ యోగాను శాసనం, పూర్వ మీమాంసా శాస్త్రము-అథాతో ధర్మ జిజ్ఞాసా, ఉత్తర మీమాంసా శాస్త్రము-అథాతో బ్రహ్మ జిజ్ఞాసా, ఇంకా అథ శబ్దాను శాసనం అని "అథ" తో పాతంజల మహాభాష్యా రంభమగుచున్నది. వేదాంత శాస్త్రము, భగవద్గీతా ప్రవచనముల ముందు ఓం అథ-ఓం అథ-ఓం అథ యని మూడు పర్యాయములు ఉచ్చరించటం సాంప్రదాయము.

"ఓం అథ" ల వైశిష్ట్యమేమి?

ఈ రెండును సృష్టికి పూర్వమే బ్రహ్మదేవుని కంఠమును ఛేదించుకొని బయల్వెడలినవి అనగా ఆవిర్భవించినవి గాన నీ రెండు పదములు మంగళకరములు అని యీ క్రింది శ్లోకము పఠింప బడుచున్నది.

"ఓంకారశ్చాథ శబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా
కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళి కావుభౌ"

"ప్రణవశ్ఛందసామివ" అని కాళిదాసు చెప్పినట్లుగా ఓంకారము మహామంగళకరమైనది. అథ శబ్దము యొక్క మంగళ కారిత్వమును చూతము - అథశబ్దము అర్థ - యాచ్ఞాయాం అను ధాతువు నుండి పుట్టినట్లు అమరసుధ తెల్పుచున్నది.

"అథ - అర్థయతే - అర్థ యాచ్ఞాయాం
అన్యేభ్యోఽపి ఇతి డః । పృషోదరాదిత్వాద్రలోపః"

- (అమర సుధ-3-3-247 )

అర్థయతే అనే ధాతువుకు డ ప్రత్యయం వచ్చి అర్థ అయింది.రేఫ లోపించి అథ శబ్దము పుట్టింది. కనుక అథశబ్దము అర్థ శబ్దమునకు ప్రతిరూపమే. అర్థశబ్దము పరమార్థ బోధకము.

శాస్త్రములన్నిటి తాత్పర్యము పరమార్థ దర్శనము. కనుక శాస్త్రారంభమున అథ శబ్ద ప్రయోగము శాస్త్ర తాత్పర్యభూతమగు పరమార్థ సంస్మరణ యగును. పరమార్థ సంస్మరణ మంగళకరమే. కనుక వేదశాస్త్రములు మంగళాదీని,మంగళమధ్యాని, మంగళాంతాని యను

వ్యాయము ద్వారా సార్థకములగుచున్నవి. మంగళముతో వారంభిపబడి, మధ్యలోను , చివర కూడ మంగళముతో ముగియబడుటచే నవి మాంగళికములై లోకమునకు మంగళము లనిచ్చెడి మంగళదేవతలగుచున్నవి.

వేదమునకు శాస్త్రమని పేరు."తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం" అని శంకర భగవత్పాదులు శాస్త్రమగువేదము ప్రమాణమని అనేక పర్యాయములు వేదమును శాస్త్రమని అనిరి. శాసించునది శాస్త్రము. "శాస్తీతి శాస్త్రమ్." వేదతాత్పర్యమును బోధించుట కవతరించిన శాస్త్రములు గూడ (దర్శనములు) శాస్త్రములే. ఈ శాస్త్రములు పౌరుషేయములు. కాని వేదమపౌరుషేయ శాస్త్రము. అపౌరుషేయ శాస్త్రమగు వేదాది యందుచ్చరింపబడెడి ఓంకారము నామరూపము. అనగా శబ్ద రూపము. అనగా వాగ్రూపము. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" పౌరుషేయ శాస్త్రాదులందు ఉచ్చరింపబడు అథ శబ్దము అర్థరూపము - రూపాత్మకము.కనుక ధీరుడగు జ్ఞాని యీ ప్రపంచమును వాగర్థ రూపముగదర్శించునని, తెలియును. కాళిదాస మహాకవి యొక్క "వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతి పత్తయే" అను శ్లోకము "ఓం అథ" శబ్దములకు తాత్పర్యమగుచున్నది."సర్వాణి రూపాణి విచిత్యధీరః , నామాని కృత్వాఽభి వదన్ యదాస్తే" అని వేదము - ప్రపంచము నామరూపాత్మకమని, అనామ రూపములు కల్పితములనీ, నామ రూపములు లేనపుడు ఉందునది బ్రహ్మ యొక్కటే యనిబోధిస్తున్నది. అట్టి యా నామరూప సంస్మరణకై ముందుగా బ్రహ్మనుండి "ఓం అథ' ' అను శబ్దములావిర్భవించినవి. ఓంకారము పరమేశ్వరుని వాగ్రూపమును, అథ శబ్దము పరమేశ్వరుని పరమార్థ రూపమును తెలియజేయును. ఇట్లు నీ రెండు శబ్దములు పరమేశ్వరుని వాగర్థతత్త్వ బోధకములగుచున్నవి.

**అథ శబ్దము - కోశములు :-**

1. మంగళానన్తరారంభ ప్రశ్న కార్త్స్న్యేష్వథో అథ.

*- అమర సుధ 3-3-247*

2. అథాథో సంశయే స్యాతాం అధికారే చ మంగళే ।
   వికల్పానంతర ప్రశ్న కార్త్స్న్యారంభ సముచ్చయే ॥

*- మేదినీ కోశ 181-35*

3. అథాఽథోఽనంతరాప్యర్థ వికల్పారంభ మంగళే

*- వైజయన్తీ కోశ*

ఇట్లే కోశములు మంగళము, తరువాత, ప్రారంభము,ప్రశ్న, అంతం,అధికారము, వికల్పము, సంశయము అనే అర్థములను తెల్పుచున్నవి. అయితేఅథ శబ్దమునకు మంగళము అను అర్థము గ్రహించుట శాస్త్రవిదుల సంప్రదాయము గాదు. ఈ విషయమును

శారీరక మీమాంసా భాష్యంలో శ్రీ శంకరులిట్లు వివరించిరి.

"మంగళస్య వాక్యార్థే సమన్వయా భావాత్
అర్థాంతర ప్రయుక్త ఏవ హ్యథ శబ్దః శ్రుత్యా మంగళ ప్రయోజనోభవతి" - అని.

ఉదాహరణ ద్వారా ఈ శంకరుని వాక్యములర్థమగును - అథాతో బ్రహ్మ జిజ్ఞాసా అని బ్రహ్మ సూత్రములో అథ శబ్దమునకు మంగళమని యర్థము తీసికొన్నచో "బ్రహ్మజిజ్ఞాసా మంగళం" అని వాక్యమేర్పడును. అనగా బ్రహ్మను గూర్చిన జిజ్ఞాస మంగళము అని అర్థము గల్గుచున్నది. కాని అథాతో బ్రహ్మజిజ్ఞాసా అను సూత్రమిట్టి అర్థము నివ్వదు. కనుక అథ శబ్దమునకు మంగళమని అర్థమును తీసికొనరాదని తేలినది. అయితే అథ శబ్దమునకు మంగళార్థమును గ్రహించనిచో గ్రంథము మంగళముతో నారంభింపని దోషము వచ్చును. ఈ దోషము నివారించుటకై అథ శబ్దము మంగళమని అర్థంతో కాకున్నను, మరియే యితరా ర్థములో ప్రయోగించబడిననూ అథ శబ్దమును విన్న మాత్రంతో (శ్రుత్వా) మంగళమను ప్రయోజనము సిద్ధించును. కాన దోషములేదని శంకరాచార్యులవారు బోధించిరి. కావున ఓంకారమును వలె అథ శబ్దమును వినుటచేతనే మంగళము సిద్ధించును.

అథ శబ్దములోని అకార, థకారముల ప్రాశస్త్యము :-

ఓంకారము అ ఉ మ్ ల సముచ్చయము. కాన అ అను అక్షరము ఓం కారము యొక్క ప్రథమావయవమట.ఈ అకారముద్వారా వాక్కు ఓంకారమునందంతర్భూతమగునని ఐతరేయశ్రుతి ఇట్లు చెప్పుచున్నది.

"అకారో వై సర్వావాక్ । సైషా స్పర్శోష్మభిః వ్యజ్యమానా బహ్వీ నానారూపా భవతి"

రూపమేలేని పరమేశ్వరుడు విశ్వమందలి సమస్తరూపములలోను వ్యాపించి యా రూపములను అభివ్యక్తము గావించినట్లు, కకారము మొదలుకొని హకారము వరకు అన్ని హల్లులందును అకారము వ్యాపించి హల్లులను అభివ్యక్తము గావించుచున్నది. కావున అకారము నిఖిల వాగ్రూపము.

"అక్షరాణా మకారో2 స్మి" -భగవద్గీతా

"అకారః సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమః శివః" -వరివస్యారహస్యమ్.

అక్షరములలో అకారము నేనేయని కృష్ణపరమాత్మ చెప్పినాడు. "అ కారో విష్ణురుద్దిష్టః" అకారము సమస్త వర్ణములను ప్రకాశింపజేసెడి పరమశివ స్వరూపమని వరివస్యా రహస్య గ్రంధము తెల్పుచున్నది. "అశబ్దః వాసుదేవే" అని మేదినీ కోశము.

ఇట్లు సర్వవ్యాపకత్వ విభూతి సంపన్నమగు అకారము వాసుదేవ, మహేశ్వర స్వరూపాత్మకము.

ధకారము :-

సామవేదమున ఉద్గీథ సామమని గలదు. సామమునకు గల అయిదు అవయవములలో ఉద్గీథమొకటి. ఉద్గీథము యొక్క అవయవము ఓంకారము.

"ఓ మిత్యేతదక్షరముద్గీథముపాసీత" - ఛాందోగ్యోపనిషత్.

ఈ ఉద్గీథ శబ్దావయవములు ఉత్-గీ-థ యను అక్షరములు. ఉత్ అనగా ప్రాణము, ఊర్ధ్వ గమనము, ఔన్నత్యము అని అర్థము. గీ అనగా వాక్కు.
అన్నం థమ్ - థకారము ఆలంబనము, ఆధారము, అన్నము అను అర్థముల బోధిస్తున్నది.

"ప్రాణఏవోత్ । వాక్ గీః । అన్నం థమ్ ।
అన్నే హీదం సర్వం ప్రతిష్ఠితమ్"

ప్రపంచమునకు ఆధారము అన్నం కనుక ఆ అన్నము థకారముచే చెప్పబడుచున్నది. ఇంకా ఉత్ అనగా ఆకాశము, సూర్యుడు, సామవేదమనీ, గీః అంటే అంతరిక్షము, వాయువు, యజుర్వేద మనీ,
థం అంటే భూమి, అగ్ని, ఋగ్వేదమనీ ఛాందోగ్యోపనిషత్ చెప్పుచున్నది.

"ద్యౌరేవోత్ - ఆదిత్య ఏవోత్ - సామవేద ఏవోత్ ।
అంతరిక్షం గీః - వాయుర్గీః - యజుర్వేదో గీః ।
పృథివీ థం - అగ్నిః థం - ఋగ్వేదః థం ॥"

-ఛాందోగ్య-1-3-6-7

ఇవ్విధముగ ఓంకారావయవమగు అ కారమును ఉద్గీథలోని థకారమును - కలిసి అథ శబ్ద రూపమేర్పడినది - అకారము పరమ శివస్వరూపము, థ కారము ఆధారము అనగా పానువట్టము అని అర్థములు (అకారః పరమః శివః థకారః ఆధారః) తీసికొనుట ద్వారా అథ శబ్దము నిఖిల జగత్తులకు ఆధారభూతమైన పరమ శివ తత్త్వమును దర్శింపజేయుచు మంగళ కరమగు చున్నది. అట్లు "అథ" అను శబ్దశ్రవణమే మంగళకరము.

ఇతిశమ్



# సిద్ధ సమాధి యోగము

సమాధి అంటే అంతః కరణము అనగా మనస్సు. సిద్ధమైన మనస్సుతో యోగము సాధ్యమగును. యోగం సిద్ధించాలంటే అందుకు మనస్సును సిద్ధపరచాలి అంటే సమాయత్తం చేయాలి. సమాధానపరచుకోవాలి. మనస్సును ప్రసన్నం చేసుకోవాలి. నిత్యం కల్లోలభరితము చంచలంగా ఉండే మనస్సును గుఱ్ఱానికి కళ్లెం వేసినట్లు కళ్లెం వేసి పట్టి ఉంచితే గాని ప్రశాంత స్థితికి రాదు. ఇంకా వ్యామోహజనకములు, దుఃఖ పూరితవిషయాలు, భోగాదులచే నాకర్షింపబడు మనస్సును అరికట్టుట భగవంతుని వైపుత్రిప్పుట యోగము యొక్క ప్రధాన లక్ష్యము.

భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృత చేతసామ్ ।
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే ॥ - *భగవద్గీత 2-44*

భోగములు, ఐశ్వర్యములందు తీవ్రమైన ఆసక్తి గల్గి, వాని చేత నాకర్షింపబడు మనస్సు గల వారికి యోగసిద్ధి సమాధిలో ననగా మనస్సులో కుదరదని యర్థము. కనుక భోగాది విషయములను చిత్తము నుండి పారద్రోలుట, నిరోధించుట యోగము. "యోగశ్చిత్తవృత్తి నిరోధః"అయితే చిత్తములో ఇతర విషయముల నిరోధము సాధ్యమా? అంత తేలికా?

అర్జునుడంతటివాడే కృష్ణునితో
"చంచలం హి మనః కృష్ణ ప్రమాధి బలవత్తరం ।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥" - *భగవద్గీత.*

అనగా నామనస్సు మిక్కిలి చంచలమైనది. ప్రచండ వాయు వేగమును నివారించుట ఎంత కష్టమో చంచల మనోవేగమును నిగ్రహించుట అంత దుస్సాధ్యమని చెప్పినాడు.

1. బలవానింద్రియగ్రామ ః విద్వాంస మపికర్షతి.
2. ప్రమాదోధీమతామ ః అనగా ఎంతటి విద్వాంసునైనా బలీయమగు ఇంద్రియములు, మనస్సు పడతోస్తాయి అని అర్థము.

అట్లే శ్రీశంకర భగవత్పాదులు గూడ ఎంతటి యోగికైనను మనోనిగ్రహము దుర్భరమని శివునకు నివేదించుకొనినాడు.

"కపాలిన్! భిక్షో! మే హృదయకపిమత్యన్త చపలం ।
దృఢం భక్త్యా బద్ధ్వా శివ! భవదధీనం కురు విభో ॥" - *శివానందలహరి*

మనస్సు ఒకకోతి. కోతి వలె యథేచ్ఛగా సంచరిస్తూ ఉంటుంది. నిలుకడ ఉండదు. లేదు. స్వామీ! నీవు భిక్షకుడవు. బిచ్చగాడు కోతి మెడకు త్రాడుగట్టి తనవెంట తీసుకొని పోవునట్లు భిక్షకుడవైన నీవు గూడ కోతి వంటి మనస్సును 'భక్తి' అనెడి త్రాటితో దృఢంగా

కట్టి నీయధీనం చేసికొమ్మని శ్రీశంకరులు ప్రజా శ్రేయస్సు కోసం ప్రార్థించిరి. కనుక మనస్సున అన్యవిషయములను రానీయకుండగా నిరోధించి ఆ మనస్సును భగవదధీనము చేయటం, అనగా మనస్సును భగవంతునిలో లీనము చేయటం అనగా మనస్సును భగవంతునితో కలుపుట - ఐక్యము చేయటం - ఏకం చేయటం - యోగము.

"అన్యధర్మస్తతో2న్యత్ర లోక సీమానురోధినా ।
సమ్యగాధీయతే యత్ర స సమాధిః స్మృతః యథా"- అని కావ్యాదర్శవచనం.

అనగా ఒక దాని ధర్మమును మరియొక దాని యందు ఆరోపించటం సమాధియగును అని అర్థము. అనగా ఆ రెండు ధర్మముల ఏకత్వం సమాధి లక్షణము.

మనస్సును సమాహితం అనగా సమాధి స్థితికి తీసికొని రావటం సమాధానపరచుకోవటం అనగాప్రసన్నం చేసి కోవటానికి మొదటి నుండి యోగాభ్యాసము చేయాలి. మొదటి నుండి అభ్యాసం చేస్తే గాని మనస్సుకు యోగము పరిచితముగాదు. యోగం సిద్ధించాలంటే ముందు వేదోక్త, విధ్యుక్త కర్మలు ఆచరించాలి. యోగమునకు కర్మాచరణం కారణము.

"ఆరురుక్షోర్మునే ర్యోగం కర్మ కారణముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే" *-భగవద్గీత 6-3*

యోగమును సాధించాలంటే ముందు కర్మలనాచరించాలి. అపుడా సమాధి సుకర మగును. "సమాధిః సుకరం కార్యం" అని కావ్యప్రకాశ అను అలంకార గ్రంథము పై అర్థాన్నే చెప్పినది. అపుడా యోగికి చిత్తశాంతి, చిత్తశుద్ధి ఏర్పడును.

తరువాత క్రమముగ యెట్టి ఫలమును కోరక కర్మలను పరమేశ్వరార్పణ చేయాలి. ఫలములనాశించక పోవటం అంటే కోరికలను క్రమక్రమముగా త్యాగం చేయటమే గదా! ఇది సామాన్య విషయం గాదు. ఉపదేశించటం తేలిక ఆచరణ కష్టము. మనస్సును వ్యామోహ పరచునవి కోరికలు. ఆ కోరికలు, ఫలముల వెంట పరుగెత్తరాదు. కనుక విధ్యుక్త కర్మల వాచరించుచు, కర్మల ద్వారా ఫలములనపేక్షించకుండ, ఆ కర్మలను భగవదర్పణము చేయట్టం యోగలక్షణము. దీనిని కర్మయోగమంటారు. ఫలములు స్థిద్ధించవచ్చు సిద్ధించక పోవచ్చు. ధనము రావచ్చు రాకపోవచ్చు సుఖము రావచ్చు. దుఃఖము కలుగవచ్చు. అట్టి ఫలాఫలములందు, సుఖదుఃఖములందు, లాభాలాభము లందు సమత్వబుద్ధి యోగము.

"యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ"
"సిద్ధ్య సిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగఉచ్యతే"
"సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ" - *భగవద్గీత.*

ఇట్లు సుఖదుఃఖములందు, ఫలాఫలములందు సమబుద్ధి గల్గి కర్మలవాచరించుటను "కౌశలం" అని అంటారు. కర్మలలో కౌశలమును యోగమంటారు.

"యోగః కర్మసు కౌశలమ్" - భగవద్గీత

యోగమనగా కర్మలందు సమబుద్ధి గల్గి యుండుట. కౌశలం అంటే కర్మల నాచరించ టంలో నేర్పు అని అర్థము.

భగవంతుడు సర్వాంతర్యామి. నిఖిల మానవులు, జంతువులు, పక్షులు, వృక్షములు మొదలగు ప్రాణులందరిలోను వ్యాపించి యున్నాడని శివ, విష్ణు సహస్రనామములు తెల్పుచున్నవి. వివిధ రకములైన పుష్పములను సూత్రముతో గ్రుచ్చిన నది 'మాల' యగును. అపుష్పమాలలోని వివిధ పుష్పములలోని సూత్రము ఒక్కటియే. అట్లే వివిధరకములు, జాతులునగు మానవులలో వ్యాపించి యున్న భగవత్స్వరూపమును దర్శించుటయే యోగము. శరీరములు భిన్నములు, రక్తమాంసములు భిన్నములు. భిన్నములలో నేకత్వమును, ఒకే ఒక భగవత్స్వరూపమును దర్శించి, ప్రేమించుట యోగము. కేవల భౌతిక శరీరములను దర్శించి అందరు ఒక్కటియే సమానమని భావించుట భ్రాంతియే. అట్లు గాక అందరిలోను భగవత్స్వరూపము సమానము, ఒకటే. అట్లు అందరిలోను సమానమగు భగవత్స్వరూపమును దర్శించి, వారందరినీ ప్రేమించుటయే సమత్వము. ఆ సమత్వమే యోగము. "సమత్వం యోగఉచ్యతే" మా అంటే లక్ష్మి, మయాసహితః సమః. అనగా లక్ష్మితో గూడినవాడు 'సమః' అగును. సమః అంటే బ్రహ్మ అని శంకరుల భాష్యము కాన సమత్వమంటే అందరిలోను దేవుని-బ్రహ్మను చూడటమర్థము. "అందరు సమాన"మనెడి భావము తప్పు. అట్లు మానవసేవయే మాధవ సేవ. అందును మరల ప్రయోజనమును, ఫలమును, ధనమును కీర్తిని, పదవిని ఆశించక కేవలం నిఃస్వార్థసేవయే నిజమైన యోగము. ఆ నిఃస్వార్థ సేవయే మొదట చెప్పిన కర్మాచరణము - కర్మకౌశలము.

"యోగః కర్మసు కౌశలమ్" కౌశలం అంటే కుశల భావము అంటే ఇచట శంకరభాష్యము-

"యోగో హి కర్మసు కౌశలమ్ । స్వధర్మాఖ్యేషు కర్మసు వర్తమానస్య యా సిద్ధ్యసిద్ధ్యోః సమత్వ బుద్ధిః - ఈ శ్వరార్పిత చేతః - తయా తత్కౌశలం కుశల భావః - తద్ధి కౌశలం యత్ బంధ స్వభావాన్యపి కర్మాణి సమత్వ బుద్ధ్యా - స్వభావాన్ని వర్తన్తే । తస్మాత్ సమత్వబుద్ధి యుక్తో భవత్వమ్" వివరణము -

యోగమనగా కర్మాచరణ మందు నేర్పరితనము. తన విధ్యుక్త ధర్మములు, కర్మల యందు ప్రవర్తించువానికి, కర్మఫలసిద్ధిగాని అసిద్ధిగాని ఈ రెంటియందు సమాన బుద్ధి గల్గి యుండటము, ఫలాపేక్ష లేకుండా ఈశ్వరార్పణ చేయుచూ కర్మల వాచరించుట యందు నేర్పరి తనమున్నూ యోగమని చెప్పబడును. అని అర్థము.

ఈ విషయాన్నే మరల భగవద్గీత స్పష్టం చేస్తోంది.

"యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున ।

కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే॥" -భగవద్గీత -3-7

ఇంద్రియములను మనస్సుని నిగ్రహించి, కర్మల యందసక్తులై అనగా ఆసక్తి లేనివారై, కర్మల నాచరించు కర్మయోగి ఉత్తముడని అర్థము. అపుడు నిఃస్వార్థసేవ ద్వారా, స్వార్థము, గర్వాహంకారాదులు, అభిమానము మొదలగు వానిని త్యాగం చేయాలి. అనగా మనస్సును వాని నుండి మరలునట్లు చేయాలి. అట్టి దుష్ట వృత్తులనుండి నివారించటమే, చిత్తవృత్తి నిరోధమే యోగము. "యోగః చిత్తవృత్తి నిరోధః" మనస్సును చాంచల్య రహితముగ చేసికొనుటయే యోగము. అపుడు చిత్త శుద్ధిగల్గును. మనస్సు అద్దము వంటిది. మాలిన్యము పోగొట్టి పరిశుద్ధము చేయబడిన అద్దములో ప్రతిబింబము స్ఫుటముగా కనపడునట్లు, దుష్టవృత్తుల నుండి నివారితమైన మనస్సు పరిశుద్ధము, శాంతము అయిన తర్వాత దానిని పరమేశ్వరాభిముఖము చేసికొన్నచో అపుడా మనస్సులో చైతన్య స్ఫూర్తి బాగా కల్గుతుంది. పరమేశ్వరుని బింబం ప్రస్ఫుటంగా కానవస్తుంది. అపుడు ఏ చింతలేని మనస్సు దేవమయమై దివ్యమగును. అట్లు దివ్యత్వం సాధించాలంటే సంయమనం పాటించాలంటే అన్ని ఇంద్రియములను విషయముల నుండి నిగ్రహించాలి. ప్రాణాపాన వ్యానాది వాయువులను గూడ నియమించాలి. దీనికి ప్రాణాయామం అని పేరు. ఇంక యోగాసనాదులు రక్తశుద్ధిని చేసి మనస్సును, వాక్కును, దేహమును గూడ శుద్ధి పరుస్తాయి. ఈ విషయాన్నే 'సంయమ నాద్దివ్యం' అని యోగసూత్రము బోధిస్తోంది. ఇంకా ఆహారము ప్రధానము. రాజస, తామసా హారములు, మనస్సును, దేహమును, వాక్కును శాంతపరచవు. రాజస, తామసప్రవృత్తులను కలిగించును. సాత్త్వికాహారము (పచ్చికూరలు, కందమూల ఫలాదులు) సాత్త్విక ప్రవృత్తిని గలిగించి మనోవాక్కాయములకు శాంతిని శుద్ధిని సమకూర్చును. అందుకే పూర్వం ఋషులు, మహాత్ములు తపస్సు చేయుటకు కందమూలములను మాత్రమే తినెడివారు.

"ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః" సత్త్వమంటే మనస్సు, ఆహారశుద్ధిచే మనశ్శుద్ధి సిద్ధించును. ఆ ఆహారమును గూడ యుక్తముగాను, నియమము గాను స్వీకరించాలి. నియమపాలన చేయాలి.

"యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్యకర్మసు
యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా"
నాత్యశ్నతస్తు యోగో2 స్తి నచైకాంత మనశ్నతః ।
న చాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవచార్జున ॥" - భగవద్గీత 6-16-17

నియమితాహార విహారములు, నియమిత చేష్టలు, కర్మలు, నియమితములైన నిద్ర, జాగరణము ఉన్నవార్కి యోగము సులభసాధ్యము. అట్లు గాక యధేచ్ఛా విహారము, ఆహారము, కర్మలు, జాగరణము, నిద్ర - యివి యోగమును సిద్ధింపజేయక దుఃఖకారకము లగును. యోగభ్రష్టుని చేయును. ఇంకా

. తిండిపోతుకు యోగము లేదు. రాదు. భోజనం మాని కేవలం ఉపవాసమున్నను యోగసిద్ధి కుదరదు. ఉపవాసమనగా ఉప - దేవునివద్ద, వాసం - మనస్సును ఉంచుట. అంతేగాని "నతుదేహస్యశోషణం" దేహమును ఎండ పెట్టుట గాదు. జ్వరాదిరోగములు, వ్యాధులు వచ్చునపుడే లంఖణము చేయాలి. ప్రధానంగా స్త్రీలు అట్టి లంఖణం చేయరాదు. మానవులందరూ బాగా తినాలి, చదవాలి, పనిచెయ్యాలి, కష్టపడాలి, కర్మాచరణ చేయాలని యోగశాస్త్రం చెప్పుచున్నది. పనులు మాని జపం చేయరాదు అని హెచ్చరిస్తోంది. అయితే ఏదైనా నియమంగా, మితంగా, యుక్తంగా ఉండాలని అంటున్నది. అతివృష్టి అనావృష్టి కూడదు. ఇంకా మిక్కిలి నిదురపోతుకు, పొద్దస్తమానం నిద్రించువానికి యోగము దుస్సాధ్యము, అసలు నిద్రలేకుండ జాగరణము చేయువారికిన్నీ యోగము లభింపదు. కనుక జాగ్రత్స్వప్నములు గూడ నియమంగా ఉంటే యోగము సులభము. అని భగవద్గీత చెప్పుచున్నది.

అట్లు కర్మయోగము ద్వారా మనస్సును పరమేశ్వరాభిముఖము పరమేశ్వరాయత్తము చేసి ధ్యాన యోగము నలవర్చుకోవాలి. ఆ తర్వాత జ్ఞానయోగము. తుదకు అభ్యాసము, జ్ఞానము, వైరాగ్యము (కోరికలు లేకుండుట, భోగాదుల పట్ల విముఖత) వీని ద్వారా మనస్సు ఉపరతి స్థితిని అనగా శాంత స్థితిని బొందును. అపుడా మనస్సులో నేవిధమగు చింతలేని స్థితి యేర్పడును. అదియే సమాధిస్థితి. "సమ్యక్ ఆధీయతే మనః ఇతి సమాధిః" - అనగా మనస్సును పూర్తిగా భగవంతుని యందుంచుటయే లగ్నము చుయుటయే సమాధి. అనగా మనస్సును భగవదధీనము చేయుటయే సమాధి. అనగా మనస్సు సమాహితము, ప్రసన్నము గానుండును. మనస్సు సమాధానపడినదన మాట. అట్టి సమాధి స్థితిలో నున్నవారినే 'ముని' యని యందురు. ప్రశాంత, ప్రసన్న స్థితియే సమాధి.

ఇంకనూ "సంయోగో యోగ ఇత్యుక్తః జీవాత్మ పరమాత్మనోః"

జీవాత్మ పరమాత్మల సంయోగమే యోగము. అనగా జీవుని మనస్సును పరమాత్మతో సంధానం చేయటమే యోగమని తాత్పర్యము. అట్లే రెండు మనస్సులు ఎచట కలియునో (unity) ఆ కలయికకే యోగమని పేరు.

భారతీయ సాంప్రదాయ రీత్యా వివాహము యోగము. పేరుకు 'సుబ్బారావు సుబ్బలక్ష్మి' అనువ్యక్తులకు వివాహము గౌణము. ఆ వివాహమున "లక్ష్మీనారాయణయోర్యోగ ఇవ యోగః అనయోర్దంపత్యోః భూయాత్" అని ఆశీర్వదిస్తారు. లక్ష్మీస్వరూపిణి యగు యీ కన్యను, నారాయణ స్వరూపుడగు యీ వరునకు ఇచ్చుచున్నారని చెప్పుదురు. కావున యీ వివాహము లక్ష్మీనారాయణులదే. ఈ వ్యక్తులకు గౌణము. కావున లక్ష్మీ నారాయణులకు గల యోగ మీ దంపతులకు సిద్ధించుగాక! అనియర్థము. ఆ యోగమెట్టిది? ఆ యోగమును

కాళిదాసమహాకవి "సంపృక్తత్వం" అని అన్నాడు. అనగా విడదీయలేని, విడిపోని స్థితి శాశ్వతంగా కలిసి ఒకటిగా ఉండు స్థితి. లక్ష్మీదేవిని వేదమాతయని (వాక్), నారాయణుః వేదవాక్కుచే ప్రతిపాదింపబడు, చెప్పబడు అర్థముగా (పదార్థముగా) వర్ణించినాడు.

"వాగార్థావివ సంపృక్తౌ పార్వతీపరమేశ్వరౌ" -రఘువంశము

వాక్కు, అర్థములవలె పార్వతీ పరమేశ్వరులు, లక్ష్మీనారాయణుల కలయిక నిత్యమః శాశ్వతము. అట్లు కేవల శారీరక సంయోగము కాక, దంపతుల మనస్సంయోగమే యోగమః మరొక చోట పార్వతీ కళ్యాణ సందర్భమున హిమవంతుడు పరమేశ్వరుని పార్వతితో యోజః చేయవలసిందిగా సప్తర్షులను ప్రార్థిస్తాడు ఎలా? అర్థమును వాక్కుతో యోజించినట్లుగా

"తమర్థమివ భారత్యా సుతయా యోక్తు మర్హసి"

వాక్కు, అర్థముల యోగము వంటిది పార్వతీపరమేశ్వరుల సంయోగము. ఇట్ట భారతీయ సంప్రదాయమునందలి వివాహమే, దంపతుల సంయోగము - యోగము. ఇc సంయోగమనగా శరీరముల సంయోగము కాదు మనస్సుల సంయోగము. అట్లే వివాహముః వధూవరుల కుటుంబముల సంయోగము ఏర్పడుచున్నది. ఆ సంయోగమే యోగమః గొప్ప యోగము. మానవులందరు సంఘముగా నేర్పడినచో యోగము సులభము. ఆ మానవుఁ చిత్త శుద్ధి గల్గి యుండవలెను. ఆ మానవుల మనస్సుల సంయోగమే - సంఘమే - యోగమ అట్లే పలు రకమానవుల మనస్సుల సంయోగము గూడ. అందుకే అన్నారు "సంఘేశక్తి కలౌయుగే" అని. ఇంకనూ, ఒకచోట కందులు, మినుములు, ఉలవలు కలిపి ఉంచిః వానిని విడదీయవచ్చును. పాలు, నీళ్ల కలిపినచో విడదీయలేము. ఇట్టి ఈ కలయి యోగమగును.

"యోగః జ్ఞానం, యోగః సమాధిః, స్వమాత్మానం ఆత్మని సమాధత్తే ఇతి"

అని శంకరభగవత్పాదుల వారు యోగమనగా జ్ఞానము, సమాధి అని తమ భాష్యమః ద్వారా తెల్పిరి. తనమనస్సును తన ఆత్మయందే సమాధాన పరచును గనుక యోగమః సమాధి యగునని చెప్పిరి. మనస్సుకు సరియగు సమాధానం యోగములో సిద్ధించును ( సమాధానమే సమాధి యోగము గనుక అందరు యోగాభ్యాసము చేయాలి. అని గీః ప్రబోధము.

"అభ్యాసేన చ కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే" - భగవద్గీత
"యోగః యోగవిదాం నేతా ప్రధానపురుషేశ్వరః"

అని విష్ణుసహస్రనామముల ద్వారా శ్రీమహావిష్ణువే యోగస్వరూపుడు. ఇచట శంకః చార్యుల వారు

జ్ఞానేంద్రియాణి సర్వాణి నిగృహ్య మనసా సహ ।
ఏకత్వభావనా యోగః క్షేత్రజ్ఞపరమాత్మనోః ॥ - శంకరభాష్యము.

అని చెప్పిరి. అన్ని ఇంద్రియములను, మనస్సును నిగ్రహించి, ఆ మనస్సును పరమాత్మ యందు లీనంచేయాలి. అపుడు జీవుడు, పరమాత్మలు వేరుగాక రెండు కలిసి ఒకటియని భావించటం యోగమగును, "ఏకత్వభావనా". సమాధి యనగా ఆత్మ అని శ్రీ శంకరులు చెప్పారు. ఈ విషయమునే భగవద్గీత ఇట్లు వివరించింది.

"శ్రుతి విప్రతి పన్నాతే యదాస్థాస్యతి నిశ్చలా ।
సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి ॥" -భగవద్గీత-2-53

నానా విధ కర్మలను, ఫలములను వినుటచే బుద్ధి చలించక, నిశ్చలమైయున్న మనస్సును సమాధియందు అనగా ఆత్మయందు లగ్నము చేసినపుడు జ్ఞాన యోగరూప ఫలము నొందెదవు అని అర్థము. "సమాధీయతేఽ స్మిన్నితి సమాధి రాత్మా" అని శంకర భాష్యము.

"అలబ్ధలాభో యోగః స్యాత్ క్షేమో లబ్ధస్య పాలనమ్"

లభ్యము కానిది లాభించినచో దానికి యోగమని పేరు. అట్లు లభించిన దానిని కాపాడుకొనుట క్షేమము. యోగాభ్యాసము చేస్తూ అన్య మనస్కులు గాక సదా తనను ధ్యానించువారి యోగక్షేమములను యోగేశ్వరుడు, మహాయోగి యగుపరమేశ్వరుడు భరించునట. వారి భారమును తానే మోయునట.

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥

దేవుడే యోగము, యోగమే దేవుడు. ఆ యోగమే సమాధి. కావున మానవులంతా యోగనిష్ఠులై యోగులగుదురు గాక! ఇంద్రియాశ్వములను, మనస్సు అనే రథమును (మనోరథమును) నిగ్రహించుకొని సుఖశాంతులతో వర్ధిల్లుదురు గాక! యోగము చేతనే సిద్ధించెడి యోగపురుషుడగు పరమేశ్వరుని దర్శించి తరింతురు గాక! మనస్సును సమాధాన పరచుకొందురుగాక! మనోవాక్కాయ శుద్ధి ద్వారా ధర్మసాధనకు పాటుబడుదురుగాక! (శరీరం అద్యంఖలు ధర్మసాధనమ్) కావున శరీరారోగ్యమును కాపాడు కొందురుగాక!

సిద్ధిసమాధి యోగము మానవులకు సరియగు నిజమగు యోగమని ఏనాడో సిద్ధులగు యోగులు సమాధి నిష్ఠులై తరుణోపాయం చూపారు. ఆ తరుణోపాయముతో నందరు తరింతురుగాక !



# శ్రీ హనుమంతుడు - వైదిక స్వరూపము

భారతీయుల ఆరాధ్య దేవతలలో హనుమంతుడు ఒక విశిష్టస్థానాన్ని అలంకరించుతాడు. ఇతరదేవులు నరరూపంలో కనుపించుతారు. ఈయనది వానరరూపము. అయిననూ, సుందరుడనీ, ఆరాధ్య దేవుడనీ కొనియాడబడుచున్నాడు.

ఈయన అసలు పేరు ఆంజనేయుడు. అంజనాసుతుడు, వాయుసుతుడు, మారుతి యనియు పేర్లు గలవు. చిన్నతనంలోనే సూర్యుని పట్టుకొనుటకు మిక్కిలి వేగంతో ఆకాశంలోకి ఎగరసాగాడు. దేవతలు భయపడి వారించలేక రాహువును గూడ పంపిరి. కాని రాహువు గూడ వారించలేకపోయాడు. చివరకు ఇంద్రుడు వజ్రాయుధం వేయగా దెబ్బదగిలి క్రింద పడిపోయాడు. మూర్ఛపోయాడు. అపుడు తండ్రియగు వాయుదేవుడు కోపంతో వాయువును స్తంభింపచేసి కుమారుని వడిలో పెట్టుకొనియుండగా ప్రపంచం తల్లడిల్లి పోయింది. అపుడు బ్రహ్మాది దేవతలు వాయుదేవుని ప్రార్థించగా వాయుదేవుడు ప్రసన్నుడయ్యెను. దేవతలందరూ ఒక్కొక్క శక్తిని ప్రసాదించుతారు. అందుచే నా బాలకుడు అత్యంత శక్తి మంతుడైనాడు, వేదవేత్త, వ్యాకరణాది శాస్త్రవేత్త అయ్యాడు. వజ్రాయుధం దెబ్బచే నాతని హనువులు పటిష్ఠములైనవి. అందుచే హనుమంతుడు అని ప్రసిద్ధిచెంది నట్లు రామాయణం ఉత్తరకాండ ద్వారా తెలుస్తోంది. ఇంద్రుని వజ్రాయుధపు దెబ్బకు కూడ మొక్కబోని ప్రశస్తమైన హనువులు గలవాడగుటచే హనుమంతుడు అని సార్థక నామధేయుడు అయ్యెను.

"హన హింసాగత్యోః" అను ధాతువునుండి హను శబ్దము పుట్టినది. హనధాతువుకు హింస, గతియని రెండర్థములు ప్రశస్తములు. "హనుః హంతేః" అని నిరుక్త శాస్త్రంలో యాస్కమహాముని నిర్వచనము ద్వారా గూడ తినుపదార్థములను నములుచున్నపుడు ఆ పదార్థమును హింసించి, జీర్ణింపచేయుటచే దవడలకు హనువులని పేరు. నములునపుడు కదలికలు గల్గిన వగుటచే గమన శీలములగుచున్నందున దవడలు హనువులైనవి. "హంతి ఆమయం ఇతి హనుః" అని అమరకోశము. ఆమయమును అనగా రోగమును పోగొట్టునది హనువు అని తెల్పుచున్నది. హనువులు దుర్బలములైనచో భోజ్యపదార్థములను నమలలేనందున అజీర్ణము గల్గును. పటిష్ఠములైనచో పదార్థములు బాగుగ నమలుటచే నవి జీర్ణమై ఆరోగ్యమును చేకూర్చును. ఇట్లు అత్యంత ప్రశస్తములైన వ్యాధి నివారకములగు హనువులను గల్గి యున్నాడని తెలుస్తున్నది. ఇంకొక కథ గలదు.

విష్ణువు యొక్క మోహినీ రూపమును చూచి శివుడు క్షుబ్ధహృదయుడై వీర్యముమ విడచెను. ఈశ్వరుని ప్రేరణచే నా వీర్యమును శ్రవణేంద్రియము ద్వారా అంజనా దేవి

గర్భమున నప్పర్షులుంచిరి. అంజనా గర్భసంజాతుడు హనుమంతుడు. రుద్ర వీర్య సంజాతుడ గుటచే రుద్రుడంతటి వాడే అయ్యెను. "రుద్ర వీర్యసముద్భవః".

హనుమంతుని విశిష్టత, ప్రాధాన్యము, సౌందర్యము రామాయణం సుందరకాండలో కాననగును, కిష్కింధ కాండలో గూడ గలదు. సీతాదేవిని రావణాసురుడపహరించగా నామెను వెతుకుతూ వచ్చిన రామలక్ష్మణులకు భిక్షురూపంలో దర్శనమిస్తాడు. వారి సంభాషణల పిదప శ్రీరాముడు హనుమంతుని గూర్చి ఇలా అంటాడు.

నా౨౨ఋగ్వేద వినీతస్య నా౨౨యజుర్వేద ధారిణః ।
నా౨౨ సామవేదవిదుషః శక్యమేవం విభాషితుమ్ ॥
నూనం వ్యాకరణం కృత్స్న మనేన బహుధాశ్రుతమ్ ।
బహు వ్యాహరతా౨నేన న కించిదపశబ్దితమ్ ॥
న ముఖే నేత్రయోర్వాపి లలాటే చ భ్రువోస్తథా ।
అన్యేష్వపి చ గాత్రేషు దోషః సంవిదితః క్వచిత్ ॥
సంస్కార క్రమ సంపన్నాం అద్రుతా మవిలంబితామ్ ।
ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయ హారిణీమ్ ॥

*రామాయణం - కిష్కింధ - 28-33*

ఋగ్వేదంలో నిష్ణాతుని వినయం, యజుర్వేదంలో నిష్ణాతుని సంభాషణ, సామవేదంలో నిష్ణాతుని పాండిత్యం ఉన్నందున హనుమంతుడిట్లు సంభాషించగల్గుచున్నాడు. వ్యాకరణ శాస్త్రకోవిదుడు గావున అపశబ్దం లేదు. ముఖంలో, కళ్లలో, నుదురు మొదలగు ఏ అవయవం లోను దోషం కనపడుటలేదు. ద్రుతముగాని, విలంబముగాని లేక సంస్కారవంతమై, హృదయమును దోచుకొను కల్యాణప్రదమైన వాక్కును ఉచ్చరించుచున్నాడు అని అర్థము.

వీనిని బట్టి హనువులవని కేవలం భోజనం చెయ్యటం, పదార్థములను బాగుగ నమలటం మాత్రమే గాదు. చక్కగ వేదాభ్యాసము, వేదాధ్యయనం, వ్యాకరణాది శాస్త్రములను అభ్యసించి, హృదయంగమము, కల్యాణప్రదమునగు వాక్కునుచ్చరించటం ప్రధానము. అట్టి హనువులు గల్గియుండుటచే హనుమంతుడని సార్థక నామధేయము. అట్లు వేదశాస్త్ర వేత్తలు, సంస్కార వంతము, కల్యాణప్రదమునగు వాక్కులనుచ్చరించు నోరు (దవడలు) గలిగిన మనీషులు హనుమత్స్వరూపులే అగుదురు. వేదాధ్యయనం నిరంతరం చేయుటచే దవడలకు నిత్యము కదలిక గల్గి గమనార్థముతోను, అజ్ఞానమును హింసించి జ్ఞానసముపార్జన గల్గించుటచేత హింసార్థముతోను నా దవడలు నిజమైన హనువులగును. గమనమనగా

పొందుట యని గూడ యర్ధము గలదు. (హను అనగా గతి - హింప) అందుచే గమవార్ధమనగా జ్ఞాన సముపార్జన యని యర్ధము తెలియనగును.

సీతారాములను కలువువారు ఇద్దరు 1)విశ్వామిత్ర మహర్షి 2)హనుమంతుడు. విశ్వామిత్రుడనగా లోకమునకు హితుడు (విశ్వస్యమిత్రం = విశ్వామిత్రః) గాన లోకకల్యాణార్థం సీతారాముల కల్యాణం జరిపివారు. విడిపోయిన అదంపతులను మరలగల్పి లోక కల్యాణం గావించిన వాడు హనుమంతుడు. ఇద్దర్ని కలుపుట అనేది "యోగ"మనబడును. వేదమాతను పరమేశ్వరునితో యోజన చేయుటయే యోగము. సీతాదేవిని శ్రీరామునితో కలుపుటయే (యోజన) యోగము. దానినే సంధి అంటారు. సంధాన కర్త యోగీశ్వరుడగు హనుమంతుడే. సంధి అనగా రెంటిని కలుపుట. ఆ సంధియే యోగము.

వేదము లోకమునకు అయిదు సంధులను ప్రసాదించింది. అవి అధిలోకము, అధిజ్యోతిషము, అధి విద్యము, అధి ప్రజము, అధ్యాత్మము. అందు అధి విద్యమును చూద్దాము :

"అచార్యః పూర్వరూపం । అంతే వాస్యుత్తర రూపం ।

విద్యాసంధిః । ప్రవచనగ్ం సంధానం" - తైత్తిరీయోపనిషద్.

ఆచార్యుడు, శిష్యుడు వీరిద్దరిని కలుపునది విద్య. ఆ విద్య ఒక సంధి. సంధానకర్త పాఠము. అట్లే అధి ప్రజం :

"మాతా పూర్వరూపం । పితోత్తరరూపం ।

ప్రజాసంధిః । ప్రజననగ్ం సంధానం" - తైత్తిరీయోపనిషద్.

తల్లి దండ్రుల యొక్క అనందగ్రంధి వారి సంతానము. ఆ సంతానము సంధి. సంధాన కర్త సంతానమును కనటము. అట్లే అధ్యాత్మం అను సంధి :

"అధరాహనుః పూర్వరూపం । ఉత్తరాహనురుత్తర

రూపం । వాక్ సంధిః । జిహ్వాసంధానమ్" - తైత్తిరీయోపనిషద్

క్రింది దవడ ఒకటి - పైదవడ (హనువు) మరొకటి. ఈ రెండు దవడలను కలుపునది వాక్కు. రెండు హనువులు కలిసినపుడే వాక్కుపుట్టును. "వాక్కు పుట్టాలంటే రెండు (దవడలు) హనువులు కలవాలి. ఆ హనువులను కలిపెడి అవాక్కు సంధి. వాలుక సంధానకర్త కనుక రెండు హనువుల యొక్క సంధి యందు పుట్టు వాక్కు సంధ్య యగును. రెండు హనువులు కల్గియున్నవాడు హనూమాన్ అగును. కనుక హనూమత్తత్త్వము వాగ్రూపసంధియగును. సంధి యందు పుట్టునది సంధ్య. కనుక విద్య, సత్సంతతి, హనూమత్తత్త్వరూప వాక్కు అన్నీ సంధ్యాస్వరూపములే. ఇచట వాక్కు అనగా వేదవాక్కు కనుక హనూమంతుడనగా

వేదవాక్ స్వరూపుడు సంధ్యా స్వరూపుడు గనుకనే సంధ్యారుణ వర్ణముతో హనుమంతుడు దర్శనమిస్తున్నాడు. ఆ సిందూర వర్ణమే సంవ్యానులు ధరించు వస్త్రముల యందు కనపడుచున్నది.

రామాయణంలోనీ శ్లోకము హనుమంతుని సంధ్యా స్వరూపునిగ వర్ణించుచున్నది.

ముఖం నాసికయా తస్య తామ్రయా తామ్ర మాబభౌ ।
సంధ్యయా సమభిస్పృష్టం యథైతత్ సూర్యమండలమ్ ॥ - సుందరకాండ

తామ్రమనగా రాగి, దాని రంగు కాషాయము అదే సిందూరము, అట్లు సిందూరవర్ణము గల ముక్కుతో సిందూరవర్ణము గల హనుమంతుని ముఖము సంధ్యచే తాకబడిన సూర్యమండలము వలె ప్రకాశించుచున్నదట. హనుమంతుని ముఖమే సూర్యమండలము నాసిక సంధ్యాస్వరూపము. ఇట్లు సంధ్యా స్వరూపుడుగనుకనే పగలు, రాత్రులను సంధ్య కలపుచున్నట్లు సీతారాముల గల్పగలిగినాడు.

హనుమంతుడు వానరుడు. వా నరః? నరుడా? అవునుగాదు అని వికల్పము "వనమేవ వానం. వానం రాతీతి వానరః" వనమనగా భగవంతుడు. వాన మనగా భగవత్తత్త్వము. ఆతత్త్వమును దర్శింపు చేయునది 'వానర' శబ్దవాచ్యము. భగవత్తత్త్వమును దర్శింప చేయగల్గినది వేదము. కనుక వానరము వేదస్వరూపము. హనుమంతుడు వేదత్రయ స్వరూపుడు వేదవాక్ స్వరూపుడని ముందు చూచినాము గద! అయితే చూచుటకు వానరము కురూపిగా నగుపించును. "కురూపోఽపి విద్వాన్ విద్యయా బహుశోభతే" అను శ్రీశంకరుల వాక్యాన్ననుసరించి కురూపియయ్యును విద్యావంతుడు, విద్యా స్వరూపుడు, వేదవేత్తయునగు హనుమంతుడు బహు సుందరుడే. సుందరియు, వేదమాతయునగు సీతాదేవిని వెతికి సందర్శించి, సుందరుడు భగవంతుడునగు శ్రీరామచంద్రునికి సమర్పించి సేవించిన మహనీయ సుందరుడు హనుమంతుడు.

"తమర్థమివ భారత్యా సుతయా యోక్తుమర్హసి". అని కాళిదాస వచనము. పరమేశ్వరుని వేదమాతతో యోజన చేసినట్లు పరమశివుని పార్వతితో యోజన చేయమని సప్తర్షులు హిమవంతునితో నంటారు. వేదమాతృ స్వరూపిణి, సుందరి యగు సీతను - పరమేశ్వరుడు, సుందరుడగు శ్రీరామచంద్రుని నుండి రావణాసురుడు వేరు చేయగా మరల వారిరువురిని యోజన చేసిన మహాయోగి, సుందరుడునగు హనుమంతుడు నగధీరుడు గూడ. ఈ సుందరత్రయముతో గూడిన కాండయే సుందరకాండ.

"వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః"

వికారము గల్గించెడి పదార్థములు, కారణములెన్నియున్నను ఎవరి మనస్సు వికారము చెందదో వారే ధీరులని అర్థము. సీతను వెతుకునపుడు రాత్రిపూట రావణాంతఃపురములో స్త్రీలు అనేక భంగిమలలో కనుపించిననూ పీసమెత్తుగూడ హనుమంతుని మనస్సు చలించలేదు । వికారము చెందలేదు. అట్లు మనస్సు చలించకుండుట, వికారము చెంద కుండుట యోగము అగును. కనుకనే హనుమంతుడు మహాయోగి. నిత్యము వేదాన్వేషణము, వేదమాతృ ధ్యానము, వేదమాతృ సౌందర్యముతో నాయన మనస్సునిండియుండును.

అట్టి యమ్మహాయోగిని సర్వదా ఆరాధించి, మనస్సులో నితర విషయములను రానీ యక నిరంతరము హనుమంతుని మనస్సులో ధ్యానము చేయుచు, మనస్సు నాయనలో లీనము చేసి అందరు మానవులు యోగపరాయణులై పరిశుద్ధమనుస్కులై ఆయురారోగ్యముల నొందెదరుగాక! వేదమాతయను గ్రహముతో సౌభాగ్య వంతులగుదురు గాక! వేదమాతృ ధ్యాన మనస్కులై, వేదమాతృ సౌందర్యమును గ్రోలుదురు గాక! అందరు. సుందరులగు గాక!

ఇతిశమ్

"నమామ వేదసుందరమ్"



# విఘ్నేశ్వరుడు

వర్షర్తువులో వచ్చు పండుగలలో శ్రీకృష్ణ జన్మాష్టమి యొకటి. ఇది శ్రావణ మాసములో వచ్చునది. వినాయక చవితి రెండవది. ఇది భాద్రపదమాసమున వచ్చునది. ఈ రెండు మాసములలో వర్షములు మెండుగా కురియును. వర్షముల వలన అనేక క్రిమి కీటకములు పుట్టుటచేత ననేక వ్యాధులు గూడ పుట్టును. వ్యాధి నివారణకై మానవులు భోజనము, భాషణములలో కడు జాగరూకులుగ నుండవలెను. ఉపవాస దీక్షతోను, ఆహార నియమము, మనోనిగ్రహము, వాక్సంయమములతో భగవదారాధనా పరాయణులై సుఖ, శాంతులతో మెలగవలెనని వేదమాత ఉపదేశము.

వినాయక చవితి పండుగ విశిష్టమైన పండుగ. ఆనాటి కార్యక్రమము అందరికి తెలిసినదే. వినాయకోత్పత్తి - పూజ - కథా శ్రవణము ప్రతి సంవత్సరము అందరు ఆనందోత్సాహములతో జరుపుకొనుట తెలిసినదే. అయితే వినాయకుడనగా ఎవరు? ఆయన వాహనము ఏమిటి? తెలిసికొనదగినది.

వినాయకుడంటే విశిష్టమగు నాయకుడు. నాయకుడు లేని నాయకుడు. అందరికి మంచి శిక్షణనిచ్చు నాయకుడని అర్థాలున్నాయి. విఘ్నాసురుని సంహరించువాడు, విఘ్నాధిపతి, విఘ్నములు తొలగించువాడు గాన విఘ్నేశ్వరుడు. పుట్టిన తోడనే శివుని సమీపమున వేదధ్వనితో పుట్టినందున హేరంబుడు. జగద్రూపుడు, జగన్ముఖుడు గావ గజాననుడు. జగమే గజము. గజమే జగము. సృష్టి, స్థితి, లయములు గల్గినది జగము. జ-జన్మ. గ-గతి యనగా లయము. కావున గజాననుడు. ఓంకారస్వరూపుడు గావున వక్రతుండుడు. ఆయన తొండము ఓంకారస్వరూపము (ప్రణవస్వరూప వక్రతుండం), గణములంటే సమస్త జీవగణములు. ప్రాణిగణములు. గణముల పాలకుడు కావున గణపతి. (గణానాం త్వాగణపతిం హవామహే) గణము అంటే వేదవేదాంగములు కావున వేదవేత్త- గణిః - గణపతియగును.

"అధీత వేదవేదాంగః సోనూచానో యుగిగణిః" అని వైజయన్తి కోశము తెల్పుచున్నది.

మూషకము ఆయన వాహనము. స్తేనునకు మూషకమని పేరు, స్తేనుడనగా అందరి తోను నమ్మకంగా ఉంటూ, స్నేహితునివలె నటిస్తూ కళ్లలో కారం కొట్టి దొంగిలించు వాడు. అట్టి స్నేహితునివలె నటించు దొంగ "నాలుక" అదేజిహ్వ. జిహ్వ అనగా తినునది శబ్దించునది అని అర్థం "హ్వాఞ్ స్పర్ధాయాంశబ్దేచ" అనిధాతువు నుండి జిహ్వ శబ్దముత్పన్నమైనది. "హ్వయతి రసవద్వస్తు ఇతి జిహ్వ" రసకరములైన పదార్థములను ఉదరబిలంలోనికి తెలియకుండగా పడవేస్తుంది. నోటినుండి శబ్దము రావటానికి కారణము గూడ జిహ్వయే. ఈ జిహ్వయే మూషకము. మూషక వాహనుడంటే ఎలుకను వాహనంగా చేసికొని,

గుఱ్ఱమువలె మూషకము మీద కూర్చొని వెళ్లుచున్నాడని అర్థం తీసికోరాదు. 'జిహ్వ' అను మూషకమును నియంత్రించెడు ప్రభువు అని అర్థం. ఈ విషయాన్ని 'జిహ్వా సింహాసన ప్రభుః' అని గణపతి సహస్రనామాలలోని నామము తెల్పుచున్నది. "లిపి పద్మాసనధరః" అని మరియొక నామము 'లిపి' అనే పద్మాసనా సీనుడని చెప్తూంది. లిపి అంటే సమస్త వేదవాఙ్మయము. ఈ వేదవాఙ్మయము గూడ మూషకమే. మానవుల అజ్ఞానాన్ని దొంగిలించెడి స్తేనుడు యీ వేదము. అట్టి మూషక రూపములగు జిహ్వ, వేదములను తన అధీనంలో ఉంచుకున్నాడని అర్థము. అందుకే ఈ విషయాన్ని శిల్పంగా చూపాడు క్షేమేంద్ర మహాకవి జిహ్వే "ప్రమాణం జానీహి భోజనే భాషణే2 పిచ" అని.

కావున వినాయక చవితి పండుగ అంటే తలంటిపోసుకొని, కొత్త బట్టలు వేసుకొని, వినాయకుని పూజించి, చక్కగ రసవత్తర భోజనం చేయటం గాదు. నోటిని అదుపులో పెట్టుకోవటం, నాలుకను అదుపులో ఉంచుకోవటం. వీలైనంత ఆహారనియమం పాటించ టం. నోటి కొచ్చి నట్లు మాట్లాడకుండ నాలుకను అదుపు, ఆజ్ఞలో పెట్టుకోవటం అర్థము.

ఇట్లు వాక్సంయమనం పాటించటం శుభప్రదమైన వాక్కులను ఉచ్చరించటమే వినాయక చవితి పండుగ ప్రధానలక్ష్యము. అందుకై వినాయకుని పూజించుట. ఆయనను పూజించిన వాక్శుద్ధి గల్గును. మంచి బుద్ధిని, ఆయన ప్రసాదిస్తాడు. అవి మనకు సిద్ధిస్తాయి కనుకనే సిద్ధి, బుద్ధి వినాయకుని భార్యలని అన్నారు. సిద్ధి ద్వారా క్షేమము, బుద్ధి ద్వారా లాభమనే కుమారులు పుట్టారని శివపురాణ వచనము. అనగా విఘ్నేశ్వరుని ఆరాధిస్తే క్షేమము, లాభము సిద్ధిస్తాయని అర్థము.

గణపతి శ్రీకృష్ణరూపుడు అని బ్రహ్మవైవర్తపురాణము చెపుతోంది. 'గణేశరూపీ శ్రీకృష్ణః' అని. కనుకనే భగవద్గీతలో

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్

అని కృష్ణుడు ఉపదేశిస్తాడు. ఎవరు ఇతర దుష్ట చింతలు లేక నిత్యము మనస్సును భగవంతుని యందు యోజన చేసి భగవంతుని ఉపాసిస్తారో వారి యోగక్షేమముల బాధ్యత నేను వహిస్తాను అని అర్థము.

గణపతిని ఆరాధిస్తే శుభప్రదమైన వాక్కులను ఆయన ప్రసాదిస్తాడు. "శ్వః శ్రేయసం శివం భద్రం కల్యాణం మంగళం శుభమ్" అని అమరకోశము, భద్రం అంటే శుభము, కల్యాణమని అర్థాలను చెప్తోంది. శుభప్రదమైన పదములనగా భద్రపదములు. భద్రమే భాద్రము. కావున భద్రపదములే భాద్రపదములు అవియే వేదపదములు. పదశబ్దమునకు పాదమని అర్థం గలదు. పదశబ్దము గతిని చెప్పుచున్నది. కనుక భాద్రపదమాసమున భద్రరూపుడగు వినాయకుని అర్చించినచో భద్రపదములు వేదపదములు సిద్ధిస్తాయి. భద్రగతి అనగా మంచి నడక సిద్ధిస్తుంది.

"భద్రం కర్ణేభిః శృణుయామదేవాః । భద్రం పశ్యేమాక్షభిః యజత్రాః ॥"

"మాసి ప్రోష్ఠపదే బ్రహ్మ బ్రాహ్మణానాం వివక్షతాం ।
అయమధ్యాయసమయః సామగానాముపస్థితః"

- రామాయణమ్ కిష్కింధ -28-54

వేదాధ్యయన మారంభించగోరు సామవేదపారగులగు బ్రాహ్మణులకు భాద్రపదమాసమే అనువైన సమయమని అర్థము. భాద్రపదమునకు ప్రోష్ఠపదమనీ పేరు. ప్రోష్ఠమనగా గోవు. గోవు యొక్క పాదముల వంటి పాదముల గలవి పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రములు. ఆ నక్షత్రములతో గూడిన పూర్ణిమ గల్గియుండుటచే నామాసమునకు భాద్రపదమాసమని పేరు గల్గినది. గోవు అంటే వేదము.

"ధేనుం ధీరాః సూనృతాం వాచమాహుః"

"ధేనుర్వాగ స్మానుపసుష్ఠుతైతు" అని వేదము తనను "గోవు" అని చెప్పికొన్నది. ఆ వేదపదములే భద్రపదములు - భాద్రపదములు కావున భాద్రపదమాసము వేదాధ్యయనమున కనుకూల సమయము. భాద్రపదమున వేదాధ్యయనం చేయువారికి భద్రమును అనగా మంగళమును వర్షించును. గోపద ధూళి తీర్థాభిషేకము వలన గలిగెడు శుద్ధిని ప్రసాదిస్తుందని కాళిదాస మహాకవి ప్రబోధము.

తస్యాః ఖురన్యాస పవిత్రపాంసుం
    అపాంసులానాం ధురి కీర్తనీయా
మార్గం మనుష్యేశ్వర ధర్మపత్నీ
    శ్రుతేరివార్థం స్మృతిరన్వ గచ్ఛత్ ! - రఘువంశము.

గోవు శ్రుతి. గోపాదధూళి వేదార్థము. దానిననుసరించు సుదక్షిణాదేవి స్మృతి. కావున గోపద సేవ-భాద్రపదసేవ-తీర్థాభిషేక శుద్ధినిస్తుంది. (తీర్థాభిషేకజాం శుద్ధిమాదధానా) అయితే సాధారణముగా వినాయకుని వాహనము మూషకమని అందరకు తెలిసినదే. ఆయన సింహ వాహనుడు అని పురాణాలు తెల్పుచున్నాయి.

"త్రినేత్రంచ చతుర్బాహుం పరశుం కమలం స్రుణిమ్ ।
పాశం సిద్ధించ బుద్ధించ సహస్తం సింహవాహనమ్ ॥"

మూడు కళ్లు, నాలుగు చేతులు, గొడ్డలి, తామరపూవు, పాశము సిద్ధి, బుద్ధి, స్రుణిని ధరించి, సింహవాహనుడైన వినాయకుని బ్రహ్మ ప్రార్థించాడట.

పూర్వము బ్రహ్మతపస్సులో ఉండగా, శంఖుడనే రాక్షసుడు వేదశాస్త్రపురాణాలను దొంగిలించి సముద్రంలో దాగియున్నాడు. అపుడు శివుడు సింహవాహనుడగు వినాయకుని

పూజించమని, ఆయనే శంఖుని సంహరించి వేదోద్ధరణ చేస్తాడని చెప్పగా ఓంకార స్వరూపుడు, సింహవాహనుడగు వినాయకుని మనసా ధ్యానించగా ఆయన సాక్షాత్కరిస్తాడు. ఆయనను ప్రార్థించగా శంఖాసుర వధచేసి వినాయకుడు వేదోద్ధరణ చేస్తాడు. ఇట్లే అనేక పురాణ గాథలు వినాయకుడు సింహవాహనుడై అవతరించినట్లు తెల్పుతున్నాయి.

గరుత్మంతుడు, నంది, మూషికము, సింహము, మయూరము ఇవన్నీ వేదస్వరూపములే. పైన చెప్పిన ఋగ్వేద మంత్ర శిల్పములే వాహనములు. దేవాలయములలో జరుపబడు బ్రహ్మోత్సవములు, వివిధ వాహనోత్సవములు పై మంత్రార్థమునుపలక్షించునవియే.

హింసయే సింహమయింది. వశియే 'శివ' గాను, మరా అనునది 'రామ' యని మారి నట్లు హింస సింహమయినది. హింసించునది సింహము. అయితే సింహ శబ్దము హన ధాతునిష్పన్నము "హన హింసాగత్యోః" అని హనధాతువునకు హింస, గతియని రెండు అర్థాలు. సింహమనగా మంచి గతియని అర్థము. అంటే మంచి పాదములున్నగాని మంచి గతి యుండదు. ఆ మంచి పాదములే శుభపదములు, భాద్రపదములు. కనుక సింహ స్వరూపమే భాద్రపద స్వరూపము. కావున సింహారాధన భాద్ర పదారాధనమే. అందుకనియే భగవంతుడు సింహమును ముఖముగా ధరించి గజముఖుడువలె నరసింహుడుగా అవతరించాడు. గజమెట్లు ఓంకారస్వరూపమో సింహమట్లు వేదస్వరూపము. కావున నరసింహుడనగా నరశ్రేష్ఠుడని యొక యర్థము. పరమేశ్వరుడు జీవరూపుడై వేదముఖుడై దుష్టరాక్షసభావము నరికట్టినట్లు భావన చేయాలి.

అట్లే మూషకవాహనుడగు వినాయకుడు సింహ వాహనుడై సింహరూప వేదముతో మానవులలోని దైత్య భావమును నశింపచేస్తాడని తెలిసికోవాలి. వేదనిందకులకు, దుష్టులకు వేదము సింహమే. సింహస్వప్నమే. అట్లు సింహరూపమై వేదము దుష్టసంహారాన్ని చేస్తుంది. కావుననే వినాయకుడు వేదమును సింహరూపములో తన వాహనంగా చేసికొన్నాడు. సింహవాహనుడని ప్రసిద్ధి చెందినాడు.

వేదమునకు సుభద్ర అని పరాదేవతకు భద్ర కాళియని పేర్లు గలవు.

భద్ర పదమునకు శ్రేష్ఠమని అర్థమున్నదికావున శ్రీరాముని రామభద్రుడనీ, బలరాముని బలభద్రుడనీ, జినుని సమంత భద్రుడనీ పిలుస్తారు. కనుక భాద్రపదమనగా శ్రేష్ఠపదమని అర్థము. శ్రేష్ఠపదము భద్రపదము భాద్రపదము ఇదే వేదపదము. కావున భాద్రపదమున వినాయకుని పూజ అంటే వేదపదమున సుప్రతిష్ఠుడైన భగవదారాధనయని తెలియవగును.

ఇతిశమ్

"నమామ వేదనాయకమ్"



# స్వరములు - వైదికదర్శనము

స్వరములు సంస్కృత భాషలో తప్పమరియే యితర భాషలోను కనపడవు. సంస్కృత మంటే స్వర సంస్కారములు గల భాష. స్వరమొక అపూర్వమైన దివ్యశక్తి. అదే యోగశక్తి. ఇది సంస్కృత భాష పదార్థజ్ఞానమును, ఔన్నత్యమును తెల్పుచుండును. అందుకే ప్రధానంగా స్వరము వేదములోను, వేదమునకు ప్రతిబింబమగు సంగీత శాస్త్రంలోను కనపడును. ఈస్వర మంటే ఏమిటి? వేద శాస్త్రాలే నిర్వచించాయి. ముందుగా సంగీతమ్.

"సమ్యక్ గీతం - సంగీతం". గీతం అంటే గానము. మంచి గానము - వేదగానమునకు సంగీతమని పేరు. అమ్మవారికి "సామగానప్రియా సౌమ్యా" అని పేరు. శివునకు "సామప్రియః" అని పేరు. ఈ సంగీతమునకు ప్రధానాధారము స్వరము.

"స్వర్యతే పూజ్యతే ఇతి స్వరః" అని వ్యుత్పత్తి. అనగా బాగుగ ఉచ్చరింపబడునది, పూజింపబడునది అని అర్థము. అందరిచే పూజింపబడువాడు స్వయంగా ప్రకాశించువాడు పరమేశ్వరుడు కాన పరమేశ్వరుడు "స్వర" రూపుడు. ఆ స్వరరూపుడగు పరమేశ్వరుడు వేదములందు సామరూపుడై, స్వరరూపుడై విరాజిల్లు చున్నాడు. అందుకే పరమేశ్వరునికి సామవేద మంటే ఇష్టమట. "వేదానాం సామవేదో2స్మి" అని కృష్ణుడే స్వయముగ చెప్పినాడు.

సంగీతశాస్త్రంలో స్వర మిట్లు నిర్వచింపబడినది-

"శ్రుత్యనంతర భావీ యః స్నిగ్ధో2నురణనాత్మకః ।
స్వతో రంజయతి శ్రోతుః చిత్తం స స్వర ఉచ్యతే॥"

శ్రోతల మనస్సును స్వయముగ రంజింపచేయునది. స్వయముగ ప్రకాశించునది "స్వర"మని చెప్పబడుచున్నది. కనుకనే పరమేశ్వరుడు "ఋషిస్వరః" అని పిలవబడు చున్నాడు. ఋషులనగా వేదమంత్రములు, వసిష్ఠాది మహర్షులు. అనగా మంత్రములచే ప్రకాశింపజేయబడిన స్వరము పరమేశ్వరుడు అని, మంత్రమనెడి స్వరము అని అర్థము. కావున పరమేశ్వరుని తరువాత వేదములు, మంత్రములు స్వరములగుచున్నవి. "స్వస్మిన్ రాజతి, స్వయం రాజతి" అని వ్యుత్పత్తులు పై యర్థాన్ని వివరిస్తున్నాయి. జీవుడు గూడ స్వర రూపుడని భాగవతము చెప్పుచున్నది.

"సఏవ జీవో వివర ప్రసూతిః ప్రాణేన ఘోషేణ గుహాం ప్రవిష్టః ।
మనోమయం సూక్ష్మము పేత్యరూపం మాత్రా స్వరా వర్ణ ఇవ ప్రవిష్టః ॥"

- భాగవతమ్.

మాత్రలు, స్వరములు వర్ణమునందువలె జీవుడు మనోమయమగు సూక్ష్మరూపమును ధరించి ప్రాణముతోను వాక్కుతోను దేహ రూపగుహను ప్రవేశించినాడని అర్థము.

సృష్టికి ముందు ఓంకారమనెడి స్వరముతో విరాజిల్లెడు దివ్యశక్తి ఆవిర్భవించినదని అగ్నిపురాణ వచనము.

"అదౌశక్తిః సముత్పన్నా ఓంకార స్వరభూషితా ।" - అగ్నిపురాణమ్ 124-8.

కనుక ఓంకారము స్వరమని తెలుస్తున్నది. వేదముగూడ తెల్పినది.

"యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతేచ ప్రతిష్ఠితః"

వేదముల యొక్క ఆద్యంతములలో సుప్రతిష్ఠితమగు ఓంకారమే స్వరము. "ప్రణవ శ్ఛందసామివ" అని రఘువంశ మహాకావ్యంలో కాళిదాసమహాకవి వేదముల యొక్క ఆది ఓంకారమని తెల్పినాడు. దీనిని బట్టి వేదము లోకమున ఆవిర్భవించుటకు ముందు ప్రణవ నాదరూపముగా అంటే ఓంకార నాదరూపముగా ఉండి ఋషులకు ఓంకార నాదరూపముతో సాక్షాత్కరించింది. ఈ ఓంకారమే స్వర రూపంలో ఉంటుంది. ఈ స్వరరూపంలో నున్న ఓంకారమే నాల్గు వేదములుగా, స్వరమయముగా అనగా స్వరములతో ఆవిర్భవించింది. ఓంకారరూప స్వరమే వేదమందలి, ఉదాత్త, అనుదాత్త, స్వరితములను మూడు స్వరములుగా ఆవిర్భవించినది. వ్యాకరణ శాస్త్రం ఆ మూడు స్వరములనిట్లు నిర్వచించినది.

"ఉచ్చైరుదాత్తః । నీ చైరనుదాత్తః । సమాహారః స్వరితః ।"

పైకి ఉచ్చరించటం ఉదాత్తము, క్రిందకి ఉచ్చరించటం అను దాత్తము, రెంటి సమాహారము స్వరితమని స్వరములు మూడు. ఇట్లు పైకి, క్రిందకు పలుకబడు స్వరములేవి? అవి అచ్చులని వ్యాకరణ శాస్త్రము తెల్పినది.

"అచః స్వరాః । కాదయో మావసానాః స్పర్శాః ।
యణోఽన్తస్థాః । శల ఊష్మాణః "

శివుడు తాండవనృత్యం చేస్తూ చేతిలోని ఢక్కను పదునాల్గుసార్లు మ్రోగించాడట. అందుండి పదునాల్గు శివ సూత్రములా విర్భవించాయి. ఆ సూత్రములనుండి అచ్చులు, హల్లులు ఏర్పడినవి. అచ్చులకు స్వరములని పేరు. క నుండి మ వరకు హల్లులకు స్పర్శలని పేరు. యరలవ లకు అంతస్థలని, శషసహలకు ఊష్మలనిపేరు. ఈ అచ్చులకు మాతృకా వర్ణములని పేరు. వర్ణము అనగా వర్ణించునదని అర్థము. ఈ వర్ణములు పరమేశ్వర తత్త్వమును వర్ణించుటకు పరమేశ్వరుని నుండే ఉద్భవించి, అవతరించి, స్వయంగా రాజిల్లుచూ స్వరములుగా ప్రసిద్ధములైనవి.

అచ్చులు స్వయం ప్రకాశకములు, స్వయం రాజకములు. అనగా స్వయముగ ప్రకాశించుచు శ్రోతల చిత్తములను రంజింపచేయునవి. (స్వతః రంజయతి ఇతి స్వరః) హల్లులు స్వయంగా రంజింపచేయలేవు కనుక వీనికి స్పర్శలని పేరు. అనగా స్వరములగు అచ్చులని తాకినపుడు మాత్రమే రాజిల్లు నవి. స్వరములు స్త్రీలుగను, హల్లులు పురుషులుగాను, ఈ

మిధునము నుండి సమస్త వాఙ్మయము, ప్రపంచము ఆవిర్భవించినదని శాస్త్రము చెప్పు చున్నది. సంగీతమున రాగాలాపనలో అచ్చులదే ప్రధాన పాత్ర. అచ్చులతో కలిసియున్నప్పుడే హల్లులు గూడ రాణిస్తాయి.

ఈ మూడు ఉదాత్తాను దాత్త స్వరితములను స్వరములు అయిదు స్వరములుగా ఆవిర్భవించినట్లునూ, అవి 'మూలబ్రహ్మ' గా కీర్తింపబడినవి. అవి "అ ఇ ఉ ఏ ఓ".

"ఈశః సప్తశిఖాదేవాః శక్రాద్యాః పంచ చ స్వరాః ।

అఇఉఏఓ కలాశ్చ మూలం బ్రహ్మేతి కీర్తితమ్ ॥" - అగ్ని పురాణం - 124-4-6

కావున స్వరమునకు 'బ్రహ్మ' అనెడి సంజ్ఞగలదు. ఈ అయిదు స్వరములతో గూడిన ఓంకార రూపస్వరమునకు 'శాంత్యతీత' అని పేరు గలదు. ఓంకార రూపస్వరము అయిదు స్వరములకు మూలభూతము. ఆ ఓంకార రూపస్వరము శబ్దగుణకమగు ఆకాశమున అవ్యక్తముగా నుండును. ఈ అయిదు స్వరములకు, కుజుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శని అధిదేవతలట.

"ఓం కారః శాంత్యతీతాఖ్యః ఖశబ్ద యూధ పాణిపః ।

పంచవర్గాః స్వరాః జాతాః కుజ, జ్ఞ, గురు, భార్గవాః ॥

శనిః క్రమాదకారాద్యాః కకారాద్యాస్తథః స్థితాః ।

ఏత న్మూలమతః సర్వం జాయతే సచరాచరమ్ ॥"

- అగ్ని పురాణ - 124-13,14,15

ఈ అయిదు స్వరములు అయిదు కలలట. ఆ కలలతో నొప్పు పరాదేవి లలిత "శాంత్యతీత కలాత్మికా" అని కీర్తింపబడుచున్నది. స్వరములయిదు కాదు. ఆరని, ఆ ఆరు స్వరములు ప్రపంచమునకు మూలమని తంత్రాలోకమనే గ్రంధము బోధించుచున్నది.

"స్వరాణాం షట్క మేవేహ మూలం స్యాద్వర్గ సంతతౌ" - తంత్రాలోక -124

ఈ స్వరములు చంద్రుని కళలు (తిధులు) అని 'పరాత్రింశిక' యను గ్రంధము చెప్పుచున్నది.

"అథాద్యాస్తిథయస్సర్వే పర్యా బింద్వవ సానతః ।" - పరాత్రింశిక-98

స్వరమనగా ధ్వని, నాదమని కాళిదాసమహాకవి కుమార సంభవకావ్యమున పార్వతీ దేవిని వర్ణిస్తూ, ఆమె కంఠస్వరం ముందు ఇతర స్వరములన్నీ అపస్వరములుగాను, వీణాది వాయిద్యముల స్వరములు, తంత్రులు (తీగెలు) లేనివాని స్వరములు గాను తేలిపోయిన వట. ఆమె స్వరఝరి అమృత ప్రవాహమట.

"స్వరేణ తస్యామమృతస్రుతేవ ప్రజల్పితాయా మభిజాతవాచి ।

అప్యన్యపుష్టా ప్రతికూలశబ్దా శ్రోతుర్వితంత్రీరివ తాడ్యమానా"

- కుమారసంభవం-1-45

"తత్ర యా స్వరసందర్భమఖగా వాదరూపిణీ ॥"

- తంత్రాలోక

తంత్రాలోక మనే గ్రంథము సప్తస్వర విభూషితమై వాదరూపిణి యగు వేదమాత భువియందావిర్భవించిందని చెప్పినది. ఈ విషయమును వేదము తైత్తిరీయోపనిషత్తులోని శిక్షావల్లిలో తెల్పినది.

"శీక్షాం వ్యాఖ్యాస్యామః । వర్ణః । స్వరః । మాత్రా ।

బలం । సామ । సంతానః । ఇత్యుక్తః శీక్షాధ్యాయః ॥"

వేదశబ్దమవగతము కావలెనన్న 'శిక్ష' అవసరము. ఆ శిక్షలో ఆరు ప్రధానము. వర్ణము, స్వరము, హ్రస్వ, దీర్ఘ, ప్లుతాది మాత్రలు, బలము, సామ, (సమత్వము) విస్తారమని ఆరు శిక్షాస్థానములని వేదము తెల్పుచున్నది. అందు 'సామ' అనుదానికి రామానుజాచార్యుల వారు భాష్యమున సామయనగా సప్తస్వరములని వ్యాఖ్యానించారు. ఇక ఉపనిషత్తులు, వేదములు స్వరమునిట్లు, నిర్వచించినవి.

1. "సమాన ఉ ఏవాయం చాసౌ । స్వర ఇతీమమాచక్షతే । స్వర ఇతి ।

ప్రత్యాస్వర ఇత్యముం । తస్మాద్వా ఏతమముం చోద్గీథముపాసత"

- *ఛాందోగ్యోపనిషత్ -1-3-2.*

ఇందు స్వరమనగా గమనము గల్గునది అని అర్థము.

"స్వరతీతి స్వరః" అని స్వర శబ్దమును శంకరాచార్య భాష్యము నిర్వచించినది. స్వరతి అనగా పోవునది అని అర్థము. ప్రాణము, సూర్యుడు ఇద్దరు గమన శీలురుగాన ఇర్వురు సమానమే. ఇద్దరికీ 'స్వర' మని పేరు. అయితే పోయిన ప్రాణము తిరిగి రాదుగాని సూర్యుడు మరల వస్తాడు గనుక ఆయనకు "ప్రత్యాస్వరః" అని పేరు.

"య ఆదిత్యః స్వరఏవ సః".

"ప్రాణః స్వరః । ప్రజాపతిః స్వరః । శ్రీర్వై స్వరః"

అని జైమినీ యోపనిషత్తు, తాండ్యమహాబ్రాహ్మణములు చెప్పుచున్నవి. సూర్యుడు, ప్రాణము, ప్రజాపతి, శ్రీ వీరందరికి "స్వర" వ్యవహారము గలదు. ఋగ్వేదము మంత్రరాశిని "అభిస్వర"మని వర్ణించింది.

"సమీం రేభాసో అస్వరన్నింద్రం సోమస్య పీతయే ।

స్వేపతిం యదీం వృధే ధృతవ్రతో హ్యోజసా సమూతిభిః ॥" 

- *ఋగ్వేద -8-97-12-13.*

రేభాది మహర్షులు మేకరూపమును ధరించిన ఇంద్రుని స్వరములతో అనగా వేదమంత్రము లతో స్తుతించిరి అని అర్థము. 'అస్వరన్' అనగా స్తోత్రము చేసిరని అర్థము. 'అభిస్వరా' అనగా వేదమంత్ర రూప స్తోత్రములతో అని అర్థము. కాన మంత్రమే స్వరము అగును.

"ప్రాణః స్వరః" ప్రాణము స్వరము. "ప్ర అణః ప్రాణః." అణః అంటే శబ్దము. ఇట్లు ప్రాణః అంటే ప్రకృష్టమైన శబ్దము - వైదిక శబ్దము. ఈ వేదశబ్దమే స్వరము.

లలితాదేవి యొక్క "ప్రాణేశ్వరీ" అను నామమునకు సౌభాగ్యభాస్కర వ్యాఖ్యానములో "ప్రకృష్టః అణః శబ్దః వేదరూపః" అని వేదశబ్దము ప్రాణమని, అది స్వరమని తెలియనగును. పరమేశ్వరుని ప్రాణము వేదముగదా! ప్రాణమంటే ఊపిరి, శ్వాస (యస్యనిః శ్వసితం వేదాః). ఈ ప్రాణగతులు ఏడని అవే ఏడు స్వరములనీ వ్యాఖ్యానం ద్వారా తెలుస్తున్నది.

"ఏష వై సూర్యోభూత్వా అముష్మిన్ లోకే స్వరతి ।

తద్యత్ స్వరతి । తస్మాత్ స్వరః । తత్స్వరస్య స్వరత్వమ్ ॥"

*గోపథ పూర్వబ్రాహ్మణమ్ 5-14*

సూర్యమండలము స్వరమండలము. ఋగ్వేదము సూర్యమండలము. యజుర్వేదము సూర్యమండలమందలి పురుషుడు. సామవేదము సూర్యకిరణములు. ఈ విధముగ సూర్యుని తేజస్సు లోకమున స్వరముగ రూపొందుచున్నది. సూర్యుడు సప్తకిరణుడు -ఆయన రథము యొక్క సప్త అశ్వములు సప్త కిరణములు. అవియే సప్తస్వరములు. అవి నెమలి, ఆవు, ఏనుగు, కొంగ, గుఱ్ఱము, మేక, కోకిలల స్వరరూపమున వెలుగొంది లోకమున సప్త స్వరములుగా వెలిసినవి. కావున పై జంతువులను జంతువులుగా చూడక లోక కల్యాణ కరములగు స్వరములు గలగాయకులుగా దర్శించాలని వేదమాత బోధ. ఆస్వరములు నిషాద, ఋషభ, గాంధార, షడ్జ, మధ్యమ, ధైవత, పంచమములు.

1. "నిషాద మనగా నిషీదతి పరమేశ్వరః అస్మిన్నితి నిషాదః ।" ఇందు పరమేశ్వరుడు ఉండునని అర్థము. ఇది ఏనుగు యొక్క ధ్వని - స్వరము.
2. "ఋషతి హృదయం ప్రవిశతీతి ఋషభమ్ ।"
   హృదయమును ప్రవేశించునది ఋషభము. ఇది గోవు యొక్క అంబారవము.
3. "గాం ధరతీతి గాంధారమ్" గోశబ్దము పరమేశ్వరునికి, వేదమునకు వాచకము. అట్టి గోవును ధరించునది గాంధారము. ఇది మేక ధ్వని - స్వరము.
4. "షడ్జం - షట్సు స్థానేషుజాయత ఇతి ।"
   నాసిక, కంఠము, రొమ్ము, దవడలు, నాలుక, దంతములనెడు ఆరుస్థానములందు పుట్టినది. ఇది నెమలి ధ్వని - స్వరము.
5. మధ్యమం - స్వరముల మధ్యనున్నది, మధ్యావయవమగు నాభినుండి బుట్టినది. ఇది కొంగ ధ్వని - స్వరము.
6. "ధైవతం - ధీమద్భిర్గీయత ఇతి । నాభ్యాదిస్థానేభ్యః ధావతివా ।"
   బుద్ధిమంతులచే పాడబడునది. నాభిమొదలగు స్థానములనుండి బుట్టినది. ఇది గుఱ్ఱము యొక్క ధ్వని - స్వరము.

7. పంచమః "వాయుస్సముత్థితో నాభేరురోహృత్కంఠ మూర్ధసు, సంచరన్ పంచమ స్థాన ప్రాప్త్యా పంచమ ఉచ్యతే" నాభి, రొమ్ము, హృదయము, కంఠము, శిరస్సు అనెడి అయిదు స్థానముల నుండి బుట్టి పంచమ స్థానమును పొందుటచే పంచమము. "పికైః పంచ్యత ఇతి పంచమః" కోయిలలచే విస్తరింపజేయబడినది పంచమము. ఇది కోయిలధ్వని. బాగా మదించిన నెమలి స్వరము గూడ పంచమమని అగ్ని పురాణవచనము.

"షడ్జం మయూరోవదతి గావస్త్వృషభభాషిణః ।
అజావికం తు గాంధారం క్రౌంచః క్వణతి మధ్యమమ్ ।
పుష్పసాధారణే కాలే పికః కూజతి పంచమమ్ ।
ధైవతం హేషతే వాజీ నిషాదం బృంహతే గజః ॥
మయూరాదయ ఏతేహి మత్తా గాయన్తి పంచమమ్"

ఈ శ్లోకములే అమరకోశములో గూడ నున్నవి. ఈ ఏడు స్వరములు - "స,రి,గ,మ, ప,ద,ని" అని లోక ప్రసిద్ధి గాంచినవి, ఇవి జగత్తును పవిత్రము చేయునవి. వాతావరణ, శబ్ద కాలుష్య నివారకములు. లోక కల్యాణ కారకములగు పూజ్యధ్వనులు.

నిషాద మంటే మనస్సు అందు లీనమగునని, చివరి స్వరమగుటచే స్వరములన్నియు నందులోనే నిమిడి యున్నవని పరమేశ్వరుడు గూడ అందు ఇమిడి యున్నాడనీ, అమర కోశము ద్వారా తెలియును. అందుకనియే పరాదేవి, శ్రీదేవి నిరంతరము హస్తి నాదముచే ప్రబోధింపబడుచున్నదని శ్రీసూక్తము తెల్పుతోంది.

"అశ్వపూర్వాం రథమధ్యాం హస్తి నాదప్రబోధినీమ్".

హస్తి అంటే ఏనుగు. హస్తి నాదమనగా నిషాదస్వరము. శ్రీదేవి నిరంతరం నిషాద స్వరముచే ప్రబోధింపబడుచున్నదట. శ్రీదేవికి నిషాద స్వరమన్న ప్రీతి. గణపతి పుట్టుచునే 'ఉమా' అని నాదం - శబ్దం చేస్తూ పుట్టాడట. "ఉమేతి శబ్దం కుర్వాణః" ఆ నాదమే నిషాదస్వరము. ఈ స్వరలక్షణమునే లను ఋగ్వేదము మండూక సూక్తము ద్వారా లోకమునకు అందచేస్తోంది.

మండూకసూక్తము :-

"సంవత్సరం శశయానా బ్రాహ్మణా వ్రతచారిణః ।
వాచం పర్జన్య జిన్వితాం ప్రమండూకా అవాదిషుః ॥"
"గోమాయురేకో అజమాయు రేకః
పృశ్నిరేకో హరితఏక ఏషామ్" *- ఋగ్వేద 7-103-1-6.*

వర్షర్తువు రాగానే శ్రావణ పూర్ణిమనాడు వ్రత నిష్ఠులగు బ్రాహ్మణులు వేదాధ్యయనం చేస్తారు. ఆ వేదవాక్కు మేఘములను వర్షించ ప్రేరేపించును. సంవత్సరమంతా దీక్షలోనున్న బ్రాహ్మణుల వలె సంవత్సర మంతా వేసవి కాలంలో చెరువులోని మట్టిలో కల్సిపోయి, వర్షర్తువురాగానే ఆ మట్టిలో నుంచి పుట్టిన మండూకములు (కప్పలు) గూడ ధ్వని చేయ నారంభించినవి. ఈధ్వని వేద ధ్వనియే. ఈ ధ్వనికి మేఘములు పులకించి వర్షించును.

ఈ కప్పలు గురు శిష్యుల అధ్యయనము వలె ధ్వనిస్తున్నవి. కప్పలు రెండు రకములు. ఆకుపచ్చనిది. తెల్లనిది. పై మంత్రములో మాయుః అనగా ధ్వని అని అర్థము. గోమాయుః అంటే అంబారవము । ఋషభస్వరము. అజమాయుః అంటే మేక ధ్వని, గాంధార స్వరము. ఆకుపచ్చని కప్ప గురువు గారి స్థానమున నుండి గాంధారస్వరములో చెప్పగా శిష్యస్థానములో నున్న తెల్ల కప్ప ఋషభస్వరములో అనుసరించుచున్నదని మంత్రార్థము. దీనిని బట్టి వేదాధ్యయన మందుగాని, సంగీత శాస్త్రా భ్యాసమున గాని గురువు గాంధారస్వరములో చెప్పగా శిష్యుడు ఋషభస్వరములో చెప్పాలని వేదము బోధిస్తోంది.

ఇక నిరుక్త శాస్త్రములో స్వర, సంస్కారములు పదార్థ విజ్ఞానమును తెలుపు శక్తి విశేషములని యాస్కమహర్షి చెప్పుచున్నాడు.

"తద్యేషు పదేషు స్వరసంస్కారౌ సమర్థౌ ప్రాదేశికేన
గుణేనాన్వితౌ స్యాతాం తథా తాని నిర్బ్రూయాత్"

- నిరుక్తశాస్త్రం -2-1-1.

రఘువంశమహాకావ్యమున కాళిదాస మహాకవి స్వర సంస్కారముల గూర్చి వర్ణించిన తీరు గమనింపదగినది.

"స్వర సంస్కారవత్యాఽసౌ పుత్రాభ్యామథ సీతయా ।
ఋచేవోదర్చిషం సూర్యం రామం మునిరుపస్థితః ॥"

రఘువంశ -15-76

పుత్రులగు లవకుశులతో గూడిన సీతతో వాల్మీకి మహర్షి శ్రీరాముని సేవించెను. అది ఎట్లున్నది? స్వర సంస్కారములతో గూడిన గాయత్రీ మహామంత్రముతో సూర్యుని ఉపాసించి నట్లున్నదట. సీతాదేవిని స్వర సంస్కారములతో గూడిన గాయత్రీ పరాదేవతగా, వేదమాత స్వరూపిణిగా కాళిదాసు చూపినాడు. భాగవతం గూడ స్వరముల గూర్చి బోధించినది.

"స్పర్శః తస్యాభవజ్జీవః స్వరోదేహ ఉదాహృతః ।
సప్త స్వరాః ప్రజాయన్తే విహారేణ ప్రజాపతేః ॥

- భాగవతమ్ -3-12-46.

ప్రజాపతియొక్క దేహము పర్వులు (హల్లులు). స్వరములు జీవము. ప్రజాపతి యొక్క విహారము నుండి అనగా క్రీడ నుండి సప్త స్వరములుద్భవించినవి అని అర్థము.

ఇక అధ్యాత్మపరముగ స్వర పరిశీలన చేద్దాము- యోగ సమాధిని అభ్యసించు సాధకుడు చెవులను మూసికొనియున్నపుడు (శ్రోత్రేంద్రియమును నియమించినపుడు) దివ్యనాదము వినపడునని ఉపనిషత్తులు తెల్పుచున్నవి. ఆ నాదమే ఓంకారనాదము. వెన్నెముక నుండి ఆనాదము పుట్టునట. క్రమక్రమముగ దుందుభిధ్వని, శంఖధ్వని, వేణుధ్వని, భేరీధ్వని, వినబడును. ఆ వెన్నెముకయే వీణాదండమనీ వేణుదండమనీ చెప్పబడును. ఆ దివ్యనాదము వేణునాదము. ఈ ఓంకార నాదము స్వరముగద. ఇది దేహములోని మూలాధారమున "పరావాక్కు" అను పేరుతోనుండును. ప్రాణానల సంయోగముతో నాస్వరము సప్తస్వరములై వైఖరీ రూపమున బయల్వెడలు చున్నదని త్యాగరాజస్వామి వారు అనేక కీర్తనల ద్వారా లోకమునకు తెలియబరచినారు. సప్తస్వరములను స్వరసుందరులనుగా త్యాగరాజ స్వామి వారు దర్శించారు. ఈ స్వర సుందరుల ద్వారా స్వరసౌందర్యమును, తద్వారా వేదమాతృసౌందర్య మును తనివి తీరా దర్శించి తామగూడ స్వరసుందరుడు, స్వర మయుడై ధన్య జీవి అయ్యాడు. "సద్యోజాతాది పంచవక్త్రజ సరిగమ పదని వరసప్తస్వర విద్యాలోలం - నిగమోత్తమ సామవేదసారం వారతనుం శంకరం వారం వారం నమామి." "శోభిల్లు సప్తస్వర సుందరులను భజింపవే మనసా। నాభి, హృత్కంఠ, రసనా నాసాదుల యందు, వర గాయత్రీ హృదయమున".

శివునికి "సద్యోజాత, వామదేవ, ఈశాన, అఘోర, తత్పురుష" అనెడు అయిదు ముఖముల నుండి స,రి,గ,మ,ప,ద,ని అని ఏడు స్వరములావిర్భవించినవి. ఆ స్వర విద్య అంటే శివునికి ప్రీతియట. ఈ స్వరములు వేదములలో నుత్తమమైన సామవేదము యొక్క సారము. అదే వేదస్వరము. అదే ఓంకారనాదము. ఆ నాదమే శివుని దేహము. అట్టి శివుని నమస్కరింతును. ఈ స్వరమే నాదస్వరము. మంగళస్వరము అని అర్థము.

ఓంకార నాదమునుండి ఆవిర్భవించిన సదాశివమయములగు స్వరములగూర్చి, స్వరతత్త్వమున్నుతెలిసికొన్న వారు జీవన్ముక్తులట. "సదాశివమయమగు నాదోంకార స్వరవిదులు జీవన్ముక్తులు" అని, "రాగసుధారసపానము చేసి రాజిల్లవే మనసా" యని మానవాళిని గూర్చి ఉద్బోధించారు. " స్వరరాగ సుధారసయుత".

ఇట్లు అనేక కీర్తనలు కానవచ్చును. చివరగా మురళీ కృష్ణుని వేణుగానము సామ వేదగానమని చెప్పారు. హనుమంతుడు స్వర ద్రష్ట, స్వరమయుడుగాన "స్వరాయనమః" అని కీర్తింపబడుచున్నాడు.

"ఉరః కంఠ గతాం వాచం వదతి మధ్యమే స్వరే" - రామాయణము.

హనుమంతుని వాక్కు మధ్యమ స్వరములో నున్నదట.

లక్ష్మీ దేవి సహస్రనామములలో "స్వర వ్యంజన వైఖరీ" అని కీర్తింపబడుచున్నది.

దేవాలయములలో ఘంటావాదము ఓంకారవాదము. అదియును స్వరమే. కనుక పూజాదులలో ఘంటావాదము వినిపించును. సంగీత విద్వాంసులందరు విధిగా నొక స్వర పేటిక నుంచు కొందురు. దాని నుండి వచ్చు స్వరమును 'శ్రుతి' అంటారు. శ్రుతి అంటే వేదమే. ఈ వేదరూప స్వరము హెచ్చు తగ్గులు లేకుండగా సమముగానుండును. సంగీత విద్వాంసుడు తన గాత్రమును పెంచినను తగ్గించినను, శ్రుతి రూపస్వరము విద్వాంసుని స్వరమును పరిరక్షిస్తూ, కాపాడుతూ ఉంటుంది.

అట్లు విద్వాంసుని స్వరమును సమస్థాయిలో నుంచుతూ కాపాడ గల్గిన శక్తి శ్రుతి రూపస్వరమునకే గలదు. అట్లు సమత్వములో నుంచునది గావున స్వరమునకు 'సామ' యనిపేరు. సామవేదమే స్వరము. స్వరమే సామవేదము. అందుకనియే త్యాగరాజస్వామి వారు -

"సామనిగమజ సుధామయ గాన విచక్షణ"
"వేదశిరోమాతృజ సప్తస్వర నాదాచల దీప"
"మురళీగాన వినోద" అని శ్రీరాముని ప్రార్థిస్తున్నారు.

శ్రీరాముడు సామవేదము నుండి బుట్టిన అమృత గానమందు పండితుడు. వేదములకు శిరము ఓంకారము. ఓంకారము నుండి సప్తస్వరములు పుట్టినవి. ఆ సప్తస్వరములకు దీపమువంటి శ్రీరాముడు యాదవకులమున శ్రీకృష్ణుడుగా నవతరించి సామగానరూప మురళీగానముతో లోకమును వినోదింపజేసెనని అర్థము.

ఈ విధముగ స్వరముల గూర్చి, స్వరతత్త్వము గూర్చి తెలిసికొని అందరు స్వరరూపులగు వేదమును, పరమేశ్వరుని సేవించి, ఆరాధించి, గానము చేసి, స్వరసుందరులగుదురు గాక! వేదమాత యొక్కయు, స్వర సుందరుల యొక్కయు ననుగ్రహ పాత్రులగుదురు గాక!

ఇతిశమ్

"నమామ స్వరసుందరీమ్"



## "పాహిం గృహీష్వ పాణినా"

"సంబంధ మాభాషణ పూర్వమాహుః" అని కాళిదాస మహాకవి - సంభాషణ వలన గల్గు సంబంధము స్నేహమని చెప్పినాడు. ఇర్వురి మధ్య సంభాషణ లేనిచో ఎవరెవరో? ఏమిటో? తెలియదు. సంభాషణమ బట్టి సఖ్యమో, వైరమో తెలుస్తుంది. స్నేహ ప్రయోజనము ఉపకారమనీ, వైర ప్రయోజనమపకారమనీ, అట్లే ఉపకారలక్షణము స్నేహము, అపకార లక్షణము వైరమనీ, రామాయణము తెల్పుతోంది.

"ఉపకారఫలం మిత్ర మపకారో2 రిలక్షణమ్" -రామాయణం, కిష్కింధకాండ

మానవునికి స్నేహితుడవసరము. స్నేహం చాల ప్రధానమైనది. శోకముతో దహించుకొని పోవువానికి స్నేహితుని దర్శనము ఔషధమని మహాభారత వచనము.

"సరవ్య శోక దగ్ధస్య సుహృద్దర్శన మౌషధమ్" - మహాభారతమ్.

అట్లు సుఖ దుఃఖములలో మానవునికి స్నేహితుడే గతియట.

"దుఃఖితః సుఖితోవా2 పి సఖ్యుర్నిత్యం సఖా గతిః" - రామాయణమ్.

"బహు మిత్ర కరః సుఖం వసతి" - మహాభారతమ్.

అనేకమంది మిత్రులు గలవాడు, మిత్రుల సంపాదించుకొనగల్గినవాడు సుఖముల నొందును. అని భారతము. స్నేహితుని సంపాదించుకొనుట చాల కష్టము. ఎట్టివారితో స్నేహం చేయాలి? స్నేహితుడనగా ఎవరు? ఎటువంటివాడు? స్నేహం ఎట్లు చేయాలి? వీని సమాధానములు రామాయణం ద్వారా తెలియనగును.

శ్రీరాముడు సుగ్రీవునితో స్నేహము చేయగోరినాడు. శ్రీరాముడు నరుడు, సుగ్రీవుడు వానరుడు. వీరిద్దరికి - నర, వానరులకు స్నేహము పొసగునా?

యాన్తి న్యాయ ప్రవృత్తస్య తిర్యంచో2పి సహాయతామ్ ।

తిర్యంచో2పి పరిచయమమరుధ్యంతే । - ఉత్తరరామచరితమ్

తిర్యగ్యోనయో2 ప్యుపకృత మవగచ్ఛన్తి । - ప్రతిమానాటకమ్

న్యాయ, ధర్మ మార్గములలో ప్రవర్తించువారికి పశుపక్ష్యాదులు సైతం స్నేహమును, సహాయమును అందజేయును. ఆ జంతువులు తాము చేయు స్నేహమును, తమకు చేసిన సహాయమును మరచిపోవు. జ్ఞాపకముంచుకొంటాయి. కనుక రామ సుగ్రీవుల స్నేహము, వారికి మాత్రమే గాక లోకకల్యాణకరమైనది, దృఢమైనది.

సతాం సద్భిః సంగః కథమపి పుణ్యేన లభతే - ఉత్తరరామచరితమ్

సత్పురుషులకు సత్పురుషులతో సమాగమము, స్నేహము ఎంతో పుణ్యం చేసికొంటే గాని లభ్యము గాదు. ఆ స్నేహము లోకమునకు గూడ పుణ్యకారకము. శ్రీరాముడు సుగ్రీవునితో మైత్రి కోరగానే సంతోషంతో సుగ్రీవుడు.

"తన్మమైవైష సత్కారో లాభశ్చైవోత్తమః ప్రభో ।
యత్త్వ మిచ్ఛసి సౌహార్దం వానరేణ మయా సహ ॥
రోచతే యది వా సఖ్యం బాహురేష ప్రసారితః ।
గృహ్యతాం పాణినా పాణిః మర్యాదా బధ్యతాం ధ్రువా ॥" - రామాయణమ్

వానరుడైన నాతో నీ స్నేహము నాకు గొప్ప సత్కారము, లాభమున్నూ. నాతో స్నేహం చేయదలిస్తే ఇదే నా చేతిని చాచితిని. నీచేతితో నాచేతిని గట్టిగా పట్టుకొనుము. ఈ స్నేహము శాశ్వతమైన బంధమగునట్లు కట్టుబాటు చేయుము.

"ఏతత్తు వచనం శ్రుత్వా సుగ్రీవేణ సుభాషితమ్ ।
స ప్రహృష్టమనా హస్తం పీడయామాస పాణినా ॥" - రామాయణమ్

సుగ్రీవుని మాటలకు సంతసించి రాముడు సుగ్రీవుని చేతిని తన చేతితో గట్టిగా పట్టుకొనెను. అట్లు చేతిని చేతితో గట్టిగా పట్టుకొనుట స్నేహబంధము. పాణిగ్రహణమని చెప్పబడుతుంది. స్నేహమున ఇద్దరు క్రొత్తగా కలిసికొన్నపుడు Shakehand అని అనటం ఈ రోజుల్లో నవనాగరిక సంప్రదాయమైనా అది పాతదే. అపుడు

"హృద్యం సౌహృదమాలంబ్య పర్యష్వజత పీడితమ్ ।"

పరిశుద్ధహృదయములతో సహృదయులు, సుహృదులు అనగా స్నేహితులై వారిరువురు గట్టిగ కౌగిలించుకొనిరి. తరువాత హనుమంతుడు జమ్మికొమ్మలను చిలికి అగ్నిని ప్రజ్వలింపచేసెను. ఆ స్నేహితులు ఇద్దరు అగ్నిని పూలతో పూజించిరి.

"తతో2 గ్నిం దీప్యమానం తు చక్రతుశ్చ ప్రదక్షిణమ్ ।
సుగ్రీవో రాఘవశ్చైవ వయస్యత్వముపాగతౌ ॥"

శ్రీరాముడు, సుగ్రీవుడు అగ్నికి ప్రదక్షిణము చేసి అగ్నిసాక్షిగ స్నేహితులయిరి. అగ్ని సాక్షిగ స్నేహమును బొందిరి. అపుడు వారిరువురు ఇట్లు అగ్నిహోత్రుని వద్ద ప్రమాణము చేసికొనిరి.

"త్వం వయస్యో2 సి మే హృద్యో హ్యేకం దుఃఖం సుఖం చ నౌ"

మన మిరువురము సుహృదులమైతిమి. ఇకనుండి మన ఇద్దరి సుఖదుఃఖములు ఒక్కటియే అని ప్రమాణము చేసిరి. రాముడు మరల సుగ్రీవునితో స్నేహమునకు ఫలము ఉపకారము గాన వాలిని చంపి, నీ భార్యను నీకు సమకూర్చి, ఉపకారము చేయుట నా కర్తవ్యమని చెప్పను.

"ఉపకార ఫలం మిత్రం విదితం మే మహాకపే ।
వాలినం తం వధిష్యామి తవ భార్యాపహారిణమ్ ।"

కావున నిజమైన స్నేహము ఒకరి చేతిని మరొకరి చేతితో గట్టిగా పట్టుకొనుట, అగ్నికి ఇద్దరు ప్రదక్షిణం చేయుట, పూజ చేసి అగ్నిసాక్షిగా ప్రమాణం చేసికొనుట, అజన్మాంతము

ఒకరి చేతిని ఒకరు విడువకుండుట అను లక్షణములతో నొప్పును. అగ్నిసాక్షిగనేర్పడు సఖ్యమే సఖ్యము. ఒక శాశ్వతబంధము. విడిపోని, విడతీయలేని, విడతీయరాని అనుబంధము. అనుల్లంఘనీయము, అమూల్యము.

వివాహము గూడ నూతన వధూవరులకు శాశ్వత స్నేహబంధము. కనుకనే దానికి పాణిగ్రహణమని పేరు. వివాహంలో మొట్టమొదట వధూవరులు ఒకరి చేతిని ఒకరు గట్టిగా పట్టుకొందురు. తరువాత మంగళ సూత్రధారణ, తలంబ్రాలు వగైరా పూర్తికాగానే వారిరువురు అగ్నిహోత్రమును ప్రదక్షిణంచేసి, అచట ఏడడుగులు వేసి, ప్రమాణములు చేస్తారు. ఈ ప్రక్రియను "సప్తపది" అని అంటారు. సప్తపది కాకుండా సప్తపది లేకుండా వివాహము సంపూర్ణముగాదు. సప్తపదితో వివాహము పూర్తియగును. ఈ సప్తపదియే సఖ్యమని అమర సింహుడు అమరకోశంలో "సఖ్యం సాప్తపదీనంస్యాత్" అని నిర్వచించెను.

కావున వివాహము పాణిగ్రహణముతో నారంభమై, సప్తపదితో సంపూర్ణమై, భార్యాభర్తలకు శాశ్వత స్నేహబంధమే అగును. స్నేహసంబంధమే। వారిరువురి ద్వారా వారి రెండు కుటుంబములకు గూడ శాశ్వత స్నేహబంధము ఏర్పడుచున్నది. సప్తపదిని జరుపునపుడు చెప్పెడి మంత్రము యొక్క అర్థమును చూద్దాము.

"సఖా సప్తపదా భవ సఖాయౌ సప్తపదా బభూవ సఖ్యంతే।

గమేయగ్ం సఖ్యాత్తే మా యోషగ్ం సఖ్యాన్మే మాయోష్ఠాః॥"

నాతో ఏడడుగులు నడచిన నీవు నాకు సఖివి. నేనుగూడ నీకు సఖుడనైతిని. మనమిర్వురము మన స్నేహమునుండి విడిపోరాదు. శాశ్వతబంధము ఏర్పడినది. ప్రతి కార్యమును మన మిర్వురము కలిసి, సఖులమై, సుహృదులమై, సహృదయులమై నిర్వర్తించుదము అని ప్రమాణం చేస్తారు. 'ఋక్త్వం సామాహమ్' అనగా నీవు ఋగ్వేద స్వరూపిణివి. నేను సామవేద స్వరూపుడను. అనగా మనది వేద సాహచర్యము, వైదిక స్నేహము గాని సాధారణమైనది గాదు. మన ఇద్దరి సుఖదుఃఖములు ఇకనుంచి ఒక్కటే. ఇట్లు విడిపోని, విడదీయరాని స్నేహమును "సంపృక్తత్వము" అని వాగర్థముల - పార్వతీ పరమేశ్వరుల - సాహచర్యము (వాగర్థావివ సంపృక్తౌ) అని కాళిదాసమహాకవి ప్రబోధించినాడు.

ఇట్టి సంబంధమే - స్నేహమే భారతీయ వివాహ వ్యవస్థ. పాశ్చాత్యులకు ఇతర విదేశీయులకు ఇట్టి వివాహ వ్యవస్థ - స్నేహబంధములేదు. వారెపుడు కావాలంటే అపుడు విడిపోవచ్చును. మరల ఇంకొకరితో స్నేహము, వివాహము చేసికొవచ్చును. వారు మళ్ళీ విడిపోవచ్చు, మళ్ళీ ఇంకొకరితో కలవవచ్చు. నియమములు, దీక్షలు లేవు. వారి వివాహము తాత్కాలికము, క్షణికము, నశ్వరము. మన భారతీయ వ్యవస్థలో ఇట్లు విడిపోవుట, మరల కలియుట కుదరదు. నీతి, నియమములు, వైదిక మంత్రములు, అగ్నిహోత్రము, మంగళ వాయిద్య ములు, వగైరా ఉంటాయి. ఎచటనైనా పశుప్రవృత్తి, కామవాంఛ, పవిత్రప్రేమ -

ఇంటువంటివి చోటుచేసికొన్నచో నచట నీపవిత్ర స్నేహబంధమునకు వ్యాఘాతము గల్గు చుండుట కనపడుచున్నది. దురదృష్టము, దుఃఖకరము. నేడు చాలమంది కేవల పవిత్ర ప్రేమలో మునిగి తేలుతూ సుఖంగా ఉంటున్నారు. వారికి కామ ప్రవృత్తి తప్ప ఇంకేమీ అక్కరలేదు. నవనాగరికులుగద! వైదిక సంస్కారాలు, వేదమంత్రాలు సప్తపది, స్నేహం, ఇదంతా పిచ్చి గోలగా ఉంటుంది.

రామాయణంలో, సీతారామ కల్యాణ ఘట్టంలో పాణిగ్రహణం గూర్చి వాల్మీకి మహర్షి ఇలా వివరించినాడు. జనకమహారాజు రామునితో చెప్పు మాటలివి.

"ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ ।
ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా ॥"

"ఈమె నా కూతురు సీత. నీకు సహధర్మచారిణి. ఈమెను స్వీకరించు. ఈమె చేతిని నీ చేతితో పట్టుకో. నీకు మంగళము అగుగాక". వసిష్ఠ మహర్షి ఆదేశానుసారం రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు సీత, ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తుల చేతులను తమ చేతులతో గ్రహించి వివాహమాడిరి. కాన పాణిగ్రహణమే వివాహ బంధమని అది శాశ్వతసఖ్యమని రామాయణ ప్రబోధము. పెళ్ళిలో అప్పగింతలపుడు చెప్పే శ్లోకం ఇదుగో -

"అష్ట వర్షా భవేత్కన్యా పుత్రవత్పాలితా మయా ।
ఇదానీం తవ దాస్యామి దత్తాం స్నేహేన పాలయ ॥"

"ఎనిమిదేళ్లుగల మా కన్యను నీకు దానం చేస్తున్నాము. ఆమెను జీవితాంతం స్నేహంతో పాలించుమా" అని అర్థం.

"అద్వైతం సుఖదుఃఖయోరనుగతం సర్వాస్వవస్థాసు యత్
విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్న హార్యో రసః ।
కాలేనావరణాత్యయాత్పరిణతే యత్స్నేహసారే స్థితం
భద్రం తస్య సుమానుషస్య కథ మప్యేకం హి త త్ప్రార్థ్యతే ॥"

- ఉత్తర రామచరితమ్

భార్యాభర్తల దాంపత్యము స్నేహము. అది నిశ్చలము. సుఖదుఃఖములలో గూడ పెనవేసుకొని, ఎన్ని కష్టములు వచ్చినను, వృద్ధాప్యము వచ్చినను తరిగిపోనిది. కాలముగడిచి పోవుచున్న కొద్ది చెరగనిది. ఎన్ని అవాంతరములు వచ్చినను వారి స్నేహము దృఢముగనే ఉండును. హృదయములకు ఎల్లవేళల, ఎట్టి స్థితిగతులలోను విశ్రాన్తిని సమకూర్చునట్టి వారి శాశ్వత స్నేహబంధమైన దాంపత్యము భద్రముగా నుండు గాక! అని అర్థము. సుఖదుఃఖ ములలో భార్యకు భర్తయే స్నేహితుడు. భర్తకు భార్యయే స్నేహితురాలు, గతి అని తెల్పికోవాలి. కాళిదాస మహాకవి ఆ దంపతుల స్నేహం, బంధము జన్మ జన్మాంతరములలోను మనస్సున స్థిరముగ నుండునని తెల్పినాడు.

"భావస్థిరాణి జననాంతర సౌహృదాని" - అభిజ్ఞాన శాకుంతలమ్

ఇక భర్తృహరి మహాకవి నీతిశతకంలో స్నేహితుని, స్నేహముల లక్షణములనిట్లు విశదపరచినాడు.

1. తన్మిత్ర మాపది సుఖేచ సమక్రియం యత్ ।
2. పాపాన్నివారయతి యోజయతే హితాయ ।
   గుహ్యం నిగూహతి గుణాన్ ప్రకటీకరోతి ।
   ఆపద్గతం చ న జహాతి, దదాతి కాలే
   సన్మిత్రలక్షణ మిదం ప్రవదన్తి సన్తః ॥
3. యదినుహృద్ధి వ్యైషథైః కింఫలమ్ ?
4. స్నేహః ప్రవాసాశ్రయాత్ మైత్రీ చాప్రణయాత్ ।
5. రమ్యం సాధు సమాగమాగత సుఖమ్ ।
6. క్షీరేణాత్మగతోదకాయ హి గుణా దత్తాః పురా తే2 ఖిలాః
   క్షీరోత్తాపమవేక్ష్య తేన పయసా స్వాత్మా కృశానౌ హుతః
   గంతుం పావకమున్మన స్తదభవత్ దృష్ట్వా తు మిత్రాపదం
   యుక్తం తేన జలేన శామ్యతి సతాం మైత్రీ పునస్త్వీదృశీ ॥

సుఖదుఃఖములలో కనపడువాడు, ఆదుకొనువాడే స్నేహితుడు. చెడునుండి వారించుచు, హితమును గూర్చుచు, మంచిపనుల ప్రోత్సహించుచు, రహస్యములను గోప్యంగా ఉంచుచు, సద్గుణముల ప్రకటించుచు, ఆపదలలో విడిచిపెట్టక, అవసరమైనపుడు కావలసినదానిని ఇచ్చుచు, సహాయము, ఉపకారము చేయువాడు సన్మిత్రం అనగా మంచి స్నేహితుడు - హితుడు అగును. అతనితో సఖ్యమే సఖ్యము గాని, పైలక్షణములకు వ్యతిరేక లక్షణములు గలవాడు స్నేహితుడు గాదు. అతని స్నేహము ప్రమాదకరము. పాలు, నీరు మంచి స్నేహితులట. వీటి స్నేహము సజ్జనుల స్నేహము వంటిదట. పాలు తన స్నేహితుడగు నీటికి తన గుణములనిచ్చి సహాయపడును. ఉపకారము చేయును. అనగా నీరు పాలుగా మారును. ఆ తర్వాత పాలను కాచునపుడు నీరు అగ్నిలో పడిపోవును. అనగా స్నేహితుడగు పాలను వదిలి ఇగిరిపోవును. అపుడు పాలుగూడా స్నేహితునితో పాటుగ అగ్నిలో పడుటకు సిద్ధపడును. అనగా పాలు పొంగుతాయి. అపుడు స్నేహితుని యాపదను, కష్టమును గ్రహించి, సహించలేక నీరు మరల వచ్చి స్నేహితుడగు పాలను ఆదుకొనును. స్నేహితుని రాకతో సంతసించి పాలు శాంతించును. పొంగు తగ్గిపోవును. ఇట్లు పాలు, నీరు స్నేహితులై సుఖదుఃఖములలో వొకరికొకరు సహాయపడి ఆదుకొన్నట్లు సజ్జనుల మైత్రి యుండునని కవి చమత్కారము.

"విమో2 పి విగాహ్యతే నయః కృత తీర్థః పయసామివాశయః ।
స తు తత్రవిశేష దుర్లభః సదుపన్యస్యతి కృత్యవర్త్మ యః ॥"

*- కిరాతార్జునీయమ్ ।*

మెట్లు, రేవు వగైరా ఏర్పాటు చేస్తే, సరస్సులోకి దిగుట చాల తేలిక. కాని మొదట దిగి-త్రోవ ఏర్పాటు చేసెడి వ్యక్తి దొరకుట కష్టము. అట్లే అన్ని విధములుగ మంచి మార్గమును బోధించు హితుడు దొరకుట కష్టము. అట్టి హితుడే స్నేహితుడు.

అట్టి స్నేహితునితో స్నేహమే శాశ్వతము సుఖప్రదము. అట్టి సహృదయుడైన సుహృత్తుగాని, సహృదయురాలు, హితమునుగోరు, స్నేహితురాలైన భార్యగాని చెంతనున్న చింతయుండదట. రోగగ్రస్తునకు అపుడు మందులు అనవసరము. స్నేహమే దివ్యౌషధము అని కవి వచనము. "యద్భర్తు రేవ హితమిచ్ఛతి తత్కలత్రమ్" భర్త హితమును కోరు స్త్రీయే భార్య. భార్యహితమును కోరుపురుషుడే భర్త. అని కవి వచనము. ఇది ప్రేమానురాగములతోను, భార్య విషయంలో ప్రణయానురాగములతోను పెనవేసికొని యున్నపుడు దృఢము. ప్రణయాను రాగాలు కరువైతే, స్నేహము కనుమరుగై, కరువై, కరిగిపోయి నశించును. అందుకే రామాయణం ఇట్లు చెప్పినది.

"సర్వథా సుకరం మిత్రం దుష్కరం ప్రతిపాలనమ్"

ఎలాగైన స్నేహితుని సంపాదించుట తేలికకాని ఆ స్నేహితునితో చెలిమి నిలుపుకొనుట కష్టము. కాస్త మాట తేడా చాలు. కథ మొదటికి వస్తుంది. అడుగడుగునా విరోధం రాకుండా చూచుకున్నపుడే స్నేహం నిలుస్తుంది.

"స్నిగ్ధజన సంవిభక్తం హి దుఃఖం సహ్యావేదనం భవతి" *- అభిజ్ఞాన శాకుంతలమ్*

మంచి స్నేహితులను సంపాదించటం గొప్పతనమే. దుఃఖము వచ్చినపుడు వారంతా పంచుకొంటారు. అపుడా దుఃఖం పలుచబడి తేలిక యగును. కావున స్నేహితుల అవసరం ఎంతైనా ఉంటుంది. అందుకనే "రాజద్వారే శ్మశానేచ యస్తిష్ఠతి సబాంధవః". రాజద్వారము లోను, శ్మశానంలోనూ అండగా నిలబడువాడే నిజమైన బంధువు - స్నేహితుడు అని అన్నారు.

"విపిపాతితానాం నరాణాం ప్రియకారీ దుర్లభోభవతి" - మృచ్ఛకటికమ్ *10-15*

ఆపదకాలంలో ఆదుకొనువాడు, మేలు చేయు స్నేహితుడు దొరకటం కష్టమని శూద్రక మహాకవి చెప్పినమాట.

"ప్రాణ పరిత్యాగేనాపి రక్షణీయాః సుహృదసవః" - కాదంబరీ

ప్రాణములను లెక్కచేయక, త్యజించి అయినాసరే స్నేహితుని ప్రాణములను కాపాడవలెను. అదే స్నేహితుని లక్షణము. అంతేగాని

"ఎప్పుడు సంపద గల్గిన నప్పుడు బంధువులు వత్తురది ఎట్లన్నన్
తెప్పలుగ చెరువు నిండిన గప్పలు పదివేలు చేరు గదరా సుమతీ"

- *సుమతీ శతకము*

డబ్బులు బాగా ఉన్నతరుణంలో బాగా దగ్గరకు చేరి ఉపకారసహాయములు అందించు నట్లు నటించి, సహాయ సహకారోపకారములను తామందుకొని, సంపదలు పోయి ఆపదలు గల్గుచున్న తరుణంలో కనపడనివారు బంధువులు గాదు. రాబంధువులే. నిజమైన స్నేహితులు గాదు వారు తియ తియ్యని తేనెల మాటలతో... చెరువు బాగా నిండుగ ఉంటే కప్పలు బోలెడు కుప్పలు కుప్పలుగా చేరతాయి. చెరువు ఖాళీ అయితే కప్ప ఒక్కటి గూడ కనపడనట్లు కొంతమంది స్నేహితుల, బంధువుల లక్షణము వివరింపబడినది.

పరమేశ్వరుడు సకల ప్రాణికోటికి, ప్రపంచమునకు మొదటి స్నేహితుడు, హితుడు, వైద్యుడు.

"భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోక మహేశ్వరం ।

సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి॥" - భగవద్గీత

సమస్తలోకములకు, భూతములకు, ఈశ్వరుడను, నియామకుడను, స్నేహితుడను నేనే. నన్ను అట్లు గుర్తించి, తెల్సుకొన్నవాడు శాంతిని పొందును అని అర్థము. ఆ పరమేశ్వరుని "ఆపద్బాంధవ ! జగద్రక్షక! దీనబంధో! అనాథరక్షక! మిత్ర!" అని ప్రార్థిస్తుంటారు.

ఆపదల కాచు పరమేశ్వరుడు స్నేహితుడు. ఆ దేవదేవుని, ప్రాణస్నేహితుని, కష్టకాలంలో "నా చెయ్యి గట్టిగ పట్టుకోవయ్యా, నా చెయ్యి విడవబోకవయ్యా" అని దేవునితో పాణిగ్రహణమునే కోరుచున్నారు. "సర్వ వ్యాధి ప్రశమనీ, సంసారపంక సంమగ్న సముద్ధరణ పండితా, తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదన చంద్రికా" సమస్త వ్యాధుల బారినుండి కాపాడి, సంసారమనే బురదలో మునిగినవారిని ఉద్ధరించి, తాపత్రయమనే అగ్నిచేత తాపమునొందిన వార్కి ఉపశమనమును అహ్లాదమును కల్గించు వెన్నెలయే లలితావరాదేవత. ఆదేవతను "మిత్రరూపిణీ" నిజమైన స్నేహితురాలు అని కీర్తించుచున్నారు. పరమేశ్వరుని శంకర, మృడ, మిత్ర అని నామములతో ప్రార్థించుచున్నాము. "మృడ - సుఖే" అనిధాతువునుండి పుట్టినది మృడశబ్దము. కాన పరమేశ్వరుడు మంగళములను, సుఖమునిచ్చు మిత్రుడట.

ఈ పరమేశ్వరుడు మానవ శరీరంలో (ప్రాణికోటి) లోపల నిగూఢంగా, నిత్య సన్నిహితంగా ఉంటూ ఎల్ల వేళల కాపాడుచు, హితమును గరపుచు స్నేహితుడేయగుచున్నాడు. ఆ స్నేహితుడే లేనినాడు. వదలిన నాడు ఆ శరీరము నశించును. కనుక శక్తి, సామర్థ్యములను, తేజస్సు, బలము మొదలైనవానిని అందజేయుచు, హితుడగు నాపరమేశ్వరునితో సఖ్యమును ఎన్నటికి పోగొట్టుకొనరాదు. నిరంతరము అంతర్ముఖుడై ఆ స్నేహితుని గూర్చి జపతపాదులతో మెప్పించి, స్నేహమును శాశ్వతం చేసికొన్న వాడే ధన్యజీవి. ఆ స్నేహితుని నిర్లక్ష్యం చేస్తే, ఆయన చేతిని వదలివేస్తే, ఆయనగూడ మనలను నిర్లక్ష్యం చేయును. మన చేతినే గాదు. దేహమును గూడ వదిలి వెళ్లిపోవును. ఆయన త్రోవ ఆయనది, మన త్రోవ మనది. కావున పరమేశ్వరుని నిర్లక్ష్యం చేయరాదు.

దేవునివలె వేదము మానవాళికి ప్రధాన మిత్రము. దేవ వేద శబ్దములు పర్యాయ పదములే. వేదము దివ్య మిత్రము. దివ్యౌషధము. మానసిక చికిత్స జేయగల్గిన ప్రధానవైద్య రాజము. ప్రాణికోటికి తాను ముఖ్య ప్రాణసఖినని వేదమనేక మంత్రముల ద్వారా చాటిచెప్పి కొనినది.

"యస్తిత్యాజ సచివిదం సఖాయం నతస్య వాచ్యపి భాగో అస్తి"

వేదాధ్యయనం చేయువారు వేదమునకు సఖులు - ఋగ్వేదము *10-7*

వారిని గుర్తించి, వారితో చెలిమి చేయు వేదమునకు "సచివిత్" అని పేరు. అనగా స్నేహితుని గుర్తించినదనియర్థము. గుర్తించుట అంటే వారికి తత్త్వజ్ఞానమును ప్రసాదించుట అని అర్థము.

"యో2ధ్యేతా సః వేదస్య సఖా" అని పై మంత్రమునకు భాష్యము. వేదము నధ్యయనము చేయు వాడు వేదమునకు సఖుడు - చెలికాడు అని అర్థము. వైరభావములేక, అనగా వేదనింద, నిర్లక్ష్యం చేయక, సుహృద్భావముతో నారాధించువారికి స్నేహ హస్తమును ప్రసాదించును. జీవితాంతము వారిని తన చేత పట్టుకొని యుండును. తన నిజస్వ రూపమును, అనేక రహస్యములను విశదపరచుచు, సమస్యల పరిష్కరించుచు, నిజార్థమును బోధించుచు వారి చేతులను విడువక మహోప కారము చేయుచు నిజమైన దివ్య స్నేహితుడుగా సార్థకమగు చున్నది. వేదముతో విరోధమును పెట్టుకొన్న వారిని, వేద నిందకులను ఆ వేద వాక్కు వజ్రమై హింసించును.

"సవై వాగ్వజ్రో యజమానం హినస్తి" - తనను ఆరాధించు వారికి ప్రబోధ వినయముల నొసగును. "సమ్యగారాధితావిద్యా ప్రబోధవినయావివ!"

అందుచేత ప్రతిమానవుడెవరితోను విరోధం పెట్టుకోరాదు. మనిషి అయినా వస్తువైనా వానితో మంచితనము, స్నేహము హితకరముగాని వైరముపనికిరాదు.

"శుష్కవైరం వివాదం చ న కుర్యాత్కేనచిత్ సహ" అని ఉపదేశము. చివరకు పుత్రునితో గూడ. కన్న కొడుకుతో, వైరము పనికిరాదట. కుమారునికి 16వ సంవత్సరం రాగానే ఇక మిత్రునిగా చూడవలసిందేనని శాస్త్రోపదేశము. పుత్రునికి వివాహము చేసినప్పటినుండి కొడుకు తోను కోడలుతోను స్నేహం తప్ప వేరుగతిలేదు.

"ప్రాప్తే తు షోడశే వర్షే పుత్రం మిత్రవదాచరేత్ ।"

కొడుకు, కోడళ్ళతో స్నేహము లేనిచో ఇంతేసంగతులు. కొడుకుతో పదహారవ ఏట నుండే స్నేహం చేయాలంటే మరి కోడలితో ఎంత స్నేహం అవసరమో? అవసరమాత్మునకే ఎఱుక! ఆ స్నేహము గూడ ఒకప్పుడు పనిచెయ్యదుసుమా! మరి వైరము పెట్టుకుంటే గతి దుర్గతియే. అధోగతియే.

ఇక మానవునికి ప్రధాన శత్రువు తన కోపము, ప్రధాన మిత్రము తన శాంతము అని సుమతి శతకము ద్వారా తెలియనగును.

"తన కోపమె తన శత్రువు
తన శాంతమె తనకు రక్ష దయ చుట్టంబౌ
తన సంతోషమె స్వర్గము
తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ ॥"

క్రోధావేశ పూరితుడైన వాడెంతటి నీచమునకైనా పాలుపడును. ఎంతకైనా తెగిస్తాడు, ఏమి మాట్లాడునది తెలియదు. శాంత, సహనములే వానికి శ్రీరామరక్ష. కోపము, చికాకు, విసుగు మూలంగా ఇంట్లోను, బయట అందరు శత్రువులుగా కనపడతారు. శాంతం కొద్దిగా గూడ లేనిచో ఇల్లు నరకమే। శాంత స్వభావులకు అందరు మిత్రులు, మంచి వారుగాను కనబడతారు. వారికి ఇల్లు స్వర్గసీమ.

సాధారణంగా పుస్తకములు మంచి స్నేహితులని - హితులు, వివేకవంతులు చెప్పు చుందురు. సాధారణ పుస్తకములే స్నేహితులగుచో, కావ్య నాటకాదులు మానవునికి -

"కావ్యం యశసే2 ర్థకృతే వ్యవహారవిదే శివేతర క్షతయే।
సద్యః పరనిర్వృతయే కాంతా సంమితతయోపదేశయుజే ॥"

కీర్తి, అర్థములనిచ్చును. వ్యవహారజ్ఞానమిచ్చి అమంగళముల పోగొట్టును. శత్రునాశమొనర్చును. భార్యవలె మంచి ఉపదేశములనిచ్చును అని అర్థము. అందుకే లోకంలో బుద్ధిమంతులు నిరంతరం కావ్య శాస్త్ర గోష్ఠి వినోదంతో కాలయాపన చేస్తారు. సర్వదా పుస్తకాలతో స్నేహం, సహవాసం చేస్తారు. మూర్ఖులకు పుస్తకములన్న వెంటనే నిద్ర వచ్చును. తలనొప్పి, వాంతిగూడ. అపై వ్యసనములు, పోట్లాటలతో కాలం గడచిపోతుంది. అని భర్తృహరి మహాకవి ఈ క్రింది శ్లోకంలో చెప్పినాడు.

"కావ్య శాస్త్ర వినోదేవ కాలోగచ్ఛతి ధీమతామ్।
వ్యసనేన చ మూర్ఖాణాం నిద్రయా కలహేన వా"

అందుకే నిరంతరం విజ్ఞాన గంధం ప్రసాదించు పుస్తకములు కావ్యాదులునూ,బుద్ధి మంతుల చేతిలో కనబడతాయి. స్నేహితుని నిరంతరం చేతితో పట్టుకొని యుండుట. స్నేహ ధర్మముగద! పైగా పుస్తకముల లంకారములట, "పుస్తకం కరభూషణమ్" గానో Fashion గానో నటనగానో, చేతితో పుస్తకం పట్టుకోవటం ఈనాడు సామాన్యమయిపోయింది. వారి ప్రసక్తి గాదు. వివేక వంతుల ప్రసక్తి ఇది. అట్లయినచో వేదరూప కావ్యము అను స్నేహితుని పాణిగ్రహణం నిత్యము చేస్తే, వారికి జరామరణములు దూరములగునట.

"వేదోవేద విదవ్యంగో వేదాంగో వేదవిత్కవిః"

- విష్ణు సహస్రనామము.

"కవిః కావ్యేన పరిపాహి రాజన్"

"సఖే సఖాయ మజరోజరిష్మే" - ఋగ్వేదము.

రాజాధిరాజు, కవియగు పరమేశ్వరుడు వేదరూప కావ్యంగా అవతరించి, ఆ కావ్యమునే చట్టముగా చేసికొని పరిపాలించుచున్నాడు. అపుడు వేదము పరమేశ్వరుని కంటె భిన్నము గాదు గనుక కవి యగుచున్నది. ఇట్లు దేవునివలె కవి, కావ్యము రెండు తానే (వేదము) అగుచున్నది. అట్టి వేదము మానవాళికి సఖి యగుచు స్నేహితులగు మానవులను నిరంతరం కంటికి రెప్పవలె కాపాడుచున్న, కాపాడగల్గిన దివ్యమిత్రము. ఉపకారము, సహాయము, జ్ఞానము, వివేకము, వినయాదులను ఎన్నియో రహస్యములను, చేయూతలను, ప్రపంచము నకు అందించుచున్న, అందించగల ఉత్కృష్ట, దివ్య మిత్రము వేదమే. ఆ వేదమాత యొక్క స్నేహ హస్తమును గట్టిగ పట్టుకోవాలి. పట్టు సడలించు కోవటం మూర్ఖత్వమే.

చివరిగా - అందుకని ఎదుటి వానిలోని దోషములనే చూడరాదు. ఎక్కువగా పట్టించుకో గూడదు. నూటికి నూరు పాళ్ళు తన మాదిరిగా సద్గుణములు గల వాడుండునా? దొరుకునా? అన్నీ దోషములు గల వాడే ఉండునా? కాస్తకుడి, ఎడమ, తప్పదు. అట్టి వారిని సమన్వయ పరచి, శాంతపరచి, వారితో చేతులు కలుపుట, వారి చేతులు మన చేతులను పట్టుకొనునట్లు చేసుకోవటంలోనే వివేకము అవసరము. అక్కడ కావాలి రోషం. చదువు, పని, స్నేహం వీనిలో రోషం పట్టుదల కావాలిగాని, తగాదాలు, పోట్లాటలు, విడిపోవటాలు, అల్లర్లలో కాదు. ఈ రోషం రోషం గాదు. ఉక్రోషమే. ఒకరితో నొకరు పోటీపడక, తగాదాలు లేకుండా స్నేహంగా ఏకవాక్యతో నుండుట ప్రధానాంశమని Bernard Shah చెప్పెను. "Co operation is more important than competition". అందుకే వేదమాత పదే పదే ఇట్లు మానవాళిని ప్రబోధం చేస్తోంది -

"సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవోమనాంసి జానతామ్ ।

సమానోమంత్రః సమితిః సమానీ

సమానం మనః సహచిత్తమేషామ్ ।

సమానీ వ ఆకూతిః సమానా హృదయాని వః ।

సమానమస్తు వో మనః" - ఋగ్వేదము.

మీ యాలోచనలు, సుఖదుఃఖములు, వాక్కులు, నడకలు, చేష్టలు, కర్మలు, మనస్సులు, హృదయములు సమానముగ ఒక్కటిగా నుండాలి. అట్లు చక్కని హితులుగా స్నేహితులుగ కలిసి మెలిసి మెలగండి. ఒకరి చేతిని ఒకరు గట్టిగ పట్టుకోండి. విడువకండి. జార్చుకోకండి, సుఖశాంతులతో వర్ధిల్లండి అని వేదసఖుని యాదేశము - ఉపదేశము.

బృహదారణ్య కోపనిషత్తు ఇలా హెచ్చరిస్తోంది.

"మైత్రీం భజత అఖిల హృజ్జైత్రీం
ఆత్మవదేవ పరానపి పశ్యేత్ ।
యుద్ధం త్యజత స్పర్ధాం త్యజత
త్యజేత పరేష్వక్రమ మాక్రమణమ్ ॥"

ఈ ఉపనిషద్వాక్యము అత్యంత ముఖ్యమైనది. యావత్ప్రపంచమునకు ఉపదేశము, హెచ్చరిక! ప్రబోధము. ప్రతివారు విధిగా అర్థమును తెలిసికొనవలసిన మహోపదేశము....

ప్రజలారా! అందరి హృదయములను జయించగలిగినది లోకంలో స్నేహమొక్కటియే. ఆ స్నేహమునందరు పాటించండి. అందరు హితులు, స్నేహితులు, సహృదయులు కండు. అందరిని, తోటివారిని తన వంటి వారుగనే చూడండి. యుద్ధమువద్దు. స్పర్ధలు వదలండి. మనః స్పర్ధలు కాలరాయండి. ఒకరితో నొకరు కలహించుకోకండి. అక్రమంగా ఇతరుల స్థలముల ఆక్రమణల నరికట్టండి. ఆక్రమించుకోకండి. అట్లే ఇతరుల అస్తులను ఆక్రమించుకోకండి. పరస్పరం ప్రేమించుకోండి సుఖశాంతులతో వర్ధిల్లండి.

ఇది ఎంత మహోపదేశము! ఇట్లు ఉపదేశించెడు వేదసఖుని ఉపదేశమును కాదు శాసనమును పాటించుటయే కర్తవ్యము. అందుకే అన్నారు. "వాణీం భజతగైర్వాణీమ్" అని. దివ్యసఖియగు, దేవతల వాణియగు వేదవాణిని, సంస్కృత భాషను సేవించండి, తరించండి యని అర్థము. ఇట్లు ఉపదేశమును ఏ ఇతర భాషలు ప్రసాదించలేవు. ఆ సంస్కృత భాష ఉపదేశమే మహర్షుల ప్రబోధము - ఉపదేశము. ఏమని?

"పాణిం గృహ్ణీష్వ పాణినా"

ఇదే సఖియగు వేదమాత యొక్క ప్రధానమైన దివ్యోపదేశము. మహోపదేశము. శాసనము -

సర్వే వై మానవా లోకే
పాణీన్ గృహ్ణన్తు పాణిభిః ।
త్యజన్తు స్పర్ధాం, శాంత్యర్థం
న త్యజన్తు సదా కరాన్ ॥

ఇతిశమ్

"నమామ తాం వేదసఖీమ్"



# వివాహములో బండి కాడి ఎందుకు?

వివాహంలో పాణిగ్రహణం, లగ్నం కాగానే వరుడు వధువు శిరస్సు మీద దర్భలతో చేయబడిన ఇణ్వము నుంచి అందు బంగారముంచి, వాని మీద బండి కాడి యొక్క రంధ్రము ద్వారా మంత్రజలంతో వధువునకు అభిషేకం చేస్తారు. ఈ ప్రక్రియను "యుగచ్ఛిద్రాభిషేక"మంటారు. అపుడు వధువును శుద్ధిగావించుటకి మంత్రమును చదువుచు అభిషేకం నిర్వహిస్తారు.

"ఖే వసః ఖే రథః ఖే యుగస్య శచీపతే ।
అపాలామింద్రః త్రిః పూర్త్వ్య కరత్సూర్యవర్చసమ్" - ఋగ్వేదము

ఓ ఇంద్రా! బండి ఇరుసు కొనల నుండి, రథ రంధ్రము నుండి, కాడి రంధ్రము నుండి జలమును మీద పోసి, మూడు సార్లు పవిత్రముచేసి 'అపాల' యనుకన్యను సూర్య వర్చస్సు కలదానిని చేసితిని. అట్లే ఇపుడీ కన్యను గూడ సూర్యవర్చస్సు కలదానిని చేయుము అని అర్థము.

ఇది ఋగ్వేదంలోని కథ - పూర్వము అపాలయను కన్యక బొల్లి రోగముతో బాధపడుచుండెను. అందుచే నామెనెవరు పెండ్లి చేసికొనుటకు ముందుకు రాలేదు. ఇంద్రుని గూర్చి యాగము చేసినచో రోగము నయమగునని తెలిసికొని యాగము చేయవలెనని కోరిక గల్గియుండెను. అయితే వివాహమైన గాని అయాగము చేయుటకు వీలులేదు. కన్యకధికారములేదు. ధర్మపత్నియైనపుడే అ యాగాధికారము సిద్ధించును. అందుచే అపాలకు కోరిక తీరలేదు. కోరిక కోరికగానే మిగిలి, విచారించసాగెను. ఒకనాడామె నదిలో స్నానము చేయుచుండగా, ప్రమాదవశమున నీటి ప్రవాహమునపడి కొట్టుకొని పోవుచుండగా, అదృష్టవశమున సోమలత యొకటి యామెనోటి దగ్గరకు కొట్టుకొని వచ్చింది. యాగమున సోమలతారసమే ఇంద్రునికి ముఖ్యము, ఇష్టము. ఆమె అతికష్టము మీద ఆలతను పట్టుకొని నమిలి ఆరసమును ఇంద్రుని గూర్చి ఉమ్మివేసెను. ఇంద్రుడు వెంటనే వచ్చి యారసమును స్వీకరించి, తన రధము, ఇరుసు, కాడి వీని రంధ్రముల ద్వారా జలమును ప్రవింపజేసి యామెపై బోసెను. తత్క్షణమే రోగము కుదిరి, ఆమె మంచి సూర్య వర్చస్సుతో తేజరిల్లెను.

ఈ కథాసంప్రదాయముననుసరించి, నూతన వధువు శిరస్సు మీద బండి కాడి నుంచి దాని రంధ్రము ద్వారా వధువును స్నానము చేయించినచో అపాలనువలె, ఈ కన్యను గూడ ఇంద్రుడు శుద్ధిజేసి, పవిత్రురాలిని, సూర్యవర్చస్సుగల దానివిగ చేయునని పై వేదమంత్రము ద్వారా బండి కాడి ప్రయోజనము తెలియనగును.

యుగ శబ్దమునకు కాడి, జంట (సంవత్సరముల సమూహము) శాస్త్రము మొదలగు అర్థములు చాలాగలవు. బండికాడి (యుగం) చేత నూతన దంపతుల జంట (యుగం) కూర్చబడుటచేత, పెండ్లిరోజే ఆ నూతన దంపతులకు యుగాది - ఉగాది. లగ్నం కాగానే వివాహము యుగంతో ప్రారంభమగుచున్నది కాబట్టి వివాహము యుగాదితో అనగా ఉగాదితో మొదలగుచున్నది.

"అధీత సాంగవేదో యః సో2 నూదానో యుగీ గది:" - వైజయన్తీకోశము.

సాంప్రదాయికుడగు వేదవేదాంగ వేత్త, లేక, వేదాధ్యయనపరుడు 'యుగి' అని చెప్పబడు చున్నారు. యుగం గలవారు యుగీ అగును. యుగః అస్యాస్తీతి యుగీ. యుగమంటే వేదవేదాంగములు. కాబట్టి వేదస్వరూప యుగము ద్వారా అభిషేకమంటే వేద మంత్రపూత జలములతో నభిషేకమే. వేదమంత్రములకన్న పవిత్రము, శుద్ధి చేయగల వస్తువు మరొకటి ప్రపంచంలోనే లేదుగద!

మత్స్యపురాణంలో కాడిని (యుగము) గూర్చి రెండు కథలు గలవు.

త్రిపురాసురసంహారమునకు శివుడు వెళ్లుటకు రథము కావలసివచ్చెను. బ్రహ్మాదిదేవతలు శివునకు రథమును తయారు చేసి యిచ్చిరి. ఆ రథము, రథముయొక్క కాడి వర్ణన ఇట్లున్నది.

"ధరాం కూబరకౌ తుల్యౌ రుద్ర పార్శ్వ చరావుభౌ !
చక్రుశ్చంద్రశ్చ సూర్యశ్చ చక్రే కాంచన రాజతే ।
కృష్ణపక్షంచ శుక్లంచ పక్షద్వయమపీశ్వరా: ।
రథనేమి ద్వయంచక్రుః
యుగం కృత యుగం చాత్ర చాతుర్హోత్ర ప్రయోజకా: !
చతుర్వర్ణా: పలీలాశ్చ బభూపుర్వర కుండలా:
తద్యుగం యుగసంకాశం రథ శీర్షే ప్రతిష్ఠితమ్ ।
ఋగ్వేదా: సామవేదాశ్చ యజుర్వేదా హ్యథర్వణా:
వేదాశ్చత్వార ఏవైతే చత్వారశ్చ తురంగమా: ।
అన్నదాన పురోగాణి యాని దానాని కానిచిత్
తాన్యాసన్ వాణినాం తేషాం భూషణాని సహస్రశ: ।"

- మత్స్యపురాణము 131 అధ్యా

బ్రహ్మాదిదేవతలు భూమిని రథముగా చేసిరి. దానికి సూర్యచంద్రులు బంగారు వెండి చక్రములు. శుక్ల, కృష్ణ పక్షములు ఇరుసులు. సత్య, ధర్మ జ్ఞానస్వరూపమగు కృతయుగమే యుగము (కాడి), దాని రెండు కొనలు "కూబరకుల"నబడు శివుని పార్శ్వంలో ఉండువారు.

అట్టి ఆకాడిని భూరథ శీర్షమున కట్టిరి. ఋగ్యజుస్సామాధర్వణ వేదములు నాలుగు గుళ్ళములు. అన్నదానాది దానములన్నీ ఆ గుళ్ళముల కలంకారములట.

కాబట్టి సత్య, ధర్మ జ్ఞాన యుగమగు కృత యుగమే భగవంతుని ధర్మ రథానికి పూన్చబడిన యుగము (కాడి), అంటే ఆ రథమునకు కట్టబడిన యుగము (కాడి) సత్య, ధర్మ జ్ఞానస్వరూపము. సత్య, ధర్మ జ్ఞానమయము. అట్టి కృతయుగ రూపయుగమునకు ప్రతీకగా నిపుడు వివాహంలో బండికాడిని (యుగము) ఉపయోగించుచున్నారు. కాబట్టి అట్టి కాడి ద్వారా అభిషేకం పావనమే గద!

## రెండవ గాథ :

సూర్యుడు రోజూ ఒక చక్రం గల్గిన బంగారు రథం మీద తిరుగును. ఆ రథమునకు ఏడు ఛందస్సులు గుళ్ళములు. ఋతువులు ఇరుసులు. సంవత్సరములు అరలు (ఆకులు). ధర్మము ధ్వజము. ఆ ధర్మ ధ్వజము కాడి (యుగము) కి కట్టబడినది. ఆకాడి యొక్క రెండు కొనలు అర్థకామములు. అనగా అర్థకామములు రెండునూ ధర్మ బద్ధములు అయినవి. ఇట్లు వర్ణన ఇంకా చాలాఉన్నది.

తత స్సూర్య రథ స్యాపి సన్నివేశం ప్రవక్ష్యతే ।
స్థితేనైకేన చక్రేణ సంచారేణ త్రినాభినా ।
అరా వేమ్యస్తు సూర్యస్య ఏకచక్రం తు నై స్మృతమ్ ।
అరాః సంవత్సరాః పంచనేమయః ఋతవః స్మృతాః
రాత్రి ర్వరూథా ధర్మశ్చ ధ్వజ ఊర్ధ్వం సముచ్ఛ్రితః ।
యుగాక్షకోటీ తే తస్య అర్థకామావుభౌస్మృతౌ ।
ఛందోభిర్వాజిరూపై స్తై ర్యథా చక్రమవస్థితమ్ ॥

*- మత్స్య పురాణము 124-46 శ్లో*

లగ్న సమయంలో "ధర్మేచ అర్థేచ కామేచ త్వయైషా నాతిచరితవ్యా - నాతి చరామి". అని ప్రమాణం చేయిస్తారు. అనగా "ధర్మార్థ కామములలో యీమెను నేనతి క్రమించను" అని వరుడు ప్రమాణం చేసిన తర్వాత కాడిని తెచ్చి అభిషేకం (యుగచ్ఛిద్రాభిషేకం) చేస్తున్నారు. దీనికర్థం దేవ, వేద స్వరూపమైన ఈ యుగము (కాడి) కొనల ద్వారా ధర్మ బద్ధమైన అర్థకామములు వధువుపై వర్షించుగాక! అని భావన. అట్లు మంగళకరములు, ధర్మోపేతములగు అర్థకామముల వర్షించు ఈ యుగముద్వారా మంత్ర జలాభిషేకము మంగళప్రదము, పరమపావనము. వివాహప్రక్రియ ఈ సుమంగళమైన, వేదరూపయుగముతో ప్రారంభింపబడుటచే పెళ్ళిరోజు నూతన వధూవరులకు యుగాదియే.

అదే ఉగాది! చివరగా ఈ అధర్వ వేదమంత్రములోని యుగప్రాశస్త్యం చూద్దాము.

"నమస్తే లాంగలే భ్యః నమఈషాయుగేభ్యః"

- అధర్వవేదము

క్షయ, కుష్ఠు రోగపీడితుని, నాగలి, పొలుకళ్లులు, కాడుల క్రింద కూర్చొబెట్టి పై మంత్రంతో అభిషేకం స్నానం చేయిస్తే ఆ రోగాలు పోతాయట. కాన నాగళ్ళు, పొలుకళ్లులు, కాడులు వ్యవసాయ సాధనాలు మాత్రమే గాక వ్యాధుల నరికట్టు దేవతాస్వరూపములు. అట్టి దేవతా స్వరూపములైన నాగళ్ళకు, పొలుకళ్లులకు, కాడులకు (యుగ) నమస్కారమని మంత్రార్థము.

"యుగాకారం" అని బిల్వాష్టోత్తర శత నామములలో శివుని నామము. శివుని స్వరూపము యుగము యొక్క ఆకారమట. కావున అటువంటి ఆయుగం అవధువును నిత్య సుమంగళిని సూర్యవర్చస్వినిని చేయును గనుక వివాహంలో యుగం (బండికాడి) గూడ "సుమంగళమ్" అని సార్థకమగుచున్నది.

*"యుగంతల్ మంగళం మహత్"*

*ఇతిశమ్*

*"నమామ యుగ దేవతామ్"*



# ఆరోగ్యమే మహాభాగ్యము

"శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్". అనగా ధర్మకార్యములు చేయుటకు శరీరము లేనిదే వీలు గాదు గాన శరీరము ధర్మకార్యాచరణకు మొదటి సాధనము అని అర్థము. అందుకే శరీరమును నిత్యం కాపాడుకొనవలసిన బాధ్యత గలదు. దానిని కాపాడు కొననిచో శుష్కించును, వ్యాధి గ్రస్తమై నశించును.

'శీర్యతే ఇతి శరీరమ్'. శిథిలమై, నశించు స్వభావము శరీర లక్షణము. అట్లు శిథిలము గాకుండక, రోగగ్రస్తమై నశించకుండా కాపాడుకొనుట, పోషణతో బలిష్ఠముగాను, ధర్మకార్యా చరణమునకు సిద్ధముగా చేసికొనుట, ఆరోగ్యలక్షణము. అందుకనే ప్రతిమనిషి ఇంకొక మనిషిని క్రొత్తగా కలిసినపుడు మొదట "కుశలమా? క్షేమమా! ఆరోగ్యమా! నీ వంట్లో బాగున్నదా?" అని అడుగుట సంప్రదాయము.

చక్కని ఆరోగ్యం ఉండాలంటే ప్రధానంగా ఆహార, పానీయాల పరిశుభ్రత, శుద్ధి, నాణ్యత ప్రధానములు. మనం స్వీకరించే ఆహారమును అన్నమని వేదము తెల్పుచున్నది. అన్న నిర్వచనమిట్లు తెల్పుచున్నది.

**"అద్యతేఽ త్తిచ భూతాని తస్మాదన్నం తదుచ్యత ఇతి"।** - యజుర్వేదము

సమస్త ప్రాణకోటిచే భక్షింపబడునది. సర్వ ప్రాణులను భక్షించునది అన్నము. అన్నము ఎక్కువ, తక్కువ తినరాదు. తక్కువ అయితే అన్నము చాలక శరీరము శుష్కించి, నీరసించును, నశించును. ఎక్కువ అయితే అజీర్ణము గల్గి వ్యాధిగ్రస్తమై నశించును. అందుకే తగినంత యోగ్యమైన అన్నమును తినవలెను. అని శ్రీ కృష్ణుడు అర్జునుని 'యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మను" అని ఉపదేశించెను.

"ఆకొన్న కూడే యమృతము" అని సుమతి శతకము. అన్నం ఆకలిగా ఉన్నపుడే తిన్నచో నది అమృతమగును, ఆకలి లేకపోయినా తిన్నచో విషమగునని బోధిస్తున్నది. అన్నం ఎలా పుట్టుచున్నదో, ఎట్టి అన్నము తింటే ఆరోగ్యమో వేదము ఇట్లు చెప్పుచున్నది.

**"తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః। ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నే రాపః।**

**అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః। ఓషధీభ్యోఽన్నం, అన్నాత్పురుషః।**

**సవా ఏష పురుషోఽన్నరసమయః।'**

పరమేశ్వరుని నుండి ఆకాశము, ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి నీరు, నీటి నుండి భూమి, భూమి నుండి ఓషధులు, ఓషధులనుండి అన్నము, అన్నము నుండి పురుషుడు పుట్టుచున్నారు. అంటే ప్రాణి కోటిఅంతా అన్న రసముతో పుట్టి, అన్నరసమయమగుచున్నది.

కావున శరీరం ఆరోగ్యంగా ఉండాలంటే చక్కని అన్నము కావాలి. మంచి వర్షము

వలన ఓషధులు పుట్టి, పంటలు (వరి మొదలగు) పండి తద్వారా చక్కని అన్నము ఏర్పడుచున్నది. మంచి వర్షం మేఘముద్వారా గల్గును. మేఘము యజ్ఞధూమము చేత గల్గును. యజ్ఞములు వైదిక కర్మానుష్ఠానముచేత కల్గును. వైదిక కర్మలు వేదము వలన కల్గును. వేదము పరమేశ్వర రూపము. అని భగవద్గీత తెల్పుచున్నది.

**అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్న సంభవః ।**

**యజ్ఞాద్భవతి పర్జన్యః యజ్ఞః కర్మ సముద్భవః ।**

**కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్ ।**

ఈ రోజులలో యజ్ఞాలులేవు. కాన యజ్ఞధూమం లేదు. యజ్ఞధూమము ఆదిత్య మండలమును ప్రవేశించి అమృత రూప ఉదకమండలమును స్పందింపజేయును. అపుడు కురిసిన దివ్య వర్షంతో దివ్యౌషధులు, దివ్యాన్నం, మంచి ప్రజలు పుట్టుదురు.

**"అన్నాద్వై ప్రజాః ప్రజాయన్తే । యాః కాశ్చ పృథివీగ్ం శ్రితాః"** అని వేదము చెప్పుచున్నది.

**"అగ్నౌ ప్రాస్తాహుతిస్సమ్యగా దిత్య ముపతిష్ఠతే**

**అదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టే రన్నం తతః ప్రజాః"** - మనుస్మృతి

అగ్నిహోత్రంలో వ్రేల్చబడిన హవిస్సులు అదిత్య మండలమును చేరును. ఆ మండలములోని ఉదకమండలమును కదిలించును. అపుడు ఆదిత్యుని నుండి దివ్యవృష్టి, అవృష్టితో దివ్యాన్నము, ఆ అన్నమునుండి ప్రజోత్పత్తి (సత్సంతానము) జరుగుచున్నది. ఆ ప్రజకు ఆదివ్యాన్నము ఆరోగ్యము, పుష్టినిచ్చి కాపాడును. ప్రస్తుతం, ధూమములో, నీటిలో, గాలిలో, శబ్దములో, ధ్వనిలో, వాతావరణంలోను చివరకు మానవునిలో గూడ అంతట కాలుష్యము తాండవించుచున్నది. అందుచే అతి వృష్టి, అనావృష్టి గల్గుచున్నవి. సువృష్టి లేదు. మనుష్యులకే గాక పంటలకు వ్యాధులు వచ్చుచున్నవి. పంటలకు, ఓషధులకు మందులు, ఎరువులు కావలసివస్తున్నది. ఆ మందులు, ఎరువులు కల్తీవిగద! అందుచే ఉత్పత్తి అగుచున్న అన్నం కాయగూరలు సమస్తం కలుషితమై మానవులకు తీవ్ర అనారోగ్య హేతువులగుచున్నవి. అందుకు ప్రధానంగా మానవులు, ప్రభుత్వము మేల్కొని యజ్ఞములు నిర్వర్తించవలెను. ఇది జరుగునది కాదు కనుక ప్రతి ఇంటిలోను అగ్ని హోత్రములో, రావి, జమ్మి మొదలగు సమిధలను హోమము చేస్తే వాతావరణ కాలుష్యంనశించి, విష వాయువులు నశించి, ఆరోగ్యమును కాపాడుకొన వీలుండును. పూర్వం ప్రతి ఇంట్లోను నిత్యం అగ్నిహోత్ర ముండేది. ఆ అగ్ని హోత్రధూమము ఆరోగ్యకరము.

**"అన్నం బ్రహ్మేతి వ్యజానాత్ । ... అన్నం పరిచక్షీత ।**

**తద్వ్రతం । అన్నం నవిన్ద్యాత్ । తద్వ్రతం। అన్నం బహుకుర్వీత । తద్వ్రతమ్।"** అని వేదము మానవుల హెచ్చరిస్తున్నది. అన్నమును పరబ్రహ్మ స్వరూపంగా దర్శించాలి. నిర్లక్ష్యం చేయరాదు. తిన్నంత తిని పారవేయరాదు. గౌరవ భావంతో పవిత్రభావంతో, శుచిగా తినాలి.

ఇది వ్రతముగ, దీక్షగా ఆచరించాలి అని వేదము పదే పదే హెచ్చరిస్తోంది. అపుడే ఆ అన్నం ప్రాణాధారము, జీవనాధారము అగును.

అన్నము ఎలాగైనా సరే విరివిగా సంపాదించి అతిథికి పెట్టాలి. అన్నదానం చేయాలి. అన్నం లేనివారికి అన్నదానం చేసిన వారియింట్లో నిత్యాన్నం ఉండును. అట్టి వారికి భగవంతుడు ఆయురారోగ్య, ఐశ్వర్యములనిచ్చి కాపాడును.

"అహమన్నం అహమన్నం అహమన్నమ్। అహమన్నాదో2హ

మన్నాదో2హ మున్నాదః । ... యో మా దదాతి స ఇ దేవమా వాః

అహమన్న మన్న మదన్తమాద్మి"

-తైత్తిరీయశ్రుతి

పరమేశ్వరుడు తనను అన్న స్వరూపునిగను, అన్నమును ఇచ్చువానినిగను దర్శించ వలెనని చెప్పుచున్నాడు. పరోక్షముగ వేదముగూడ తానే అన్న స్వరూపమని అన్నదాతయని సూచించినది. అట్లు అన్నమును అన్నార్థుల కొసంగిన వారిని పరమేశ్వరుడు సంరక్షించి ఆయురారోగ్యాదుల నొసంగును. అన్నార్థులకు, మరెవ్వరికిని పెట్టక తానొక్కడే భుజించు చున్నచో వానిని అన్న స్వరూపుడగు భగవంతుడే తిని వేయునట. వాని ఆరోగ్యము నశింపజేయును. వానికి అనర్థముల గల్గుజేయును.అని పై వేదమంత్రార్థము.

అందుకనే విరివిగా అన్నదానం ఏ యింట జరిగితే ఆ యింట అన్న శాంతి అనగాఅన్న స్వరూపుడగు భగవంతునికి శాంతి జరుగును. ఏ యింట అన్న శాంతి జరుగదో, రెండవ విస్తరి లేవదో అచట అనారోగ్యము, అశాంతి తప్పక తాండవించును. అన్నము బ్రహ్మ స్వరూపము. అన్నము మానవులకు భగవద్దత్తము. అట్టి అన్నమును భగవంతునికి నివేదింపక తాను మాత్రమే భుజించువాడు దొంగ అగునని భగవద్గీత తెల్పుచున్నది.

"తైర్దత్తానప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః" - భగవద్గీత

అట్టి దొంగ పైకి పెద్దమనిషివలె కనబడినను లోపల అనారోగ్యము, రుగ్మతలు తప్పక బాధిస్తూనే ఉంటాయి. అట్టివాడు చూస్తూ పిల్లికి బిచ్చం గూడ వేయలేదు. వానిని లోభియని అంటారు. వాని ఇంటిలో రెండవ విస్తరికి అవకాశం ఉండదు. 'అతిథి దేవో భవ' అని వేదశాసనము. అతిథి పూజ, అతిథిని సత్కరించి అన్నము పెట్టుటయున్నూ ప్రతి మానవునికి, అతని యింటికి ఆరోగ్యలక్షణములగునని తెలియచేస్తోంది. కర్తవ్యమని నిర్దేశిస్తోంది. చెవిటివాని వద్ద శంఖము ఊదిన ఏమి ప్రయోజనం!

"నాన్నోదకసమం దానం" "దీనేభ్యో దీయతామన్నం యది ధర్మమభీప్ససి"

- మహాభారతమ్

దీనులకు అన్న, ఉదకదానములు - ధర్మమును, శ్రేయస్సును, ఆరోగ్యమును శుభమును ప్రసాదించును. అన్న, ఉదకదానములను మించిన దానం లేదని మహాభారతవచనము.

ప్రతి మానవుడు మితాహారమునే స్వీకరించవలెను. అట్లే విహారము, చేష్ట, కర్మ, నిద్ర, జాగరణము గూడ మితము, యుక్తము గాను ఉన్నచో ఆరోగ్య భంగము గలుగదని భగవద్గీత ద్వారా తెలియదగును.

"నాత్యశ్నతస్తు యోగో2 స్తి న చైకాంత మనశ్నతః ।
న చాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥"

ఆహారములో ఎక్కువ తక్కువలు పనికిరానట్లే నిద్ర, జాగరణములలోను నియమము పాటించాలి. అట్లే కర్మల విషయంలో గూడ. నిద్ర ఎక్కువ అయితే బుద్ధి మాంద్యముగల్గును. అతి నిద్రాలోలుడు తెలివి లేని మూర్ఖుడు. ఆహారము గూడ మితిమీరినచో నిద్రమత్తు గల్గును. అట్లే నిద్ర తక్కువ అయినచో తిన్న ఆహారం జీర్ణం గాక విషంగా మారును. మరల మరునాడు నిద్ర మత్తు ఉంటుంది. అది ఇది ఏల? అన్ని రంగాలలోను అతి పనికిరాదు. మితి పరిమితి - శ్రేష్ఠము, ఆరోగ్యదాయకమని పెద్దలు చెప్పుదురు. శాస్త్రాలు ఘోషిస్తున్నాయి.

ఆరోగ్యమునకు మూలము క్షుత్పిపాసలు. అనగా ఆకలి దప్పికలు వానిని సరిగా కాపాడి, వాని దోషములను పోగొట్టి, అలక్ష్మిని పోగొట్టి, లక్ష్మిని, అంటే ఆరోగ్యలక్ష్మిని ప్రసాదించమని, అందుకు మంచి వర్షములను, పంటలను ప్రసాదించమని రోజు అమ్మవారిని శ్రీసూక్తంలో

"వర్షంతు తే విభావరి భువో అభ్రస్య విద్యుతః ।
రోహంతు సర్వ బీజా న్యవబ్రహ్మద్విషో జహి ॥

క్షుత్పిపాసామలాం జ్యేష్ఠామలక్ష్మీం నాశయామ్యహమ్"॥ అని ప్రార్థిస్తున్నాము. తినిన అన్నం బాగుగ జీర్ణం కావాలంటే ఉదరంలో జఠరాగ్నిని కాపాడుకోవాలి.

"సో2 గ్రభుగ్విభజన్ తిష్ఠన్నాహారమజిరః కవిః" - వేదము
"అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః"
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్"॥ -భగవద్గీత.

తినిన ఆహారమును ముందు ఉదరంలోని అగ్ని దేవుడు తినునట. అంటే ఆహారమును మరల పాకం చేసి, జీర్ణం చేసి, ఆ అన్నరసమును నాలుగు భాగములుగ విభజించి, సారమును శరీర భాగాలన్నిటికి సరఫరా చేస్తాడట. లోపల ఉండి మనకు ఆరోగ్యమును ప్రసాదించునది ఆ యగ్ని దేవుడే. కావున ఇంటిలోను అగ్నిదేవుని ఆరాధించాలి. మనదేహంలోను అగ్నిదేవుని ఆరాధించాలి. ఉదరంలో అగ్ని ఎంత బాగా ప్రజ్వలించితే అంత బాగా ఆరోగ్యము సిద్ధిస్తుంది. ఉదరంలోని క్రిమికీటకాదులను, వ్యాధులను నశింపచేయును. అట్లే ఇంటిలో అగ్నిహోత్ర ధూమము ఇంటిని శుద్ధి చేసి విషవాయువులు, క్రిమికీటకాదుల సంహరించి ఆరోగ్యమును ప్రసాదించును.

శరీరం ఆరోగ్యంగా ఉండాలంటే శరీరంలోని అగ్నిని కాపాడుకోవాలి. అందుకు ప్రాణాయామము, వ్యాయామము, ఆసనములు, యోగము, ధ్యానము ప్రధానసాధనాలు. మామూలుగ అగ్నికణం ఉంటే గాలివీస్తే ఆకణం ద్వారా అగ్నిరాచుకొని బాగాప్రజ్వలించును. శరీరంలో అట్లు అగ్ని ప్రజ్వలించవలెనన్న ప్రాణాయామము ప్రధాన సాధనము. ఆ అగ్ని ప్రజ్వలనము వలన గర్భశుద్ధి గల్గి, అన్నము జీర్ణమై ఆరోగ్యసిద్ధి గల్గును. అట్లు గాక బాగా తిని కూర్చుంటే, రోగము వస్తుంది. శరీరం మనమాట వినదు. శరీరము చెప్పినట్లు మనము నడవాలి. శరీరం వంగదు. పని ఏమాత్రం చేయలేదు. కాస్త పనిచేస్తే ఆయాసం వగైరా సాగుతాయి. కనీసం భోజనం చేసి నూరు అడుగులు వేయాలని శాస్త్రవచనము. "భుక్త్వా శత పథం గచ్ఛేత్" ఏ మాత్రం నిర్లక్ష్యం అశ్రద్ధ చేసిన, శరీరం మాట వినకపోగా, అనారోగ్యం వలన మనచేయి గూడ జారిపోతుంది. ఇక దైవాధీనమే శరీర గతి. ధనమెంతైనా, పోయినా మరల సంపాదించువచ్చును. ఒకసారి ఆరోగ్యం పోతే మరల సంపాదించటం చాలా కష్టము.

తాత్కాలి కోద్రేకాన్ని గల్గించు మత్తుపదార్థాల జోలికి వెళ్లరాదు. వానికి శరీరం అలవాటు పడిపోయి, అవిలేనిదే ఉండలేని స్థితిగల్గి, క్రమక్రమంగా నాశనమునకు గురి అగుతుంది. ధూమం, మద్యం, ఘుట్కా, జరదా, వ్యభిచారం ఇవన్నీ తాత్కాలికోద్రేక సుఖాలనిచ్చి మనిషిని లోబరచుకుంటాయి. వానికి లోబడిన శరీరము ఇక మనమాట వినదు. క్రమంగా నరములు ఉద్రేకించి, ఉద్రేకించి, శక్తి గోల్పోవును. నిస్తత్తువ, రక్తకాలుష్యము, వగైరా వ్యాధులు చెప్ప నలవిగానివి, కొత్త కొత్త పేర్లతో అనేకములు సంక్రమిస్తున్నవి. సంపాదించిన ధనం వ్యాధి నివారణకే చాలని స్థితి వస్తుంది.

చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొనిన ఏమి ప్రయోజనము? అందుకే "ప్రక్షాళనాద్ధి పంకస్య దూరా దస్పర్శనం వరమ్" అని ఆర్యోక్తి. బురదలో పడి కడుక్కోవటం కంటె బురద అంట కుండ దూరంగా ఉండటం శ్రేష్ఠము.

ఉదయం నిద్రలేవగానే 3,4 గ్లాసుల నీరు త్రాగుట శ్రేష్ఠము. దాని వలన మల విసర్జన సక్రమముగ, సుఖముగా జరుగును. ఇది అత్యంత ప్రధాన ఘట్టము. ఆరోగ్యరక్షణకు ఈ ఘట్టము ముఖ్యాతిముఖ్య సాధనము. ఇక ప్రాణయామ, యోగాసన, ధ్యానాదులు, నాడీమండలమును, ఊపిరి తిత్తులను, రక్తమును, మనస్సును, ఉదరమును, గుండెను శుద్ధిపరచి ఆరోగ్యపరిరక్షణమునకు దోహదపడుచున్నవి. "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అని చెప్పుట వలన సూర్యోపాసన అనగా సూర్యనమస్కారములు ఆరోగ్యమును ప్రసాదించును అని తెలియనగును. యోగ శాస్త్రము అన్నమును తినుపద్ధతిని ఇలా వివరిస్తున్నది.

అర్థం సవ్యం జవాన్నస్య తృతీయ ముదకస్యచ
వాయోప్పంచరణార్థంతు చతుర్థమవ శేషయేత్ ॥

ఉదరంలో సగభాగం అన్నమునకు, మూడవ భాగము నీటికి కేటాయించి అనగా నీటితో నింపి, నాలుగవ భాగమును వాయుసంచారమునకు వదిలి వేయవలెను.

ప్రాగ్ద్రవం పురుషో2శ్నీయాత్ మధ్యేతు కఠినాశనమ్ ।
అన్తే పునః ద్రవాశీ తు బలారోగ్యైర్నముంచతి ॥ - విష్ణు పురాణమ్.

మొదట ద్రవపదార్థము, మధ్యలో కఠినపదార్థము, చివరలో ద్రవపదార్థమును భుజించినచో మానవునికి బలము, ఆరోగ్యములు గల్గును అని విష్ణుపురాణవచనము. అపుడతని శరీరము ధర్మ సాధనము మాత్రమే గాక "పరోపకారార్థ మిదంశరీరం" అని సార్థకమగును.

వేదము ప్రజల హితమును కోరి "మితి మీరి అన్నం తినవద్దు. కావలసినంత తీసికోండి. ఎక్కువ అయినా తక్కువయినా మీ యారోగ్యభంగమే. మిమ్ము రక్షించదు. హింసించును. మితాహారము మీకు శ్రీరామరక్ష" యని పదే పదే. గుచ్చి గుచ్చి ప్రజలకు హితమును బోధిస్తోంది. క్రింది మంత్రార్థమిదియే ।

"యదుహవా ఆత్మసంమిత మన్నం తదవతి తన్న హినస్తి।
యద్భూయో హినస్తి తద్యత్కనీయో2 న్నం న తదవతి ॥"

- శతపథబ్రాహ్మణమ్

చిరుతిండ్లు, తీపిపదార్థములు హాని కరములు. ఇంకా ప్రధానంగా అన్నం తినునపుడు మనస్సు నిర్మలంగా, ప్రశాంతంగా ఉండాలి. కోపం ఉద్రేకం కామాది వికారములతో భోజనం చేస్తే వాని ప్రకంపనములు దోషభూయిష్ఠం చేస్తాయి. అనారోగ్యకారణములగును. అందుకనే భోజనం చేయునపుడు "సుఖేన మౌనేన భోక్తవ్యమ్' అని అంటారు. శౌచం పాటించటం ఆరోగ్యమునకు ప్రధాన సాధనము. శౌచం అంటే భోజనం ముందు స్నానం చేసి శుద్ధ (మడి) వస్త్రములు ధరించి అవుడు భుజించాలి. అంతేగాని బజారులోకి వెళ్ళివచ్చిన చెప్పులతోను, లాగు చొక్కాలతో భోజనం అనారోగ్యకరము. అపరి శుద్ధ వాతావరణంలో తిరుగుటచే దుమ్ము ధూళి, క్రిమిజాలము అంటుకొని యుండును. అందుచే అట్లు అంటుపడిన, దుస్తులు చెప్పులు వగైరా విడచి శుచియై చేసినప్పటి భోజనము హితకరము, ఆరోగ్యకరమునగును.

"న రోగః అరోగః .అరోగస్య భావః ఆరోగ్యమ్"

రోగము లేకుండుట అరోగము. అరోగము యొక్క భావమే ఆరోగ్యము. రోగనివారణకు అన్నమే ఔషధమని వేదము చెప్పుచున్నది. దీనినే నేటి డాక్టర్లు Dieting అని Diet Controll అని అంటున్నారు. శరీరగతరోగమునకు బాహ్యౌషధము కావాలి. మనోగత రోగమునకు మనశ్శుద్ధి ఔషధము. ఆ రెండు ఔషధములు - పరిమిత, యుక్తాహారము (అన్నము) ద్వారా సిద్ధించును. ఇట్లు అన్నమే ఈ రెండు రకముల ఔషధములు అగునట.

'అథో అన్నేనైవ జీవన్తి । అథైవ దపియన్త్యతః ।
అన్నగ్ంం హి భూతానాం జ్యేష్ఠమ్. తస్మాత్సర్వౌషధముచ్యతే"

అన్నము నుండి పుట్టుట, అన్నము వలన జీవించుట, అన్నములోనే లయము నొందుట చేత అన్నము బ్రహ్మ, విష్ణు, మహేశ్వర త్రయరూపమైన పరబ్రహ్మ స్వరూపము. అన్ని భూతముల కంటె ముందు పుట్టుట చేత, జ్యేష్ఠమగుట చేత అన్నము బ్రహ్మము, సర్వౌషధము అనియు చెప్పబడుచున్నది.

"యే2 న్నం బ్రహ్మోపాసతే । తస్మాత్సర్వౌషధముచ్యతే।"

అన్నమును పరబ్రహ్మగా ఉపాసించినపుడు ఉపాసించినవారిని అది దివ్యౌషధమై కాపాడును. వేరే ఇతరములగు మందులు అనవసరము. శారీరక, మానసిక రుగ్మతలకు పరబ్రహ్మరూపమగు అన్నము దివ్యౌషధము. అట్టి దివ్యౌషధ సేవజేసి, ఆరోగ్యమును కాపాడుకొని, శరీరమును ధర్మక్షేత్రముగా తయారు చేసికొని, ధర్మకార్యాచరణ చేసి జీవితం ధన్యం చేసికొనమని వేదమాత ఉపదేశము. ఆదేశము. ఛాందోగ్యోపనిషత్ ఇలా చెపుతోంది.

"ఆహారశుద్ధౌ సత్వ శుద్ధిః ।
సత్వశుద్ధౌ ధ్రువా స్మృతిః । స్మృతిలాభే ।
సర్వగ్రంధీనాం మోక్షః ।
తస్మై మృదిత కషాయాయ తమసః పారం దర్శయతి"

ఆహార శుద్ధితో ఆరోగ్యసిద్ధి, తద్వారా మనశ్శుద్ధి, తద్వారా ఆత్మానందం, మోక్షము, చీకటి పోయి వెలుగు అనగా అజ్ఞానం పోయి జ్ఞానము సిద్ధిస్తాయని అర్థము. కనుక ముందు ఆరోగ్యసిద్ధికి ఆహారశుద్ధి చాల ప్రధానమని, కల్తీలేని, మందులు వాడని, పవిత్రమైన ఆహార మత్యంత మావశ్యకమని వేదమాత యొక్క ప్రధానాతి ప్రధానమైన హెచ్చరిక!

ఒక కవి ఇట్లు ఉపదేశిస్తున్నాడు.

"జిహ్వే! ప్రమాణం జానీహి భోజనే భాషణే2 పిచ"

ఓ నాలుకా! భోజనములోను, సంభాషణలోను నీ ప్రమాణమును, పరిమితిని తెల్సుకొనుమా! స్వేచ్ఛ, చాపల్యము వలదుసుమా! అని యర్థము. జిహ్వా చాపల్యము లేకుండుట, మితసంభాషణ ఆరోగ్యప్రదములు. అధర్వవేదమిట్లు ఉపదేశిస్తోంది.

"సర్వేవా ఏష జగ్ధ పాప్మా యస్యాన్నమశ్నాతి"

- *అధర్వవేదము-95-8.*

ఏ మానవుని ఇంటిలో అతని అన్నమును అందరు తిందురో, ఏ మానవుడు ఇతరులకు అన్నదానం చేస్తాడో అతని పాపములన్నీ దగ్ధములై పోవును. అతని ఇల్లు శాంతి, సౌఖ్య, ఆనందాలతో కళ కళలాడుతుంది. ఆ మానవుడు కూడ ఆరోగ్యవంతుడై, తేజస్వియై యొప్పును. ఏ మానవుని ఇంటిలో మరొక విస్తరి లేవదో ఆ ఇల్లు కళా విహీనమై యుండును. ఆ మానవుడనారోగ్యముతో నుండును.

కావున ప్రతి మానవుడు కేవలం ధనమును మాత్రం సంపాదించిన చాలదు. తినటానికి నోచుకోనపుడా ధనమెందుకు పనికిరాదు. కాన ఆరోగ్యమును మించిన ధనము, భాగ్యము లేదు. అట్టి ఆరోగ్యమును సంపాదించుకొని తన శరీరమును ధర్మసాధనకు, పరోపకారార్థము ఉపయోగపడునట్లు తీర్చిదిద్దుకోవాలి.

"వపురాఖ్యాతి భోజనమ్" శరీరాన్ని చూసి ఆ మనిషి భోజనం చేయుచున్నాడో, లేదో ఏవిధమైన భోజనం చేస్తున్నాడో చెప్పవచ్చును. కనుక అట్టి శరీరాన్ని రక్షించుకొనుట ప్రధాన కర్తవ్యము. దానిని బట్టి మనస్సు యొక్క ప్రవర్తన, మానవుని ప్రవర్తన ఉంటాయి. కాన మహాభాగ్యమగు ఆరోగ్యమును అన్నిరకములుగాను సంపాదించుకోవాలి.

Face is the index of Mind. ముఖవర్చస్సు బట్టి మనస్సును పసిగట్టవచ్చును. ప్రసన్నవదనమో, అందమైన ముఖమో, కోపభూయిష్ఠమో, కుటిల స్వరూపమో చెప్పవచ్చు. దీని కంతకు మూల కారణం ఆహారమే. కనుక అందరు ప్రసన్న ముఖములతో మంచి తేజస్సుతో కళకళలాడాలి అని వేదమాత కోరుకొంటోంది.

**ఆహారే భాషణే చిత్తే శబ్దే వాయౌ చ కర్మసు**
**జలే2ంతరిక్షే కాలుష్యం సర్వథా2 రోగ్య నాశకమ్౹**

ఇతిశమ్

"నమామ అన్న దేవతామ్"



# మితభాషణము

మానవుని జీవితం నోటి మాట మీద ఆధారపడియుండును. "నోరు మంచి దయితే ఊరు మంచిది" అని సామెత. నోరు అంటే నోటిమాట, నోటిలోని ఆహారం గూడ అర్థం. మాటను పదము, శబ్దమనీ అంటారు. అక్షర సమామ్నాయమును 'లిపి' అంటారు. అక్షరముల ద్వారా శబ్దములు, శబ్దముల ద్వారా భాష ఏర్పడుచున్నవి. భాషను వాక్, భారతీ, సరస్వతీ, వాణీ అని అంటారు.

"బ్రాహ్మీతు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ"

-*అమరకోశం.*

మాట శబ్దం ద్వారా, శబ్దం భాష ద్వారా వెలుగులోకి వస్తాయి. కాన భాషలేనిదే మాటలు లేవు. మాటలేనిదే మానవ జీవితానికి వెలుగులేదు. జీవితం అంధకారమయం. కనుక మాటను, అనగా శబ్దమను జ్యోతిస్సు అని, శబ్దబ్రహ్మ అని వేదవాణి తెల్పుతోంది. శబ్దమనే జ్యోతిస్సు, సృష్టి ప్రారంభం నుండి దీపంలాగ ప్రవర్తించక పోతే ముల్లోకాలు కారు చీకట్లో మునిగి యుండేవని కావ్యాదర్శ అనే అలంకార శాస్త్రగ్రంథం చెప్పుతోంది.

"ఇదమంధతమః కృత్స్నం జాయేత భువనత్రయమ్ ।
యదిశబ్దాహ్వయం జ్యోతి రా సంసారం న దీప్యతే ॥"

-*కావ్యాదర్శ.*

శబ్దము గూర్చి పుట్టిన వ్యాకరణ శాస్త్రగ్రంధము శబ్దమును జ్యోతిస్సు అనీ, నోటిలోనుండువచ్చు శబ్దము ద్వారా మాటలాడు వ్యక్తి యొక్క హృదయాంతరాళము తెలుసుకోవచ్చునని తెల్పుచున్నది.

"ప్రాప్తరూప విభాగాయా యో వాచః పరమోరసః ।
యత్తత్పుణ్యతమం జ్యోతిః తస్యమార్గో2య మాఞ్జసః ।"
అరణిస్థం యథా జ్యోతిః ప్రకాశాంతర కారణమ్ ।
తద్వచ్ఛబ్దో2పి బుద్ధిస్థః శ్రుతీనాం కారణం పృథక్ ॥

- *వాక్యపదీయం - బ్రహ్మకాండ -12-46.*

శబ్ద సముదాయ మంతా వాక్కు యొక్క ఉత్కృష్టమైన సారము. అసాధు శబ్దసముదాయమే పుణ్యతమమగు జ్యోతిస్సు. అశబ్దజ్యోతిస్సును తెలుసుకొనుటకు సులభమార్గము వ్యాకరణ శాస్త్రము. సాధు శబ్దములు, అసాధుశబ్దములు లోకంలో వాడుకలో ఉన్నాయి. అసాధు శబ్దములు కంకివంటివి.

జమ్మి, రావికఱ్ఱల రాపిడికి నిప్పుపుట్టును. ఈకఱ్ఱలను 'అరణి' అంటారు. అరణిలో గూఢంగా నున్న జ్యోతిస్సు మధనం ద్వారా బయటపడి ప్రకాశించును. అట్లే బుద్ధిస్థమైన శబ్దము, వాలుక, కంఠాదుల ద్వారా (నోటినుండి) బయటపడును. అది సాధువో, అసాధువో, అట్టి శబ్దము, నోటిమాట ద్వారా మానవుని బుద్ధిని, హృదయమును తెలియజేస్తుంది. అట్లు తెలియజేయటమే ప్రకాశము. కాన శబ్దము ప్రకాశమును ఇచ్చు జ్యోతిస్సు. అనగా జ్ఞానమును గలిగించు జ్యోతిస్సు.

అవుడు ఆ మానవుని మాటను బట్టి అతనితో వైరమో, స్నేహమో, అతనిని నిందించటమో, గౌరవించటమో జరుగును. ఈ శబ్దజ్యోతిస్సును వ్యర్థము చేయక, నియమించుకుని నియమంగా ఆరాధిస్తే జ్ఞానజ్యోతిస్సు ప్రసాదింపబడునని వేదశాస్త్రాలు బోధిస్తున్నాయి. అందుకేభాషను లలితా దేవతరూపంలో ఆరాధించాలి.

"భాషారూపా బృహత్సేనా భావాభావవివర్జితా"          లలితా సహస్రనామములు

శబ్దముల ద్వారా పరమేశ్వరుని తెలుసుకొనదగును "శబ్దాతిగః శబ్దసహః" - అని విష్ణు సహస్రనామములు తెల్పుచున్నవి. కావున శబ్దం యొక్క శక్తి వర్ణనాతీతము.

'శబ్ద' అనే పదానికి మూడు వ్యుత్పత్తులు గలవు.

1. "శప ఆక్రోశే" అను ధాతువునుండి పుట్టింది. "శప్యతే అనేనేతి శబ్దః". దీనిచేత ఆక్రోశం పబడును. అని అర్థము. ఆక్రోశం అంటే దుఃఖము. నోటిమాట సరియయినది గానిచో దుఃఖము గల్గించును.
2. "శం సుఖం దదాతీతి శబ్దః" సుఖమునిచ్చునది. నోటిమాట మంచిదయితే సుఖముగల్గును.
3. "శపగతౌ" అనుధాతువునుండి పుట్టింది. "శపయతి అవగమయత్యర్థమితి శబ్దః". అర్థమును తెల్పునది శబ్దము. ఈ విషయాన్నే "ఏకః శబ్దః సమ్యగధీతః సమ్యక్ ప్రయుక్తః స్వర్గేలోకే కామధుగ్భవతి" అని శాస్త్రం చెప్పుతోంది. ఈ వాక్యం ఉత్కృష్ట గ్రంథ విషయంలోని శబ్ద పరమైనను, లౌకికంగాగూడ చక్కగ ముందువెనుక లాలోచించుకొని, బాగా చదువు కొన్నవాని, సంస్కారముగల వానినోట నుండి వచ్చు మాట అయినను అనంత సుఖ దాయకము. కోరికల కురిపించు కామధేనువు వంటి దగునని సూచింపబడుచున్నది.

కాళిదాసమహాకవి గూడ కుమారసంభవం అనే కావ్యంలో పార్వతీదేవి వర్ణనద్వారా, ఎంత చదివినా, నేర్చినా, సంస్కారము గల వాక్కు (మాటలు) మానవుని పవిత్రము చెయటమె గాక అతని కలంకారమగునని, బోధించాడు. వాక్కు సంస్కార శూన్యమగుచో అతడు వ్యర్థమైన ప్రాణియగునని తెలియుచున్నది.

"సంస్కారవత్యేవ గిరా మనీషీ తయా స పూతశ్చ విభూషితశ్చ"

కాబట్టి శబ్దము (మాట) విలువ, శక్తి ఎంతవో తెలసికోవచ్చును. ఈ మాట విలువను, శక్తిని తపస్సు ద్వారా తెలిసికొని, సాధించి, నియమించి, ఆరాధించినారు మన మహర్షులు, మహాత్ములున్నూ. "వాచో వీర్యం తపసా2న్వవిందన్".

ఈ మాటల శక్తి ఇంత అంత గాదు. మంచి, చెడులు మాటమీదనే ఆధారపడియుండును. ఒక్క చిన్నమాటచాలు, ఇళ్లు, వాకిళ్లు, కుటుంబాలు, దేశాలు ధ్వంసమైపోతాయి. భస్మమై బూడిద పాలగును. సక్రమంగా, స్నేహంతో అన్యోన్యంగా ఉన్నపుడు మాటలెంత పరుషములైనా, కఠినములైనా, సబబుగానే ఉంటాయి. కాస్త తేడా వస్తే సరి, రామ అనే మాటగూడ తప్పుడు మాట అగును. కనుక మాటలాడునపుడు, సమయసందర్భాల నెరిగి, ఆచి, తూచి కడు జాగ్రత్తగా మాటలను ప్రయోగించాలి.

మాట నాలుకద్వారా వ్యక్తమగును. నాలుకలేనిచో మాటరాదు. నాలుకకు జిహ్వా అని పేరు. జిహ్వా అనే పదం "హ్వాఙ్ స్పర్ధాయాం శబ్దేచ" అను ధాతుజము. "హ్వాయతి రసవద్వస్తు, శబ్దంవా" అనువ్యుత్పత్తి చేత రసోపేతమగు వస్తువులను కోరునది, శబ్దమునుపలుకునది, శబ్దమున కాధారభూతమగునది అని అర్థములున్నవి. కనుక మాటకు ఆధారం జిహ్వా. ఈ ఆధారమును ఆసనమని అంటారు. గణపతి సహస్రనామములలో గణపతికి "లిపి పద్మాసనా ధారః, వాణీజిహ్వః, జిహ్వాసింహాసన ప్రభుః, శబ్దబ్రహ్మ" అని నామములు గలవు. అక్షర సంస్థానమునకు లిపియని పేరు. అనగ అక్షరసముదాయం. శబ్దము అక్షర సముదాయమే. అట్లు జిహ్వా, అనెడి సింహాసనం మీద లిపి అనే పద్మాసనంమీద కూర్చొన్నశబ్దస్వరూపుడు, వాణీ స్వరూపుడగు పరమేశ్వరుడే వినాయకుడు. కనుక వినాయకుని పూజ అంటే జిహ్వాను, దానిపై కూర్చొన్న శబ్దమును వాక్కును ఆరాధిస్తున్నాము. అపుడు జిహ్వాయే మూషికము అని చమత్కారము. జిహ్వా అంటే నాలుక, ఎలుక లాగ కనపడని దొంగయే. జిహ్వాచాపల్యం అంటే ఎలుక లాగ కనపడిన ప్రతి వస్తువును తినగోరి, ఎవరు చూడకుండగా, ఎవరికి తెలియకుండగా, ఉదరం అనే కన్నంలోకి పడేయటం. అట్లే అసత్యబాషణం, వ్యర్థ భాషణం, మితిమీరిన భాషణం చేస్తుంది. కొందరిని రెండు నాలుకలుగల వారని అంటారు. వారు ఇప్పుడు చెప్పినది మరల చెప్పరు. ఇట్లు నాలుక మూషికం వంటిదే.

కనుక జిహ్వాసింహాసనప్రభువు, శబ్దబ్రహ్మయునగు వినాయకుని అర్చిస్తే నోటి వెంట మంచి మాటలు వస్తాయి. నోరు, నోటి మాట అదుపులో ఉంటాయి. జిహ్వాచాపల్యం కూడ అరికట్టబడి సాత్వికాహారమును స్వీకరించు శక్తి వస్తుంది. కనుక ప్రప్రథమంగా నోరు అదుపు, అజ్ఞలో ఉండుటకే జిహ్వాసింహాసనాధీశ్వరుడు, శబ్ద బ్రహ్మయునగు వినాయకుని ప్రతివారు విధిగా ఆరాధించితీరాలి. భోజనం విషయంలోను జిహ్వా చాపల్యం అరికట్ట బడాలంటే వినాయకుని పూజలకు ప్రాధాన్యం ఎంతో ఉంది. అపుడు తప్పక జిహ్వా స్వాధీన మగును. జిహ్వా స్వాధీనములో, ఉంటే ప్రపంచమే స్వాధీనమగును.

ఒక కవీశ్వరుడిలా ఉపదేశిస్తున్నాడు. "జిహ్వే! ప్రమాణం జానీహి భోజనే భాషణేఽపిచ" ఓ నాలుకా! భోజన విషయంలోను సంభాషణ విషయంలోను నీ పరిమితివెరిగి మసలుకో! అదుపులో ఉండుమా! అని. కనుక మితభాషణం, మితభోజనం రెండు మానవ జీవితంలో ఆరోగ్యప్రదములు. అత్యంత ప్రధానమైనవి. ప్రతివారు జాగ్రత్తపాటించవలసింది ఈ రెంటి విషయంలోనే. నాలుకను అదుపుల్లో ఉంచుకొన్న వాడే లోకమును జయించ గలడు. నాలుక గనుక మితిమీరిన ప్రమాదము. అందుకనే పెద్దలు

జిహ్వాగ్రే వసతే లక్ష్మీః జిహ్వాగ్రే మిత్రబాంధవాః ।
జిహ్వాగ్రే బంధనం చాపి జిహ్వాగ్రే మరణం ధ్రువమ్ ॥

అని చెప్పారు. మితభాషణం, మృదుభాషణం, సౌమ్య భాషణం ఆరోగ్యప్రదములు. హితకరములు. లాభదాయకములు. అతి భాషణం, బహు భాషణం, వ్యర్ధభాషణం, పరుష భాషణం ప్రమాదకరములు. మాటలాడేటపుడు కోపము, తాపము, ఆవేశము, ఉద్వేగము, విసుగు, చికాకు పనికిరావు. "అనుద్వేగకరం వాక్యం హితకరం చ యత్" అని వివేక చూడా మణి ప్రబోధము. కోప, రోషములతో గూడిన మాటను "అకల్యాణి" యని శుభ, హితకరమైన మాటను "కల్యా" యని అమరకోశం తెల్పుతోంది.

"రుశతీ వాగకల్యాణీ స్యాత్కల్యాతు శుభాత్మికా"! ఎచట శుభప్రదమైన మాట - కల్య వినపడునోనచట కల్యాణం తటస్థించును. "కల్యశ్చాసౌ అణశ్చ కల్యాణః" అణః అంటే శబ్దము.

"కల్యాం అణతి శబ్దాయతే ఇతి కల్యాణం" అను వ్యుత్పత్తి పై అర్థాన్ని బోధిస్తోంది. ఆ 'కల్య' యనబడు శబ్దములు వేదమంత్రాలు. ఎచట కల్యరూప వేదమంత్రోచ్చారణ జరుగునో నచట కల్యాణం. పెండ్లిలో వేదమంత్రోచ్చారణ ఉన్నపుడా పెండ్లి కల్యాణం అగును. వేదమంత్ర ప్రసక్తి లేనిచో వివాహమే. అసలు ఏరకమైన తతంగము లేని పవిత్ర ప్రేమో పేత వివాహము అనబడు ఆధునిక దాంపత్య ప్రక్రియ కాముకత్వ, పశుత్వ ప్రవృత్తి గల్గినది అగును. కనుక శుభప్రదమగు మాటకు గలశక్తి అమోఘము. అందుకనే ఎపుడు శుభాన్ని పలుకుచుండాలి. కొందరి మాటలు రెండు నాలుకల ధోరణితో గూడి యుంటాయి. అవి ఇంకాప్రమాదము. వాల్మీకి రామాయణంలో రాముడు రెండు నాలుకలతో మాటలాడడని చెప్పబడింది. "రామో ద్విర్నాభి భాషతే"

అట్లే "భవ్యా న ద్విరుచ్చారయన్తి వాచమ్" హర్షచరితమ్ । ఉత్తములైనవారు రెండు నాలుకలతో మాట్లాడరు.

ఇంక మధుర భాషణం, ప్రియభాషణం గూర్చి కావ్యములలో ఉదాహరణలు -

"హితం మనోహారిచ దుర్లభంవచః"

- *కిరాతార్జునీయం,1-4.*

అందరికి హితమును బోధించెడి, అందరిని రంజిపచేసెడి మాటలు దొరకటం చాలాకష్టము. కిరాతార్జునీయగ్రంథమింకొక చోట ఈ విషయాన్నే చెప్పింది.

"సుదుర్లభాః సర్వ మనోరమాగిరః" - కిరాతార్జునీయం, 14-5.

అందరి మనస్సుకు ఆహ్లాదకరమైన మాటలు దుర్లభములు. "కన్య న జనయతి హర్షం సత్కార్యం మధురవచనంచ"- ఆర్యాసప్తశతి. "మంచిపనులు, తీపి మాటలు అందరి నానంద పరుస్తాయి."

"సతాం హి ప్రియవదతా కులవిద్యా" - హర్షచరితం.

మంచివారికి ప్రియంగా మాట్లాడటమే వారికులవిద్య.

"సతాం హి వాణీ గుణమేవభాషతే" - కిరాతార్జునీయం,14-1

సజ్జనులు మంచిని గూర్చియే మాట్లాడుతారు. వారివాక్కులు సుగుణోపేతములు.

"మహీయాంసః ప్రకృత్యా మితభాషిణః" - శిశుపాలవధం,2-13.

సహజ సిద్ధంగా మితభాషణం చేసేవారే గొప్పవారు. గొప్పవారే మితంగా మాట్లాడుదురు.

"మధురాం త్వీరయన్వాచమపి శత్రుః సఖా భవేత్" - మహాభారతమ్.

తీయని మాటలతో ఎంతటి శత్రువైనా చల్లబడి స్నేహితుడు, ప్రియుడు అగును. "మితం చ సారం చ వచో హి వాగ్మితా" - నైషధీయచరితమ్. మితంగాను, సారవంతంగాను మాటలాడటమే గొప్పవక్త, ఉపన్యాసకుని లక్షణమ్.

"అర్థవచ్చ విచిత్రంచ పశక్యం బహుభాషితుమ్" - మహాభారతమ్ 5-2-78.

అర్థవంతంగాను, చిత్రంగాను, అందంగాను మాట్లాడటం చాలకష్టము.

"బహుభాషిణో న శ్రద్ధధాతి లోకః" - కాదంబరి, 6వ అధ్యాయం.

అతిగాను, వ్యర్థంగాను మాటలాడువారి మాటలను లోకం పట్టించుకోదు. ఎవరు లెక్క చేయరు. "అతిభుక్తిః అతీవోక్తిః సద్యః ప్రాణాపహారిణీ" అతిగా భోజనం, అతిగా మాటలాడటం మిక్కిలి ప్రాణాంతకములు.

"సర్వమతిమాత్రం దోషాయ" - ఉత్తరరామచరితమ్

అన్ని రంగాలలోను "అతి" దోషభూయిష్టము. దీనమైన మాటలు గూడ పనికిరావు అని భర్తృహరి అంటారు.

"యం యం పశ్యసి తస్య తస్య పురతో మాబ్రూహి దీనం వచః"

- భర్తృహరిసుభాషితం 1-50

కనపడుప్రతివాని యెదుట దీనమైన మాటలు చెప్పవద్దు. అయితే తీయగా మాట్లాడినంతమాత్రాన చాలదు. "మధు తిష్ఠతి జిహ్వాగ్రే హృదయే తు హాలాహలమ్" నాలుక చివరేమో తేనె, హృదయం నిండా విషం. మనస్సు గూఢ విషపూరితమే. అట్టివారితో చాల

జాగ్రత్తగా మసలు కోవాలి. వారి హృదయ మెరిగి నడచుకుంటే సుఖం. లేనిచో వారి తీయతీయని తేనెల మాటలకు భ్రమపడి, ఆశపడి, గోతిలో పడిపోవటం ఖాయం.

అందుకే యువతీయువకులు పై పై మెరుగులకు, తీయ తీయని మాటలకు లొంగి పోక గోతిలోపడగూడదు. కాలుజారరాదు. మాట జారరాదు. నోరుగూడ జారరాదని పైన చెప్పిన కావ్య, నాటక, శాస్త్రాదుల ఉపదేశం. వారి మాటలను నమ్మరాదని, దెబ్బలు తినవద్దనీ, జీవితమును, శీలమును నాశనం చేసికొనవద్దనీ, వేదశాస్త్రాల హెచ్చరిక.

వేద, శాస్త్ర, కావ్యముల మాటలు పాతకాలవు మాటలనీ బూజుపట్టినవనీ, చాదస్తపు మాటలనీ తోసిపారేయక మంచి మనసుతో, కడు జాగ్రత్తగా ఆచితూచి, మంచి మంచి మాటలతో సుఖమయజీవితాన్ని కొనసాగించుకోవాలి.

"వినాశకాలే విపరీత బుద్ధిః"

వినాశకాలం వస్తే బుద్ధి, మాటలు గూడ విపరీతం గానే ఉంటాయి. విపరీతమైన చెడుమాటల వలన బుద్ధిగూడ విపరీతమై, ఇంకా మాటల మీద మాటలు చెలరేగి, చిలికి చిలికి గాలి వానై ఇంట, బయట, కలహం, తుఫాను వస్తాయి. ఇక మాటలను బట్టి, ద్వేషమో, గౌరవమో ఏర్పడును. ఏమాట మాట్లాడిన తగవు రాదో ఆలోచించి మాట్లాడాలి.

తనను అందరు గౌరవించాలనుకుంటే ఎవరు వచ్చి గౌరవించరు. తను మాటలాడుతీరును బట్టియే, గౌరవం గాని ద్వేషం గాని, కోపం గాని సంభవించును. అందుకే నీలకంఠ దీక్షితుల వారిలా అంటున్నారు.

"స్వాజ్ఞాన జ్ఞానినో విరలాః" అని

తమ అజ్ఞానాన్ని తెలుకొన గల్గినవారు చాల తక్కువ. చాల మంది తమమాటలలో దోషమేమీలేదని, చాల చక్కదనం, తీయదనం ఉంటాయనుకొంటారు. ఎదుటివారి మాటలలోనే దుడుకుతనం, దోషం ఉందనుకొంటారు గాని తమమాటలలోనే దుడుకుతనం, దోషం ఉందని గ్రహించేలేక పోతున్నారు.

తప్పులెన్నువారు తమ తప్పులెరుగరు గదా!

కనుక మొదట తమ మాటలలోని దోషాన్ని గుర్తించి, మృదు, మధు, మిత, సౌమ్యభాషణం, కల్తీలేని భాషణం చేసినపుడు అసలు కలహాలకు తావేలేదు.

ఇతిశమ్

"నమామ శబ్దదేవతామ్"



# శృంగాంతరం ద్వార మివార్థసిద్ధేః

కావ్యజగత్తులో రఘువంశమహాకావ్యము విశిష్టమైనది. కవి సార్వభౌముడైన కాళిదాస మహాకవి కరకమల సంజాతము. ఆ కావ్యము పూర్తిగా వేదార్థమును, వేదశిల్పమును లోకమున కందించుటకై అవతరించిన వేదలక్ష్మి. కావ్యలక్ష్మియై కాంతా సంమితముగ దర్శింపజేసినది. అందు రెండవ సర్గలోని శ్లోకపాదమే యీ శీర్షిక.

"ప్రదక్షిణీ కృత్య పయస్వినీం తాం
సుదక్షిణా సాక్షత పాత్రహస్తా ।
ప్రణమ్య చానర్చ విశాలమస్యాః
శృంగాంతరం ద్వారమివార్థసిద్ధేః ॥"

*- రఘువంశ -2-21*

ధేనువు యొక్క కొమ్ముల మధ్య ప్రదేశము కార్యసిద్ధికి ద్వారము వలెనున్నదని శీర్షిక యొక్క స్థూలార్థము. కాని విశేషార్థము వైదిక పరము. ఆ విశేషార్థము పొక్కింత జాతము. ముందు కథాభాగము -

రఘువంశపు రాజులలో వ్యగగణ్యుడు దిలీపమహారాజు. ఆయన భార్య సుదక్షిణాదేవి. చిరకాలము సంతానము లేని ఆ దంపతులు తగు సలహాకోసం వసిష్ఠమహర్షి వద్దకు పోగా ఆయన నందినీ ధేనువును సేవించుమనీ (ప్రీతా కామదుఘా హిసా) అని చెప్పెను. ఆమహర్షి యొక్క యాదేశానుసారం ఆ రాజదంపతులు నందినీ ధేనువును సేవించుచున్నపుడు కాళిదాస మహాకవి గోవు యొక్క మాహాత్మ్యమును, తద్ద్వారా వేదముల ప్రాధాన్యమును ఔన్నత్యమును భంగ్యంతరముగా తెలియపరచినాడు. గోశృంగముల మధ్య భాగము పరమార్థ సిద్ధికి ద్వారమని చెప్పినాడు. ఎట్లో చూతము -

దిలీపుడు సుదక్షిణాదేవిల మధ్యనున్న యాధేనువు రేయింబవళ్ల మధ్యమున్న సంధ్య వలెనున్నదట. "దినక్షపా మధ్యగతేవ సంధ్యా".

ముఖము మీద అర్ధ చంద్రాకృతిలో నున్న ఎఱ్ఱని రోమములతో, దేహమంతా తెలుపు రంగు గల యాధేనువు అపుడే ఉదయించుచున్న నూతన చంద్రునితో గూడిన సంధ్య వలెనున్నదట.

"లలాటోదయమాభుగ్నం పల్లవ స్నిగ్ధ పాటలా
బిభ్రతీ శ్వేత రోమాంచం సంధ్యేవ శశినం నవమ్"

*- రఘు -1-83*

మరియొకచోట వన్యవృత్తిని అవలంబించి ధేనువును సేవించినచో ఆ ధేనువు అభ్యాసము ద్వారా విద్యను సేవించిన వానికి ఆ విద్య వలె ప్రసన్నురాలగునని తెలిపినారు. వన్యవృత్తి యనగా వనమున కందమూల ఫలాదులను ఆహారముగ స్వీకరించుట.

"వన్యవృత్తిరిమాం శశ్వత్ ఆత్మానుగమనేన గామ్ ।
విద్యా మభ్యసనేనైవ ప్రసాదయితు మర్హసి ॥"

- రఘు -1-88

ఈ శ్లోకము ద్వారా ధేనువు విద్యా స్వరూపిణి యనిస్పష్టము చేసినారు. ఇంకొక చోట సూర్యకాంతి, ధేనువుల సంచారముచే లోకములు, దిగంతరములు పవిత్రములగునని బోధించినాడు.

"సంచారపూతాని దిగంతరాణి ----
---- ప్రభావతంగస్య మునేశ్చధేనుః ।"

అట్లు లోకములను పవిత్రము చేయుచూ, పుణ్యముల ప్రసాదించుచూ పరిశుద్ధురాలు, పరమశాంతమూర్తియునగు గోవును హింసించ వద్దు, చంపవద్దుయని, గోసేవ ద్వారా పాపప్రక్షాళన గావించు కొండని కవీశ్వరుడు హెచ్చరించెను.

"మా గా మనాగా మదితిం వధిష్ఠ"

అయితే నేటి సమాజము, ప్రభుత్వము గూడనిట్టి హితోక్తుల పెడచెవిన పెట్టి గోవధ జరిపించుట కడు శోచనీయము. నిర్దాక్షిణ్యముగ వేలకొలది గోవులు చంపబడుటచే భారత దేశము అపారమైన దైవీ సంపదను గోల్పోవుచున్నది. ఎంతయో పాపమును మూటకట్టుకొనుచున్నది.

"శ్రుతేరివార్థం స్మృతిరన్వ గచ్ఛత్" - రఘు -2-2.

ముందు నందినీ ధేనువు నడచుచున్నది. ఆ ధేనువు గిట్టల నుండి లేచిన ధూళి పరమ పవిత్రము. తీర్థములందు స్నానమాచరించుటచే గల్గెడు శుద్ధిని గల్గించునట. (తీర్థాభిషేకజాం శుద్ధి మాదధానా) అట్టి పవిత్ర ధూళి ధూసరితయై, ఆ ధేనువు యొక్క ధూళి ననుసరించుచున్న సుదక్షిణాదేవి వేదము యొక్క అర్థముననుసరించెడు స్మృతి వలెనున్నదని కాళిదాసు (నందినీ) ధేనువును వేదమాతగను, గోధూళిని వేదార్థముగను, సుదక్షిణా దేవిని స్మృతి స్వరూపిణిగను కనబరచినాడు.

వేదమాత ధేను స్వరూపిణియని భర్తృహరి మహాకవి గూడ ప్రకటించినాడు.

"శుద్ధాం శాంతాం మాతరం మంగళానాం ధేనుం ధీరాః సూనృతాం వాచమాహుః"

అనగా వేద వాక్కు మంగళములను గురిపించు ధేనువు అనగా కామధేనువని తెలియ వగును. అట్లే -

"దేవీం వాచమజనయంత దేవాస్తాం విశ్వరూపాః పశవోవదన్తి ।
సానో మంద్రేష మూర్జం దుహానా ధేనుర్వాగస్మానుప సుష్టుతైతు ॥"

- ఋగ్వేద -8-100-11.

అని యీ వేదమంత్రము "వేదవాక్కు పరమేశ్వరుని నుండి యావిర్భవించిన దివ్యవాక్కు అనీ, ఆ వాక్కు అన్నమును, కోరికల గురిపించు ధేనువని" వర్ణించినది. అట్లే "వాచం ధేనుముపాసీత" వేదమాతృ స్వరూపిణియగు ధేనువు నారాధించండియని బృహదారణ్య కోపనిషత్తు మానవులను ప్రబోధించుచున్నది.

అట్టి యానందినీ ధేనువును సుదక్షిణాదేవి సేవించుచూ, ప్రదక్షిణము చేయుచూ, ధేనువు యొక్క కొమ్ముల మధ్యనున్న విశాలమైన ప్రదేశమును నిత్యము నమస్కరించుచూ, అక్షతలతో పూజించుచుండెనట. కార్యసిద్ధి నొందెనట. సత్సంతానమును బడసెను. కావున కార్యసిద్ధి కొరకు ధేనువు యొక్క శృంగముల మధ్య ప్రదేశము ద్వారమని కాళిదాస మహాకవి వర్ణించినాడు. దీనిని బట్టి సంతానం కోసం గాని, మరియే కార్యసిద్ధికైనాగాని, భారతీయులు గోసేవ చేసెడి వారనీ, తరువాత భావి భారతపౌరులు గూడ గోసేవ చేసి సత్సంతానాది సమస్త సౌభాగ్యముల నొంద వలెనని యుపదేశించెను.

ధేనువు, గోవు అనగా వేదమాతయే. గోసేవయన వేదమాతృసేవ. కావున వేదమాతృ సేవ సర్వకార్యసిద్ధికి ప్రధానంగా సత్సంతాన సౌభాగ్యసిద్ధికి ప్రధాన దివ్యద్వారమని లోకమునకు ప్రబోధించినాడు.

ఇక శృంగములనగానేమి? వాని మధ్య ప్రదేశమేది? అర్థమన నేమి? తెలిసికొందాము - శృణాతీతి శృంగమని వ్యుత్పత్తి. ఒకరిని మించిపోవునది అనగా ఉన్నతమగునదియని భావము.

"కూటో2 స్త్రీ శిఖరం శృంగమ్" - "శృంగం ప్రాధాన్య సాన్వోః"

- అమరకోశము

"శృంగం ప్రభుత్వే శిఖరే చిహ్నే క్రీడాంబుయంత్రకే ।
విషాణోత్కర్షయోః । శృంగః స్యాత్కూర్చ శీర్షకే ।
స్త్రీ విషాయాం స్వర్ణమీన భేదయోః ఋషభౌషధౌ"

- మేదినీ కోశము.

ఇట్లు కోశములు పర్వతశిఖరము, ప్రభుత్వము, చిహ్నము, కొమ్ము ఉన్నతము, ఉత్కర్ష స్వర్ణము, మీనము మొదలగు అర్థముల దెల్పుచున్నవి. అర్థమనగా కార్యము, ప్రయోజనము, ధనము, పరమార్థము మొదలగు అర్థములున్నవి.

శ్రీశైలము, హిమవత్పర్వతము, భద్రాద్రి, వేదాద్రి మొదలగు పర్వతములన్నీ దేవతా స్వరూపములు (ఉదా : అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః) అవే వేదమయములు. (దేవ ఏవ వేదః వేద ఏవ దేవః) దేవ వేదశబ్దములు పర్యాయ పదములు. అట్టి యాపర్వత శిఖరములే వేదశిఖరములు - వేదశృంగములు. అనగా శ్రుతిమాత సీమంతములు. అవియే ఉపనిషత్స్వరూపములు. కనుకనే "శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే" అనగా శ్రీశైలాది పర్వత శిఖరముల దర్శించినచో పునర్జన్మ ఉండదని చెప్పబడు చున్నది.

పర్వత శృంగముల వలె గో శృంగములు గూడ వేద శృంగములే వేద స్వరూపములే. కావున శృంగదర్శనము, శృంగాంతర దర్శనము పాపనాశనము చేయును. కనుక పాపనివృత్తికి, పుణ్యప్రాప్తికి కార్యసిద్ధికి శృంగదర్శనము, శృంగాంతర దర్శనము, శృంగాంతరమున అర్చనయున్నూ ద్వార భూతములు.

శివ, విష్ణు, దుర్గ, గణపతి మొదలగు దేవాలయములకు వెళ్లువారు ముందుగా వాహన ములగు నంది, గరుడ, సింహ మూషికాదులను దర్శించి తద్వారా దైవ దర్శనం చేస్తారు. శివాలయంలో నంది కొమ్ముల మధ్య గుండా శివుని చూడని వారుండరు. అట్లు నంది యొక్క మధ్య నుంచి శివుని చూచుట ఎందుకు? విడిగా చూచినచో శివుడు కనుపించడా? విడిగా చూచుట కన్న, కొమ్ముల మధ్యనుండి చూచుటలోని అంతర్యమేమి?

శివుని విడిగా చూచినపుడు శివుని విగ్రహము, లింగము కనపడును. కాని పరమార్థ తత్త్వమును, పరమేశ్వరుని తత్త్వమును తెలిసికొనుటకు శృంగముల మధ్య నుంచి చూచిన గాని ఆ తత్త్వ రహస్యము బోధపడదు. శృంగములనగా సాధారణంగా కొమ్ములనియే అర్థము. ఏ భాషలోనైనా కొమ్ము అని తప్ప వేరు అర్థం కానరాదు దొరకదు గూడ. సంస్కృత భాషలోనే ప్రతి పదమునకు యోగశక్తి ద్వారా అనేకార్థములు సిద్ధించును.

"నిరుక్తిర్యోగతో నామ్నామన్యార్థత్వప్రకల్పనమ్" అని కువలయానందమనే అలంకార శాస్త్రగ్రంథమున నిరుక్త్య లంకారలక్షణ ప్రకారం శబ్దములకు యోగశక్తి ద్వారా చమత్కార జనకమైన అన్యార్థములు ప్రదర్శింపబడునని శాస్త్ర సంప్రదాయము. ఆ ప్రకారం శృంగశబ్ద మునకు ప్రభుత్వం, ప్రాధాన్యం, స్వర్ణము, ఉత్కర్ష ఔన్నత్యము మొదలగు విశేషార్థములు కనబడును. అయితే వేద మందలి యీ మంత్రముల జాతము -

"వయం నామ ప్రబ్రవామా ఘృతస్యాస్మిన్ యజ్ఞే ధారయామా నమోభిః ।
ఉపబ్రహ్మ శృణవచ్ఛస్యమానం చతుశ్శృంగో2 వమీద్గౌర ఏతత్ "

- ఋగ్వేద 5-58-2

ఈ మంత్రమునకు భాష్యములో సాయణాచార్యులు "చతుశ్శృంగః చత్వారి శృంగాణి వేద చతుష్టయ రూపాణి యస్యసః" అని నాల్గు శృంగములను నాలుగు వేదములని తెలిపిరి. పరమేశ్వరుడు నాల్గు శృంగములగు వేదముల ద్వారా జగత్తును నిర్వహించు చున్నాడని మంత్రార్థము. అట్లే

"చత్వారి శృంగా త్రయో అస్యపాదా
ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య ।
త్రిధా బద్ధో వృషభో రోరవీతి
మహాదేవో మర్త్యాగం ఆవివేశ ॥"

- ఋగ్వేద -5-58-3.

ఈ మంత్రమును శాస్త్రములన్నీ తమ తమ శాస్త్రమర్యాదానుకూలంగా సమన్వయం చేసికొన్నాయి. వ్యాకరణ శాస్త్రప్రకారం శబ్దము వృషభముగా చూపబడినది. ఈ వృషభము సాధారణ వృషభము గాదు. సాధారణ వృషభమునకు ఒక శిరము, రెండు శృంగములు, నాలుగు పాదములు మాత్రమే ఉంటాయి. మరియీ శబ్దరూప వృషభమునకు నాల్గు శృంగములు, రెండు శిరములు, మూడు పాదములు, ఏడు హస్తములు గలవు. సాధారణ వృషభమును ఒకటి లేక రెండు విధములుగ బంధిస్తారు. కాని ఈ శబ్ద వృషభమును మూడు విధములుగ బంధింతురట - ఎట్లన :

పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరీ అని నాల్గు రకములగు వాక్కులు గాని నామ, అఖ్యాత, ఉపసర్గ, నిపాతలని అనబడు వాగ్వివేషములు నాల్గు శృంగములు. భూత, భవిష్యద్వర్తమాన కాలములు మూడు పాదములు. వ్యంజ్య వ్యంజక శబ్దములు రెండు తలలు, ఏడు విభక్తులు ఏడు చేతులు. ప్రథమ, మధ్యమ, ఉత్తమ పురుషలతో గాని, ఏక వచన, ద్వివచన, బహువచన ములతోగాని మూడు విధములుగ బంధింపబడి, మహాదేవ స్వరూపమగు శబ్ద వృషభము మానవులను ప్రవేశించి అంతర్యామియై మానవులను నియంత్రించుచున్నదని అర్థము.

ఈ ఘంత్రమునకు సాయణ భాష్యము గలదు. శుక్ల యజుర్వేదాన్తర్గతమైన యీ మంత్రమునకు ఉవట, మహీధర భాష్యములు గలవు. ఈ మూడు భాష్యములు శృంగములనగా వేదములని పేర్కొన్నవి. యజ్ఞమును, యజ్ఞమందలి అగ్నిని వృషభముగ చెప్పినవి. యజ్ఞ రూప వృషభమునకు నాల్గు వేదములు నాల్గు శృంగములు. "చత్వారి శృంగాః చత్వారః వేదాః" అని స్పష్టముగ బోధించినవి. నాల్గు సవనములనియు ఉవట భాష్యము. మూడు - ప్రాతః, మధ్యాహ్న, సాయం సవనములు - మూడు పాదములు. బ్రహ్మోదనం, ప్రవర్గ్య రెండు శిరస్సులు. సప్త ఛందస్సులు ఏడు హస్తములు. మంత్ర - బ్రాహ్మణ - కల్పములతో మూడు విధముల బంధింపబడినదట. అట్లే బ్రహ్మ ఉద్గాత, హోత,

అధ్వర్యువు ఈ నలుగురు ఋత్విక్కులు యజ్ఞరూప వృషభమునకు నాల్గు శృంగములు. అపుడు ఋగ్యజుస్సామ వేదములు - మూడు పాదములు. సప్త ఛందస్సులు ఏడుహస్తములు.

సూర్యుని వృషభముగా జూపినదీ మంత్రము. అపుడు "అస్యాదిత్యస్య చత్వారి శృంగాణి చతస్రోదిశః। ఏతాః శ్రయణార్థత్వాత్ శృంగాణీత్యుపచర్యన్తే। త్రయో వేదాః పాదాః। ద్వేశీర్షే అహశ్చరాత్రిశ్చ। సప్త హస్తాసః సప్త రశ్మయః సప్త ఋతవో షడ్విలక్షణా ఋతవః ఏకః సాధారణః ఇతి సప్త హస్తా భవంతి" అని సాయణ భాష్యమ్। ఈ సూర్య రూపవృషభమునకు నాలుగు దిక్కులు నాలుగు శృంగములు. మూడు వేదములు మూడు పాదములు. "శ్రయణాత్ శృంగం" అను సాయణాచార్యులు ఇచ్చిన వ్యుత్పత్తి రీత్యా "ఆశ్రయము గలది శృంగం" అని అర్థము. రాత్రి, పగలు న్నూ రెండు తలలు, ఏడు కిరణములు లేక ఏడు ఋతువు లేదు చేతులు. విలక్షములైనని యారు, సాధారణమైనది ఒకటి కలిపి మొత్తం ఋతువు లేదు.

ఇట్లు శృంగములనగా వేదములు, ఋత్విక్కులు, దిక్కులు పరా పశ్యన్తీత్యాది వాక్కులు అని తెలియుచున్నది. ప్రధానంగా వేదములు, వేద శిఖరములగు ఉపనిషత్తులని స్పష్టము. నిరుక్త శాస్త్రమున యాస్క మహాముని గూడ శృంగమనగా వేదమనియే నిర్వచించెను -

"చత్వారి శృంగా వేదా వా త ఉక్తాః"

- నిరుక్తమ్.

వీనిని బట్టి పరమేశ్వరుడు సిద్ధించవలెనన్న శృంగరూప వేదములే ప్రవేశమార్గమనీ, ద్వారమనీ బోధపడుచున్నది. ఇంకను -

"యత్రగావో భూరి శృంగా అయాసః"

- ఋగ్వేద 1-154-6

అని ఋగ్వేదమంత్రము గూడ గావః అనగా గోరూప వేదవాక్కులు శృంగములు అని తెల్పుచున్నది.

"మహాశృంగః కృతాంతకృత్, నైకశృంగో గదాగ్రజః" అని విష్ణు సహస్రనామములు పరమేశ్వరుడు ఒక గొప్ప శృంగమనీ, అనేకములైన శృంగములు గలవాడనీ కీర్తించుచున్నవి. సహస్రనామములన్నీ వైదిక పదములే గావున సహస్ర శృంగములగుచున్నవి. ప్రతి నామము శృంగమే. కావున నిట్టి సహస్ర శృంగములు గలవాడు కనుకనే "నైకశృంగః, మహాశృంగః, శృంగీ" ఇత్యాది నామములతో కీర్తింపబడుచూ పరమేశ్వరుడు ప్రసిద్ధిజెందినాడు. ఆ మహాశృంగుడగు పరమేశ్వరుని వేదరూపములు, వైదిక పదములునగు సహస్రనామ రూప శృంగములు మానవులకు సిద్ధింపజేయుచున్నవి. పరమేశ్వరుడీ సహస్రనామరూప శృంగము లలో సుప్రతిష్ఠుడై యున్నాడు. ఈ శృంగముల పని మహా శృంగుని వర్ణించుట, నిర్వచించుట,

కీర్తించుట, స్వరూప స్వభావముల నెరింగించుట. మహా శృంగుని కీర్తించుటచే నీ నామములు శృంగములయినవి. అట్టి యీ శృంగములలో సుప్రతిష్ఠుడై యున్న యమ్మహా శృంగుని సిద్ధింప చేసికొన వలెనన్నచో నట్టి శృంగరూప వేదము, శృంగరూపములగు సహస్రనామములు ద్వారములగు చున్నవి. అట్టి శృంగదర్శనం, శృంగాంతరమున అర్చన మానవాళిని తరింపచేయునని కాళిదాస మహాకవి హృదయము. ఈ విష్ణుసహస్రనామరూప శృంగములను శృంగరూప సహస్రనామములను పారాయణ చేస్తూ ఆరాధించు భక్తులు గూడ శృంగములే యగుదురు. అట్టి వారి హృదయాంత రాళములలో శ్రీమహావిష్ణువు సుప్రతిష్ఠుడై యుండును గద! అట్లే లలితాదేవి "శృంగార రస సంపూర్ణా జయా జాలంధరస్థితా" అని సహస్రనామములలో కీర్తింపబడుచున్నది.

శృంగార రసమన్నపుడు ఐహికమగు అర్థమును గ్రహింపరాదు. "శృంగంరాతీతి శృంగారః" అని వ్యుత్పత్తి ప్రకారం శృంగం అనగా అత్యున్నత స్థితిని, వేదమును, పరమేశ్వరుని సిద్ధింపచేయునది అని అర్థము. మోక్షమును ప్రసాదించునది అని అర్థమున్నూ గలదు. "రసోవైసః" అని మంత్రము రసమనగా భగవంతుని చెప్పుచున్నది. కావున "శృంగార రస సంపూర్ణా" యనగా వేదములచే ప్రతిపాద్యుడు, వేదములందు సుప్రతిష్ఠుడు, వేదములచే సిద్ధించెడు, వేదవేద్యుడగు పరమేశ్వరునితో కలిసి పరిపూర్ణమై మానవులనను గ్రహించు తల్లి యని యర్థము. మోక్షప్రదమగు బ్రహ్మానంద రసముతో నిండియున్నదని అర్థము.

"శృంగేరి" అనగా శృంగగిరియనగా వేదగిరి యని చెప్పదగును. "శృంగీ, మహాశృంగః," అనియు పేర్కొనదగును. ఇట్లు పరమేశ్వర సిద్ధికి, వేదములు, వేద మాతృ సీమంతములునగు ఉపనిషత్తులు, కావ్యములు, పురాణములు, వైదిక శబ్దములు, సహస్రనామములు మొదలగు శృంగములు ద్వారములనెడు యీ శిల్పమునే తన కావ్యమున కాంతా సంమితముగ "నందినీధేను శృంగాంతరము అర్థసిద్ధికి ద్వార" మని చమత్కరించుచూ మహాకవి ప్రబోధించినాడు.

దేవాలయములోని నందియే సుదక్షిణా దిలీపులచే నారాధింపబడిన నందినీ ధేనువు అనియు కవీశ్వరుని చమత్కారమే. గరుత్మంతుడు గూడ ఛందోమయుడు, వేదమయుడని వైదిక సాంప్రదాయము. గజేంద్ర మోక్షఘట్టమున గజ రాజును రక్షించుటకు శ్రీమహా విష్ణువు వేదమయుడైన గరుత్మంతునిచే మోయబడుచున్నవాడై వచ్చెనని వ్యాస భగవానుడు తెల్పినాడు.

"ఛందోమయేన గరుడేన సమూహ్యమానః"

- భాగవతమ్

"తతః సభగవాన్ తార్క్ష్యో వేదరాశిః స్మృతః" అని భారతమందలి హరివంశమున గరుత్మంతుడు వేదరాశిగా చెప్పబడెను.

గజమే జగము. జగమే గజము. గజమనగా ప్రపంచం. గ అంటే గమనం. అంటే లయము. జ అంటే జన్మ. కావున గజమన జన్మ లయము పైగల ప్రపంచమందలి జీవులు. మకర మనగా అజ్ఞానము. అజ్ఞానము నశించి జ్ఞాన సాక్షాత్కారం కోసం జీవస్వరూపమగు గజము భగవానుని ప్రార్థించగా వేదోరూపగరుడ వాహనము మీద భగవంతుడు వచ్చెను. భగవంతుడు వేద వాహనుడు గద! అనగా జీవులకు భగవత్సాక్షాత్కారము సిద్ధించవలెనన్న వేదమే ద్వారమగుచున్నదని తెలియనగును. భగవంతునికి జీవునకు మధ్య ఉన్న వేదమే - శిల్ప రూపంగా గరుత్మంతుడుగా నవతరించెను. గరుత్ అనగా పక్షము (రెక్క) ఇచ్చట వేదపక్షములు గ్రహించాలి.

అట్లే గజాననునికి వాహనము మూషికము. దీనిపేరు "అనింద్యుడు" - రఘువంశమహా కావ్యంలోని నందినీ ధేనువుకు "అనింద్య" అని నామము చెప్పబడినది.

"అనింద్యా నందినీ నామధేను రావవృతే వనాత్"

- రఘు -1-82.

మూషికమన స్తేనుడు - దొంగ యని అర్థము. మానవుల అజ్ఞానమును, దొంగిలించు వేదమే మూషికము. కావున నంది, గరుత్మంతుడు, మూషికాది వాహనములన్నీ వేదమయ ములే "బ్రహ్మణం బ్రహ్మ వాహనమ్" అని ఋగ్వేదము. పరబ్రహ్మయే శివ, విష్ణు, గణపతి వాచ్యుడుగా, శబ్దబ్రహ్మయే నంది, గరుడ, మూషికాది వాచ్యముగా చిత్రీకరింపబడినారు. కావున పరబ్రహ్మను దర్శించుటకు ద్వారము శబ్దబ్రహ్మయనీ, "శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధి గచ్ఛతి" అనగా శబ్ద బ్రహ్మ యగు వేదమందు నిష్ణాతుడు పరంబ్రహ్మను దర్శించి, పొంది, తరించగలడని శాస్త్రవచనమునే కాళిదాస మహాకవి తనకావ్య లక్ష్మి ద్వారా తెలియబరచెను - శిల్పముగా చూపెను.

"వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః" అని గీతావచన తాత్పర్యము గూడనిదియే. శ్రీసూక్తమున అమ్మవారిని "గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం" అని ప్రార్థించుచున్నాము. అపరా దేవత "గంధద్వార" యట. అనగా నా దేవత వద్దకు పోయెడి ద్వారము గంధమట. ఆ గంధమేది? ఏ గంధము ద్వారా అమెవద్దకు పోవుటకు వీలగును? ఆ గంధము విద్యా గంధము - బ్రహ్మ విద్యా గంధము. అనగా వేద విద్యా గంధము, కావున జగన్మాత దర్శన భాగ్యము సిద్ధించ వలెనన్నచో వేదములే. ద్వారము అని శ్రీసూక్తము మానవాళికి ద్వారమును చూపినది. అదియే ఉత్తర ద్వారము. వైదిక ద్వారము.

మానవుని చైతన్యము హృదయాంతరమున నుండును. దేహము దేవాలయమని చెప్పబడు చున్నది. "దేహో దేవాలయః ప్రోక్తః జీవోదేవః సనాతనః" అట్లే

"అష్ట చక్రా నవద్వారా దేవానాం పూరయోధ్యా ।
తస్మాదం హిరణ్మయః కోశః సజ్యోతిషా2వృతః"

అని యీ మంత్రము ద్వారా దేహమే దేవతల పట్టణము. అయోధ్య. నవద్వారములు గల్గిన ద్వార నతిపురం. ద్వారక. అని తెల్పుచున్నది. అందలి హృదయము జ్యోతిస్సుతో నిండి యుండుటచే నా హృదయ కోశము గూడనొక శృంగమే. పరమేశ్వరుని దర్శించువారు అంతర్ముఖులై తపస్సు ద్వారా హృదయ శృంగాంతరమందుండు భగవంతుని సర్వదా దర్శించుచూ ఉంటారు. మహర్షులు, మహాత్ములు నట్లు తమ తమ హృదయ శృంగములనెడి ద్వారముల గుండా పరమార్థ సిద్ధిని, తద్ద్వారా కార్య సిద్ధినొందెడి వారు. హనుమంతుడు తన హృదయశృంగమందు సుప్రతిష్ఠులై యున్న సీతారాములను చూపుచుండును గదా! చివరగా "యజ్ఞోవైవిష్ణుః" అనగా యజ్ఞమే విష్ణుస్వరూపమని అర్థము. "చత్వారి శృంగా" అను మంత్రప్రకారం యజ్ఞము శృంగము గదా! అట్టి యజ్ఞములను చేయువారు గూడ మహాశృంగములే యగుదురు.

ఈ విధముగ పరమేశ్వర దర్శనమునకు, పరమార్థసిద్ధికి ద్వారము వేదము. శృంగములందు సుప్రతిష్ఠుడైన మహా శృంగ రూప పరమేశ్వరుని సిద్ధికి ఆ శృంగములే ద్వారములు. శృంగాంతరమందు అర్చనయే ద్వారమని కాళిదాస మహాకవి ప్రపంచము తరించుటకు గొప్ప ద్వారము నేర్పరచినారు. చూపినారు. భారతీయులు గోరూప వేదమాతను సేవించి తదను గ్రహమున సత్సంతాన రూప కార్య సిద్ధిని పొందెడి వారని, ఉత్తమ విద్యా గంధము గల, వివేక విజ్ఞాన వంతులగు సత్సంతానము పొందెడి వారని తెలిపినారు. భావితరపు భారతీయులకు గూడ సత్సంతాన ప్రాప్తి మొదలగు కార్యసిద్ధి కొరకు వేదమాతృ సదాసేవయే దివ్య ద్వారమని ప్రబోధించినారు. ఆదివ్య ద్వారమే ఉత్తర ద్వారము. అట్టి ఉత్తమమైన, ఉన్నతమైన ఉత్తర ద్వార దర్శనము అత్యంత ఫలప్రదము. మోక్ష ప్రదము.

ఇతిశమ్

"నమామ శృంగరూపిణీమ్"



# మండూకములు -వైదిక స్వరూపము

మండూకములనగా కప్పలు, ఇవి వర్షాకాలమున బుట్టును. వాని ధ్వని వర్షసూచకము, ప్రేరకము. ఏవి ధ్వనికి మేఘములు ప్రీతిచెంది పులకరించి వర్షములనిస్తాయి. వర్షములు కురవనిచో మండూకపూజ చేస్తారు. వేదములో ప్రత్యేకముగ మండూక సూక్తము గలదు. సూక్తమును జపించినచో వర్షము కురియును. ఇంతు శాస్త్రజ్ఞులు తమ ప్రయోగాలన్నీ ముందుగా కప్పల మీద ప్రయోగిస్తారు. సంగీత శాస్త్రంలో మండూక ధ్వనికి ప్రత్యేక స్థానం గలదు.

"ధగ ధగ ధగం - జాగ జాగ జాగం" అని మండూక శబ్దమును గాయకులాలాపిస్తారు.

హాని చేయని, బాధ తలపెట్టని సాధుజీవిమండూకము. దీనికి "భేకే మండూక వర్షాభూః శాలూర ప్లవ దర్దురాః" అని అమరకోశమున పేర్లు గలవు.

1. "సర్పాత్ బిభేతీతి భేకః" - పామువలన భయపడుటచే భేకమని పేరు.
2. "మండయతీతి మండూకః" - చెరువు నలంకరించునది గాన మండూకము.
3. వర్షాభూః - "వర్షాసు భవతీతి వా వర్షాన్ భావయతీతి వా" వర్షములలో పుట్టునది లేక వర్షములను ప్రేరేపించునది లేక సూచించునది.
4. శాలూరః - "శలతి - ఉత్ప్లుత్య గచ్ఛతి" - గంతులువేస్తూ ఎగురుతూ పోవునది.
5. ప్లవః - ఎగిరెగిరి పోవునది.
6. దర్దురః - "శబ్దేన కర్ణాన్ దృణాతీతి". తన ధ్వనితో చెవులను బ్రద్దలు కొట్టునది.

మండూక శబ్దమును నిరుక్తశాస్త్ర మిట్లు నిర్వచించింది.

"మండూకా మజ్జూకా మజ్జనాత్ మదతేర్వా మోదతి
కర్మణో మందతేర్వా తృప్తి కర్మణో మండయతేరితి
వైయాకరణాః । మండ ఏషామోక ఇతి మండో
మదేర్వా ముదేర్వా తేషా మేషా భవతి"

- నిరుక్తం -2-5.

మజ్జనం అంటే మునిగి యుండటం. నిత్యము నీటిలో మునిగి యుండుటచే కప్పలకు మజ్జూకములని పేరు. మండూక అను పదము మజ్జూక అయింది. కప్ప ఎప్పుడు సంతోషముతో ఉండునది. తృప్తి అను అర్థముగల 'మది' అను ధాతువునుండి మండూక శబ్దం పుట్టింది. మోదతే అనగా తృప్తి చెందుట. కాన మోదతే అనుధాతువు నుండి పుట్టుటచే మండూకమైనది. మండయతి అనగా వర్షాకాలము నలంకరించుటచే మండూకమయినది.

"మండ ఏషాం ఓకః స్థానమ్" మండ అంటే జలము. జలము స్థానముగా గల్గినది మండూకము. ముది అనే ధాతువుకు సంతోషమని అర్థము. ఆ 'ముది' ధాతువు నుండి మండూక శబ్దం పుట్టింది. కనుక నిత్య తృప్తి, సంతోషము గలది మండూకమని అర్థము.

రామాయణంలో మండూక ప్రశంస ఇట్లు గలదు ।

"షట్పాద తంత్రీ మధురాభిధానం ప్లవంగమోదీరిత కంఠ తాళమ్ ।
ఆవిష్కృతం మేఘ మృదంగ నాదైర్వనేషు సంగీత మివ ప్రవృత్తమ్"

- *కిష్కింధ-28-36*

తుమ్మెదల మధురనాదము వీణా నాదముగాను, కప్పల ధ్వని గాత్రము గాను, మేఘ ధ్వనులు మృదంగ నాదములు గాను వనములలో సంగీతము ప్రవర్తించుచున్నట్లున్నది. కప్పల గాత్రమునకు తుమ్మెదలు వీణతోను, మేఘములు మృదంగములతోను సహకరించినవి.

"స్వనైర్ఘనానాం ప్లవగాః ప్రబుద్ధాః విహాయ నిద్రాం చిరసన్నిరుద్ధామ్ ।
అనేక రూపాకృతి వర్ణనాదాః నవాంబు ధారాభిహతా నదంతి"

- *కిష్కింధ-28-38*

రకరకముల రూపములు, ఆకారములు, రంగులు గల కప్పలు చాలకాలముగ దాగు చున్న నిద్రను మేఘగర్జనలతో విడచి మేల్కొన్నవై క్రొత్తగా పడుచున్న జలధారలతో కొట్టబడినవై రకరకముల ధ్వనులు చేయుచున్నవి. అట్లే భాగవతంలో గూడ మండూక ప్రశస్తి -

"శ్రుత్వా పర్జన్యనినదం మండూకాః వ్యసృజన్ గిరః ।
తూష్ణీం శయానాః ప్రాగ్యద్వత్ బ్రాహ్మణా నియమాత్యయే ॥"

*-భాగవతం -10-20-9*

కర్మానుష్ఠానము చేసి ఊరకనే పడుకున్న బ్రాహ్మణులు గురువుగారి పిలుపు లేక ధ్వని వినగానే వేదా ధ్యయనమునకుపక్రమింతురు. దీక్షాంతమున మౌనముగ పడుకున్న బ్రాహ్మణులు వర్షాకాలం రాగానే శ్రావణ పూర్ణిమనాడు మేఘధ్వని వినగానే వేదాధ్యయనమునకుపక్రమింతురు. అట్లే గ్రీష్మాంతము మౌనంగా పడుకున్న మండూకములు వర్షాకాలం రాగానే మేఘధ్వని వినినంతనే మేల్కొని ధ్వనులను (వాక్కులను) చేయసాగినవి. అని అర్థము. వ్యాస, వాల్మీకి, యాస్క మహర్షులతీంద్రియద్రష్టలు. వేద వేత్తలు. వారు మండూకముల ధ్వని వేద వాక్కులతో పోల్చినారు. మండూక ముల గూర్చి అనేక రహస్యములను వేదములు మండూక సూక్తం ద్వారా ప్రకటించినవి. వాటిని మానవులందరికి అందుబాటులోను, సులభంగా తెలిసికొనునట్లుగాను కవులు - మహర్షులు తమ కావ్యములలోను, శాస్త్రములలోను విస్తృతం చేసి మానవాళి కందించారు. నేటి జంతు శాస్త్రము కప్పల కొని వాని అవయవాదుల

ప్రాణమును, భౌతిక తత్త్వమునే తెల్పుచున్నది గాని వేద శాస్త్రాదులు మండూకముల యొక్క రహస్యమును, ఇంద్రియగోచరము గాని పెక్కు రహస్యములను, వైదిక స్వరూపమును తెలుపుచున్నవి. వేదములలోని ఋగ్వేదములో మండూక సూక్తములోను అధర్వణ వేదములోను ఈ క్రింది విషయములు తెలియవగును.

## మండూక సూక్తము

ఋగ్వేదము, ఏడవ మండలములోని యీ సూక్తమున పది ఋక్కులున్నవి. వర్షమును కోరువారీ సూక్తమును జపించవలెనని శ్రీ సాయణాచార్యుల వారు తమ భాష్యమున తెలిపిరి.

"సంవత్సరం దశ పర్జన్యస్తుతిః సంహృష్టాన్మండూకాన్
తుష్టావాద్యానుష్టుప్ ఇతి । వృష్టి కామేనైత త్సూక్తం జప్యమ్"

సంవత్సరము పాటు చేసిన మేఘస్తుతి, మేఘ ధ్వనిచే సంతోషించిన మండూకములను తృప్తి పరచెను అని అర్థము. ఈ సూక్తమునకు వసిష్ఠుడు ఋషి, ఛందస్సు త్రిష్టుభము. దేవత మండూకము. మొదటి మంత్రము -

1. "సంవత్సరం శశయానా బ్రాహ్మణా వ్రతచారిణః ।
వాచం పర్జన్య జిన్వితాం ప్రమండూకా అవాదిషుః ॥"

- ఋగ్వేద-7-103-1

"అత్ర నిరుక్తమ్ - వసిష్ఠో వర్షకామః పర్జన్యం తుష్టావ ।
తం మండూకా అన్వ మోదన్త । సమండూకానను మోదమానాన్ దృష్ట్వా తుష్టావ"

- నిరుక్తం -9-6

వసిష్ఠ మహర్షి వర్షము గోరినవారై మేఘమును స్తుతించి తృప్తిపరచెను. ఆస్తోత్రమును మండూకములను మోదించినవి. వసిష్ఠుని ఆమోదించినవి. అట్లు ఆమోదించిన మండూకముల జూచి వసిష్ఠుడు సంతసించెను - ఇక మంత్రార్థము :

సంవత్సర సత్ర మనెడి యాగమును వ్రత దీక్షాపరులై, వాక్సంయమనముతో బ్రాహ్మణులు శరదృతువు మొదలుకొని వర్షర్తువు వరకు సంవత్సర కాలము చేసిరి. నియమాంతమున ఊరక పడుకున్న ఆ బ్రాహ్మణులు వర్షర్తువు రాగానే వేదాధ్యయన మున కుపక్రమించిరి. అట్లే శరదృతువు నుండి వర్షర్తువు వరకు సంవత్సరకాలము వర్షము కొరకు తమబిలములలో తపస్సు చేయువారి వలె నివసించుచున్న మండూకములు (శశయానాః శిశ్యానాః వర్షణార్థం తపశ్చరన్త ఇవ నిలీనవన్తః) మేఘ ప్రీతికరములగు వాక్కులను పల్కుచున్నవి. అనగా మండూక ధ్వని మేఘ ప్రీతికరమగు ధ్వని. ఈ ధ్వని బ్రాహ్మణుల వేదధ్వని వంటిదట.

2. "దివ్యా ఆపో అభియదేవ మాయన్ దృతిం నశుష్కం సరసీశయానమ్ ।
గవామహనమాయుర్వత్సినీనాం మండూకానాం వగ్నురత్రానమేతి"

- ఋగ్వేద-7-103-2

వర్షర్తువు రాగానే దివినుండి వచ్చిన జలములు గ్రీష్మమున ఎండిపోయిన చెరువులో పడుకున్న మండూకములను చేరినంతనే మండూకములానందముతో ఘోషించుచున్నవి. దూడలు చెంతకు రాగానే గోవులు ఆనందముతో నెట్లు ఘోషించునో అట్లు మండూకములు జలములు రాగానే ఘోషించుచున్నవి. కనుక మండూకముల ధ్వని గోవుల ధ్వనివలె శుభప్రదమైనది అని తెలియుచున్నది.

3. "యదీమేనాగ్ం ఉశతో అభ్యవర్షీ త్తృష్యావతః ప్రావృష్యా గతాయామ్ ।
అఖ్ఖలీకృత్యా పితరం న పుత్రో అన్యో అన్యముపవదన్తమేతి"

- ఋగ్వేద -7-103-3

వర్షమును కోరుచూ, వర్షం కోసం ఆశగా ఎదురు చూచుచున్న మండూకములు వర్షర్తువు రాగానే "అఖ్ఖల" అను శబ్దం చేస్తూ తండ్రిని కొడుకువలె శబ్దముచేయుచూ నొక దానిని మరి యొకటి అనుసరించుచున్నవి.

4. "అన్యో అన్యమను గృభ్ణాత్యేనోరపాం ప్రసర్గే యదమంది షాతామ్ ।
మండూకో యదభివృష్టః కనిష్కన్ పృశ్నిః సంపృంక్తే హరితేన వాచమ్"

-ఋగ్వేద -7-103-4

ఈ రెండు రకముల మండూకములలో ఒకదానినొకటి పట్టుకొని, అనుసరించు యుండును. వర్షము పడగానే సంతసించినవై యుండును. అపుడు తెల్లని కప్ప ఎగురుచూ వెళ్లి ఆకు పచ్చని కప్పతో తన వాక్కును మేళవించును.

5. "యదేషామన్యో అన్యస్య వాచం శాక్తస్యేవ వదతి శిక్షమాణః ।
సర్వం తదేషాం సమృధేవ పర్వయత్సువాచో వదథనాధ్యప్సు"

-ఋగ్వేద -7-103-5

బాగా శిక్షణ నీయగల, శిక్షణలో శక్తిగల గురువు యొక్క వాక్కును శిక్షణ బొందు శిష్యుడనుకరించుచున్నట్లు ఆకుపచ్చని కప్ప వాక్కును (ధ్వనిని) తెల్లకప్ప అనువదించు చున్నది. ఎపుడైతే ఈ కప్పలు శోభన కరములగు వాక్కులను పలుకుచున్నవో అపుడు వర్షములో సంపూర్ణావయవములు గల్గినవై విలసిల్లుచున్నవి. ఇచట సాయణ భాష్యము-

"ఘర్మకాలే మృద్భావమాపన్నాః మండూకాః పునర్వర్షణే
సత్యవికలాంగాః ప్రాదుర్భవన్తీత్యర్థః"

వేటి శాస్త్రజ్ఞులకు తెలియని విషయమును వేద మిట్లు తెల్పుచున్నది. వేసవి కాలమున చెరువులెండిపోవుటచే కప్పలు మట్టిలో కలిసిపోతాయి. మృద్భావమును పొందుతాయి. మరల వర్షము కురవగానే ఆ మట్టినుండి పూర్వమువలెనే సంపూర్ణావయవములు గలిగి పుట్టు చున్నవట. కనుకనే వర్షములో పుట్టునది (వర్షాసు భవతీతి) "వర్షాభూః" అని నామధేయము సార్థకమైనది.

పై మంత్రమును బట్టి తెలిసినదేమనగా అకుపచ్చని మండూకము మంచి శిక్షణ నిచ్చు గురువు వంటిదనీ, తెల్లమండూకము మంచి శిక్షణ పొందిన శిష్యుడు వంటిదనీ, వాని మధ్యనున్న మండూక ధ్వని వేద ధ్వని వంటిదనీ తెలియనగును. మన ఇండ్లలో గురు శిష్యులచే వ్యక్తముగా నుచ్చరింపబడు వేదవాక్కులను వరమ్పులలో మండూకముల వ్యక్తముగ నుచ్చరించుచున్నవి.

6. "గోమాయు రేకో అజమాయురేకః పృశ్నిరేకో హరిత ఏకఏషామ్ ।
పమానం నామ బిభ్రతో విరూపాః పురుత్రావాచం పిపిశుర్వదన్తః"

- ఋగ్వేద -7-103-6

"గోమాయుః" అంటే "గోః మాయురివ మాయుః శబ్దః యస్యసః" అనగా గోవు యొక్క శబ్దము వంటి శబ్దము గల్గినది అని అర్థము. "పృశ్నిః" అంటే తెల్ల కప్ప. తెల్లని కప్ప ధ్వని ఆవు యొక్క ధ్వని వంటిది. "గావః ఋషభభాషిణః" అని అమర కోశము. "గోవు యొక్క ధ్వని ఋషభ స్వర" మని చెప్పచున్నది. అట్లే హరితః అంటే అకుపచ్చని కప్ప. దాని ధ్వని "అజమాయుః" అంటే మేక యొక్క ధ్వని వంటిది. మేక యొక్క ధ్వని గాంధార స్వరము. "అజావికంతు గాంధారం" అని అమరకోశము. గురుస్థానీయమైన అకుపచ్చని కప్ప ధ్వని గాంధారము. శిష్యస్థానీయమైన తెల్లని కప్ప ధ్వని ఋషభము. దీనిని బట్టి గురువు ఉచ్చరించు స్వరము గాంధార మనీ, శిష్యుని స్వరము ఋషభమనీ తెలుస్తున్నది. గురు, శిష్య స్వరములు అట్లు ఉండాలని గూడ యీ మండూక ధ్వనులు సూచిస్తున్నవి.

కప్పలన్నీ రకరకముల రూపములు గల్గి యున్ననూ 'మండూక' ములనెడి సమానమైన నామము ధరించి అనేకములు, రకరకములైన ప్రదేశములలో శబ్దములు చేస్తూ పుట్టు-చున్నవి.

7. బ్రాహ్మణాసో అతి రాత్రే న సోమే సరో న పూర్ణమభితో వదన్తః ।
సంవత్సరస్య తదహః పరి ష్ఠ యన్మండూకాః ప్రావృషీణం బభూవ"

- ఋగ్వేద -7-103-7

బ్రాహ్మణులు అతి రాత్రమనెడి సోమయాగమును రాత్రి యందు చేసి ఇట్లు చెప్పచున్నారు. "ఓ మండూకములారా! రాత్రి యందు చెరువు లందు శబ్దములు చేయుచూ

అదినమంతయు వర్షోపేతముగ చేయవలసినది" అని. అనగా బ్రాహ్మణులు రాత్రి పూట అతిరాత్ర యాగం చేసినట్లు మండూకములు రాత్రి యందు చేయు శబ్దములకు తృప్తి చెంది మేఘములాదినమంత వర్షమయం చేస్తాయని అర్థము.

8. "బ్రాహ్మణాసః సోమినో వాచమక్రత బ్రహ్మ కృణ్వన్తః పరివత్సరీణామ్ ।
అధ్వర్యవో ఘర్మిణః సిష్విదానా ఆవిర్భవన్తి గుహ్యా న కేచిత్"

- ఋగ్వేద -7-103-8

సంవత్సర కాలము సోమయాగము చేయు బ్రాహ్మణుల వాక్కులవలె మండూకములు గూడ సంవత్సర కాలము పిదప వాక్కులనుచ్చరించుచున్నవి. ధర్మకాములైన ఋత్విక్కులు యాగమందు దేహములందు చెమట పట్టి యున్నట్లు గ్రీష్మర్తువులో చెమట పట్టిన దేహములు గలవై బిలములలో నిగూఢముగ మండూకములు ఉంటున్నవి. వర్షమురాగానే పుట్టుచున్నవి.

9. దేవహితిం జుగుపుర్ద్వాదశస్య ఋతుంనరో న ప్రమినంత్యేతే ।
సంవత్సరే ప్రావృష్యాగ తాయాం తప్తాఘర్మా అశ్నువతే విసర్గమ్"

- ఋగ్వేద -7-103-9

దేవతలాయా ఋతువుల కాయాధర్మముల విధించిరి. ఈ మండూకములు నాయకులై ఆయా ఋతుధర్మములను రక్షించుచున్నవి. "రాజా కాలస్య కారణమ్". ప్రభువులే గద కాలమునకు కారణభూతులు. అనగా ప్రభువులు ధర్మప్రభువులైతే సంవత్సరమందలి ఆయా ఋతు ధర్మములు గూడ సక్రమముగా నుండును. సకాల వర్షములేర్పడును. అకాల వర్షములు, అతి వృష్టి అనావృష్టి మొదలగు బాధలుండవు. అట్లే యీ మండూకములు ధర్మ ప్రభువులవలె, నాయకులై ఋతుధర్మముల కాపాడుచూ, ఇతరములైన వసన్తాది ఋతువులను బాధింపవు. అనగా నితర ఋతువులలో వర్షములను ప్రేరేపించవు. వర్షాకాలములో మాత్రమే బిలముల నుండి బయల్వెరలి వేదధ్వని వంటి ధ్వనులు చేయుచూ మేఘముల తృప్తి పరచి మంచి సస్యానుకూల వర్షమునకు కారణమగుచున్నవి.

10. "గోమాయురదాదజమాయురదాత్ పృశ్నిరదాత్ హరితో నో వసూని ।
గవాం మండూకాదదతః శతాని సహస్రసావే ప్రతిరన్త ఆయుః"

- ఋగ్వేద -7-103-10.

అంబారవము వంటి ధ్వనులు గల శ్వేత మండూకములు, అజముల ధ్వనులు గల హరిత మండూకములు మాకు పెక్కు ధనముల ననగా వర్షములను, తద్వారా పంటలను సమకూర్చుగాక! వేలకొలది దివ్యౌషధుల పుట్టించెడి వర్షముల నిచ్చుగాక! వేల కొలది గోవులను ఇచ్చుగాక! అట్లు మా జీవనమును, ఆయుస్సును వృద్ధి బొందించు గాక!

అధర్వ వేదములలోని మంత్రములను చూద్దాము. వర్షమును గూర్చి చాల మంత్రము లున్నవి. అందు కొన్ని:

1. అపోవిద్యుదభ్రం వర్షం సం వో2 వన్తు సుదానవ ఉత్సా అజగరా ఉత ।
మరుద్భిః ప్రచ్యుతా మేఘా ప్రావంతు పృథివీమను ॥

- అధర్వ -4-3-15-9

వర్షర్తువు వచ్చి నీరు, విద్యుత్తు, మేఘము, వర్షము, నదులతో మమ్ము రక్షించుగాక! చక్కని వాయువులు, వానిచే ప్రేరితములైన మేఘములు భూమిని రక్షించుగాక!

2. "అపామగ్ని స్తనూభిః సంవిదానో య ఓషధీనా మధిపాబభూవ
సనో వర్షం వనుతాంజాత వేదాః ప్రాణం ప్రజాభ్యో అమృతం దివస్పరి"

- అధర్వ -4-3-15-10

మేఘజలాంతర్గతమై విద్యుద్రూపంలో నున్న అగ్ని, ఓషధీ పాలకమై, ఆకాశమునుండి అమృత వర్షం కురుపించు గాక! ప్రజలకు ప్రాణ రూపమైన యీ యగ్ని ఇట్లు అమృత వర్షప్రదాతయై ప్రజల రక్షించుగాక!

3. ఉపప్రవద మండూకి వర్షమావద తాదురి ।
మధ్యే హ్రదస్య ప్లవస్వ విగృహ్య చతురః పదః ॥

- అధర్వ -4-3-15-14

ఓ మండూకమా! నావద్దకు వచ్చి ధ్వని చేయుము. వర్షము కురియునట్లు వర్షాభిముఖమై వాక్కుల పలుకుము. తరణ స్వభావము గలదానా! తటాకములు జల పూర్ణములు కాగానే అపుడు నీ నాలుగు పదములు ప్రసారించి ఎగురుచు వెళ్లి పొమ్ము. స్వేచ్ఛగా సంచరించుము.

4. వదంతు పృశ్నిబాహవో మండూకా ఇరిణాను ।

- అధర్వ -4-3-15-12

మేఘము ప్రాణరక్షకుడగు తండ్రి. ఆ మేఘము వృష్టికి అనుకూలమగు వాయువులతో వర్షమునిచ్చుగాక! అందుకు గర్తలేని భూముల నుండి వర్షము పడగానే పుట్టిన తెల్లని మండూకములు వర్షానుకూలమైన ధ్వనులు పలుకుగాక! ఆ ధ్వనులతో తృప్తి జెందిన మేఘములు సస్యానుకూల వర్షము నిచ్చుగాక!

5. "ఖణ్వఖా ఇ ఖైమఖా ఇ మధ్యే తదురి ।
వర్షం వనుధ్వం పితరో మరుతాం మన ఇచ్ఛత ।"

అధర్వ -4-3-15-15

ఖర్వాభ, శైమఖ, తదురి అనునవి అడు కప్పల పేర్లు. ఓ మండూకములారా! మడుగు మధ్యలో ఉండి మీ శబ్ద ఘోషతో వర్షమును ప్రసాదించండి. మమ్ముపాలించు పితృ రూపులైన మండూకములారా! వృష్టికి అనుకూలముగా వీచుటకై వాయువుల మనస్సును వశము చేసికొండి. అనగా వేద ధ్వని వంటి మండూక ధ్వనికి వాయువుల మనస్సు పరవశమై, కరిగి, చక్కగా వర్షాను కూలంగా వీచునని అర్థము. ఇట్లు సస్యాను కూలమైన అమృత వర్షహేతువులగు యీ మండూకములు ప్రభువులుగా, పాలకులుగ, నేతలుగ, వేదాధ్యయనం చేయు గురుశిష్యులుగా, వర్షప్రదాతలుగా, పితరులుగా వేదములందు చెప్పబడుచున్నవి. అంతేగాదు, వాని ధ్వని వేదధ్వని. అధ్వనితో తృప్తి చెందిన మేఘములు అమృత వర్షములు కురియును. సస్యములు, ఓషధులు, తుదకు దివ్యాన్న ప్రదాతలగు వా మండూకములు దేవతలే! భూదేవతలే! వ్రత పరాయణులు, వేదవేత్తలునగు బ్రాహ్మణోత్తములతో సమానమైనవే! అని వేదములు ఘోషించుచున్నవి.

"అమృతస్య ధారా బహుధా దోహమానం
చరణం లోకే నో సుధితాం దధాతు ॥"

- వేదము.

అమృతధారలను కురిపించు భగవంతుని పాదము మనకు తృప్తిని, ఆనందమును ఇచ్చుగాక! అమృత వర్షిణియగు వేద చరణము అనగా వేదమంత్రము పాండిత్యమును అనగాజ్ఞానమును, అమరత్వము నొసగుగాక!

ఇతిశమ్
"నమామ మండూకరూపామ్"



# పుష్పములు - వైదిక స్వరూపము

లోకమున మనస్సునకాహ్లాదమును, ఉల్లాసమును కల్గించు మధురాతిమధుర పదార్థము లలో ప్రధానములైనవి పుష్పములు. అవి భగవదారాధనలో ముఖ్యపూజా ద్రవ్యములు. స్త్రీల మాంగల్య, సౌభాగ్య చిహ్నములు. పుష్పమంటే వికాసమని అర్థము. తాను వికసిస్తూ నిఖిల ప్రాణికోటిని వికసింపజేయునది పుష్పము. సాటి లేని అలంకారమునకు, పవిత్రతకు, శోభకు పుష్పముల ప్రాధాన్యము, వైభవము చెప్పనలవిగాదు.

"స్త్రియః సుమనసః పుష్పం ప్రసూనం కుసుమం సుమమ్" -అమరకోశము

"సుమనాః కుసుమం పుష్పం" -నామమాల

మంచి మనస్సు గల్గినదీ పుష్పము. జనులు దీనియందు బాగుగ మనస్సునుంచెదరు గాన పుష్పము "సుమనాః" అని పిలువబడుచున్నది. "పుష్యతే ఇతి, పుష్పయతీతి వా"పుష్పం" అను వ్యుత్పత్తి ప్రకారంగాను, "పుష్పవికసనే" అను ధాతువు ప్రకారంగాను, వికసించునది, వికసింపచేయునది పుష్పమని అర్థము. సాధారణ, లౌకిక పుష్పముల వికాసము తాత్కాలికము, నశ్వరము. కొన్ని దేవతా పుష్పములు గలవు. వాని వికాసము గూడ తాత్కాలికమే. కాని శాశ్వత విక్నాసము, శాశ్వత పరమానందమునిచ్చు పుష్పములు గలవు. అవియే దివ్య పుష్పములు - వైదిక పుష్పములు. అవి ఏమో చూతము

పద్మము, ఇందీవరము, మల్లి, నాగమల్లి, పారిజాతము, ఏడాకుల అరటి, కుముదము మొదలగునవి దేవతా పుష్పములు. "పద్యతే అత్రలక్ష్మీరితి" పద్మం. లక్ష్మినివాసముండునది గాననది పద్మము. లక్ష్మికే పద్మా, పద్మాలయా, పద్మాననా అని పేర్లున్నవి. "పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదలాయ తాక్షి" అని శ్రీసూక్తము. అందమైన ముఖము, కాళ్లు, చేతులు, కండ్లు వగైరా పద్మములతో పోల్చబడుచున్నవి. ఇందీవరం - ఇందీ అంటే పారమైశ్వర్య విభూతి, అంటే లక్ష్మి - అలక్ష్మి చేత వరింపబడునది - ఇందీ వరం అంటే వరలక్ష్మియే, దీనిని సేవించువారిని దీనితో పూజించు వారిని లక్ష్మి వరించునట.

మల్లికా - "మల్ల్యతే ఇతి మల్లికా" । ప్రతి వారిచేత శిరస్సున ధరింపబడునది యని అర్థము. ఈ పుష్ప వైభవం అత్యంత ప్రసిద్ధము. వివరింపతరము గాదు. నాగమల్లికా - అయిదు దళములతో మధ్య శివలింగముతోను, ఆ శివలింగమునకు సర్పాభరణముతోను నొప్పారు చుండును. దేవాలయమందలి పానవట్టము, దానిపై శివలింగముల శిల్పముతో నీ పుష్పము దేవతాపుష్పమే. కుముదం - "కుం మోదయతీతి కుముదమ్" । భూమిని సంతోష పరచునది - తెల్లకలువ.

పారిజాతః - పారం అంటే జలము. పారంగల్గినది పారీ - అంటే సముద్రము. సముద్రము నుండి పుట్టుట చేత పారిజాతము. హల్లకం - చెంగల్వపూవు. "హ్లాదయతీతి హల్లకం,"

ఆహ్లాదమును గల్గించునది. దీనికి రక్త సంధ్యకం అని పేరు. ఇది సంధ్యవలె రక్త వర్ణము గల్గియుండును.

ఉత్పలం - కలువపూవు. "ఊర్ధ్వం పలతిలి ఉత్పలం" ఊర్ధ్వమును పొందునది. ఊర్ధ్వస్థితి అనగా ఉన్నతస్థితిని గల్గించునది. తెల్లకలువకు కైరవమని పేరు.

ఏడాకుల అరటికి 'శారదః' అని పేరు. శరత్కాలమున పూచుట చేత 'శారద' యయినది. శారదాదేవి చదువులతల్లి, అనగా భాషామతల్లిక. భాష ఏడు వర్గలతో నొప్పుచున్నది. అవి అ,క,చ,ట,త,ప,య వర్గలు. ఈ యేడు వర్గలకు ప్రతిరూపముగ ఏడు ముఖములనీ, అందు చేత శారద పుష్పమునకు ఏడు ఆకులు ఉండునని ఆగమశాస్త్ర వచనము. అందుకే గొప్ప విద్వాంసుని శారదుడని, విశారదుడనీ అందురు. శారద మంటే శ్వేత పద్మమని శబ్దకల్ప ద్రుమమనే గ్రంథము తెల్పుచున్నది. కనుక శారదాదేవి శారదమును చేతితో ధరించి యున్నదంటే భౌతికంగా శ్వేత పద్మమును, దైవికంగా ఏడు వర్గలు గల వాఙ్మయమును, అనగా వేద వాఙ్మయమును ధరించి యుండునని యర్థము. ఈ విధముగ వివిధ పుష్పములు వివిధ దేవతాస్వరూపములని తెలియనగును.

మన్మథునికి "పుష్పధన్వా" అని పేరు. ఆయనకు పుష్పమే విల్లు. పుష్పములే బాణములు. అవి

"అరవింద మశోకం చ చూతం చ నవమల్లికా ।

నీలోత్పలం చ పంచైతే పంచబాణస్య సాయకాః" - అమరకోశము.

(పద్మము, అశోకము, మామిడి, మల్లె, నల్లకలువ) అట్లే లలితా దేవి "మనోరూపేక్షు కోదండా పంచతన్మాత్రసాయకా" అని లలితా సహస్రనామములలో కీర్తింపబడుచున్నది. మనస్సు ధనుస్సుగాను, పుష్పములు బాణములుగను ధరించి యున్నదా పరదేవత । ఈ నామములకు శ్రీభాస్కరరాయలు

"బాణాస్తు త్రివిధాః ప్రోక్తాః స్థూల సూక్ష్మపరత్వతః ।

స్థూలాః పుష్పమయాః సూక్ష్మా మంత్రాస్తథేరితాః ॥"

అని వ్యాఖ్యానం చేశారు. బాణములు స్థూల, సూక్ష్మ, పరములని మూడు విధములు. స్థూలములు పుష్పములు, సూక్ష్మములు మంత్రములు, పరములు భూతవాసనా వాసనములు. "చైతన్య కుసుమప్రియా" అని లలితాదేవి నామము. ప్రాణుల యందుండి మహాఫలముల నొసగెడు "చిత్" అను పుష్పమే చైతన్యము. ఈ పుష్పము దేవికి మిగుల ప్రియము. చిత్ అనగా చైతన్యము.

సౌందర్యలహరిలో "జడానాం చైతన్యస్తబక మకరంద స్రుతి ఝరీ" అని శంకరాచార్యుల వారు దేవిని స్తుతించిరి. ప్రాణులలోని చైతన్యమనెడి పుష్పము నుండి స్రవించెడి తేనెయే దేవియట.

ఈ చైతన్య పుష్ప మితర అష్టపుష్పముల కన్న విలక్షణమైనది. ఆ ఎనిమిది పుష్పములు

"అహింసా ప్రథమం పుష్పం, ఇంద్రియాణాంచ నిగ్రహః ।
క్షాన్తిః పుష్పం దయా పుష్పం జ్ఞానపుష్పం పరం మతమ్ ॥

"తపఃపుష్పం సత్యపుష్పం భావపుష్ప మథాష్టమమ్ " అహింస, ఇంద్రియ నిగ్రహము, క్షమ, దయ, జ్ఞానము, తపస్సు, సత్యము, భావము - ఈ ఎనిమిది పుష్పములట. సంవిదాదులు పుష్పములే. తంత్ర రాజమనెడి గ్రంథము గూడ - దేవికి మనస్సు చెరకు విల్లు, రాగమే పాశము, ద్వేషమంకుశము, పంచతన్మాత్రలు పుష్పబాణములు. అని చెప్పినది.

"సహస్రారాంబుజారూఢా" అని లలితా దేవీ నామము. వేయిదళములు గల పద్మము మానవుని శిరస్సున బ్రహ్మ రంధ్రము క్రిందగలదు. ఆ పద్మమే పరాదేవిస్థానము, హృదయము గూడ కమలమే అని అర్థము.

మానవునికి వేదోక్తమగు ఆయుస్సు 116 సంవత్సరములు, ఇది మూడు భాగములు, మొదటి 24 సంవత్సరాలు ఒక పుష్పము, తరువాతి 44 సంవత్సరములు రెండవ పుష్పము. ఆ తరువాత 48 సంవత్సరములు మూడవ పుష్పము, ఇయ్యాయుష్యత్రయమే పుష్పత్రయము. పుష్పములకాపాడు కొన్నచో నవి మంచి ఫలములనిచ్చునట్లు, కర్మానుష్ఠాన తత్పరుడై 'త్ర్యాయుష' ములనెడి మూడు పుష్పముల కాపాడుకొన్నచో అమృతత్వ రూపఫలములు సిద్ధించునని వేద మీ మంత్రములో చెప్పుచున్నది.

"త్ర్యాయుషం కశ్యపస్య జమదగ్నేః త్ర్యాయుషమ్ ।
త్రీణ్యమృతస్య పుష్పాణి త్రీణ్యాయూషం మేఽ కృతః ॥"

ఆయుష్యత్రయరూప పుష్పములను "అమృతస్య పుష్పాణి" అని వేదము గీర్తించి నది.అమృతత్వసిద్ధికి యోగ్యమైన ఫలముల నొసగెడు పుష్పములని అర్థము.

విష్ణు సహస్రనామములలో భగవంతుడు "పుష్పహాసః" అని కీర్తింపబడుచున్నాడు. "ముకుళాత్మనా స్థితానాం పుష్పాణాం హాసవత్ ప్రపంచ రూపేణ వికాసోఽస్యేతి పుష్ప హాసః" అని యీ నామమునకు శంకరాచార్య భాష్యము. పూలమొగ్గలు పుష్పములుగా వికసించినపుడా వికాసమును హాసమని కవులు చమత్కరిస్తూ ఉంటారు. పుష్పము కార్యము. మొగ్గ కారణమని శాస్త్రసంప్రదాయము. ప్రకృతమున పరమేశ్వరుడు ముకుళ రూప (మొగ్గ) కారణము. ఈ పరమేశ్వరరూపముకుళము వికసించి 'జగత్తు' అనెడి పుష్పముద్భవించినది. అందుకే విష్ణుసహస్రనామములలో మొదటి నామము 'విశ్వం'. రెండవ నామము 'విష్ణుః' అని భగవంతుడు కీర్తింపబడుచున్నాడు. కావున జగద్రూప పుష్పము కార్యము. భగవంతుని యొక్క జగద్రూప పుష్ప వికాసమే హాసము. కనుక భగవంతుడు "పుష్పహాసః" అని కీర్తింపబడినాడు. అట్టి యీ భగవంతుని వేదము "అపాంపుష్పం" అని స్తుతించినది.

"యో2పాం పుష్పం వేద । పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి । చంద్రమా వా అపాంపుష్పమ్" ఆపః అంటే నీరని స్థూలముగ అర్థము. "ఆప- వ్యాప్తౌ" అని ధాతువు నుండి "అపః"

అను శబ్దమేర్పడినది. "ఆప్నోతీతి, అప్యత ఇతి, ఆపయతీతి వా అపః" అను వ్యుత్పత్తి రీత్యా తాము పొందుచూ, పొందింపబడుచూ, పొందింపజేయునవి "అపః" అగును. భగవంతుని పొందుచూ, భగవంతునిచే మానవుల చేతనూ పొందింపబడుచూ, ప్రాణి కోటికి భగవంతుని పొందింపచేయుచూ, అందింపజేయుచూ వేదములు "అపః" అగుచున్నవి.

"అప ఏవ ససర్జాదౌ", "గౌరీ మిమాయ సలిలాని తక్షత్యేకపదీ", "ఆపోవా ఇదగం సర్వం । విశ్వాభూతా వ్యాపః ప్రాణావా అపః । పశవ అపః । ----- ఛందాంసి. అపః । జ్యోతీంషి అపః । యజూంషి అపః । సత్యమాపః" అని వేదమంత్రములు ప్రప్రథమంగా సృజింపబడినవి అపస్సులనీ, అపస్సులే - సమస్త ప్రపంచము, భూతములు, ప్రాణములు, పశువులు, అన్నము, వేదములు, జ్యోతిస్సులు, సత్యము, అమృతములని చెప్పినవి. కనుక 'అపాం పుష్పం' అనగా వేదముల యొక్క పుష్పము అనగా వేద సారము, వేదప్రతి పాద్యుడగునగు భగవంతుడే. అపస్సులు అనగా వేదములు పూలమొగ్గలు. ఆ వేద ముకుళములు వికసించగా భగవద్రూప పుష్పమావిర్భవించినది. కావున అపాం పుష్పమనగా మంత్రపుష్పమే. (అపాం మంత్రాణాం పుష్పం). అందుకే భగవదారాధనలో ముందు సామాన్యపుష్పములతో నర్చించి చివరగా మంత్రపుష్పమును సమర్పించుటతో పూజ ముగియుచున్నది. మంత్రపుష్పమనగా "మంత్ర ఏవ పుష్పం, మంత్ర రూప పుష్పం, మంత్రశ్చాసౌ పుష్పంచ", అని వ్యుత్పత్తులు గలవు. మంత్రమే పుష్పము, మంత్ర రూపపుష్పము, మంత్రము వంటి పుష్పమనీ అర్థములున్నవి. "పాదయోః సువర్ణదివ్య మంత్ర పుష్పం సమర్పయామి" అని అంటూ భగవంతుని పాదపద్మముల మీద సువర్ణములతో గూడిన దివ్య మంత్రపుష్పమును జనులు సమర్పించుచున్నారు. 'నారాయణ' శబ్దార్థముగూడ అపాం పుష్పమనియే. "ఆపోనారా ఇతి ప్రోక్తాః ఆపో వై నర సూనవః" అనగా నారములు అపస్సులు అని అయన మంటే స్థానమనీ అర్థము. కనుక 'నారాయణ' అంటే మంత్రరూపపుష్పములలో ప్రతిష్ఠితుడైన వాడు పరమేశ్వరుడని అర్థము. ఈ విధముగా పరమేశ్వరుడు మంత్రరూపపుష్పములలో ప్రతిష్ఠితుడని మంత్రపుష్ప స్వరూపుడు అని అర్థము. ఇట్టి యీ మంత్ర పుష్పరూప భగవంతుని తెలిసికొన్న వారు పుష్పవంతులగుదురని పై మంత్రార్థము.

"ఏకయోక్త్యా పుష్పవన్తౌ దివాకర నిశాకరౌ" -అమరకోశము

"తేజస్వినౌ విరాజేతే పుష్పవన్తావివోదితౌ" -శివభాగవతమ్

సూర్యచంద్రులు పుష్ప వంతులట. పుష్పము గలవారు పుష్పవంతులు. సూర్య చంద్రులలోని పుష్పములేవి?

"భాను మండల మధ్యస్థా" 'భైరవీ భగమాలినీ' చంద్రమండల మధ్యగా" -లలితా సహస్ర నామములు. లలితా దేవి ఎక్కడుంటుంది? సూర్య మండలములోనూ, చంద్రమండలము లోను ఉన్నదట. కాన లలితా దేవియే సూర్య చంద్రమండలాంతర్గతమైన పుష్పము. లలితా దేవి స్వరూపం వేదమని లలితా సహస్రనామములే బోధిస్తున్నవి.

"స్వాహా స్వధా మతిర్మేధా శ్రుతిః స్మృతిరనుత్తమా ।
భాషారూపా బృహత్సేనా భావా భావవివర్జితా" ॥

కనుక లలితా దేవి శ్రుతి యనగా వేదము - భాషారూపిణి.

"యో2సావాదిత్య మండలే పురుషస్సో2సావహమ్" అని వేదము ఆదిత్యమండలమున నున్న పురుషుడే భగవంతుడని, తెల్పుచున్నది.

"వేదో వేద విదవ్యంగో వేదాంగో వేదవిత్కవిః" అని విష్ణు సహస్రనామములు భగవంతుడే వేదము అని బోధించుచున్నవి.

"ఋగ్యజుస్సామ పారగః" "త్రయీ మయాయ త్రిగుణాత్మ ధారిణే" 'వేదాత్మ క్రతవస్త్వైవ' అని భారతము సూర్య భగవానుడు వేదమయుడని బోధించుచున్నది. ఇంకా పెక్కు మంత్రములు సూర్య, చంద్ర మండలములు వేదమయములని ఘోషించుచున్నవి. కావున సూర్య చంద్ర మండలాంతర్గత పుష్పము వేదమే.

చంద్రమండలమే శ్రీచక్రమని భాస్కరరాయవ్యాఖ్య ఆ శ్రీచక్రములోని "శ్రీః" వేదములే.

"యమృషయస్త్రైవిదో విదుః । ఋచస్సామాని యజూంషి । సా హి శ్రీరమృతా సతామ్" అని వేదమే శ్రీః అనగా ఋగ్యజుస్సామ వేదములని తెల్పుచున్నది. కావున శ్రీచక్ర రూపమగు చంద్రమండల మధ్య గత పుష్పము అమృతపుష్పము - అదే వేదపుష్పము - దివ్యపుష్పము.

నేడు అమెరికా, రష్యా మొదలగు దేశములు చంద్ర మండలము మీద మనుష్యులను, నౌకలను దించి అచట వాతావరణమును కలుషితము చేయుచున్నారు. అపవిత్రము చేయుచున్నారు కనుకనే అనేకములగు ఉపద్రవములు సంభవించుచున్నవి. చంద్ర కిరణములు కలుషితములగుచున్నవి. అందుచే ఓషధులన్నీ కలుషితములు, ఆ ఓషధుల నుండి పుట్టు అన్నం కలుషితము, ఆ అన్నము నుండి పుట్టు పురుషుడు గూడ కలుషితుడగుచున్నాడు. "చంద్రమా మనసో జాతః" అని చంద్రుడు మనస్సునకు కారకుడు అని వేదము చెప్పుచున్నది. అట్టిచో మానవుల మనస్సులుగూడ కలుషితములగుచున్నవి. అందుకని ప్రత్యేకించి, మరెవ్వరినీ చెప్పక, చంద్రుని మాత్రమే పుష్పమనీ, చంద్రుని ఆరాధించ మనీ వేదము హితవు చెప్పుచున్నది. "చంద్రమా వా అపాం పుష్పమ్" అని. అయితే యీ విషయాలన్నీ ప్రస్తుత మానవ సమాజానికి చెవికెక్కదు. వేదమెన్ని రకములుగ మానవాళికి హితబోధ చేస్తోందో? ఏమి ప్రయోజనము? చెవిటికి శంఖాదినట్లే -

కూర్మ పురాణము :

"అశేష వేదాత్మకమేక వేద్యం స్వతేజసా పూరితలోక భేదమ్

త్రిలోకహేతుం పరమేష్ఠి సంజ్ఞం నమామిరూపం రవి మండలస్థమ్"

అనగా సూర్యమండలము వేదాత్మకము. సూర్యమండలాంతర్గత వేదమే "బ్రహ్మ" అనెడి సంజ్ఞతో, తన తేజస్సులతో ముల్లోకముల నింపి, పాలించు చున్నవని చెప్పుచున్నది.

"చంద్రమావా అప్స్వంతరా సుపర్ణో ధావతే దివి" అని యీ మంత్రము అపస్సుల యందంతట లోకకల్యాణ కరములగు దివ్యతేజస్సులతో చంద్ర స్వరూపుడైన భగవంతుడు విరాజిల్లుచున్నాడు. అని తెల్పుచున్నది. అపస్సులలో వ్యాపించియున్న చంద్రుడు పుష్పము అగును (అపాం పుష్పం).

నక్షత్రములకు అప్సరసలని పేరు. "అప్సు రాతీతి అప్సరాః" అను వ్యుత్పత్తి ప్రకారం నక్షత్రములు జలముల నుండి, ఉత్పన్నములైనవని తెలియనగును. అనగా నవి ఉదక మండలములని అర్థము. అందుకే నక్షత్రములు చంద్రునివలె చల్లదనమును, అహ్లాదము నిచ్చుచున్నవి. అపస్సుల నుండి పుట్టునవి కనుకనవి వేదమయములే. కనుక పుష్పములే. (అపాం పుష్పాణి). "అప్సరసః" అను పదమునకు గల "అద్భ్యః సరన్తీతి", "అప్యన్తే ప్రాప్యన్తే పుణ్యకృద్భిరితి" "అపాం సరాః అప ఏవసరాః" అను వ్యుత్పత్తులు నక్షత్రములకు గల వేదత్వమును, పుష్పత్వమును తెల్పుచున్నవి. మరి యొక వ్యుత్పత్తి "అపసారయన్తి స్ఖలయన్తి ధైర్యాత్ సర్వాన్" అందరిని ధైర్యము వలన స్ఖలింపజేయు వారను అర్థము తీసికొని వార కాంతలను చెడు అర్థమును తీసికొనుచున్నారు. అట్లే పద్మమునకు "అబ్జ"మని పేరు. అపస్సుల నుండి పుట్టినది. కనుకనే వైదిక పుష్పము. దేవతా పుష్పము. (అపాం పుష్పం) (అద్భ్యః జాయత ఇతి).

నాలుగు వేదములు నాలుగు పుష్పములని ఛాందోగ్యోపనిషత్ ఇట్లు చెప్పుచున్నది - "అసావాదిత్యో దేవమధు । తస్యద్యౌరేవ తిరశ్చీనవంశో2ంతరిక్షమపూపామరీచయః పుత్రాః"

తస్యయే ప్రాంచోరశ్మయస్తా ఏవాస్య ప్రాచ్యో మధునాడ్యః । ఋచఏవ మధుకృతః । ఋగ్వేద ఏవ పుష్పమ్ । తా అమృతా అపః । అధయే2స్య దక్షిణా రశ్మయస్తా ఏవాస్య దక్షిణా మధునాడ్యః । యజూంష్యేవ మధుకృతః । యజుర్వేద ఏవ పుష్పమ్ । తా అమృతా అపః ।

అథ యే2 స్య ప్రత్యం చో రశ్మయస్తా ఏవాస్య ప్రతీచ్యో మధునాడ్యః । సామాన్యేవ మధుకృతః । సామవేద ఏవ పుష్పమ్ । తా అమృతా అపః ।

అథ యే2 స్యోదీచ్యో రశ్మయస్తా ఏవాస్యో దీచ్యోమధునాడ్యః ।

అధర్వాంగిరస ఏవ మధుకృతః । అధర్వవేద ఏవపుష్పమ్ । తా అమృతా అపః ।

అథ యే2 స్యోర్ధ్వారశ్మయస్తా ఏవాస్యోర్ధ్వా మధునాడ్యః । గుహ్యా ఏవాదేశా మధుకృతః బ్రహ్మైవపుష్పమ్ । తా అమృతా అపః ।

సూర్యుడు దేవతలలో కెల్లా తేనెవంటివాడు. ఆ సూర్యునికి స్వర్గమధ్య కొయ్యగా ఉన్నది. ఆకాశమా అడ్డ కొయ్యను పట్టుకొని వ్రేలాడు తేనె పట్టు. సూర్యుడా తేనె పట్టులోని తేనె. కిరణములు తేనె టీగలు, తూర్పు దిక్కు వైపు ప్రసరించు కిరణములు తేనె పట్టునుండి తేనెను కార్చెడి తూర్పు నాడులు. ఋఙ్మంత్రములే తుమ్మెదలు. ఋగ్వేదము తూర్పుదిక్కు లోని పుష్పము. ఆ ఋగ్వేదమంత్రములు (అపః) అమృతములు. దక్షిణ దిక్కువైపు ప్రసరించు కిరణములు తేనెను కార్చెడి దక్షిణనాడులు. యజుర్వేద మంత్రములు తుమ్మెదలు. యజుర్వేదము దక్షిణ దిశలోని పుష్పము. ఆ వేదమంత్రములమృతములు - సుధామయములు.

పడమటి దిక్కువైపు ప్రసరించు కిరణములు తేనెను కార్చెడి పడమటి నాడులు. సామవేద మంత్రములు తుమ్మెదలు, సామ వేదము పడమటి దిశలోని పుష్పము. ఆ వేదమంత్రముల మృతములు. సుధామయములు. ఉత్తర దిక్కువైపు ప్రసరించు కిరణములు తేనెను కార్చు ఉత్తరనాడులు. అధర్వవేద మంత్రములు తుమ్మెదలు. అధర్వవేదము ఉత్తర దిశలోని పుష్పము. ఆ వేద మంత్రముల మృతములు, సుధామయములు. ఊర్ధ్వ దిక్కువైపు ప్రసరించు కిరణములు తేనెను కార్చు ఊర్ధ్వ నాడులు. రహస్య ములైన ఉపనిషద్వాక్యములు తుమ్మెదలు. బ్రహ్మలేక ఓంకారము పుష్పము. ప్రణవసారములగు వేదములమృతములు. సుధామయములు.

ఇవ్విధముగ నాలుగు వేదములు నాలుగు పుష్పములు. ఓంకారము గూడ పుష్పమేనట. ఆ వేదమంత్రములు తుమ్మెదలు. తుమ్మెదలనగా తేనెటీగలు. తేనెటీగలు పుష్పముల నుండి తేనెను తేనె పట్టులో సమకూర్చునట్లు వేదమంత్ర రూపములైన తేనె టీగలు వేదరూప పుష్పములనుండి ఆకాశమనెడి తేనె పట్టులో సూర్యుడనెడి తేనెను సమకూర్చుచున్నవి. ఆ తేనె పట్టునుండి తేనెను కిరణములనెడి నాడులు కార్చి లోకమున కంద జేయుచున్నవి. ఆతేనెయే సూర్యతేజము. అట్లు నాల్గు వేదములు నాల్గు పుష్పములై సూర్యకాంతి రూపమైన తేనెను లోకానికి ప్రసాదించుచున్నవి. ఈ జగత్పుష్పమునకు వికాసమునిచ్చుచున్నవి. అట్లు నాల్గు వేదములు లోకోత్తరములు, ప్రధానములైన దేవతాపుష్పములే.

భూమి గూడ పుష్పము గనుకనే తర్క శాస్త్రము భూమికి లక్షణము 'గంధము గల్గియుండుట' యని పేర్కొన్నది. "తత్రగంధవతీ పృధివీ" - పుష్పము నకేగద గంధముండునది!

పరాదేవతను చూపుద్వారమేది? గంధద్వారము అని శ్రీసూక్తము ద్వారా తెలియనగును. ఏ గంధము? ఏ పుష్పము నుండి వచ్చు గంధము? వేద రూపపుష్పము నుండి వచ్చు గంధమే ఆ దేవీ దర్శనమునకు ద్వారము. "గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్". "త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్" అను యీ మంత్రము మంచి సుగంధము గల ముక్కంటియగు శివుని ఆరాధించమని ఉపదేశిస్తోంది.

రామాయణములో హనుమంతుని "పుష్పగిరి" స్వరూపుడుగా వాల్మీకి మహర్షి వర్ణించినాడు. "యథా పుష్పమయో గిరిః" అని. సముద్రలంఘనం చేయునపుడు, అశోకవనమున సీతా దేవిని వెదుకునపుడు చెట్లనుండి అనేక పుష్పములురాలినవట. ఆ పుష్పములతో మునిగి పోయిన హనుమంతుడు పుష్పమయమైన కొండవలె యున్నాడట. పుష్పగిరియంటే వేద పుష్పగిరియే. మంత్ర పుష్పగిరియే. అందుకనే భగవంతుడు "గిరిశః, గిరిశః" అని కీర్తింపబడుచున్నాడు - గిరి వేద వాక్కు నందు శః అంటే శయనించియున్న వాడని అర్థము. పరమేశ్వరుని నివాసము వేదవాక్కే గద!

వృక్షమును బాగుగ పోషించినచో నది మంచి పుష్పములనిచ్చును. ఆ పుష్పములను కాపాడుకొన్నచోనవి మంచి ఫలములనిచ్చును. అట్లే వేదమొకమహా వృక్షము. ఆ వృక్షమును పోషించినచో నది మొదట ధర్మమనెడి పుష్పముతో వికసించును. ఆ ధర్మ పుష్పమును బాగుగ సంరక్షించు కొన్నచో క్రమముగ బ్రహ్మజ్ఞాన ఫలము సిద్ధించును. కావున వేద విద్వాంసునికి ధర్మజ్ఞానము పుష్పము. బ్రహ్మజ్ఞానము ఫలము. విద్వాంసులు కాని వారికి మాయా ధేనువుపాలనివ్వ నట్లు వేదవృక్షము పుష్ప, ఫలములనివ్వదని వేదమే యీ మంత్రము ద్వారా తెల్పుచున్నది. అనగా ధర్మ బ్రహ్మజ్ఞానములు సిద్ధింపవు

"అధేన్వా చరతి మాయయైష వాచం శుశ్రువాగ్ం అఫలామపుష్పామ్" అని. -ఋగ్వేదము

మంచి పుష్పములతో నున్న చెట్టునుండి చాల దూరము వరకు మంచి గంధము, సువాసన వచ్చును. మంచి పుణ్యకర్మలు చేయు మానవుడు గూడ మంచి సువానన గల పుష్పములతో గూడిన వృక్షరూపుడే. పుష్పించిన వృక్షమే. పుణ్యకర్మలే పుష్పములు. పుణ్య కర్మలు చేయువారి మనస్సులు గూడ మంచి పుష్పములే. వారి సత్కర్మలనెడి పుష్పములు వికసించి వంచి ఫలములనిచ్చును. పాపకర్మలు ఎండిపోయిన పుష్పములవలె రాలి పోవును. అట్టియీ సత్పురుషుని నుండి చాలా దూరము వరకు మంచి గంధము, సువాసన వీచునట. పాపకర్మలాచరించినచో దుర్గంధమే. సత్పురుషుని నుండి మంచి మాటలు వినబడును. అవియును పుష్పములే. ఈ పుష్పముల కోసం లోకం వెతుకును.

"యథా వృక్షస్య సంపుష్పితస్య దూరాద్గంధో వాత్యేవం పుణ్యస్య కర్మణో దూరాద్గంధో వాతి"

సాధారణపుష్పములతోనే లోకము ఆనందమును పొందుతుంటే లోకోత్తరములు, దివ్యము లగు వైదిక పుష్పములతోను, వేద పుష్పములతోనూ ఎంత ఆనందము పొందవచ్చును? స్వస్తి.

ఇతిశమ్

"నమామ పుష్పరూపిణీమ్"



# వైదిక ధర్మములు

లోకములో ప్రాణులందరికి ఆహార, నిద్ర, భయ, మైథునములు సామాన్యము. కాని మానవులకు, ఇతర ప్రాణులకు కొంచెం భేదమున్నది. అది ధర్మము. ఇతర ప్రాణులకు జ్ఞానము అనగా వివేకము లేదు కనుక ధర్మ ప్రసక్తి లేదు. ధర్మము, వివేకము లేనిచో మానవులు పశుప్రాయులే. అయితే ధర్మమనవేమి? ఏ ధర్మమును పాటించాలి? ధర్మము లేని ప్రాణులు సుఖశాంతులతో మండుటలేదా? కనుక ధర్మముతో పని ఏమున్నది?

లోకమున ప్రజాజీవితమునకు కట్టుబాట్లు, నియమములు ఉండాలి. ఎవరెవరు ఏమి చేయాలి? ఎందుకు చెయ్యాలి? ఎట్లు చెయ్యాలి? అవి కట్టు బాట్లు, పద్ధతులు, విధులు - వీనిని తెల్పునది, నియమించునది ధర్మము. ఆ ధర్మమార్గమున నడుచువారు ధర్మాత్ములుగా ప్రసిద్ధికెక్కుతారు. లేనిచో తెగిన గాలిపటంలాగా భ్రష్టులగుదురు. కనుక ధర్మము మానవులనే గాదు లోకమునంతా నియమించి, ధరించుచూ ఉంటుంది.

"స్యాద్ధర్మ మస్త్రియాం పుణ్యం శ్రేయసీ సుకృతం వృషః"

-అమరకోశము

ధర్మమనగా పుణ్యము, శ్రేయస్సు, సుకృతమని అర్థము. కోరికలను గురిపించుటచే 'వృష' అని పిలవబడుచున్నది. "ధరతి విశ్వం (లోకం) ఇతివా, ధ్రియతే జనైరితి ధర్మః" లోకమును ధరించునది, ప్రజలచేతను, లోకముచేతను ధరింపబడునది ధర్మము. ఈ లక్షణములు గలవాడు పరమేశ్వరుడు. కనుక పరమేశ్వరునికి "ధర్మః" అని పేరు.

"అణురేవ ధర్మః" -అని ఋగ్వేదము.

"ధర్మో ధర్మ విదుత్తమః"

"ధర్మగుబ్ధర్మకృద్ధర్మీ" -విష్ణుసహస్రనామములు

"సర్వ భూతానాం ధారణాత్ ధర్మః । ధర్మై రారాధ్యత ఇతి ధర్మః"

-శంకరాచార్య భాష్యమ్

సమస్త భూతములను ధరించువాడు 'ధర్మః' అనబడును. ధర్మములచే వారాధింపబడు వాడు ధర్మ శబ్దవాచ్యుడు. ధర్మవేత్తలలో నుత్తముడు పరమేశ్వరుడు. ఈ ధర్మములు శ్రుతులు, స్మృతులు అని ఆభాష్యవచనము.

"శ్రుతయశ్చ స్మృతయశ్చ యస్యాజ్ఞాభూతాః స ఏవ ధర్మవిదాముత్తమః"

-శంకరభాష్యమ్

"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" - భగవద్గీత

లోకమున ధర్మము లోపించినపుడా ధర్మమును మరల ప్రతిష్ఠించుటకు ప్రతి యుగంలోను ధర్మ స్వరూపుడగు పరమేశ్వరుడవతరించుతాడని అర్థము. అట్లు జగత్తు నందు ప్రతిష్ఠింపబడెడి ధర్మమునకు 'ప్రతిష్ఠ' యనిపేరు. ప్రపంచమా ధర్మమునందు ప్రతిష్ఠింపబడియుండును. ధర్మ మాప్రపంచమున ప్రతిష్ఠింపబడియుండును. ప్రతిష్ఠ యనగా ఆధారము, లక్ష్యమని అర్థము. వేదము పన్నెండు మోక్షసాధనములనుపదేశించింది - సత్యం, దానం, తపస్సు, శమము, దమము, ధర్మము, ప్రజననము, అగ్ని, అగ్ని హోత్రము, యజ్ఞము, మనస్సు, సంన్యాసము - అని. ఇందు ధర్మమున్నది. పై విషయమును శ్రుతి ఇలా అన్నది.

"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా । ధర్మే సర్వం ప్రతిష్ఠితమ్ ।
తస్మాద్ధర్మం పరమం వదన్తి"

పరమేశ్వరుడిట్టి ధర్మమును రక్షించు వాడు కనుక "ధర్మగుప్" అని చెప్పబడుచున్నాడు. ధర్మాధర్మములతో తనకు సంబంధములేకున్ననూ ధర్మమర్యాదా స్థాపన కోసం ధర్మాచరణ, ధర్మపాలన చేయుటచే "ధర్మకృత్" అని చెప్పబడుచున్నాడు. "ధర్మాన్ ధారయతీతి ధర్మీ" అని భాష్య ప్రకారం ధర్మములను ధరించువాడగుటచే నా దేవదేవుడు 'ధర్మీ' యని కీర్తించబడుచున్నాడు. ఆయన ధరించు ధర్మములేవి? ఆ ధర్మములు వేదములు, స్మృతులు.

"వేదాశ్శాస్త్రాణి విజ్ఞానమే తత్సర్వం జనార్దనాత్"

ధర్మములగు వేద శాస్త్రములు, విజ్ఞానము - ఇవన్నియు ధర్మియగు జనార్దనుని నుండి పుట్టినవి.

రామాయణములో శ్రీరాముడు ధర్మ విగ్రహముగా చెప్పబడినాడు. "రామో విగ్రహవాన్ ధర్మః" అని. శ్రీరాముడు అడవికి పోవునపుడు తల్లి - కౌసల్య ఏమని ఆశీర్వదించినది?

"యం పాలయసి ధర్మం త్వం ధృత్యా చ నియమేన చ ।
స వై రాఘవశార్దూల! ధర్మస్త్వామభిరక్షతు"

నాయనా! శ్రీరామా! నీవు చిన్ననాటి నుండి నియమముతోను, ధైర్యముతోను ఏధర్మమును పాలించావో, పాటించావో ఆ ధర్మమే నిను రక్షించుగాక! శ్రీరామునకే ధర్మపాలన అవశ్యక మగుచో సామాన్యుల సంగతి ఏమి? కనుకనే ధర్మ బద్ధ జీవితం, ధర్మపాలన, నియమపాలన చేయువారిని ధర్మాత్ములు గాను కీర్తించి, వారిని లోకము ఆచంద్రతారకం నమస్కరిస్తుంది. వారి అడుగు జాడలలో, లోకము గూడ నడుస్తుంది. అందుకే భగవద్గీతలో

"యథా యథా దాశరథిః ధర్మ ఏవాస్థితోऽభవత్ ।
తథా తథా ప్రకృతయః రామం పతిమకామయన్"

-రామాయణమ్

శ్రీరాముడు ధర్మనిరతుడు, ధర్మమూర్తి. అయన ధర్మమును పాటించిన కొలదీ ప్రజలు అతనినే తమ పాలకునిగ, ప్రభువుగ వెంచుకొనిరి, కోరిరి. కనుకనే 'రామరాజ్య' మని పేరు. అయన అడుగుజాడలలో నడచిన ప్రభువులు ధర్మప్రభువులై లోకమును ధర్మబద్ధంగా పాలించారు. నేటి విషయం పూర్తిగా దీనికి విరుద్ధము. కేవలం ధనసముపార్జన, కామప్రవృత్తి పశుప్రవృత్తి తప్ప ధర్మప్రసక్తి మచ్చుకైనా కనపడదు. అట్టి వారిని బట్టియే లోకముగూడ ధర్మ బద్ధమో, అధర్మబద్ధమో అగును. ప్రకృతివైపరీత్యాలు, అతి వృష్టి, అనావృష్టి, భూకంపములు మొదలగు వానికి కారణం ప్రభువుల అధర్మాచరణయే. అరాజకమే । కుటిలరాజకీయమే. ధర్మం ప్రతిష్ఠింపబడి లోకం ధర్మ బద్ధమయితే ప్రకృతి మాత గూడ ధర్మబద్ధమై యుండును. ఉపద్రవములుండవు. అందుకే "రాజా కాలస్యకారణం" అని అన్నారు.

రాజు కాలమునకు కారణమట. రాజులు ధార్మికులైనచో ప్రజలు ధార్మికులగుదురు, లోకము ధర్మపథమున నడుచును. లోకమును పాలించు, లోకము పాటించు ధర్మములే లౌకిక ధర్మములు. ఈ ధర్మములను లోకమునకు చెప్పినది, తెల్పినది, ఆచరించు నట్లు చేసినది వేదము. కనుకనే వేదమునకు ధర్మమని పేరు. వేద ధర్మమును దర్శించి, స్మరించి మానవాళికి మహర్షులు స్మృతులను, ధర్మ శాస్త్రములను అందించారు.

సీతాదేవి గూడ శ్రీరాముని ధర్మనిరతియే తనను రంజింపచేసినట్లు తెల్పినది.

"మాతృవద్వర్తతే వీరః మా పముత్సృజ్య ధర్మవిత్
అమరక్షా2స్మి ధర్మేణ పతిం వీర్యవతాం వరమ్ " - *అయోధ్య -118-6*

ఇతర స్త్రీలను తల్లి వలె చూచుటచే ధర్మ విగ్రహుండైనాడు శ్రీరాముడు. పరదారాభిగమనం ద్వారా రావణుడు ధర్మ భ్రష్టుడయినాడు. అందుకే భర్తృహరి అంటాడు.

"మాతృవత్పర దారాణి । పరద్రవ్యాణి లోష్ఠవత్"

పర స్త్రీలను మాతృసదృశులుగాను పరద్రవ్యమును ఇనుపముక్కలుగాను చూడటమే ప్రధాన ధర్మము.

ఇట్లు యీ ధర్మమును వేదమేమి బోధించినది?

"శ్రుతిః స్త్రీ వేద ఆమ్నాయః త్రయీ, ధర్మస్తు తద్విధిః" - అమరకోశము.

శ్రుతి, వేద, ఆమ్నాయములని వేదమునకు పేరు.

1. "శ్రూయతే ధర్మాధర్మాదికమన యేతి శ్రుతిః" - దీని ద్వారా ధర్మాధర్మములు వినబడును గాన శ్రుతి యనిపేరు.
2. "విదన్తి ధర్మాధర్మావితి వేదః" - దీని ద్వారా ధర్మాధర్మముల వెరుగుదురు కాన వేదః అని పేరు

పై వ్యుత్పత్తుల వలన వేదము ధర్మాధర్మములను బోధించునని అర్థము. "ధర్మస్తు

తద్విధిః" - వేదముచే విధింపబడు కర్మలకు విధులని పేరు. ఆ విధియే ధర్మము. అని అమర సింహవచనము. ఈ ధర్మమే లోకమున ఆచరింపబడుచున్నందున లౌకిక ధర్మమగు చున్నది. వేద విహిత కర్మ, విధి, ధర్మము తప్ప వేరు ధర్మములేదు. అందుకే శంకరాచార్యుల వారు మానవాళికి ఇట్లు సందేశమిస్తున్నారు.

"వేదోనిత్యమధీయతాం తదుదితం కర్మస్వనుష్ఠీయతాం"

నిత్యము వేదాధ్యయనము చేయండి, వేదముపదేశించిన కర్మానుష్ఠానము చేయండి. ధర్మపాలన చేయండి అని. నిత్యము అనుష్ఠానము మానవుని స్వేచ్ఛా జీవితమును యధేచ్ఛా విహారమును అరికట్టి ధర్మబద్ధ జీవితము నొసగునని భవభూతి మహాకవి ఉద్బోధ.

" కింత్వను ష్ఠాన నిత్యత్వం స్వాతంత్ర్యమపకర్షతి"

- ఉత్తరరామ చరితమ్.

ధర్మబద్ధ జీవితం పాపపుటాలోచనలను, కర్మలను దరిచేరనీయదు కాన వేద విహిత ధర్మానుష్ఠానమే శరణ్యము. భగవద్గీతకు భాష్య ప్రారంభమున శంకరాచార్యుల వారిట్లు ధర్మము గూర్చి చెప్పిరి -

"స భగవాన్ సృష్ట్వేదం జగత్తస్యచ స్థితిం చికీర్షుః మరీచ్యా దీనగ్రే సృష్ట్వా ప్రజాపతీన్ ప్రవృత్తి లక్షణం ధర్మం గ్రాహయా మాస వేదోక్తమ్ । తతో2న్యాం శ్చ సనక సనందనాదీనుత్పాద్య నివృత్తి లక్షణం ధర్మం జ్ఞానవైరాగ్య లక్షణం గ్రాహయామాస । ద్వివిధో హి వేదోక్తః ధర్మః । ప్రవృత్తి లక్షణో నివృత్తి లక్షణః జగతాం స్థితికారణమ్ । ప్రాణినాం సాక్షాదభ్యుదయ నిశ్శ్రేయసహేతుర్యః సః ధర్మః ।"

పరమేశ్వరుడీ జగత్తును సృష్టించి, ఆజగత్పాలనకై స్థితికై, మరీచ్యాది మహర్షులను సృష్టించి ప్రవృత్తి లక్షణమగు ధర్మమునుపదేశించెను. సనక సనందనాదులను సృష్టించి వార్కి నివృత్తి లక్షణము, జ్ఞానవైరాగ్య లక్షణమగు ధర్మమును పదేశించెను. ఈ రెండు ధర్మములు వేదోక్తములే. ఆవాటి నుండి ధర్మము ప్రవృత్తి, నివృత్తి యనురెండు రకములు. ప్రవృత్తి అనగా కర్మలయందు ప్రవర్తింపచేసేది. నివృత్తి అనగా కర్మలనుండి నివర్తింపచేసేది. ఈ రెండును లోకము యొుక్క స్థితిగతులకు ప్రధాన ధర్మములు. ఇవి ప్రాణుల యొుక్క అభ్యుదయ నిశ్రేయసములకు హేతువులు. అభ్యుదయం అంటే అభివృద్ధి. నిశ్రేయసం అంటే శాశ్వత సుఖం, ముక్తి. వీనికి హేతువేదియగునో నది ధర్మము.

"వేదో2ఖిలో ధర్మమూలం స్మృతి శీలే చ తద్విదాం ।
ఆచారశ్చైవ సాధూనాం ఆత్మన స్తుష్టిరేవ చ"

- మనుస్మృతి -2-6

ధర్మమునకు నాల్గు వేదములు మూలము. వేదములను దర్శించి, స్మరించి వేదధర్మములను ఋషులు లోకమునకందించిరి. వారి స్మృతులు, వారి యనుష్ఠానము, శీలము, సాధువుల ఆచారమున్నూ ధర్మమునకు కారణములు.

"యః కశ్చిత్ కస్యచిద్ధర్మో మనునా పరికీర్తితః ।
స సర్వోఽభిహితో వేదే సర్వజ్ఞాన మయో హి సః" - మనుస్మృతి -2-7

ఎవరికి ఏధర్మము విధింపబడెనో అది యంతయు వేదము నందే చెప్పబడినది.

"శ్రుతి స్మృత్యుదితం ధర్మమనుతిష్ఠన్ హి మానవః ।
ఇహ కీర్తిమవాప్నోతి ప్రేత్య చానుత్తమం సుఖమ్" -మనుస్మృతి -2-9

శ్రుతులు, స్మృతులచే విహిత ధర్మములను పాటించుచు, కర్మలు చేయు మానవులు శాశ్వత సుఖమును, కీర్తిని పొందెదరు. కొన్ని యెడల, పెద్దలు, మహాత్ములు, ధర్మాత్ములు ఆచరించిన పద్ధతి, మార్గము, ఆచారము పరమధర్మముగా, తపస్సుగా పేర్కొనబడినది.

"ఆచారః పరమోధర్మః ఆచారః పరమంతపః"

ఇక వేదము అనేక ధర్మముల బోధించినది. మానవ ధర్మము, పురుష, స్త్రీ, పత్నీ, పుత్ర, పితృ, భ్రాతృ, దుహితృ ధర్మములు, గురు శిష్య ధర్మములు, అట్లే నిద్ర లేచినది మొదలు పడుకొను వరకు చేయవలసిన ధర్మములు, దానధర్మములు, వ్యాపార ధర్మములు, రాజ ధర్మములు, బ్రహ్మచారి, గృహస్థ, సంన్యాసి ధర్మములు - ఇట్లనేక ధర్మములను బోధించినది.
శ్రీరాముడు అడవికి పోవలెనని తండ్రి ఆజ్ఞ. అందరు వద్దని వారిస్తారు. అపుడు రాముడు

"న హ్యతో ధర్మచరణం కించిదస్తి మహత్తరం ।
యథా పితరి శుశ్రూషా తస్యవా వచన క్రియా॥"

- రామాయణమ్

తండ్రి శుశ్రూష, తండ్రి మాటను వినుటకన్న గొప్ప ధర్మములేదు. అని అర్థము. శ్రీరాముడు వనవాసమునకు పోయెదననగానే కౌసల్య గూడ వస్తానంటుంది. ఆమెను వారించుచూ శ్రీరాముడు తల్లిని తండ్రి వద్దనే ఉండమంటూ ఇలా అంటాడు.

"జీవంత్యా హి స్త్రియా భర్తా దైవతం ప్రభురేవ చ
శుశ్రూషా క్రియతాం తస్య స హి ధర్మస్సనాతనః ।
వ్రతోపవాసనిరతా యా నారీ పరమోత్తమా
భర్తారం నాను వర్తేత సా తు పాపగతిర్భవేత్ ॥
భర్తు శ్శుశ్రూషయా నారీ లభతే స్వర్గముత్తమమ్ ।

అపి యా నిర్నమస్కారా నివృత్తా దేవపూజనాత్ ।
శుశ్రూషామేవ కుర్వీత భర్తుః ప్రియహితే రతా ।
ఏషధర్మః పురా దృష్టః లోకే వేదే చ విశ్రుతః"

- రామాయణము - అయోధ్యా -21, 22,26,27

జీవించినంత కాలము స్త్రీకి పతియే దైవము. పతి శుశ్రూషయే భార్యాధర్మము. ఎంత గొప్పదైననూ, వ్రతములు, ఉపవాసములు చేసిననూ భర్తననుసరించనిచో యామె పాపము నొందును. చేసిన వ్రతములు, నోములు వ్యర్థములు. దేవతలకు పూజ చేయకున్ననూ, పెద్దలకు ద్విజులకు నమస్కరించకున్ననూ భర్తృ శుశ్రూషతో స్వర్గము నొందును. భర్తకిష్టమైన పనులు చేయుచూ భర్తశుశ్రూషచేయటమే భార్యాధర్మము. ఈ ధర్మము లౌకికము, వైదికము గూడ. అనగా వేదములో చెప్పబడిన ధర్మము. లోకమున ఇంత వరకు అచరింపబడుతూ వచ్చినది, ఇక మీదట లోకమున నందరు అచరించవలసినది అని అర్థము.

ఇట్లే సీతాదేవిని గూడ రాముడు వనవాసము వద్దని వారిస్తాడు. అపుడు సీత

"భర్తార మనుగచ్ఛంతీ భర్తా హి మమ దైవతమ్ ॥
ప్రేత్య భావేఽపి కల్యాణః సంగమో మే సహ త్వయా ।
శ్రుతిర్హి శ్రూయతే పుణ్యా బ్రాహ్మణానాం యశస్వినామ్
ఇహ లోకే చ పితృభిర్యా స్త్రీ యస్య మహామతే ।
అద్భిః దత్తా స్వధర్మేణ ప్రేత్యభావేఽపి తస్య సా ॥"

- అయోధ్య -29-16-18

రామా! నేను నిత్యము భర్తననుసరించు దానను. భర్తయే నాకు దైవము. పరలోకములో గూడ నీతో సమాగమము కల్యాణప్రదము. వేదములేమి చెప్పుచున్నవి? తన ధర్మము ప్రకారము తల్లిదండ్రులచే ఏ స్త్రీ ఉదకపురస్సరముగ నే పురుషునికి వివాహ విధిలో నివ్వ బడునో నామె ఇపుడే గాదు పరలోకమున గూడ నాతని భార్యయే. అట్లు పతివ్రత యగుననేల విడిచి పోతావు? అని శ్రీరాముని అయన చెప్పిన ధర్మ వాక్యములతోనే శాంతపరచుకొని వనవాసమున కంగీకరింపచేసెను. అందుకనే సీత మొదలగు పతివ్రతా శిరోమణులు ధర్మ పత్నులుగా ప్రసిద్ధి గాంచిరి. ఇట్టి ధర్మపత్నుల వలనే భారత దేశము ధర్మ భూమిగా, పుణ్య భూమిగా కీర్తింపబడినది. లలితా పరాదేవత గూడ "నిజ భర్తృ ముఖాం భోజచింతనా" అని కీర్తింపబడుచున్నది.

ఇంక ఇట్లేన్నో ధర్మ సూక్ష్మములు గలవు. అయితే ఎవరెవరికి ఏయే ధర్మములు విధించబడినవో వారు అ "స్వధర్మ"ములనే పాటించాలి. పరుల ధర్మముల నాచరించరాదని భగవద్గీత ఇలా బోధిస్తోంది.

"శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥"

*- భగవద్గీత -3-35*

స్వధర్మము కన్న పరధర్మము రుచిగా ఉంటుంది. బాగా డబ్బు గూడ రావచ్చు. స్వధర్మము గుణహీనంగా చప్పగా కనపడుతుంది. బాగా పరధర్మాచరణం కంటె స్వధర్మాచరణమే గుణరహితమైననూ మిక్కిలి శ్రేష్ఠము. స్వధర్మాచరణలో మరణం గూడ శ్రేయస్కరమే. పర ధర్మము ఎపుడు నరకాది భయహేతువు.

"స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్" *-భగవద్గీత-2-40*

అట్టి స్వధర్మమును స్వల్పముగా ఆచరించినా, అది ఎంతో గొప్ప భయమునుండి కాపాడగలదు. అర్జునుడు క్షత్రియుడు, అతని ధర్మము యుద్ధము. కాని అతడు దుష్టులైన దుర్యోధనాదుల చంపక, తన ధర్మమును విడచి, వైరాగ్యము, సంన్యాసలక్షణమగు పరధర్మా చరణకుద్యమిస్తాడు. రాజులు సంన్యాసులైతే దుష్టశిక్షణ, శిష్ట రక్షణ ఎలా జరుగును? ఎవరు చేస్తారు. కనుక స్వధర్మమైన యుద్ధమే రాజులకు కర్తవ్యము. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేయమని కృష్ణుడుపదేశిస్తాడు.

"స్వధర్మమపి చా వేక్ష్య న వికంపితు మర్హసి
ధర్మ్యాద్ధి యుద్ధాత్ శ్రేయోऽన్యత్ క్షత్రియస్య న విద్యతే"

*-భగవద్గీత-2-31*

"అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।
తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి ॥"

*-భగవద్గీత -2-33*

అర్జునా, నీవు నీక్షాత్ర ధర్మమగు యుద్ధమును విడచినచో నీవు నీ ధర్మమును, కీర్తిని పోగొట్టుకొని పాపమును మూట కట్టుకుంటావు.

ఇలా మహాభారతంలోను, భాగవతంలోను, అనేక ధర్మములుపదేశించబడినవి. ముఖ్యంగా స్త్రీలకు, పురుషులకు అనేక ధర్మములు కట్టుబాట్లు నియమములు చెప్పబడినవి. పురుషుల కింకా ఎక్కువ ధర్మములు, ధర్మోల్లంఘన చేస్తే కఠిన శిక్షలు విధించబడినవి. పోతనామాత్యుల వారు భాగవతములో నిట్లు బోధించిరి.

"తన ధర్మము మండి తరలడా ధర్మంబు
  కోరికలతనికి గురియుచుండు
వంతోషాడేని శత్రువైన వశించు
  నిర్ధమండైన నిదురబోవు"

ఎవరు నిత్యము ధర్మపరాయణులో, ధర్మమార్గము నుండి కొద్దిగా గూడ చలించరో వారికి ఆ ధర్మము కోరికలను గురిపించును. సంతోషము లేనిచో ఇంద్రుడైనా, ఎంత ఐశ్వరవంతుడైనా నశించిపోవును. నిదురపోదు. మనశ్శాంతి కరువగును. Sleeping Pills వేసి కోవలసిందే. సంతోషమే సగం బలము. అట్లు సంతోషమున్నవానికి ధనము లేకపోయినా హాయిగా మనశ్శాంతి గల్గి చక్కగా నిద్రబోవును - అందుకే అన్నారు. "ధర్మోరక్షతి రక్షితః" అని. తాను ధర్మమును అచరించినచో అ ధర్మమే అతనిని కాపాడును.

నేడు యువతీ యువకులంతా మనభారతీయ సంస్కృతికి, ధర్మములకు తిలోదకాలిచ్చి, పాశ్చాత్య సంస్కృతి, వేషములు, ధర్మములచే నాకర్షింపబడి, పిచ్చి వ్యామోహములలో పడి కింకర్తవ్యతా మూఢులగుచున్నారు. మన వైదిక ధర్మముల గూర్చి తెలిసికొన్న, తెలిసికొందా మను కొనెడి, అచరించెడి, తల్లిదండ్రులు లేరు. ఎక్కడో కొద్దిగా ఉన్నారు. తమ పిల్లలకు చెప్పేవారులేరు. చెప్పినా వినెడి కొడుకులు, కూతుళ్లు లేరు. ఎవరి ఇష్టం వారిది. ఎవరికి వారే యమునా తీరే - భార్య త్రోవ భార్యది. భర్త త్రోవ - భర్తది. తల్లి త్రోవ తల్లిది. తండ్రి త్రోవ తండ్రిది. కొడుకు త్రోవ కొడుకుది. కూతురు త్రోవ కూతురిది. ఈ త్రోవలు గూడ ధర్మ విరుద్ధములే. కేవలం కామప్రవృత్తియే. కామముండవలసినదే. అయితే ధర్మబద్ధమైన కామము ఉపద్రవముల నుండి కాపాడును. "ధర్మా విరుద్ధః కామో2హ" మని కృష్ణుడు తాను ధర్మ బద్ధమగు కామస్వరూపమని చెప్పినాడు. ప్రధానంగా నేడు "పవిత్రప్రేమ" అనే దుష్టశక్తికి బలిఅయిపోయి తల్లిదండ్రులకు దూరమై, ధర్మభ్రష్టులై, నరకమునకు, సంకరమునకు దోహదపడుచున్నారు.

"ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మో2భిభవత్యుత ।
అధర్మాభిభవాత్కృష్ణ । ప్రదుష్యన్తి కులస్త్రియః ॥"
స్త్రీ ను దుష్టాసు వార్ష్ణేయః జాయతే వర్ణసంకరః ।
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥
సంకరో నరకాయైవ"

*- భగవద్గీత 1-40-42*

ధర్మం నశిస్తే కులములన్నీ అధర్మభూయిష్టములగును. అ ధర్మము వలన కులస్త్రీలు చెడిపోదురు. స్త్రీల మూలకంగా ఇంటిలో కొంచెమైనా ధర్మము నిలుస్తుంది. స్త్రీలు దుష్టులైతే వర్ణసాంకర్యము గల్గి, జాతి, కులధర్మములన్నీ నశించి పోతాయి. సంకరము నరకమునకు త్రోవ.

పశువులకు కామ విషయంలో తల్లి, తండ్రి, అక్క, అన్న, చెల్లెలు, కూతురు అనెడి వివేకముండునా? అయా ధర్మములు పాటించునా? వానికి కామము, తృప్తి చాలు. ఏదిఎట్లు

పోతే వానికేమి? అట్లే "పవిత్రప్రేమ" అనెడి మహమ్మారి బారిన పడిన వార్కి పశువులవలె ధర్మవిచక్షణ ఉండదు.

"కామాతురాణాం న భయం న లజ్జా"

అట్టి కాముకులకు భయము, సిగ్గు గూడ ఉండదట. అందుకని ఆకామం తీరకపోయినా, పెద్దలు వారించినా, క్రోధావేశములు చోటు చేసుకొని ఆత్మహత్యలకు త్రోవ తీయుచున్నవి. అందుకని వేద మాతయుపదేశానుసారం, వేదవిహిత ధర్మాచరణం చేసి, బజాయి వేషాలు, కామపూరిత వేషాలుమాని, 'పవిత్ర ప్రేమ' అనే దుష్ట శక్తిని పారద్రోలి, పాశ్చాత్య వ్యామోహం జోలికి పోక, పరధర్మం జోలికి పోక, స్వధర్మమగు భారతీయ సంస్కృతితో వైదిక సంస్కృతితో సంస్కరింపబడిన వార్లై ధర్మపరాయణులై సుఖశాంతుల నొందెదరు గాక!

ధర్మప్రతిష్ఠ గావించి భారత దేశప్రతిష్ఠను కాపాడెదరు గాక!

కృతయుగంలో ధర్మము నాల్గు పాదములతో విలసిల్లిందట. త్రేతాయుగంలో ధర్మము ఒక పాదము లోపించి మూడు పాదములతో నడచింది. త్రేతా - అంటే మూడు ధర్మముల సంపుటి. ద్వాపరమనగా "ద్వాపరా" అనగా రెండు ధర్మములతోనే ఆ యుగం నడచింది. కలియుగంలో ధర్మమొక్క పాదముతో నడుస్తుందట. కాని అసలు ధర్మమున్నదా - నలుసంతయినా గలదా యనితోస్తున్నది.

"న హి వేదాః కలౌయుగే"

ఈ కలియుగంలో అంతా తారుమారే. ధర్మచ్యుతి బాగా ప్రబలిపోతుంది. వేదముల మాట చెవికి ఎక్కదు. ధర్మము శూన్యము. వివాహములో నూతన వధూవరులిర్వురి చేత ప్రమాణం చేయిస్తారు.

"ధర్మే చ అర్థే చ కామే చ నాతిచరితవ్యా - నాతి చరామి" అని ధర్మార్థకామములలో మనమిర్వురం అతిక్రమించరాదు అని. అలా అతిక్రమించని అనూతన దంపతులక్కు ధర్మసంతానము గల్గును. ధర్మాతిక్రమణ చేస్తే పాప పంకిలము, కురూపులు, అంగవికలురు, వ్యభిచారులు, మొదలగు అధర్మసంతానమే గల్గును. అట్లు ధర్మము అతిక్రమించినచో (ఇల్లు) కుటుంబము, కుటుంబములోని వారు, వారి సంతతి, తద్వారా, ఆ గ్రామము, దేశము అధర్మములకు నిలయమై అపకీర్తి, ఉపద్రవముల పాలుబడును. అట్లు గాక ధర్మాచరణతో సత్సంతానము పొందుతానని అగ్ని వద్ద ప్రమాణం చేయాలని వేదము శాసిస్తోంది - ఏమని? చిన్ననాటనే ప్రమాణం చేయిస్తారు.

"సుప్రజాః ప్రజయా భూయాసం । సువీరో వీరైః । సువర్చా వర్చసా । సుపోషః పోషైః । సుగృహో గృహైః । సుపతిః పత్న్యా । సుమేధా మేధయా । సుబ్రహ్మా బ్రహ్మచారిభిః"

మంచి సంతానమును కని దేశానికి వంశానికి అందజేస్తాను. వీరుడనగుదును. వర్చస్సుగలవాడనగుదును. మంచి పోషణ గల్గి పుష్టి గల వాడనగుదును. మంచి భార్యను స్వీకరించి ఆదర్శ గృహస్థునగుదును. మంచి భర్తనగుదును. మంచి మేధను బొంది మేధావి యగుదును. వేదాధ్యయనం చేసి తోటి బ్రహ్మచారులతో పాటు "సుబ్రహ్మ" నగుదును.

ఇట్లీ చెప్పిన వన్నియు వేద ధర్మాలే. ఆ ధర్మములనాచరిస్తే కావలసినదేమున్నది?

ఇతిశమ్

"నమామ ధర్మరూపిణీమ్"





# వర్షములు - వైదిక స్వరూపము

గ్రీష్మ తాపమును తాళలేక ప్రాణులు వర్షం కోసం తపించిపోతారు. కనీసం నాలుగు చినుకులు పడినా ఊరట చెందుతారు. వర్షము అంటే వాన అని సామాన్యార్థము. వైదిక స్వరూపమేమి?

కాలము ప్రధానంగా శీతోష్ణ ద్వంద్వరూపము. వర్షకాలము సమశీతోష్ణస్థితి గల్గి యుంటుంది. మిక్కిలి వేడిగాని, చలిగాని ఉండవు. అందుచే వర్షము ప్రాణికోటి జీవన హేతువగుచున్నది. ప్రాణాధారమైన నీరు వర్షము ద్వారా సమకూరుతుంది. నీటికి 'జీవనం',' 'పుష్కరం' అని పేర్లు. జీవనాధారమే గాక పోషించునది అని అర్థము.

గ్రీష్మ, వర్ష, శీత స్థితులకు హేతువు సూర్యుడు. గ్రీష్మర్తువున సూర్యుని తేజస్సు ఓషధులందు సంక్రమించి, వర్షర్తువునందంకురించి శరత్కాలంలో అభివృద్ధి చెంది హేమంతమున ఫలించుచున్నది. రోహిణి కార్తెలో నారుమళ్లు, విత్తులు జల్లటం, వర్షకాలంలో నాట్లు, హేమంతంలో పంటలు చేతికి రావటం జరుగుచున్నది. ధాన్యము పంటల రూపంలో వస్తుంది.

ఈ ధాన్యమును ఓషధులంటారు. ప్రాణికోటి జీవనానికి అన్నం కావాలి. అన్నం నుండి ప్రాణికోటి సృష్టి జరుగుతోంది. (అన్నాద్భవంతి భూతాని) అన్నం ఓషధుల నుండి, ఓషధులు భూమినుండి, భూమి నీరునుండి, నీరు అగ్నినుండి, అగ్ని వాయువునుండి, వాయువు ఆకాశము నుండి, ఆకాశము పరమాత్మ నుండి ఆవిర్భవించుచున్నవి.

"తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః। ఆకాశాద్వాయుః। వాయోరగ్నిః। అగ్నేరాపః। అద్భ్యః పృథివీ। పృథివ్యా ఓషధయః। ఓషధీభ్యో 2న్నం। అన్నాత్పురుషః। సవా ఏష పురుషో2న్నరసమయః"

- తైత్తిరీయోపనిషత్

అట్లే భగవద్గీతగూడ

"అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్న సంభవః।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః।
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్।"

ప్రాణికోటి అన్నము నుండి, అన్నము మేఘములనుండి, మేఘము యజ్ఞము నుండి, యజ్ఞము వైదిక కర్మలనుండి, ఆ కర్మలు వేదమునుండి, వేదము అక్షరము నుండి అనగా పరమేశ్వరుని నుండి పుట్టుచున్నవని చెప్పింది. బ్రహ్మ అనగా వేదము. అక్షరుడనగా పరమేశ్వరుడు.

మేఘముల ద్వారా వర్షము కురియును. మేఘములు యజ్ఞధూమము ద్వారా పుట్టుచున్నవి. యజ్ఞములలోని హోమధూమము సూర్యుని జేరును. ఆ సూర్యుని వలన మేఘోత్పత్తి, మేఘముల ద్వారా వర్షము, వర్షము వలన అన్నము, అన్నము నుండి ప్రజలు ఉద్భవించుచున్నట్లు మనుస్మృతి తెల్పుచున్నది.

"అగ్నౌ ప్రాస్తాహుతిస్సమ్య గాదిత్య ముపతిష్ఠతే।
అదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టే రన్నం తతః ప్రజాః॥" - మనుస్మృతి॥

యజ్ఞములలో సమంత్రకముగ అగ్నియందు హవిస్సులనర్పించగా నా హవిస్సులు ఆహుతులై సూర్యుని బొందుచున్నవి. సూర్యుని నుండి హవిస్సులు వర్షరూపమున పుట్టుచున్నవి. వర్షము నుండి అన్నము, అన్నము నుండి ప్రజోత్పత్తి జరుగుచున్నదని అర్థము. ఇంకొక అడుగు లోపలికి పోయి వేదము దివ్య వర్షము గూర్చి ఇలా వివరిస్తున్నది.

"రోచనే హ వా ఖైష లోకే యత్రైష ఏతత్తపతి"

- *శతపథ బ్రాహ్మణమ్ -7-1-24.*

అగ్నిలో సమర్పించబడిన హవిస్సులు ఆహుతులై ధూమములగును. ఆ ధూమము భూమి మీద కాలుష్యము నివారించుచూ అంతరిక్షమును ప్రవేశించి అంతరిక్షమును శుద్ధ పరచును. పిదప ఆ ధూమము ఆదిత్య మండలమును ప్రవేశించును. అచట "రోచన" మను పేరుగల జ్యోతిర్లోకమును ప్రవేశించును. ఆ రోచనాఖ్యలోకమందు గల ఉదకములను, అంతరిక్షమునందు గల ఉదకములను యజ్ఞధూమము గదలించును. అప్పుడు అమృత ధారలు గురియునవి వేద ప్రబోధము. ఋగ్వేదము ఈ విషయమునింకొక మంత్రము ద్వారా స్పష్టము చేయుచున్నది.

"అగ్నే దివో అర్ణమచ్ఛా జిగాస్యచ్ఛా దేవా ఊచిషే ధిష్ణ్యా యే।
యా రోచనే పరస్తాత్ సూర్యస్య యాశ్చావస్తా దుపతిష్ఠన్త ఆపః॥"

- *ఋగ్వేద - 3-22-3.*

సామాన్య ధూమము అంతరిక్ష జలములనే ప్రేరేపించును. పెట్రోల్, కిరోసిన్ వగైరా రసాయనాదుల నుండి పుట్టు ధూమము ద్వారా కృత్రిమ వర్షములు (పొల్యూటెడ్ రైన్స్) గల్గి జననాశనకరము, విషపూరితమైన అన్నముపుట్టును. యజ్ఞ ధూమము రోచనాఖ్యలోక జలమును, దివ్య వర్షమును తద్వారా దివ్యాన్నమును ప్రసాదించును.

అగ్ని హవిస్సును అంతరిక్షమునకు తీసికొని పోవుననే విషయం సముద్ర లంఘనము చేయు హనుమంతుని వర్ణన ద్వారా రామాయణం తెలియజేస్తోంది. హనుమంతుడు సముద్రమును దాటుటకాకాశమందు పోవుచున్నాడు. ఆ అకాశమెట్లున్నది?

"సేవితే వారి ధారాభిః పతగైశ్చ నిషేవితే।
వహతా హవ్య మత్యర్థం సేవితే చిత్రభానునా॥"

- సుందరకాండ -1-168

యజ్ఞమందు సమర్పితమైన హవిస్సును దేవతలకు కొనిపోవు అగ్నిచేత ఏ ఆకాశము సేవించబడుచున్నదో దివ్య వారి ధారలతో నిండియున్న ఆ ఆకాశముననే హనుమంతుడు పోవుచున్నాడట.

అరుణమీ మంత్రముద్వారా చక్కని వివరణ ఇచ్చింది.

"భూమిం పర్జన్యా జిన్వన్తి । దివం జిన్వన్త్యగ్నయః॥"

భూ లోకమును మేఘములు తృప్తి పరచుచున్నవట. అనగా అంతరిక్షము నుండి దివ్య వృష్టిని ప్రసాదించి మేఘములు భూలోకమును సస్యశ్యామలము చేయుచున్నవి. ఆ అంతరిక్ష మును భూలోకమందలి అగ్నులు తృప్తి పరచుచున్నవట. అనగా అగ్నిలో సమర్పితమగు హవిస్సులు ధూమములై అంతరిక్షమును శుద్ధిచేసి అమృతమయము గావించుచున్నవి. కనుకనే దివ్య వృష్టి కలుగును.

ఈ యజ్ఞ ధూమము భూలోకమందలి వాతావరణ కాలుష్యము పోగొట్టి వాతావరణ శుద్ధి గావించును. మానవుల గృహములను, వారి మనస్సులను, బుద్ధులను గూడా శుద్ధి చేయును. పూర్వము భారతీయులు యజ్ఞాలు చేసెడివారు. దివ్య వృష్టితో పాటు దివ్యాన్నమును పొందెడివారు గనుకనే వారి మనస్సులు, బుద్ధులు పరిశుద్ధముగాను, పవిత్రముగానుండేవి. ఇప్పుడంతా కృత్రిమ వర్షాలు, అకాల వర్షాలు, అతివృష్టి, అనావృష్టి, కృత్రిమాన్నం, కృత్రిమ మనస్సులు, బుద్ధులు, ఆలోచనలు గల్గుచున్నవి. యజ్ఞముల వలన దేహశుద్ధి, మనశ్శుద్ధి, వాతావరణశుద్ధి, గ్రామ, పట్టణ, దేశ శుద్ధి తుదకు లోకములు గూడా శుద్ధి నొందును.

అయితే నేటి వాతావరణం తారుమారుగా ఉంది. యజ్ఞములు వృథా, ద్రవ్యములను హోమంలో పోయటం వృథా, నెయ్యి మొదలగు ద్రవ్యములనాశనం తప్ప ఏమీ లేదని నాస్తిక వాదము ప్రజ్వరిల్లు చున్నది. అందుకే పూర్వస్థితికి నేటి స్థితికి తేడా కనపడుతోందీ గద!

ప్రజలు అందరు యజ్ఞములు చేయుట కుదరదు. పూర్వం ప్రభువులు చేసేవారు. అందుకై వారు పంటలందలి ఆరవభాగం పన్నుగా స్వీకరించేవారు-కాదు-ప్రజలు సంతోషంగా తమంతట తామే ఇచ్చేవారు. ఆవును పాలు పితుకుచున్నప్పుడు శ్రమ లేకుండా ఇస్తుంది. యజమాని గూడ శ్రమ పడవక్కర్లేదు. అట్లే ప్రజలు శ్రమ, బాధ పడక, తల్చక పన్నులిచ్చేవారు. కుంభకోణాలు, మోసం, దోపిడీలెరుగని ప్రభువులా ద్రవ్యమును ప్రజాభివృద్ధికి వెచ్చించేవారు కనుక ప్రజలు సుఖశాంతులతో జీవించేవారు. యజ్ఞాల కోసం పన్నుల రూపంగా డబ్బు

ఇచ్చేవారు. యజ్ఞాల వలన వారికి దివ్య వర్షము, దివ్యాన్నము దొరికేవి. ప్రభువులు గూడ ధర్మ ప్రభువులే. ప్రజలను పీడించటం, హెచ్చుగా పన్నులు వేయటం ఆ ప్రభువులకు చేతగాదు, తెలియదు. తీసికొన్న ద్రవ్యమునకు వేయిరెట్లు ప్రజాభివృద్ధి కార్యక్రమములు కనపడేవి. ఒక్కపైన గూడ తాకనైనా తాకరైరి. ఇదెట్లు ఉందంటే సూర్యుడు భూమి నుండి జలమును తీసికొంటాడట. ఎందుకు? వేయిరెట్లు మరల భూమికి జలమును వర్షించుటకు అని కాళిదాస మహాకవి యొక్క రఘువంశ మహాకావ్యం ద్వారా పూర్వపు భారతీయ ప్రభువుల ఔన్నత్యము, యజ్ఞ వైభవము, దివ్య వర్షోత్పత్తి, దివ్యాన్నము, సత్సంతానోత్పత్తి, ప్రజల సుఖశాంతిమయ జీవనము ధర్మజీవనమున్నూ అడుగడుగునా చిందుతూ కనపడును.

"ప్రజానామేవ భూత్యర్థం స తాభ్యో బలిమగ్రహీత్।
సహస్రగుణముత్స్రష్టు మాదత్తే హి రసం రవిః॥
దుదోహ గాం స యజ్ఞాయ సస్యాయ మఘవా దివమ్।
సంపద్వినిమయేనోభౌ దధతుర్భువనద్వయమ్॥" - రఘువంశము1

యజ్ఞము కోసం దిలీప మహారాజు భూమిని, ఇంద్రుడు పంటల కోసం అంతరిక్షమును దున్నెడివారట. ఈ విధముగ, రాజు, ఇంద్రుడునూ భూమిని, అంతరిక్షమును శుద్ధి చేసి పాలించెడివారట.

యజ్ఞముల కోసం ద్రవ్యము, ధనము అనవసరపు ఖర్చు అని అనుకొను ప్రబుద్ధులకు ఇతరత్ర దుర్వినియోగాలు, కుంభకోణాలు, అవినీతి కనపడవేమో!

భోపాల్‌లోని విషవాయు సంఘటన ప్రత్యక్ష నిదర్శనము. అచట ఫ్యాక్టరీలోని విషవాయువుచే వేలకు వేలు జనులు చనిపోయిరి. ఫ్యాక్టరీ వద్ద ఒక బ్రాహ్మణ గృహంలోని వారు మాత్రం సమిధలను అగ్నిలో హోమం చేసి, ఆ హోమధూమము ద్వారా విషవాయువు నరికట్టి బ్రతికి బట్టకట్టి బయట పడ్డారు గద. పురాణాలు, దేవీ భాగవతం, రామాయణం, వేదాలు, కావ్యశాస్త్ర నాటకాదులన్నీ యజ్ఞములను, హోమములను చెప్పి వాతావరణ కాలుష్య నివృత్తి, వాతావరణ శుద్ధి, మనశ్శుద్ధి పొంది సుఖశాంతులతో వర్ధిల్లమని ఉపదేశిస్తున్నాయి. భూకంపాదుల నివారణకు, వ్యాధులు,అరిష్ట నివారణకై అనేక హోమాలను నిర్దేశించినవి. అయితే ఇదంతా చెవికెక్కదుగద. పాశ్చాత్యులు అనుభవము ద్వారా వివేకమును పొంది హోమాదులను చేతపట్టినారు. వారెంత ధన్యులో!

వేదము "యజ్ఞాః కల్యాణహేతవః" అని "ఆ నో భద్రాః క్రతవో యంతు విశ్వతః" అని పదేపదే హెచ్చరిస్తోంది. భగవద్గీత గూడ ఇట్లే హెచ్చరిస్తోంది.

"దేవాన్ భావయతా2 నేన తే దేవా భావయన్తు వః।
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ॥

సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వం ఏషవో2 స్త్విష్టకామధుక్॥
ఇష్టాన్ భోగాన్ హి దేవా దాస్యన్తే యజ్ఞభావితాః"

బ్రహ్మ ప్రజలతో పాటు యజ్ఞముల సృష్టించి ఇలా చెప్పాడు. ఈ యజ్ఞములు మీకు కోరికలు కురిపించు గాక. యజ్ఞములతో దేవతల తృప్తి పరచండి. తృప్తి చెందిన దేవతలు మిమ్ము తృప్తి పరతురు. మీకు కావలసినన్ని సంపదలను సమకూర్తురు అని హెచ్చరించింది.

ఇక వర్ష శబ్దమునకు సంవత్సరము, వయస్సు మొదలగు అర్థములున్నవి. "కామాన్ వర్షతీతి వర్షః" కోరికలను వర్షించుట చేత సంవత్సరము వర్షమని చెప్పబడింది. కొత్త సృష్టి ప్రారంభమైనట్లు వర్షాకాలంలో నాట్లు వేయుట, ప్రాణికోటి కామ పరవశమగుటచేత సృష్టి ప్రారంభమగునట్లుండుటచే వర్ష శబ్దము సంవత్సర పదవాచకమే. సంవత్సరమునకు 'అబ్దః" అని పేరున్నది. "అపః దదాతీతి అబ్దః" అపః అంటే జలములు, వేదవాక్కులు. కావున జలములను, వేద వాక్కులను అనేకములైన కోరికలను ప్రసాదించు సంవత్సరము వర్షమగు చున్నది. అంటే వర్షము జలములను, వేద వాక్కులను, కోరికలను ప్రసాదించు, వర్షించు కామధేనువు.

సాధారణ మేఘము ఆకాశమున విహరించును. జల ధారలు కురిపించును. అయితే పరమేశ్వరుడు, శంకర భాగవత్పాదుల వారున్నూ "చిత్" అనబడు మేఘములట. వారు వేదములవెడి ఆకాశమున విహరింతురు. వారు అద్వైతామృతమును వర్షించెడి దివ్యమేఘములట.

"చిద్ఘనాయ ప్రసన్నాయ శ్రుత్యాకాశవిహారిణే ।
అద్వైతామృత వర్షాయ శంకరాయ నమోనమః"

రామాయణంలో వర్షర్తువర్ణన చూద్దాము -

"నవమాసధృతం గర్భం భాస్కరస్య గభస్తిభిః
పీత్వా రసం సముద్రాణాం ద్యౌః ప్రసూతే రసాయనమ్ ।
సంధ్యారాగోత్థితైః తామ్రైరంతేష్వధిక పాండరైః ।
స్నిగ్ధైరభ్రపటచ్ఛేదైర్బద్ధవ్రణమివాంబరమ్ ।
మందమారుత నిః శ్వాసం సంధ్యాచందనరంజితమ్ ।
ఆపాండు జలదం భాతి కామాతుర మివాంబరమ్ ॥
మేఘకృష్ణాజినధరా: ధారాయజ్ఞోపవీతినః ।
మారుతాపూరితగుహాః ప్రాధీతా ఇవ పర్వతాః ॥

మాసి ప్రోష్ఠపదే బ్రహ్మ బ్రాహ్మణానాం వివక్షతామ్ ।
అయమధ్యాయ సమయః సామగానాముపస్థితః ॥"

- రామాయణమ్ - కిష్కింధ - 3 నుండి 54

కార్తీకము నుండి ఆషాఢము వరకు తొమ్మిది నెలలు. ఈ తొమ్మిది నెలలలో సూర్యుడు కిరణములతో జలమును స్వీకరించును. అట్లు ఆకాశము తొమ్మిది నెలల గర్భము దాల్చినదనీ, అది శ్రావణ మాసంలో ఆరు రసములకు కారణమగు జలమును నదియవ మాసమున శిశువుని కనినట్లు ప్రసవించుచున్నదట. అనగా ప్రసాదించుచున్నది. సంధ్యా రాగముచే మేఘములు గూడ కషాయ రంగుతోను, కొనల యందు తెలుపు రంగుతోను కొంచెము తడిగానున్న వస్త్రఖండములవలెనున్నవి. పుండును గుడ్డముక్కతో కట్టి యుంచుతారుగద! అట్లే ఆకాశము తన పుండును మేఘరూప వస్త్రఖండములతో కట్టు కొన్నట్లున్నది.

కాంత విరహపీడితురాలైన స్త్రీ మెల్లగా నిట్టూర్పులను విడచును. శైత్యోపచారార్థం చందనపుపూతలు వంటికి పూసుకుంటుంది. వదలంతయు పాలిపోయి యుండును. అట్లే ఆకాశము గూడ మెల్లని పిల్ల వాయువుల వంటి నిట్టూర్పులు విడచుచూ, సంధ్యా కాలమనెడి చందనపుపూతతోను, తెల్లని మేఘములతో శరీరము పాలిపోయి యున్నట్లున్నది.

పర్వతములు నల్లని మేఘములతో కృష్ణాజినములను ధరించినట్లునూ, తెల్లని జలధారలతో యజ్ఞోపవీతముల ధరించినట్లునూ, వాయువుతో నిండిన గుహలు కలవై వేదాధ్యేతలవలె ఉన్నాయి. (గాలితో నిండిన గుహలో వేదపాఠకుల గంభీరధ్వని వంటి ధ్వని ఏర్పడుచుండును కద) భాద్రపదమాసము వేదాధ్యయన మారంభించ గోరు సామవేద వేత్తలగు బ్రాహ్మణులకు అనుకూల సమయము. ఇతర మాసములలో నితరేతర వ్యాపార ములతో వేదాధ్యయనము సరిగ కుదరవచ్చు. కుదరకపోవచ్చు. ఆషాఢ శుద్ధ ఏకాదశి నుండి ఆశ్వయుజ శుద్ధ ఏకాదశి వరకు నాలుగు నెలలు చాతుర్మాస్య దీక్షనాచరిస్తారు. ఎచటికి ప్రయాణము చేయరాదు. నీటి కాలుష్యము ప్రధానంగా రోగకారణము. నదులు వరదలతో రజస్వలలు అగును కాన వానిని తాకరాదు. ఆహార నియమము పాటిస్తూ దీక్షితులై వేదాధ్యయనమునకు శ్రావణ, భాద్రపదమాసములు పూర్తిగ అనుకూలమైనవి. "శ్రవణ, భాద్ర" పదములు వేదమునకు పర్యాయపదములు. కనుక వర్షాకాలము వేదమయము, వేదస్వరూపము. జ్ఞాన వర్షం, అమృతవర్షం, దివ్యవర్షమునిచ్చెడి వర్షము వేదవర్షమే.

భాగవతములో వర్షర్తువర్ణనను చూద్దాము :-

"ప్రావృట్ శ్రియంచ తాం వీక్ష్య సర్వకాల మహోత్సవామ్ ।
భగవాన్ పూజయాం చక్రే ఆత్మ శక్త్యుపబృంహితామ్॥"

సర్వకాలములందు సుఖమును గలుగజేయు వర్షాకాల సౌందర్యమును. తన శక్తి చేత వృద్ధిపొందిన వర్ష లక్ష్మిని భగవంతుడగు శ్రీకృష్ణుడభివందించెను.

"మార్గాబభూవుః సందిగ్ధా స్తృణైశ్ఛన్నా హ్యసంస్కృతాః
వాఠ్యమానా శ్రుతయో ద్విజైః కాలహతా ఇవ"

బ్రాహ్మణులు అధ్యయనము చేయకపోవుట చేత కాలవశమున వేదములు లుప్త ప్రాయములు కాగా వేదములున్నవా? లేదా? అను సందేహము గల్గునట్లు వర్షాకాలమున తృణములచే కప్పబడి గోతులు, రాళ్లు మొదలగు వానిచే వింఢి సంస్కారము లేక మార్గములన్నీ ఉన్నవా! లేవా! అను సందేహము గల్గించుచున్నవి.

"గిరయో వర్షధారాభిః హన్యమానా నవివ్యథుః
అభి భూయమానా వ్యసనైర్యథా2 ధోక్షజ చేతసః"

విష్ణు భక్తి పరాయణులగు సాధువులు మాటిమాటికి కష్టములు, ఆపదలలో చిక్కుకొని ఏ మాత్రము బాధ చెందనట్లు పర్వతములు గూడ మాటి మాటికి వర్షధారలచే గొట్టబడుచున్నను ఏ మాత్రము వ్యధను బొందుటలేదు.

మేఘాగమోత్సవా హృష్టాః ప్రత్యనందన్ శిఖండినమ్ ।
గృహేషు తప్త నిర్విణ్ణా యథాచ్యుత జనాగమే ॥

ఇండ్లలో బాధలు, కష్టములచే తపించు వారలకు, దుఃఖించు వారలకు విష్ణు భక్తులతో సమాగమముచే శాంత చిత్తులై ఆనందము నొందునట్లు వర్షాకాలమున మేఘముల రాకచే ఉత్సవము చేసికొంటూ ఆనందముతో నెమళ్లు సంతోషం ప్రకటించుచున్నవి.

పీత్వాపః పాదపాః పద్భి రాసన్నా వాత్మ మూర్తయః ।
ప్రాక్ క్షామాస్తపసా శ్రాన్తా యథా కామానుసేవయా ॥

మొదట తపస్సుచే చిక్కిపోయి, అలసిన వారు తరువాత యోగైశ్వర్యమును బొంది జనులు నానా విధములగు రూపములను బొందునట్లు గ్రీష్మమున క్షీణించి, వడలి, శ్రాంతములైన చెట్లు వర్షాకాలమున వేళ్లతో నీటిని త్రాగి, చిగుళ్లు, ఆకులు, పూలు, పళ్లు మొదలగు నానా రూపములు గలవి యగుచున్నవి.

తపః కృశా దేవమీఢా ఆసీద్వర్షీయసీ మహీ ।
యథైవ కామ్యతపసస్తనుః సంప్రాప్య తత్ఫలమ్ ॥

తపస్సుచే కృశించిన శరీరములు గల తాపసులు కోరుకున్న ఫలములు సిద్ధించగా

మరల పుష్టి నొందునట్లు, గ్రీష్మమువలన కృశించిన శరీరము గల భూమి గూడ వర్షము వలన మరల పుష్టి చెందసాగెను.

**అష్టౌ మాసాన్ నిపీతం యద్భూమ్యాశ్చోదమయం వసు**
**స్వగోభిర్మోక్తు మారేభే పర్జన్యః కాల ఆగతే ॥**

సూర్యుడు తన కిరణములచే ఎనిమిది నెలలు పాటు భూమి నుండి జలమనే ధనమును తీసికొని వర్షాకాలము రాగానే తిరిగి ఆ ధనమును భూమికి విడువ నారంభించెను.

**తటిద్వన్తో మహా మేఘాశ్చండ శ్వసన వేపితాః ।**
**ప్రీణనం జీవనం హ్యాస్య ముముచుః కరుణా ఇవ ॥**

దయగల సాధువులు దుఃఖితుల దుఃఖము జూచి ఉపకారము చేయుటకై తమ ప్రాణములను సైతము విసర్జింతురు. అట్లే మేఘములు విద్యుత్తు అనే నేత్రముల ద్వారా ప్రజల తాపము జగత్తు యొక్క దుఃఖమును చూచి దయగల వై ప్రచండ వాయువుచే గదల్పబడినవై జగత్తుకు ప్రజలకు సంతృప్తి కలుగు నట్లు జలములను విడుచుచున్నవి.

**నిశాముఖేషు ఖద్యోతాస్తమసా భాన్తి న గ్రహాః ।**
**యథా పాపేన పాషండాః న హి వేదాః కలౌయుగే ॥**

కలియుగమున పాపులగు మనుజులతో పాటు నాస్తిక శాస్త్రములు వెలిగిపోవును కనుక వేదములు బయటకు కనపడవు, శోభిల్లవు. అట్లే వర్షాకాల సంధ్యా సమయములలో అంధకారముతో పాటు మిణుగురు పురుగులు ప్రకాశిస్తాయి గాని చంద్ర నక్షత్రాది గ్రహములు కనపడవు.

**"ఉమత్పథ గామిన్యః క్షుద్రనద్యో2ను శుష్యతీః**
**పుంసో యథా స్వతంత్రస్య దేహద్రవిణ సంపదః"**

ఇంద్రియ్యములకు వశులైన మనుష్యుల్లు, వారి శరీరములు, బాగా సంపదలు రాగానే దుష్ట మార్గమున స్వేచ్ఛగా పోవునట్లు, గ్రీష్మముచే చిక్కిపోయిన నదులు వర్షములు రాగానే కట్టలు తెంచుకొని ఇష్టము వచ్చినట్లు ప్రవహించుచున్నవి.

**"శృత్వా పర్జన్య నినదం మండూకాః ససృజుర్గిరః**
**తూష్ణీం శయానాః ప్రాగ్యద్వద్బ్రాహ్మణా నియమాత్యయే"**

నిత్యకర్మల వాచరించి మౌనముగ పడుకొన్న బ్రాహ్మణులు గురువుగారి పిలుపును లేక ధ్వనిని వినినంతనే వేదాధ్యయనమును ఆరంభించునట్లు గ్రీష్మమంతా ఎండిపోయిన

ఈ విధంగా అందరు మహాకవులు దేశపాలకులు ధర్మపరాయణులు కావాలనీ, యజ్ఞములు చేయాలనీ, వానిచేత ప్రీతి నొందిన దేవతలు కల్యాణ వృష్టినివ్వాలనీ, తద్వారా దివ్యాన్నం ప్రసాదింపబడాలనీ, ఆ అన్నము ద్వారా దేశప్రజలు మనశ్శుద్ధి, వాక్శుద్ధి గలవారై: ధర్మపరాయణులు వేదమార్గ ప్రవర్తకులు కావాలనీ, అట్లు దేశం సుభిక్షంగాను, ప్రజలు సుఖశాంతి జీవనం సాగించాలనీ కోరుకొనుచున్నారు.

వారి ఉపదేశాలను పాటించుచు ప్రజలు వేదమార్గ ప్రవర్తకులు కావాలనీ కోరుచూ, చివరగా నీ భరతవాక్యము -

"కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్య శాలినీ
దేశో2యం క్షోభరహితః ప్రజాస్సన్తు నిరామయాః"

సకాలంలో మేఘము వర్షించుగాక! కల్యాణ వర్షము నొసగుగాక। భూమి సస్యశ్యామల మగు గాక! దేశమేవిధమైన క్షోభలు, అరిష్టములు లేకుండగ ప్రశాంతముగ నుండుగాక! ప్రజలు రోగములు లేనివారై ఆనందముతో నుందురు గాక!

దేశమంతట వేదపద - భాద్రపద - వర్షము కురియుగాక ! ఆ దివ్యామృత వర్షము ప్రజలకు కోరికలు వర్షించుగాక!

ఇతిశమ్

"నమామ వర్షరూపిణీమ్"





# గ్రంథకర్త పరిచయము

రచయిత : హరి శ్రీరామమూర్తి
పుట్టిన తేది : 19-7-1942
తల్లి దండ్రులు : హరి అనసూయ, వెంకట కృష్ణమూర్తి
భార్య : అన్నపూర్ణ
శాస్త్రాధ్యయనం : ప్రస్థాన త్రయము
విద్యార్హతలు : సంస్కృతకళాశాల పొన్నూరులో
సాహిత్య విద్యాప్రవీణ, వ్యాకరణ విద్యాప్రవీణ (సంస్కృతం)
యమ్.ఎస్.సి., యమ్.టెక్.
గురువులు : హరి వేంకటకృష్ణమూర్తి, హరి సాంబశివ శాస్త్రి
రచనలు : శోధన్ భారతి, వైదిక వాఙ్మయము,
పురాణేతిహాసములు, కావ్యనాటకాదులలో పరిశోధన.
ఇతర వ్యాసంగములు : శ్రీ దుర్గామల్లేశ్వరస్వామి, తిరుమల తిరుపతి
దేవస్థాన, పాదుకాక్షేత్రములలో ధార్మికోపన్యాసములు.
ఆకాశవాణి, దూరదర్శన్‌లలో ఉపన్యాసములు.,
హాబీలు : ఆంధ్రజ్యోతి, ఈనాడు, వార్త, శైవవాణి, ఆర్షవాణి
మొదలగు పత్రికలలో వ్యాసములు వ్రాయుట.
గ్రంథముద్రణ : అమరకోశము (లింగాభట్టీయ వ్యాఖ్య) నానార్థ
రత్నమాల, రుద్రాధ్యాయము, భారతీ నిరుక్తి (వైదిక
స్వరూప దర్శనము) మొదలగు ప్రాచీన గ్రంథములు.
ముద్రించవలసిన
గ్రంథములు : హరిభారతి రెండవ భాగము
పరిచయము : బుఱ్ఱా నీలకంఠశాస్త్రి